# అప్పకవీయ వివరణము

## తృతీయాశ్వాసము

వివరణకర్త:


వేదుల రామశాస్త్రి

సంస్కృతాంధ్రోపన్యాసకులు, సంస్కృతకళాశాల,

కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా



ఆలమూరు:

రాజయోగసాధనాశ్రమము

తూర్పుగోదావరిజిల్లా

# విషయానుక్రమణిక



# సమర్పణ

## శ్రీ సువర్చలా పంచముఖాంజనేయ స్తవ చంద్రికా

శ్లో॥ నమో దేవ దేవ, త్రిమూర్తి స్వరూప
హితాని వ్యస్తాని మహాదేవ భావ
త్రిలోకావనేచ్ఛో, దయాబ్ధో, భవార్తం,
భయాత్త్రాహి మాం ద్రాగ్, గిరాపత్యరక్ష

శ్లో॥ మహాదేవ రూప స్వ రుద్రార్భ్య పాప
పవిత్రాప పవిభావ ప్రసిద్ధ పవిభాధ్య
నమ సూర్య పుత్రీ సమాలంకృతాంగ
నమస్తే నభస్వద్విభు స్తుత్యపాహి

శ్లో॥ అయే వాయు సూనో, భయం మామకీయం
రయా త్రోలయిత్వా నయే స్థాపయిత్వా
త్రయీ ధర్మ సక్తేంద్రియాళిం చ కృత్వా
దయాబ్ధోఽవమాం త్వం వియద్గామి గేయ

శ్లో॥ న్వ భావ స్వభావా నుభావ్య ప్రభూతాఘ
బాధాప్ర భూతా భిభూతిం విభేద్య
విభాస్వచ్ఛుభోద్య త్ప్రభాం మే ద్య దేహి
ప్రభావాఢ్య భో పంచముఖ్యాంజనేయ

శ్లో॥ న భిక్షామి విత్తం న యక్షాధిపత్యం
న వీక్షా మమాసీ ద్బుభుక్షీ ప్రభుత్వే
బుభుక్షాన మే న్యా నభస్వ జ్జనుష్మ
న్నపేక్ష్యాం కృపాక్షాం తవేక్షాం ప్రతీక్షే

శ్లో॥ గ్రహాణాం మమారిం జహి ప్రాగ్భవాఘం
దహ స్వాత్మభాసాప్రహస్తా వమృత్యో
అహ ర్నాథ పుత్రీ రహః కేళి భాజ్మ
వహ స్వావనేచ్ఛాం గృహాణా ర్త బంధో

శ్లో॥ అపాకృత్య దుఃఖా న్యుపాహృత్య భద్రా
ణ్యా పోహ్యా ప్రపీడాం విపాట్యా ఘ రాశిం
క్షపాకృ త్కళాభృ త్ప్రపూర్ణావతార
ప్రపన్నం విపన్నం కృపార్ణో నిధేఽవ

శ్లో॥ తపః పూర్తి లభ్య స్వపాద ప్రణామ
ద్విపేంద్రా ర్థ్య సంపత్ప్రపుష్టస్వ భృత్య
జపాపుష్ప రోచిః ప్రపుష్య త్స్వ ధామన్
కపీంద్ర క్షితీంద్ర స్వరింద్రేడ్యరక్ష

శ్లో॥ త్వ మిందు స్త్వమర్క స్త్వ మగ్ని ర్నభ స్త్వమ్
త్వమాపో దిగీశో నగేశ స్త్వ మేవ

స్వరీశో గిరీశోఽ బ్జజేశో రమేశః
పరేశో మమేశః కపీశ త్వమేవ

శ్లో॥ జగత్సృష్టి కృత్త్వం జగత్పుష్టి కృత్త్వం
జగన్నష్టి కృత్త్వజగ ద్భావ భావ స్త్వమ్
త్వమన్యశ్చ తస్మాత్త్వమీశోఽఖిలస్య
త్వదీశో న కశ్చిత్కపీశేశ మేఽవ

శ్లో॥ అణో రప్యణీయాన్ గరీయాన్ గురోస్త్వం
లఘీయా నసి త్వం లఘో రప్యతీవ
ద్రవస్త్వం ఘనస్త్వం గుణీ త్వం విదన్యో
నకించిత్త్వదన్య ద్భవిష్య ద్విరించే

శ్లో॥ ఘనాపత్త మోఽర్కం జనౌఘా వనేచ్ఛం
సునాసీర వంద్యం మునీంద్రా భిగమ్యమ్
మనా గ్దృష్టిపాతా ద్వినాశీ కృతాతం
మనోజ్ఞాం తరాళే హనూమంత మీడే

శ్లో॥ ఘనీ భూత పాపాన్ ప్రణష్టాత్మ రత్నాన్
జనాన్ స్వాంఘ్రినమ్రాన్ క్షణా న్మోదయంతమ్
తనౌ దీప్తిమంతం మనోఽబ్జే దయార్ద్రం
వనౌకో విభుం త్వాం హనుమంత మీడే

శ్లో॥ కదా వా త్వదీయం ముదా పాద పద్మం
సదా సేవితుం మే నిదానం దదాసి
వదామ్యత్ర మేవం యది స్యా ద్వ్యథా వ
త్తదా వాయు సూనో విదీర్యే న్మదీయా

శ్లో॥ అయం, మే, ప్రదేహి హ్యాయం భక్త ఆసీ
న్మయీ త్థం సదేతి స్వయంభూ ర్ధయస్వ
జయే త్యాశిషం మే ప్రయుజ్య ప్రభావ
ప్రకర్ష ప్రగేయ ప్రభో పంచ వక్త్ర

శ్లో॥ హారా త్మ న్నమ స్తే సురాళీ కిరీట
స్ఫురద్రత్న నీరాజితాం ఘ్ర్యబ్జ యుగ్మ,
ధరావర్తి సర్వస్థిర స్వాంత భక్తో
ద్ధరత్వా దరేణో మదు త్వత్రి పాహి

శ్లో॥ తవస్తోత్ర సక్తాం సువర్ణ ప్రభా ఢ్యాం
స్వభూషా భుజంగ ప్రయాత ప్రవృత్తామ్
సమా కర్ణనో చ్చారణ ప్రాపితే ష్టా
మి మాంచంద్ర రేఖాం గృహాణేశ్వరాత్మన్

ఉ॥ సంచిత పుణ్యులైన జన సంతతులన్ సిరు లిచ్చి ప్రోవఁ గా
నెంచి హనూమదాఖ్యనుతి కెక్కిన భక్త పురిన్ మహా మహ
త్త్వాంచిత లీలలన్ వెలసి నట్టి మదీశ్వరు శ్రీసువర్చలా
పంచ ముఖాం జనేయు మదిఁ బ్రస్తుతిఁ జేసిభజింతు భక్తిమె

క॥ ఎంచి భజించెద మహిమా
భ్యంచితుని సువర్చలా ప్రి యాంతికభవామాం
కాంచితునిన్ బంచముఖిన్
వంచన లేనట్టి భక్తి భావము వెలయన్

మ॥ అమలాంతః కరణమ్ములో విమల భక్త్యారూఢ భావమ్ములో
డ ముదమ్మొందుచు నెట్టి కోర్కులకు వేడ్కం జెందకుండ న్ గటా
క్షము మాపైఁ బరగించు మంచు మదభీష్టమ్మైన దైవమ్ము బం
చముఖీ వీర సువర్చలా హనుమ నంచ ద్భక్తిఁ బ్రార్థించెదన్



బ్రహ్మశ్రీ వేదుల రామశాస్త్రి గారు

# పరిచయము

ఏతద్గ్రంథకర్తలు శ్రీ వేదుల రామశాస్త్రిగారు సంస్కృత వ్యాకరణములో కూలంకష పాండిత్యముగల్గి యితర శాస్త్ర పరిచయము నుం బొంది యాంధ్రగీర్వాణ సాహిత్యములలో నసాధారణమేగాక యసమానమైన వైదగ్ధ్యము గల్గినవారు. ఆశుకవిత్వ, చిత్రకవిత్వ, సరస కవిత్వములలో వీరు సిద్ధహస్తులు. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు పరమపదము నొందిన తరువాత కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠములో వారి స్థానము నలంకరింపఁగల వారికొఱకై మేమన్వేషణము చేసి చేసి తుదకు శ్రీ శాస్త్రిగారిని సంపాదించి ధన్యులమైతిమి. గతచిన సంవత్సరం డేడ్లనుండియు శ్రీ శాస్త్రిగా రాంధ్రగీర్వాణ విద్యాపీఠమునకొక గొప్ప యలంకారమై ఉభయ భాషలలోని ప్రౌఢప్రబంధ లక్షణగ్రంథములను తమ యసదృశ విమర్శ పాటవ బోధన కౌశలములతో విద్యార్థులకు బోధించుచు నాచార్యవతంసులుగా నెన్నికగన్నవారై విశాలాంధ్రావని వాస్తవ్య సారస్వత పిపాసుల కీగ్రంథము నందించుచు తమధారాగ్రగణమును దేశ విస్తృతము గావించుకొనినారు.

అప్పకవీయమువంటి లక్షణ గ్రంథముపైని విమర్శ విలసితమైన వివరణము వ్రాయువారికెంత పాండిత్యము, యుక్తిచాతుర్యము, లక్ష్య లక్షణ గ్రంథానుభవమునుండవలయునో యంత శాస్త్ర యుక్త్యనుభవ సంపత్తి శ్రీ శాస్త్రిగారికిఁ గలదను ప్రత్యయ మీగ్రంథము పఠించువారి కడుగడుగునకును గల్గుచుండును. శ్రీ శాస్త్రిగారి వ్యాకరణ శాస్త్ర విమర్శ జ్ఞానముచే నీవివరణ మెట్లుద్దీపితమైనదో 165 వ పద్య వివరణము లోని స్వాంతశబ్దముపై వీరుచేసిన విమర్శమును శకంధ్వాదులపై వారు గావించిన వివరణమును తెలుపఁగలవు.

శాస్త్రానుగుణ యుక్తిచే శ్రీ శాస్త్రిగారు పరపక్షఖండన స్వపక్ష స్థాపనలఁ గావించిన తెఱంగచ్చెఱువుగొల్పును. కొన్నియతులలోని సామంజస్యమును నిరూపించుటలో శ్రీ శాస్త్రిగారు శాస్త్రానుప్రాణిత యుక్తిననుసరించినరీతి మిక్కిలి ప్రశంసాపాత్రముగ నున్నది. అ య హ లకును, శ ష లకును, న ణ లకును గలమైత్రిని గురించి వీరుచూపిన హేతువుల నిప్పట్ల నుదాహరణములనుగాఁ జూపవచ్చును. ఋ, రు వడిని గుఱించి సమకాలికులైన విమర్శక శిఖామణుల యభిప్రాయమును ఖండించుటలో శ్రీ శాస్త్రిగారు శాస్త్రయుక్త్యనుభవములను మూఁడింటిని నొక్కుమ్మడి గఁబ్రయోగించి యఖండ ప్రతిభను జూపినారు. ప్రతి పక్షులపట్ల వీరుచూపు మర్యాదను నేఁటి విమర్శకు లనేకులు నేర్చుకొనఁ దగును. అప్పకవిని గూడఁ గొన్నిపట్ల విమర్శించుటకు శ్రీ శాస్త్రిగారు

వెనుదీయలేదు. అప్పకవి యుభయ యతి లక్ష్యముగు 'అన్యోన్య' శబ్దమును 18 వ పద్యములో లుప్తవిసర్గవళి సందర్భమున నుదాహరించుట పొరపాటని శ్రీ శాస్త్రిగారు నిరూపించినారనునది రుచిత యుదాహరణము.

శ్రీ శాస్త్రిగారి వివరణములో నీక్రిందిలక్షణములు గూడ నెల్లరకును స్ఫుటముగాఁ గోచరించును.

(1) విషయకాఠిన్యమున్నను వివరణకాఠిన్యము లేకపోవుట.

(2) పాఠకుని మనస్సులో నూటిగా నాటుకొను మాటలతో రచన నిండియుండుట.

(3) సాధారణముగా ఛందోవిషయక విమర్శనము కతిపయ పండిత కౌతుకజనకమేయైనను నీ వివరణము సకలపాఠక హృదయాకర్షకమై నవలవలెఁ బఠనార్హమై యొప్పారుట.

ప్రాచీన పండితులకుఁ బాండిత్యమునకుఁ దగిన విమర్శపాటవముండదను వదంతిని శ్రీ శాస్త్రిగారి యీ గ్రంథము నిరస్తము చేయుచున్నది. ఈ రీతి వివరణములు మన ఛందోఽలంకార వ్యాకరణ గ్రంథములన్నింటిపైని బయలుదేరుచో నది యాంధ్రికి భాగ్యోదయమని చెప్పవచ్చును.

ఎవరివలనను నేవిధమైన ఫలముకాని ప్రోత్సాహముకాని లేకయే కేవల విజ్ఞానతృష్ణచే నింతకాలమింత శ్రమపడి శ్రీశాస్త్రిగారీ గ్రంథము నాంధ్రుల కందించినారన్నచో నెవరైనం దగిన యవకాశములను గల్గించుచో వీరెన్ని సారస్వతము లోకోపకారములైన ఘనకార్యములను నిర్వహింపం గలరో మనము సులువుగా నూహించుకొనవచ్చును. ఈగ్రంథమును రచించుటచే శ్రీ శాస్త్రిగారాంధ్ర సారస్వతనిరతుల నధమర్ణులనుగాం జేసికొనుటయేకాక యాంధ్రలక్షణ వాఙ్మయములో నొక నూతన శకము నుద్భవింపం జేసినారనుటలో నతిశయోక్తి లేదు.

ఇట్లు,

జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ.,

సంస్కృతోపన్యాపకులు, ఎస్. ఆర్. ఆర్. సి. వి. ఆర్. కాలేజి,

విజయవాడ.

కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు

వెనుకటి ప్రధానాచార్యులు.

విజయవాడ

8–3–50

# అ వ తా రి క

ఇది ఆంధ్రశబ్దచింతామణికి వివరణ మనదగు తెనుఁగుసేఁతయై యున్నది. ఇందు చింతామణిలోని సంధి పరిచ్ఛేదాంతభాగము తెనిగింప బడినది. మిగిలిన తత్సమ దేశ్య క్రియా భాగములు మూఁటిని ఆశ్వాస త్రయముగా తెనిగింప దలచినట్లు పీఠిక యందలి 9 వ గద్యలో "ముందు బృందారక భాష" అనుదానిచే అప్పకవి యే వ్రాసికొన్నాఁడు. అందే ఎలకూచి బాలసరస్వతి రచించిన చింతామణి టీక నాధారముగా చేసుకొని తానా గ్రంథము రచించినట్లు కూడ వ్రాసుకొన్నాఁడు. ఈ బాలసరస్వతి 1608 ప్రాంతమువాఁడు. ఆచింతామణికే విపులముగా సంస్కృతవ్యాఖ్య రచించిన అహోబలపతి 1704 ప్రాంతమువాఁడు. ఈ అప్పకవి 1653 సం॥ నారంభించి 1660 సం॥ వరకు రచించెనని వీరేశలింగము పంతులు గారు వ్రాసినదానికిఁ బ్రమాణ మెక్కడ నున్నదో మాకు తెలియదు అనియు, అప్పకవి వ్రాసుకొనిన వృత్తాంతమును బట్టి 17 వ శతాబ్ద మధ్యమందున్నవాఁడని స్పష్టముగా కనబడుచున్నదనియు, కలగన్న మరునాఁడే యీ గ్రంథమును వ్రాయుటకు మొదలు పెట్టుటచేతను, తా నదివరకు సంస్కృతాంధ్ర గ్రంథములు కొన్ని రచించినట్లున్ను, శ్రీగిరిలో భోగివిలాసుఁడని పట్టపు గవీంద్రుడుగా

మున్నట్టున్ను పీఠికలో 84, 85 లలో చెప్పుకొనుటచేతను, అప్పకవి 17వ శతాబ్దారంభమున పుట్టియుండు నని యూహింప వచ్చుననియు గిడుగువారు పీఠికలో వ్రాసిరి. 1656 లో కలవచ్చినట్లు చెప్పుట చేతను మరునాఁడే గ్రంథము ప్రారంభించుట చేతను గ్రంథము పూర్తి కాక మూఁడు ఆశ్వాసములు మిగిలిపోవుటచేతను అంతకుముందే కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథములు రచించుటచేతను అప్పకవి 17 వ శతాబ్దములో మధ్య కాలము వాఁడని తేలుచున్నది. అనగా బాలసరస్వత్యహోబలపతులకు మధ్య వాఁడని తేలుచున్నది.

ఈ తెనుగుసేత విపులమగు వివరణ మనుటను అప్పకవియే వ్రాసిన 9 వ గద్యము స్పష్టముగా చెప్పుచున్నది. ఇందు నాల్గవ ఆశ్వాసములో జాతులు వృత్తములు గలవు. ఈ మూఁడవ ఆశ్వాసములో యతి ప్రాసల విషయమెల్ల చెప్పబడినది. ఈ ఆశ్వాసమునకు వివరణముపై వివరణ మవసరమని మాకు తోఁచుటచే నిది యావిర్భవించినది.



# పీఠిక

ఆర్య విజ్ఞప్తి

"గుణ దోషౌ బుధో గృహ్ణన్" అను ఆర్యోక్తి లోని బుధ శబ్దమున ముఖ్యార్థమున కేని మేమంత యర్హులము కామనుకొను వారమున్ను ఏ యౌపచారికార్థము నవలంబించుటచేతనో దాని యర్హత నొకింత సంపాదించు కొను వారము మాత్ర మగుదు మనియు మొదటి వాక్యమున కంతకును మే మౌపచారికతా ర్హులమే యనియు, "శిరసా శ్లాఘతే పూర్వమ్, పరం కంఠే నియచ్ఛతి" అను దాని ముఖ్యార్థ తాత్పర్యమును మాత్రము ముఖ్యముగానే అనుసరించుట పరమ లక్ష్యముగా గలవార మనియు ఈ మా వివరణము లోని మూల కర్త యగు నప్పకవి మహాశయునిం గూర్చినవియును మఱియు నితరులను గూర్చినవియు నగు మా వ్రాతల యభిప్రాయము లెట్లు తోచునవి యైనను ఒకరి నిరసనమునకుం జెల్లని వనియును, మాకు సమ కాలికులో మాకన్నను కాలమునం గూడ మిక్కిలి మిన్నలో యనం దగిన వారున్ను ప్రకృత వివరణ మూలమునకు విమర్శము వ్రాసిన వారగుటచేతనూ మాకు నామ స్మరణ సేయక తప్పని వారున్ను విమర్శకాగ్రేసరులును మహా భాషా సేవకులును మిక్కిలి పలుకుబడి గలుగు వారును మహో బిరుదాంకితులును అగు గిడుగువారి ప్రస్తుత గ్రంథాభిప్రాయము నందలి మా యభిప్రాయము తెల్పుట, తక్కిన యెల్లర యభిప్రాయములను తెల్పుట కుపలక్షణ మగు నని యెంచి వారి భావములనే ఇందు ప్రధానముగా గ్రహించి తెల్పితి మనియు, ఆతని తరువాతి వారి కెల్లరకును మా నిష్కల్మష నిశ్చయాభిప్రాయము చొప్పునను, మఱియు మా అనుభవ సాక్ష్యముతోడను ఆంధ్రపద్య లక్షణ లక్ష్య యతి ప్రాస ఛందః ప్రభృతి యావ ద్విషయములును, ఒకరి యపేక్ష లేనట్లు గిడుపు నిండు భిక్ష పెట్టి కరతలా మలకముగా విజ్ఞానము నిచ్చిన అప్పకవి విజ్ఞుని పట్లను మఱియు నెల్లర పట్లను మా మిత్రులు గిడుగువారి

యుపదేశ ప్రకారమే వారి వలన పొందిన మహోపకారమునకు కృతజ్ఞ తలో నొక్కింత యేని కొఱవడని వారమే యనియు, కొన్ని కొన్ని యవసరములలో "స్తుతౌ కవీనామ్, అన్యథా భూషణం పుంసామ్" మన్నగునవి తెల్పు నట్లు అన్నిటికి కాలభేదము లుండుటచే, నిరసన మున్నూ భూషణమే యనియు, అప్పుడున్నూ శ్లాఘ గుణమే కాదనియు ప్రాచీనార్యులయు నభిప్రాయ మనియు, మా చిరంజీవు లెల్లరయు సహాయ మిందు మిక్కుటముగానే యుండుటచేత మేము మా అను రీతి బహువచనము వాడినవార మని గిడుగువారి యుపదేశమే అవలం బించితి మని తెల్పుట యే మొదట పురికొల్పినది కాని బహువచన ప్రయోగముకన్న ఏకవచన ప్రయోగమే కొన్నియెడల రమ్యమైనట్లు మిక్కిలి గర్వమును అహంభావమును అరమ్యతను స్పష్టముగా తెల్పక మానదనియు, బహువచనమే కొన్ని యెడల దానికి విరుద్ధమై వినయ రమ్యతలను తెల్పుననియు మొత్తము మీఁద ఈ ఏకవచన బహువచనములకు తగిన వేళ లున్న వనియు, ఎప్పు డేది యెట్లు చెల్లునో సహృదయు లెఱుంగుదురు; మఱియు నెఱుంగవలయును. అట్టి యభి ప్రాయముతోడనే కావలయు సర్వజ్ఞుఁడు పాణిని సూ. "అస్మదో ద్వయోశ్చ" ఏక వచన ద్వి వచనములలోను (వివక్షయందును) బహు వచనము వికల్పముగా నుండును అని అనుశాసించి తెల్పినాఁడు అని యెంచి మే మట్లే యవలంబించితిమని తెల్పుట యే మొదటి దానిని త్రోచివైచినది- మా వివరణము వ్యావహారిక భాష నే వలచినది ఎప్పుడును అందచందములలోనూ కాల భేద మున్నది గదా, శాస్త్రను సారిత్వము కాల మహిమచే దీనికి యదృచ్ఛిక మైనది జనార్దనుఁడు వోలె ఆర్యులు భావ గ్రాహులై దీని భ్రమ ప్రమాదములు మే మెంత ప్రయత్నపడినను మరలునవి కావు గనుక వానిం జక్కజేసుకొను బాధ్యత వహింప హృదయ పూర్వకముగా సాంజలి బంధముగాఁ బ్రార్థితు లగుచున్నారు.

అప్రస్తుత ప్రశంస

కొంత కాలము క్రిందట పదిపదేను ఏండ్ల వెనుక మే మొకప్పుడు, అనఁగా మాకు గురువర్యు లగుటయే గాక మా కెల్లవిధముల బూజ్యలగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి శతావధాని గురుపాదుల షష్టిపూర్తి మహోత్సవ సమయమున బందరు రైలులో నున్నప్పుడు, 'కీర్తిశేషులు' మా మిత్రులు ధీ విశారదులు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులు గారును మేమును ఒకరి యొకరి విశేషములు మాత్ర మంతకు వెనుకనుండి ఎఱిఁగిన వారమయ్యును పరస్పరావలోకన పరిచయమున కదియే ప్రథమమైన ప్రసంగములో వారు రచించు వావిళ్ళ నిఘంటువునకు నా తోడ్పాటు వారు కోరుటయు, నే నంగీకరించుటయును, ఆపని నిర్వహించుచు ఇంచుమించుగా ఆపని నిర్వాహణము సగము వఱకు అగుచుండఁగా వారి పేరుతోడి నిఘంటు నిర్వాహణమే 'మా మిత్రుల కంట్రాక్టు ప్రకారము కొంత సొమ్ము నెల నెలకు పొందుచు' మే మొనర్చు అప్పటి పనియునై యుండుటచేతనే, కావలయు మమ్మును తమ పండితులలోని వారినిగా గౌరవించు నభిప్రాయముతో అప్పుడు వారు పునర్ముద్రణమునకుఁ గడంగిన యీ అప్పకవీయ ప్రాచీన ప్రతి యొకటి యొకింత (స్థూల దృష్టితోడనే) పరిష్కరించి పంపుడని (పోస్టుద్వారా రామచంద్రపురము ఈ నిఘంటు కార్యాలయమునకు) పంపుటయు మా మిత్రులు ఆపనియు నాయొక్కని మీఁదనే పెట్టుటయు నే నొకింత స్థూల దృష్టితోనే చూచిన నేమి నా హృదయమునకు కొన్ని అనివార్య దోషములు తోఁచక మానకుండుటయు, అవి మా మిత్రులకు తెల్పుటయు వానిలోని కొన్నిటితో నొక వ్యాసము వ్రాసి మా మిత్రులు మా నియంతలగు బ్రహ్మశ్రీ వావిళ్ళ వెంకటేశ్వర్లు శాస్త్రులు గారికి పత్రికలలో ప్రచురింపఁ బంపుటయు, ఇది యిట్లు స్థూల దృష్టికి లొంగని దనియు, మిక్కిలి సూక్ష్మ దృష్టి కావలయు ననియు అంగీకరించి నియమించినచో అట్లునన్ను నిర్వ

చేత నిలిచి పోవుటయు ప్రయత్నమునకే విఘ్నము వచ్చుటయు, ఇప్పటికిం గలిగిన అవశ్య కర్తవ్యతావశావకాశములచేత, తక్కిన స్వంత ద్రవ్య వ్యయముతోడనే ఇది యిట్లు ముద్రాపిత మొనర్చి ఆంధ్రలోకమునకు సమర్పించు కొనుచుండుటయు, ఇట్టి ప్రసక్తి మే కలిగి అహోబల పండి తీయమునకును మరియుం గొన్నిటికిని ఇట్టి రీతి వివరణములే వ్రాయు టయు అవి లోకమున కెట్లు సమర్పించుకో వలయునో మార్గ మిప్పటి కేర్పడ కుండుటయు అవి భద్రముగా పేటిక నలంకరించి యుండుటయు, ఇట్టి యీ అప్రస్తుత ప్రశంస కొందఱ యభిప్రాయమున కలంకారము కాకున్న నేమి మాకు మాత్ర మిట్లు ప్రధానా లంకారమే యగుటయు మా మనవిచేయవలసినవి యైనవి ధనాపర్యాప్తిచే కలిగిన కేవల లుబ్ధత్వ ముచే (విద్యార్థులే కాక కొందఱు పండితులును ఈ విస్తరము ముఖ్యా వసరమే యని కోరినను తెల్పినను) రెండు మూడు సారులు ప్రూని కతో నీ తృతీయాశ్వాస వివరణము మాత్రము మే మెంత ప్రధాన విషయములు మాత్రము చేరునట్లు సంగ్రహించి సంకోచ పఱచినను మొత్త మాకారమున అప్పకవీయము నైదాశ్వాసములగ్రంధము నతి క్రమించక మానినదికాదు కాదు.

మఱియు నిట్టి మా వివరణ విషయము లన్నియు పూర్తిగా నాసక్తి లేని చదువుటకు విసువు గలుగు నేమో యని కొన్ని విషయము లిందు నవీనములునూ అవసరములని తోచినవి చూపుచున్నాము.

(అట్టి నవీనములలో) ఛందో యతి ప్రాసాదు లెందుకు?

ఛందో నియమము శాస్త్ర లక్షణ ప్రకారము లేక స్వేచ్ఛా ప్రవృత్తి యైనచో దేనికిని మహత్త్వాభివృద్ధులు ఐహికాముష్మిక సుఖములూ కలుగకుండుటయే గాక సహృదయ హృదయ హృద్యత్వ మైన నుండదు. లోక ప్రవృత్తి వ్యవహారములు క్లిష్టములై కుంటుపడక మానవు వేయేల యెల్లరకును మహాపదలు సైతము వాటిల్లును, అవి తెలిసికో లేక పోవుచున్నాము గాని ఆఫలము లనుభవించుచునే

యున్నాము. ఈ ఛందో నియమము కొఱవడని మహాకవు లెప్పుడును నిరుపమానోత్కృష్ట మహిమలతో విలసిల్లినారు; ఇప్పుడున్నూ విలసిల్లుచున్నారు. కాని సంఘాచరణ లోపమున వారి నెఱుంగ లేకున్నాము (ఎఱుంగ లేము) మనమిట్లు నిస్సారుల మగుటకు మన యాచరణ లోపముకన్న మఱియొక హేతు వక్కఱలేదు (అది హేతుక నక్కఱయునూ లేదు.) మన వేద శాస్త్రము లెప్పుడును నిరుపమాన మహిమ నిచ్చునవే గాని వాని శక్తి యెందును ఎప్పుడును కొంచెమేని కొఱవడునది కాదు. ఈ ఛందో యతి ప్రాసాదు లెల్ల నన్నివిధములా అట్టివియే కాని భిన్నములు కావు (ఇప్పుడును పనికిమాలినవి కావు.) వాని మహిమ చెప్ప నలవికాదని వెనుకటి వారు పెక్కండ్రు ప్రత్యక్షముగా చూపించినారు. ఇప్పటికిని అట్టివారు అరుదుగానైన నున్నారని మా అనుభవము చెప్పుచున్నది. వారిప్పుడు కాల మహిమచే గావలయు నిగురు గప్పిన నిప్పు లగుచున్నారు. వెనుకటి వారిత లేమి ఇప్పటి మా వ్రాతలేమి పట్టి పనికిమాలిన నిస్సారము లనువారు మాకున్నూ అన్నివిధములా అట్టివారే కాక మానరు. అవి నిసర్గ కవితా ధార కేమి రసముట్టిపడుట కేమి మాధుర్యము నింపుట కేమి దేనికిని ప్రతిబంధము లెంతమాత్రమున్నూ కాకపోవుటయే గాక మిక్కిలి యనూనానుకూలములే యని నమ్మించు ననుభవజ్ఞు లిప్పుడును నున్నారు. అట్లైనచో కాదంబరి మున్నగునవి యెట్టివి? అవియు నియమబద్ధములే, భిన్నములు కావు కాని వాని మహిమ అన్నిటా ఇట్టిది కాదనియే మా నిగూఢాభిప్రాయము. మఱియు సంస్కృతమున కన్ననూ కొన్నిట తెనుగు (ప్రబంధములు తెనుగు కవులు, తెనుగు కవిత్వ మెల్ల మేము వర్ణించినది యనుట) అగ్రస్థానము చూఱగొన్న దనియూ మా నిశ్చితాభిప్రాయము; పెక్కు దృష్టాంతములతో ఋజువుచేయుచుకో గలము. ఈ యావేశమున వ్రాయ వలసిన దెన్నియో వచ్చుచున్ననూ విస్తర భీతి యాపివేసినది.

వళి (వడి) శబ్ద నిర్ణయము

సంస్కృతములో లేని వళి (వడి) యను (యతి) పర్యాయ పదము తెనుఁగులో ఈయర్థముతో నపూర్వముగా వచ్చిన దనుటలో మతభేదము లుండవు గాని వళి, వడి యను వానిలో మొదటి దేది అని పరికింపఁగా డాక్టరు గిడుగు సీతాపతిగారు అనంతుని ఛందో దర్పణమున ఉపోద్ఘాతములో 'వడి యనునది అరవములోని వడు అను మార్గము అను నర్థము గల దాని సంబంధము గలది. తెనుఁగులోని యతి భాగములకు రెంటికి మార్గములు చూపు నట్లుండునది యను నభిప్రాయముతో తెనుఁగులోని యతి విశేషార్థమును తెలుపుచు లక్షణ కర్తలెల్ల రిట్లు అపూర్వముగా వడి యని వాడినారు. లక్షణము చెప్పు నప్పుడీ పదమే కాని మరొక పదము వాడఁ గూడ దనియే తోఁచు చున్నది అను నర్థముతో మొత్తము మీఁద వడు వడియు, వడి వళి యైనది. ఇవి రెండును దేశ్యములే' అను తమ భావమును తెల్పిరి. కొందఱు వడి (వళి) దేశ్యములని మాత్ర మురరీకరించిరి. నాకివి రెండునూ నచ్చినవి కావు. ఈ లక్షణ కర్తలలో మొదటి వాఁడు నన్నయ భట్టారకుఁడే గదా, ఆతఁడు 'ఆద్యో వళిః' అనియే చెప్పి నట్లున్నది. అనఁగా వడి యను మాట వాడి నట్లు గానరాదు; వళిః అని సంస్కృత విభక్త్యంతముగా వాడినాఁడు. ఇది అనుకరణమున్నా గాదు. (అనఁగా నన్నయ సూత్రములోని వళి యను నది ఆద్యక్షర మును చెప్పునది గాని వళి యను వర్ణములు అను నర్థము గలదికాదు. అట్లు అనుకొనుట పొసఁగదు. ఇట్లే సంస్కృత పద సమాసమునను లక్షణ కర్త లీ పదమును వాడినారు. భట్టారకుఁడు సాధారణముగా ఆంధ్ర పదమును గ్రహించ వలసినప్పుడు దాని యర్థము గల (దానికి పర్యాయ పదముగా సంస్కృతమున నుండు) దానినే 'తచ్ఛబ్దాతః దారాదేః' మున్నగు రీతిగాను కేవలము లగు తెనుఁగు పదములనే నిర్దేశించ వలసి నప్పుడు (సంస్కృతమున " అతోభిసఐస్ " మున్నగు

రీతి, డు, ము, వులవః ప్రథమా స్యాత్, మున్నగు నీతిగాను) అను కరణమునందును, వాడినట్లగపడుచున్నది. కనుక ఇది దేశ్య పదము కాదు. సంస్కృత పదమే కావచ్చును, ఈ యర్థమున సంస్కృతములో వాడఁబడ కున్ననూ, అపూర్వముగానే తెనుఁగులో వాడనూ వచ్చును. అది యపూర్వము కాదు. ఇట్టి సంజ్ఞా పదములకే కాక మరియుం గొన్నిటికిని, వ్యుత్పత్తు లక్కఱయే లేదు. ఉన్ననూ ఆపదముల యర్థము వ్యుత్పత్త్యర్థములకు లొంగనూ లొంగదు అని సంస్కృత వైయాకరణులు, "రథంతరమ్" మున్నగు చోట్ల తెల్పుటచేత మాకు వ్యుత్పత్త్యర్థ ప్రదర్శనా వశ్యం భావిత లేనే లేదు. చెప్పవలె నన్నచో అదియును సుకరమే రమ్యమే యను నట్లు చెప్పనూ వచ్చును. వళి యనఁగా కాంతకు, ఉదరమున నుండు మడతలు (తెఱలు), అని యొట్లు కాంతకు సహజాలంకారములో ఈ వళులున్న పద్యములను అట్టివే యగుటచేత, సన్వర్థకముగానే వళులనఁజెల్లినవి. (ఇవి మూఁడే కా నక్కఱ లేదు, రెండున్నా అగును, మూఁడున్నా మరియూ నెక్కువయు నగును. ఇంతియే భేదము) శ. ర. లో. వళి యత్యర్థమందున్నా ఇకారాంత స్త్రీలింగ మని యున్నది. వడి (దాని) వైకృత మని యున్నది, అదియూ నూ యభిప్రాయమునకే తోడ్పడుచున్నది. కావ్యాలంకార చూడామణిలో నొకచో వళ్లు అని స్త్రీలింగ పదముగా (దాని విశేషణములను స్త్రీలింగ రూపములుగా) ప్రయోగించెను. అది కూడా మా యభిప్రాయమునే ధ్రువపఱుచును. డాక్టరు సీతాపతి గారి వ్యుత్పత్త్యర్థము నే వ కోశము నను (ఆ పదమున లేనిది) మనమున నిడుకొని లక్షణ కర్తలెల్ల ఆ పదమునే (అపూర్వ మగు తమ యర్థము నే తెలుపుటకు) వాడియున్నా రనుట మాకు పొసఁగి నది కాదు. మొత్తమున వడి యను పదము నుండి వళి రాలే దనియు, మొదట సంస్కృత పదమే యతి పదములకు పర్యాయ పదముగా తెనుఁగులో వళి యనియు వాడబడినది. ళ డ ల యభేదముచేత గాని (వైకృతి ము గాని) వడి యనియు వచ్చిన దనియు

వ్యుత్పత్తి వలయు నను వారికొంత కదియు చూపితి మనియు మా అభి ప్రాయ సారాంశ మెఱుంగునది.

లుప్త విసర్గ స్వర వళి

ఇది స్వర ప్రధాన వళి కన్న నించుకయు భేదము లేనిదే. దీని కీ పేరున్ను (విసర్గలోప సంబంధ మీ యతి పదములలో లేనట్లెఱింగియు నిట్టి పేరు పెట్టుటయు) ఇట్టి ప్రత్యేకత యున్ను, పొసఁగక పోవుటయే గాక, ఇట్టి స్వర ప్రధాన యతియుం జెల్లఁ దగిన (గో + అగ్రమ్ — గోఽగ్రము, ద్యోః + అధిదిపః — ద్యోఽధిపుఁడు మున్నగు వానిలో నున్ను అనుకరణములో శంభో — అత్ శంభోఽత్రి, విష్ణో + అవ — విష్ణోఽవ — మున్నగు వానిలో) పెక్కు పదములలో నిది చెల్లదను విపరీతార్థము నిచ్చునది యు నగును, అట్లు చెల్లకుండుటకు సరియైన ప్రమాణము మాకు తోఁచలేదు — అనంతుఁడు దీనిని గుప్త స్వర వళి యనుట పొసఁగియే యున్నది, కాని, లక్షణములో విసర్గ సంబంధమును నిర్వచించుటయు అది యెఱుఁగుటచేతనే కావలయు పేరు మాత్రము మార్చి విపరీతముగా నప్పకవి నిర్వచించి యిట్లు వ్రాయుటయు మాకు పొసఁగియుండ లేదు. విశేషములకు మా లుప్త విసర్గ స్వర వళి వివ రణము చూచునది.

ఋ వడి

ఇది ఛందోదర్పణమున ననంతుఁడు వ్రాసి పెట్టియు తన గ్రంథము లోనే దానిని బ్రయోగించి యున్నాఁడు అని కొందఱు మహా విమర్శ కులే వక్కాణించుచున్నారు. అవి మాకు మిక్కిలి విరుద్ధము లైనవి. అనంతుఁడు 4 పద్యము లీ సందర్భములో చెప్పినాఁడు. అందు పాఠ భేదములు కొన్ని చోట్ల గలవు. అయిన నేమి, అవి యెల్ల రివళిని (ఋ వళిని) వక్కాణించునవి యే అయి, ఋవడి సంబంధమును కొంచె మేని తెల్పునవి మాకు కాలేదు — లక్ష్యములున్న వారు చూపినవే (అందనంతునిదియు) ఋవడిని స్థాపించునవి కాలేదు; అవి ప్రమాణము లైనచో మఱియొక రాతియతిని స్థాపించునవి మాత్ర మగును. ఇందలి

విశేషములెల్ల మా రివడి వివరణమున ముఖ్యముగాఁ జూడ విజ్ఞులు ప్రార్థితులు. ఆ రివడి వివరణమే 'రువడియా ? రివడియా ?' అను పేరుతో వ్యాసముగా ననువదించి భారతికి రెండు సార్లు సవినయముగా బ్రచురింపఁ బంపుకొన్నాము. ఎందుచేతనైన నేమి భారతి ప్రచురించినది కాదు. అదియు మా వివరణము త్వరలో నిట్లు వెలువడుటకు హేతువై మా కృతజ్ఞతకు బాత్రమైనది. ఇట్లు స్థాలీ పులాక న్యాయము చొప్పున నిక్కడ తెల్పి ఓపిక కల వారెల్ల మా వివరణమంతయు చూతు రనియే విశ్వసించుచు అట్లు చూడఁ గోరుచు ఇందు తెల్పనివియు నప్పకవి చెప్పనివియు కొన్ని యాతఁడు నిరసించినవియుఁ గొన్ని మాత్రము సప్రమాణముగా వ్రాయఁబడుచున్నవి. మరియు గిడుగు వారి పీఠికలో మేము చూచిన ప్రతికిన్ని మా గృహీత మైన ప్రతికిన్ని మిక్కిలి భేదములు కొన్నిట నుండుటయే కాక మాకు విరుద్ధాభిప్రాయములున్నూ అందున్నవి. అవి యెల్ల చాలవరకు ఈ మా తృతీయాశ్వాస వివరణము తెల్పినది, తెల్పనివియుఁ గలవు. అందొక్కటి ముందిక్కడ వ్రాయుచున్నాము.

అప్పకవి శబ్దార్థ లక్షణాలంకార సీస మాలికలో (ప్రథమాశ్వాసమున, 33 వ పద్య 17 వ పేజీలో 7 వ పాదము మొదట 'మధుర తౌదార్య సమాధి' అని వ్రాయుఁగా మధుర అను దానికి వెనుక 'ఆ పాదము మొదట — అను గుర్తు పెట్టి గీటుక్రింద ఈ గుర్తుతో ఈ' శబ్దము కావ్య గుణ వాచక మైనప్పుడు, మాధుర్య' అని యుండఁదగు—అట్లున్నచో ఛందో భంగము 'ధర్మ ధర్మిణో రభేదః' అను న్యాయము రస వాచక మైన యప్పుడే చెల్లును. ఇచ్చట చెల్లదు. —అని గిడుగు వారి పీఠిక ప్రతిలో నిప్పటికిని నిస్పష్టముగాఁ గానవచ్చుచున్నది. దీని యభిప్రాయము మాకు సరిగా నిప్పటికిని నచ్చినది కాదు. ఇది మిక్కిలి పొరపాటు గానే ఇప్పటికిని తోఁచుచున్నది. ఇక్కడ అప్పకవి మాధుర్య అనుదాని కన్నిటను పర్యాయ పద మగు

మధురతా అను పదమును వాడినాఁడు (మధురతా + ఔదార్య— వృద్ధి సంధిచే మధురతౌదార్య అని సమాసములోఁ గూర్చినాఁడు) ఇందు మధుర అని యెట్లు విఱుగును? (అది వట్టి భ్రాంతియే కావల యును) మాధుర్య, అనియే కాని మధురతా అనియు నిట్టి యెడఁ జెల్లదని వారి యభిప్రాయము అనుకొనుటకును ధర్మ ధర్ముల కభేద మిచ్చుట చెల్ల దను నిర్వచనము (అనుశాసనము) మిక్కిలి ప్రతిబంధక మగుచున్నది. (ఇక్కడి పదము మధుర అనునది అనుకొన్నప్పుడే గాని మధురతా అని గ్రహించనచో అది యెట్లు కుదురును? మాధుర్య మధురతలు ధర్మ వాచకములే కాని వీనిలో నొకటి ధర్మియు నొకటి ధర్మము నెట్లగును? ఇఁక నభేద మెందుకు, అది చెల్లమి యేల?) కనుక ఇక్కడ కవి మాధుర్య అనుటకు మధుర అని యన్నాఁడు అని వట్టి భ్రాంతియే పడినారు అనక తీర కున్నది. ఈ సందర్భ మొకప్పుడు ఒకానొక చెన్నపురి సభలో మేము కూడినప్పుడు డాక్టరు గిడుగు సీతాపతి గారిని చెలిమితోడనే నే నడిగినట్లున్ను పుస్తకము చూచిన గాని మేమిప్పుడు చెప్పుటకు వలనుపడదు అని (పుస్తకము చూచినట్లు నేనిదియెల్ల నప్పచెప్పిన నేమి) నిరాకరించునట్లున్ను గూడ నాకు గురు న్నది ఇది విజ్ఞు లరయ ప్రార్థితులు.

ఇఁక నప్పకవికిన్ని మాకున్నూ పెక్కులు మత భేదములు వచ్చినవి. అవి యెల్ల వివరణము ఆ యా చోట్ల తెలిపినది. అతఁడు తన మతమును సాధించుటకు అడ్డువచ్చిన మహాకవి నిర్వచనములును వారి ప్రయోగములును తన మతములోనికి తెచ్చుటకు మిక్కిలి క్లిష్ట మార్గమే కాక అనుచిత మై చెల్లని మార్గములును అవలంబించె నని మాకు తోఁచినది. ఒండు రెండు మచ్చునకు ఇక్కడ వ్రాయ బడుచుండెను. భీమ కవి వాస్తవమున కవిజనాశ్రయములో సామా న్యాఖండ యతికే లక్షణము చెప్పి ఆ పద్యమునందే లక్ష్యమున్ను ('భానుసహాస్ర భాసివృషభాధిపుఁడన్నట్లు లక్ష్యయుక్తము పూనినచో

నఖండ వళి పోల్పగు నాద కవి ప్రణీతమై' వృషభ — అధిప—వృషభా
ధిప) అని వక్కాణించియుండగా అది సామాన్యాఖండ యతి కాద
నియు (ఉపసర్గ సంధిరూపోభయ యతి యని వెనుక నెక్కడను
తానున్నా చెప్పకయే 'ఉపసర్గసంధికి' అని మాత్ర) మిక్కడ శీర్షిక
పెట్టి అచ్చు చెల్లుటకు మరొక లక్ష్యముతో) గ్రాహ్య మగు ఉపసర్గ
సంధ్యుభయ యతులలోని అఖండయతిగా భీమకవి పద్యమునకుఁ
దాత్పర్యము బోధించినాఁడు. ఇందలి విప్రతిపత్తు లెల్ల ఉపసర్గసంధికి
అనుచోట మా వివరణమునఁ జూచునది.

రలల కభేదప్రమాణముచే మహాకవులు (భట్టారకుఁడున్నా)
యతి ప్రాసల మైత్రి వాడియుండఁగా తనకున్నా కానవచ్చిన కాకుత్స్థ
విజయము లోని 'మారుం డద్భుత..............రే ఖా లిప్సన్' అను
చోట నున్న రల ప్రాసమున్ను తన మతము చొప్పుననూ గ్రాహ్య
మగు సంధి గత ప్రాసలుగా సమర్థించినాఁడు. ఇందలి క్లిష్టతయు
నయుక్తతయు నెట్లన— ఇది అక్లేశముగా లభ ధాతు నిష్పన్న మగు లిప్స
అగుచుండఁగా అట్టిది కాదనియు దీని ప్రకృతి రభ ధాతు వనియు రకా
రమునకు లకారాదేశ రూప సంధివలన లిప్స అని మారినదనియు,
అందుచేత ఈ లకారము మొదట రకారమే కనుక ఇట్లు చెల్లెను గాని
లకార మగుటచేఁ గాదు అను నభిప్రాయము వివరించినాఁడు. ఇప్పు
డర్థము మాట యెట్లున నేమి ఇట్టిచోట రకారమునకు లకారమును
విధించు ప్రమాణ మెక్కడ నున్నదీ యెంచినను మా యూహకు గోచరించ
లేదు. ఇఁక పృషోదరాదిత్వమో ఏదో అధిక కల్పనమో దానిని తేవలసి
యున్నది. అది క్లిష్టమున్ను అప్రమాణము న్నూ అయుక్తమున్నూ
అని మా యభిప్రాయము. (రభ ధాతు రూపము 'ప్రారిప్సిత గ్రం
థము' అనునట్లు రిప్స యగు కాని, ఈ లిప్స ఎందునూ కానేరాదనుట.)

ఇతర విశేషములు:—

క॥ భూపతి......నీ ప్రెగ్గడ......రూపంబు....లాపంబు

ఇక్కడ ఒకచో రకార సంయుక్తము తక్కినచోట్ల అసంయుక్తములు ప్రాసలు చెల్లినవి. [హరి. పూ. 2 ఆ 46 వ పే.

మాలిని॥ యజన ముఖ ను కర్మ ప్రాభవా భంగ కీర్తీ—

[హరి. పూ. 3 ఆ. 77 వ పే.

ప్రభోః భావః ప్రాభవః—అది వృద్ధిలో గూడ ఆకారమునకును యతి మైత్రి చెల్లునట్లును ప్రాభవ అను పదియు (ఇట్టివిన్ని) ఉభయ యతి పదమగునో యన్నట్లును ఈ ప్రయోగము తెల్పుచున్నది. (ప్ర—అభవ అని అనర్థకముగా ఆకార ప్రశ్లేష మాకు నచ్చ లేదనుట.)

మ॥ వాణీ సత్తను నీ తండొకరుండ నాఁ జను మహాత్మ్యాప్తిన్

[హరి. పూ. 1 ఆ. 9 వ పద.

మహాత్త్వ — ఆప్తి— ఇక్కడ అఖండ యతియే—

శా॥ లక్ష్మీ......లక్ష్మ్యౌ......క్ష్మా, సూక్ష్మ—

[హరి. పూ. 1 ఆ. 11 వ పే.

మ॥ మేసుల్ మహా శ్రమ వేగం——విహారాపేక్షులై —

[హరి. పూ. 6 ఆ. 140 వ పే.

విహార — అపేక్ష — అఖండ యతియే

క॥ అటవులు నవమాలతీ లతాంత పరిమళో—

[హరి. పూ. 16 ఆ. 142 వ పే.

లతాంత శబ్దములో అచ్చు చెల్లినది.

చ॥ నీటిలో దరిసిన పాఠీ నముల గతి— పాటీన రూపాంతమురము లేదు. ట, ర, ల వర్గీయ ప్రాసలు— [హరి. పూ. 6 ఆ. 138 వ పే.

మ॥ విస్ఫుర తక్కలహాసంబుల బంధురస్తన భరోత్థానంగ సంగంబులన్

[హరి. పూ. 8 ఆ. 181 వ పే.

స్తనభరోద్ధత — అనంగ — అఖండ యతినో

గీ॥ నెఱపు ధూళులు మేనులఁ బొరసి యవియ

ఋ, రల ప్రాసలు— హరి. పూ. 8 ఆ. 181 వ పే.

మ॥ మహాశయ్యోపరిం, జతుర ప్రీతి శయించి—

హరి. పూ. 8 ఆ. 197 వ పే.

శయ్యాయాః ఉపరి — ను— శయ్యో పరిన్, ఉపరి అను నవ్య యము తెనుగులోకి వచ్చుటకును—ఇవర్ణాంతముల మీఁదను (యను అని కాక) ను అనియు తండ్రిం దల్లియు అన్నట్లుండుటకున్నూ ఇది ప్రమాణము.

ప్రమదము.....తనుపారఁగ— తనువు + ఆరఁగ (శ. ర. లో) తనుపారు— శబ్దపల్లవ ధాతువు—దేశ్యనిత్య సమాసోభయ యతి పదమేని ఇదియు నగును— హరి. పూ. 8 ఆ. 199 వ పే.

ఉ॥ కంసుని......తద్వంశము, ధ్వంసము, హంసుఁడు, శ, స, ల, అభేద ప్రాసలు— హరి. పూ. 9 ఆ. 212 వ పే.

సీ॥ మాటెందు లేక యుదీర్ణ — ఋ ర ప్రాసలు, రకారము సంయుక్తము లో మొదటి దైనను, సంయుతా సంయుత ప్రాసలు న్నూ కానవచ్చు చున్నవి. నూతనపు మార్పున్నది— హరి. పూ. 9 ఆ—218 వ పే.

ఇట్లగు 'న జడాకృతిఁ దోడఁ దగవు నెఱపక'—అగున్ + ఎ, వాల్లు చెల్లెను, అచ్చు సహజమే— ఇట్టి చోట్ల అచ్చు చెల్లుటకు సరియైన ప్రయోగము కానరాక కావలయును, అప్పుర ప్రాసి వ్యకారోభయ యతి అప్పకవి చెప్పలేదని తోఁచుచున్నది— హరి. ఉ. 4 ఆ. 86 వ పే.

తే॥ దేవదేవ సమీహిత స్థాపకములు—అభేద వర్గ ప్రాసలు చెల్లెను—

హరి. ఉ. 4 ఆ. 86 వ పే.

స్థాపకములు అను సవరణకుఁ బని గానరాదు, అధికారమూ లేదు. (నవీన సంస్కారమున్నూ లేదు)

క॥ కర్మారబ్ధ...అనారత—న + ఆరత, అనారత—ఎల్లప్పుడు, నిర్యాము

(అనారత శబ్దములో అచ్చు వీఱుగట ఎల్లరకు దెలియదు.)
శా॥ స్వైరాకృష్ట....సర్వస్వ హరి. ఉ. 4 వ ఆ. 106 పే.

ఇదియు నిత్యసమాసోభయ యతులలో చేరాలి, లేకపోతే అఖండయతి కావాలి (స్వ — ఈర, స్వ+ఈరి. స్వైర. స్వైరి. స్వాదీరేరిణోః — వృద్ధి) ఇక్కడ, ఈ, ఐ, అను అచ్చులకును,

హరి. ఉ. 4 వ ఆ. 106 పే.

(స్వైర) సై, వై అను హల్లులకును నాల్గింటికి ఉభయ యతులు చెల్లాలి) ఇట్లే ముందరి ప్రౌఢ మున్నగు వానికిని,

(ప్ర + ఊఢ, "ప్రాదూహోఢో" ఇత్యాదినావృద్ధిః (వృద్ధివచ్చును)

అంబర మున....ప్రౌఢిజ — హరి, ఉ. 4 వ ఆ. 98 పే.

మ॥ సమ్మద మొప్పారఁ దదీయ మిత్రి పదవిన్యస్యేండ్యనై

హరి. ఉ. 5వ ఆ. 133 పే.

అప్పకవికి భిన్నముగా నిక్కడ న మలయతి—ఉన్నది (నవీన ప్రీతియున్మాన్యుండనై అని ఎందుచేతనో మార్చలేక పోయినది)

మ॥ అసిరోముండు....ఉ ర్విచలింపంగ — హరి. ఉ. 10వ ఆ. 259 పే.

ఇక్కడ కొందఱు మతమున గసడదవాదేశమున కవకాశమున్నను శ. ర. లో నలించు వైకృతము అన్నను చసల యతి వంటి) ప్రాస లనుట యే హృద్య మని తోఁచును. అట్లుకానిచో విష్ణుఁడు సక్రియ అనియు అగుట కాటంక ముండదు. స్వమతాభిలాష విపరీతపు మార్పు లను చేయించును. ప్రమాదముచేతను ఆమార్పులు రావచ్చును—'చల్ల జంపయ్యెఁజండుఁడు శతు తతికి' — హరి. ఉ. 10 వ ఆ. 267 పే.

చల్లఁజంపు—చల్లఁగా (తడిపాతకోఁతగా) చంపువాడు (గోముఖ వ్యాఘ్రము) శ. ర. లో చల్లఁజంపు — భయంకరుఁడు అని వ్రాసి ఇది యే ఉదాహరించెను గాని ఇక్కడ (ఈపదమున) ఆ యర్థము కొంచెమేని సరిపడు నట్లు తోచదు. చల్లన్ + చంపు— చల్లఁజంపు అని (శబ్ద పల్లవ మైననేమి) రెండు పదముల యర్థ

మిందు స్ఫురించక మానదు. ఈ సంగతిని విశేష మగు చంద్రుఁడు అను పదమున్నూ (చది ఆహ్లాదే చంద్రః) ధ్రువపఱుచుచున్నది అని మా యభిప్రాయము. (ఇట్టి మార్పులు పెక్కులు చూపవచ్చును.) ఇట్టి భిన్నభిన్నార్థములు కాల వ్యక్తి భేదములతో పాటు వచ్చుచునే యున్నవి (అది వింత కాదనుట.)

'ఆశ్రయించిన వానికి.......కీడువాటిల్లు'

(భార. శాం. 5 వ ఆ. 326 ప.

ఉప (కీడు — పాటిల్లు) 'యింత పట్టు..............వచ్చు' (ఇంత — పట్టు) జాతి లాతి వా లకు (అప్పకవి) యతి కూడ నన్నాఁడు గాని అదియును ఇట్లు భారతముననే ఉన్నది. (భార. శాం. 4. ఆ343 పద్య.

'ఆడితె........ఎఱుంగనా'— ఎఱుంగను (ఎఱుంగన్) ఆ, ఎఱుంగనా— అచ్చున్నూ చెల్లుచున్నది. (భార. శాం. 4 వ ఆ 396 పద్య.

'భూత స్వభా వంబు యందు కొంచ అమిత తేజ'

(భార. శాం. 5 వ ఆ. 67 ప.

బిందు పూర్వక బకారమునకును పంచమాక్షరమగు మకారము నకును ప్రాసలు చెల్లుచున్నవి. (ఇట్లబిందు (యతివలె) బిందు ప్రాసలన్ని వర్గీయములకును చెల్లునని తోఁచుచున్నది. 'అంబుజాక్ష' అని క్రిందు భాగమున పాఠాంతరము వ్రాయఁబడి యున్నది.

క॥ దండము కాషాయంబును ముండితయుఁ గమండలువును మోక్ష మొసఁగ వెంట్లండేని లింగములకు నఁ ఖండ జ్ఞాన ప్రదత్వ కలనము గలదే— (భార. శాం. 6వ ఆ. 178 ప. (ఇక్కడ కవి విరచితము ఎట్లండేని ఎట్లు — అండేని— అని యే యనియు టపప్రస లై పోవు నని భీతిచే కావలయు ఇట్లు మాఱియుండు ననియు ఈ ఱండేని ప్రయోగము మేకాని, ఎట్లునూ సహజము కాదనియు మాకుఁ దోఁచును.)

"హ్రాషి, కేశ నామకము లసీాస చరిత"

(భార. శాం. 6 ఆ. 431 ప.

(హృషీక — ఈశ — హృషీకేశ, జనార్దన మున్నగునవి వోలె ఉభయయతి పదమై అచ్చు చెల్లెను హల్లున్నూ చెల్లును 'కే అను దాని కనుట హృషీకే శేత ఇతి అనియును వ్యుత్పత్తి ఉన్నది హృషీకే — శ అని, అప్పుడు ఈ అని విఱుగదు గనుక అచ్చునకు చెల్లదనుట)

"ఏ, కాంతిక ధర్మంబు కరతలామలకము"

(భార. శాం. 6 వ ఆ. 503 ప.

(ఏక + అంతిక — ఏకాంతే భవమ్ ఏకాంతికమ్' ఇట్లు ఏకాంత శబ్దమిందు గలుగుటచే ఉభయయతి యై కరతల ఆమలక అచ్చు చెల్లెను, హల్లున్నూ చెల్లును. ఇట్లే అన్నిటిలోన్నూ)

"జమ దగ్ని తనయ రాఘవాదు లైన"

(భార. శాం. 6 వ ఆ. 589 ప.

(జమత్ — అగ్ని జమదగ్ని, రాఘవ — ఆది, జమదగ్ని శబ్దో భయయతులలో, అచ్చు చెల్లెను హల్లున్నూ చెల్లును.)

క॥ వనితల, పురుషుల యెడఁ బు
ట్టిన యది వెల్లివిరిసేఁత డిమ్మరితన మె
ట్టి నికృష్టుం డైనను ని
ప్పునికిఁ జొరఁడు దగునె యది నృపాల సుతునకున్

(భార. శాం. 6 వ ఆ. 208 ప.

డిమ్మరి—మత్తు కలవాఁడు, తాౕగు బోతు, డిమ్మరితనము—తాౕగు బోఁతుతనము, డిమ్మరి, డిమ్మరితనము—రూపాంతరములు—అని శ. ర. లో— చూ. కొందఱ మతమున దడలకు, యతులు ప్రాసలు ఉన్న వనియు అవి ఇష్టముకాక ఇట్టి రూపము లున్నూ కృత్రిమము లై వచ్చినవి, సహజములు- పదములలోను యతి ప్రాసల లోనూ దకార మంతే కన్నఁగా దడలకు యతి ప్రాసలు సహజముగానే ఎల్లెడఁ జెల్లు వనుట. ఇట్టి మార్పులు పెక్కులు విమర్శకులకు బాడకట్టును కనుకనే ఇట్టి గూఢ భేదములు వచ్చినవి, వచ్చుచున్నవి, ఇంకా రాఁగలవు.

"అచ్చెరువు గ....అవి జేయ" — హరి. ఉ. 10 వ ఆ. 282 పే.
"ఆ యచ్చెరువురు....అ జేయుండై" హరి. ఉ. 10 వ ఆ. 266 పే.

ఇట్టి కవిత్రియ ప్రయోగములున్నూ ఇతరములున్నూ పెక్కులుండి, 'అబాధకాన్యపి నిపాతనాని భవంతి' అను భాష్య మత నిపాతాబాధకత్వ పక్షావలంబముచే శాస్త్రీయముగానే మా వివరణముచే సాధింపఁబడినని.)

క॥ విషయేంద్రియ ప్రపంచము,
హృషీక మనఁ బరఁగు నీ వధీతుఁడ వై యు
న్మిషితముగ నది ధరించుట
హృషీకేశ నామ శోభి వైతివి కృష్ణా
హరి. ఉ. 6 వ ఆ. 142 పే.

ఇందు 4 వ పాదమున కంద లక్షణమునకు భిన్నముగాను ఇదియు నొక కంద భేదమగును. కానిచో ఎఱ్ఱాప్రగ్గడ ఎట్లు ప్రయోగించును. మఱియొక రీతి మార్చుటకేని వీలుపడని హృషీక హృషీకేశ పద నిరుక్తి స్థలమయి యున్నది అనియు ఇంతేకాక ఋకారము రెండు రకారముల చేతను— అభితోఽజ్ఝక్తిచేతను— అంతటను, చుట్టువాఱి యున్న అజ్భాగము, అజంశముతోడను పుట్టినది అని ప్రమాణముండుటచేతను ఆ యజంశ మిట్టి దను నిరుక్తి— ప్రమాణము లేక అది ఇకారమునకే కాక ఇతరులకును మైత్రి చెల్లునదియూ, ఇక్కడ అకార మైత్రికినీ చెల్లినదా అని అపూర్వమగు సందేహమును గలిగించునదియు ఐ మాకుఁ దోఁచినది. మిక్కిలి ప్రతిభా శాలురు విశేష దృష్టినిచ్చుట నుపయోగింపఁ బ్రార్థితులు.

కం. శ్రీకంఠ గగన తటినీ
శీకర కోరకిత జూట శీతకిరణ రే
ఖాకల్ప కల్పతరు శ్రీ
లాకల్ప దయా విలాస లాలిత సుజనా
హరి. ఉ. 6 వ ఆ. 140 పే.

కల్ప తరు శీల + ఆ కల్ప — కల్పవృక్ష శీలము వంటి శీలము భూషణ మైన లేక ఎటరమైననూ శీల ఆకారాంత స్త్రీ లింగము కాదు గనుక ఆకల్ప అని విఱుగక తీఱదు, లాలిత అను దానిలో ఎట్లును అకారము విరుగదు. అఖండయతి కాకమానదు — లేక లలిత మేవ లాలితమ్, అణ్ణంతమై ఆది వృద్ధి చేత ఏర్పడి వెనుక చెప్పినట్లు ఉభయ యతులలోని దగుటచేత గాని చెల్లుబడి యగును—మార్పుగాన రాలేదు.

తే॥ ...... అవహితాంత, రంగులై విను( డింపార నన్మ దుక్తి—

హరి. ఉ. 6వ ఆ. 142 పేజి

(అంతర్ + అంగులు, అంతర్ అనునది ఉపసర్గ వంటిదే గనుక అచ్చు చెల్లెను లేక అంతరంగ శబ్దముభయ యతులలో చేరి హల్లునూ్న చెల్లవచ్చును.

క॥ మాటాడినఁ గోపింతురు

నీరుగ శపియింతు రేమొ నీ బోంట్లకు నీ

శూరతములు వెఱతురె మముఁ

గాటియఁగా నిట్లు పలుకఁ గలరే యన్యుల్

హరి. ఉ. 6వ ఆ. 145 పేజీ

అ, ర ప్రాసలే అత్యంతమ్ శూరాః శూరతమాః—ఇట్టి సంస్కృత పదములో అ సంపాదించ లేరుగదా, నవీన ప్రతియు మార్చలేక పోయినది.

'మదన బాణముల కేణా లోకముల' హరి. ఉ. 6వ ఆ. 182 పేజీ ఇది అఖండముగా మ, ణా, ల, యతియే గాని నవీన ప్రతి అతను బాణముల అని మార్చినది—

మతుబాదేశ యతి:—

చ॥ మది మదినుండియేను బలవంతుఁడనై హరి. ఉ. 8వ. ఆ. 199పద్యం.

ఇది మతుబ్నిత్యాదేశ యతిగా నున్నది. ఇట్టి యొక ఉభయ యతి గ్రహించవలసి నట్లే ప్రయోగము నిర్ణయించు చున్నది. ఇది

యుక్తమే యగు చున్నది. బలవ్ అన్యాతీత, బల — మత్ —మాదు పథాయా మతో౽ యవాదిభ్యః — యవాది గణములో జేరని విన్ని మకారాంతములు మకారోపధలు అకారాంతములు అకారోపధలున్ను అగువానికిఁ జేరిన మతుప్పులోని మకారమునకు నిత్యముగా వకారము వచ్చును అను నర్థముగల దానిచే మకారమునకు వకారము వచ్చి బల వత్, అది తత్సమమై బలవంతుఁడు ఇట్టి వానిలో స్థానిని బట్టి మకారమునకును ఆదేశమును బట్టి వకారమునకును యతి మైత్రులు చెల్లును. ఇక్కడ స్థాని యగు మకారమునకు ఆది యందున్న మది అనుదాని మకారము చెల్లినది. దృశ్యమానమగు వకారమునకు సిద్ధమే. (సహజమే) ఇది మతుబ్వత్వాదేశ యతియగునని భావము. ఇట్టిచోట్ల బలమంతుఁడు అనఁగూడదు అని యెఱుంగునది. అన్నిటను పారమిక్లే యున్నది. నవీనులు అనికొందఱు ముద్రిత ప్రతులలో దిద్దుకొనుచున్నట్లు కానవచ్చుచున్నది. అది అనవసరము అయుక్తము నని మా యభిప్రాయము—

ఉ॥ కాదన నేను నీ క్రియ నీకంటికి నై

ఒకొంటికి—ఇట్టిదే— వీనిలో ఒక — అంటికి, ఒక — ఒంటికి అని విఱుగదు. ఇవి దేశ్య నిత్యసమాస పదములున్నూ కావు. భిన్న పదముల సంధి కలవిన్నీ కావు. ఒకొంటి అను దానిలోఅచ్చు(కకారముమీఁది ఒకారము) నకున్నూ (దేశ్యనిత్య సమాస యతిగాఁ గావలయు) మైత్రి చెల్లు నట్లు ప్రయోగములున్న వనుచున్నారు. అట్లైనచో ఒకంటి అకారమునకున్నూ చెల్లుట కాటంకమేమున్నది? అప్పుడది ప్రత్యేక వక్తవ్యమే అని యన్యత్ర విస్తరము. అప్పకవి— 'మా కొనరిన సైన్యముల్ పదునా కొంటికి' అని యున్న చోట దేశ్యనిత్యసమాస యతిగా తెలియని వారు కొందఱు అచ్చునకునూ చెల్లు నట్లనుకొనుచున్నారు. ఇక్కడ సోమయాజులు సంధిచేసి స్వరప్రధాన యతి గాఁ బ్రయోగించినారు. (అది తెలియక అట్లనుకొందురు)అను భావము తెల్పుచు దేశ్య నిత్యసమాసోభయ యతిలోనిదై అచ్చునకుఁ జెల్ల

నప్పుడు స్వరప్రధాన యతి యెట్లగుననుకొన్నాఁడు ? ఇది మిక్కిలి విపరీతము అను నట్లు వ్రాసినట్లు ఇప్పటి ప్రతులన్నిటను మా చూచిన అప్పకవీయ ప్రతులలో నున్నది. కాని అప్పకవి ఇంత తెలివి తక్కువ వాఁడుగా మాకు తోఁచినది కాదు. అందుచేత ఆతని గ్రంథ పాఠమున్ను ఆతనికి లభించిన భారతప్రతి పాఠమున్ను 'మా కొనరిన సైన్యముల్ పదికి నొంటికి' అని 'యే పదికిన్+ఒంటికిన్ — పదికినొంటికి అని సంధి చేసి (ఇక్కడ సంధి యనఁగా పొల్లు నకార వుకార ముతో గూడి నొ అగుట 'యే' అనుట సరిపడును స్వరప్రధాన యతియు అనుకూలముగా నగును. దీని ననుసరించి తరువాతి వివరణ వాక్యములోను 'పదికి నొంటికి' అని యున్న చోట అనియే ఆతని పాఠము. ఇప్పుడా అప్పకవి తనచే దూరువడిన వారికన్ననూ తెలివి లేని వాఁడు కాకుండఁజేయుట యైనది కాని ఇప్పుడు (తిక్కన్నగారి) భారత కవిత్వమునకుండవలసిన సౌకుమార్య గాంభీర్య ప్రౌఢత్వాదులు ఇందు కొఱవడినవనుట మాకున్ను తప్పనిదే. ఐననేమి ఆతని సమర్థన మిట్టిది యని మా యభిప్రాయము. విశేషము వివరణమున చూచునది.

'కేవల భోగ యోగ్య పరిగృప్తికి' -- హరి. ఉ. 8 వ ఆ. 226 పే.

ఇది ఋ, ఇ, ఈ, ౠ, ఎ, ఏల మైత్రిని తెలుపును. ఇక్కడ కే కృ లకు మైత్రి చెల్లెను.

సీ॥ పా. ఇతఁడని కృష్ణుని యుదయించుటాదిగా—

హరి ఉ. 8 వ ఆ. 226 పే.

త, ద, లకు ప్రాసలు చెల్లినవి.

శా॥ కేతువున్ శార్దూలాంకము .... కలితోద్యత్ --

హరి. ఉ. 9 వ ఆ. 258 పే.

ఇక్కడను బిందు పూర్ణముకాని ద కారమునకే పంచమాక్షరముతో (నకారముతో) మైత్రి చెల్లినది. మార్పున్నూ లేదు.

సీ॥ కృ తాంత రోష వికృతి కాత్మ యసఁగ —
హరి. పూ. 4 వ ఆ. 93 పే.

కృత — అంత, వికృతికి — ఆత్మ, కృయంత శబ్దోభయ యతిలో అచ్చు చెల్లెను, హల్లు సహజమే.

చ॥ అఱచుచు...కృతాంత భార. అర. 3 వ ఆ. 153 పద్య.

పై దానివంటిదే—

సీ॥ ఉలి వాడు చోపుడు గోలలగుచు— కళా. 2వ ఆ. 172 పద్య.

(ఉలివు — ఆడు—చలించు, శ. ర. అచ్చు చెల్లెను. ఇదియు నొక దేశ్యనిత్య సమాస పదమై హల్లునూ చెల్లును.)

మ॥ అని చెప్పన్ .... ఏలా కళా. 3వ ఆ. 48 పద్య —అచ్చే చెల్లును.

'అ ల్లంతన....అకటా' కళా. 3 వ ఆ. 85 పద్య —అచ్చే చెల్లెను.

ఇట్టి వానిని బట్టి దూరాహ్వానము కానప్పుడు ప్లుతమెట్లు వచ్చె ననుకొన్నాడు. ప్లుతయతితో అచ్చునకు చెల్లుట అకారాంతేతరములకే అని యనుట చెల్లనిదే— దీనికి తిక్కన్నగారి ప్రయోగాలు చాలానే యున్నాయి— పీఠికాంతమున వ్రాయఁబడును.

సీ॥ వీణె యేమయ్యె దే విచ్చుటికిని— కళా. 3వ ఆ. 135 పద్య.
ఇది శుద్ధాఖండయతియే.

'త దాజ్ఞను మునుపటి తనదు' కళా. 4 వ ఆ. 188 పద్య.

తద్ — ఆజ్ఞ— అఖండయతియే - తచ్ఛబ్దోభయ యతియేని కావాలి, హల్లుచెల్లెను, అచ్చు సహజమే.

'కృతా ధిరోహుఁడై ... యథేచ్ఛా'
కళా. 4 వ ఆ. 190 పద్య.

యథా — ఇచ్ఛా — అఖండయతియే — యథావ్యయ యోగోభయయతి యేని యగును.

కృత — అంత, వికృతికి — ఆత్మ, కృతాంతజ శబ్దోభయ యతిలో అచ్చుచెల్లెను, హల్లు సహజమే.

చ॥ అఱచుచు....కృతాంత— భార ఆర 3 వ ఆ. 153 పద్య.

"అని నెడ నాడుదు రనిన మము నిసీ యను టరుదే"

భార. శాం. 1 వ ఆ. 117 పద్య.

ఇక్కడ ఇట్లే ఉన్నది కాని ఎడనాడుదురనిన అనియో చెడ నాడుదురు అనియో కవి విరచితమై ఉభయయతులు చెల్లును గాని నెడ అనికాదు అని మాకుఁదోఁచినది

'పోయిరి——కాదే'—అచ్చు చెల్లెను. భార. శాం.1 వ ఆ. 225 పద్య.

'అయ్యె నే నృపాల—మహీశ్వరుండు'— అచ్చే, భార. శాం. 1వ ఆ. 237 ప. 'ఆదిత్యు నుదయా స్తమయ'— భార. శాం. 2 వఆ. 293 ప. (అ స్తమ్+ అయ—అ స్తమయ—శబ్దోభయ యతులలో అచ్చు చెల్లెను. హల్లు సహజమే; ఉదయ శబ్దమున్నూ ఇట్టిదే.)

'సహ సమాసీన—అగ్ని'— భార. శాం. 1 వ ఆ. 374 ప.

సమ్+ఆసీన—అచ్చు చెల్లెను, హల్లున్నూ చెల్లును.

'అ య్యారవు......తలఁపవే'— అచ్చే భార. శాం. 2 వ ఆ. 54 పద్య.

'ఎమ్మెయి.....సేయరే'— అచ్చే భార. శాం. 2 వ ఆ. 70 పద్య.

(ఏకాక్షర ప్లుతయతుల లోనూ భారతమున హల్లు చెల్లునవే. పెక్కులు ఇట్లు అచ్చులున్నూ చెల్లుచున్నవనుటకు నివి చూపఁబడినవి.)

'యజ్ఞమునకంటె నధికమైనదియు'— భార. శాం.2వ ఆ. 228వ.

అధిక మైన+అదియు—అచ్చే

'రాత్రియైనచో—పరిచర్యం బాసి'— భార. శాం. 2 వ ఆ. 238 ప.

రాత్రియైన+అచో—అచ్చే—

'దామోదర——ఒరుల'— భార. శాం. 1 వ ఆ. 390 ప.

జనార్దన శబ్దము వంటి దామోదర శబ్దోభయ యతులలో అచ్చు చెల్లెను హల్లు సహజమే.

'ప్రసాలుపమచునది' భార. శాం. 2 వ ఆ. 298 ప.

(పసుపు — అది—అచ్చే చెల్లెను.)

'ఏచు తెఱఁగున నేఁచుచు నీచ కుటిల' భార. శాం. 3 వ ఆ. 105 పద్య.

భారతమున (తిక్కనగారి) కిష్టమే — సబిందు నిర్బిందు ప్రాసలు

'అల్లన——కడపునది' కడపు — అది అచ్చే— భార. శాం. 3వ ఆ. 273 ప.

'పైను ప్రా పై యుండ నేను వెఱతునె యెల్లె'

భార. శాం. 3వ ఆ. 292 పద్య.

(ప వల అభేద వర్గయతి భారతముననే యున్నది.)

క॥ సురుచిర........స్ఖలన (ఇక్కడ స్కరణ అని మాఱెను) గాని అది యట్లు మాఱునది కాదని మా వివరణము సప్రమాణము, సహేతుకము గా నిరూపించి రల ప్రాస మున్నూ ఆది కవి కిష్టమే యని ధ్రువపఱిచినది. భార. ఆర. 3వ. ఆ. 88 పద్య.

చ॥ 'సురేంద్ర నం దను పటు——హాతినాధృతరాష్ట్ర'

భార. ఆర. 1వ ఆ. 149 పద్య.

(హాతిన్+ఆధృతరాష్ట్ర) అఖండయతియే నవీనముగా తద్ధృత రాష్ట్ర అని మాఱెను)

'పారావార రవంబు వోలె ననివార్యములై' భార. ఆర. 2వఆ. 55 పద్య.

(పార — అవార, పారావార శబ్దమున అచ్చు చెల్లెను హల్లు సహజమే)

సీ॥ 'సాకార మై వచ్చి సకలంబు' భార. ఆర. 4వ ఆ. 221 పద్య.

'సాంగ వేద వేది యగు' భార. శాం. 2వ ఆ. 298 పద్య.

(సహ) స+ఆకార (సహ) స+అంగ—సాకార, సాంగ సహ పూర్వపద బహువ్రీహి పదోభయ యతులై అచ్చున్ను హల్లున్ను చెల్లినవి ఇట్లే సహపూర్వపద బహువ్రీహు లన్నిటను రెండున్ను చెల్లు నని యెఱుంగునది

'వృత్తాంతము——క్రియన్' వృత్త — అంత వృత్తాంత శబ్దోభయ యతులలో' అచ్చు చెల్లెను. హల్లు శ్రావ్యమే భార. ఆర. 6 వ ఆ. 50 పద్య.

క॥ జ టాయువనం——అరయుఁడు జటా+ఆయువు అచ్చు చెల్లెను హల్లు శ్రావ్యమే భార. ఆర. 6వ ఆ. 356 పద్య. జటాయు శబ్దోభయ యతి

ఆ॥ 'శరము లేయుటయు నిశాట వరుఁడు' నిశా — అట హల్లు చెల్లెను. అచ్చున్ను చెల్లును) ఇట్టి అట శబ్దముచే నేడిన అన్నిటను రెండున్ను చెల్లును. ఇక్కడ ప్రాచీన ప్రతుల గొన్నిట ప్రమాద మున 'నిశాచ వరుఁడు' అని పడియున్నది అది చూచియే కావలయు అర్థము కుదురుటకు ఇట్లు నవీన ప్రతి నిశాట వరుడు అని మార్చినది. వాస్తవమున నిశాచరుండు అని కవి కృతమని మాకుఁ దోఁచినది. ఎట్లైన నేమిఁ నిశాట మున్నగునవి ఉభయయతులు చెల్లునవి యే.

ఆ॥ 'ఇమ్మహా శరమ్ము పార్థునది యచూవె' భార. విరా. 4వ ఆ. 123 పద్య.

ఇక్కడ కవి విరచితము సహజము; 'పార్థునిదియచూవె' అనియే అయి 'తచ్ఛబ్దాతః' అను దానిచే పార్థుని — అది; అది అను దాని అకారమునకు లోపము వచ్చి పార్థునిది అని యేర్పడి లుప్త స్వర యతి (లేక) ప్రత్యేకయతి అగునట్లే వాడఁబడి యుండగా అది యిట్లు పార్థునది గా మాఱినది. ఈ పాఠము అప్రాథము కృత్రిమము అయి మోటువడి భారతమునకు తగినది మాకు కాలేదు. ఇక్కడ హల్లున్నూ చెల్లును. అది సహజమే ఇట్టిదే కళాపూర్ణోదయమున నూ ఒక ప్రయో గము కానవచ్చినది. మేము చూచిన ప్రతులలో మార్పున్నూ లేదు. కాని మల్లాది వారి ప్రతిలో ఇక్కడ యతి తప్పినందుచేత మార్చి నాము అని యున్నది మార్పున్ను ఉన్నది (చూ. ప్రత్యేకయతి [illegible] మా వివరణము). ఈ విషయము నిర్ణయమునకు సహృదయులు ప్రమా ణము.

క॥ మాధవ సముపానీతములై నవి యేఁ జేయు నభిషేచనము
గై కొనుమా హరి. పూ. 7వ ఆ. 176 పే. ఐన — అవి — ఐనవి — హల్లు
చెల్లెను. (నవీనపు మార్పుకృతి)మమే.

క॥ భూదేవ సమాదరమునఁ గాదె బ్రతికినవి యిజ్జగముల్
భార. ఆర. 7వ ఆ. 314 పద్య.

సమ్ — ఆదర, బ్రతికిన + అవి, అచ్చు చెల్లెను — ఈ రెండున్ను తచ్ఛ
బ్ధార్థక బహువచన మగు అవి అను దాని అకారము సంధి వశమున 'అత్వ
సంధిచే' లోపించినను లు ప్తస్వర యతియో ప్రత్యేకయతియో అయి
అచ్చునకు హల్లునకు రెంటికిని చెల్లుచున్నవి. ఇట్టి వానియందెల్ల నిట్లే
చెల్లునని మా యభిప్రాయము.

క॥ ఒంటిఁదిరుగుదాని చొప్పెఱుంగదు

హ్రస్వ పూర్వ సబిందు నిర్బిందు ప్రాసలు అప్పకవి చెప్పనివి భార. విరా.
1వ ఆ. 102 ప.

'చెలఁగి మార్కొని పొదివిరి సంకులముగ' భార. విరా. 3వ ఆ. 212 ప.

ఇక్కడ యతిగాని ప్రాస యతి గాని కానరాదు. మా
చూచిన ప్రతులన్నిట నిట్లే యున్నది. సోమయాజులు (చెలఁగి) చలఁగి
అని దంత్యాదిగా వాడెనా యని అనుకొనుటకు మఱొక్కటి ఇట్టిది
యీతని కవిత్వమందును మాకుఁ గానరాలేదు. కనుక పాఠము మాఱి
వలెనా ఇదియే దానికి ప్రమాణమా అని తోఁచుచున్నది. ఇది విజ్ఞులకు
విమర్శనీయము.

క॥ 'పర్వోచు స్త్రీ పర్వాదిక పర్వంబుల నేనిటం గృపాయుతమై'
భార. ఆది. 1వ ఆ. 55 ప.

కృపా — అయుతము — దయా వృత్తము లేనిది ఈ పర్వమున
మహా ఘోర కృత్యములు జరిగిన వనుట, — అఖండ యతియే — నవీన
ప్రతిలో 'కృపాయిత మై' అని మాఱినది. అఖండయతి కానట్లు
(కృపా — యుతము అని) చెప్పుట సులభమై యుండ మార్పునకు
విశేష ప్రయోజన మిక్కడ లేదు. కృపాయితము — దయవలె నాచరించు

నది, జాలి కలిగించునది అని యెట్లో విశేషము సమర్థింప వచ్చును గాని సరళత్వము లేనిదై కృత్రిమ మగునని మార్చఁ దోఁచినది. కృప యనఁగా దయగాని కరుణ రసము గాదు అనుట.

శా॥ ఏడక్షౌహిణు...రూఢిన్...ఏపారు ఘోరాన నల్లాడన్
భార. ఆది. 1 వ ఆ. 69 ప.

ఈ ప్రాచీన ప్రతిలోని డ థ (ప్రాసలున్ను ఘోరమున అను దాని రూపాంతర మగు) ఘోరాన అనియు దుష్టములే యని కావలయు నవీన ప్రతి అధికారము లేకయే రూఢి ఘోరాజి అని మార్చినది— అందము చెడఁగొట్టినది. అవి సప్రమాణములే యని అన్యత్ర విస్తరము "అక్షౌహిణీ, యా నిరంతర ప్రమాణ సంఖ్య" అనుచోట నిట్లే ఔ నిరంతర ప్రమాను సంఖ్య అని మార్చినది. ఇట్టివి పెక్కులు.

సీ॥ 'దంతుల నమిత పదాతుల' పద + అతి—హల్లు చెల్లెను. అచ్చున్ను చెల్లును.
భార. ఆది. 2 వ ఆ. 21 ప.

"ఈ రమణీయ కాంతి నుపమింపఁగ" — అఖండ యతి యేని ఇంచుగాగమ యతి యేని యయి పోవునని—కాంతిని వహింపఁగ అని నవీనమే మార్చెనది.
భార. ఆది. 5 వ ఆ. 150 ప.

'ఇప్పాట పాండు వంశజులు రాజ్యార్హు లగుదురు వసుమతీ రాజ్యమునకు'—అఖండ యతియు రలల యతియు నగునని, 'రాజ్యార్హు లగుదురు రాజ్యమునకు' అని మార్చినది. భార. ఆది. 6వ ఆ. 126వ ప.

మత్తకోకిల. అంతకాలము...బిడౌజ — అచ్చు చెల్లెను. వృద్ధి యతిగా ఔకారము చెల్లెను. ఓకారమున్ను చెల్లును. ఉభయ యతి పద్మమె డౌ అనునదియు (హల్లున్ను) చెల్లును. ప్రభా. 1వ ఆ. 87 పద్య
ఆ॥ 'త్యున్నతి...బిడౌజ'—95 పద్య—ఓకారమునకు హల్లుకు శ్రావ్యమే
'ఏ, లా....అంతిపురము' — అచ్చు చెల్లెను.
ప్రభా. 5వ ఆ. 72 పద్య.

"గూహన....రథాంగ పతంగ"—అచ్చు చెల్లెను, పక్షివాచక రథాంగ శబ్దముభయ యతులలోనిదై హల్లున్ను చెల్లును.

[ప్రభా. 5 ఆ. 59 ప.

"నా కౌక స్స్వామికి.....అనుపుట" నాకౌక శ్శబ్దోభయ యతులలో ఔకారమునకు చెల్లెను ఔకారమునకు కౌ అను హల్లున కున్నూ చెల్లును.) [ప్రభా. 5. ఆ. 88వ పద్య.

'చిట్టుములు - - అనూన' [ప్రభా. 5 వ ఆ. 185 పద్య.

చిరు [చిట్టి] + ఉములు—చిట్టుములు న — ఊన, అనూన ఇదియు నొక దేశ్యోభయ యతి పదమై అచ్చు చెల్లెను, హల్లు సహజమే.

'నమ్మ వాచ్యతఁ దోఁచినట్టి నాకు' (అఖండయతి యేని వెనుక చెప్పిన అత్వసంధ్యుభయ యతి యేని యగును.)

[కళా. 5. వ ఆ. 54 పద్య.

'ప్రాణాయామ- - - -ప్రయత్న'—(ప్రాణ —ఆయామ, అచ్చు చెల్లెను. ఇదియు నుభయ యతి పదమై హల్లున్ను చెల్లవచ్చును.)

[కళా. 5. ఆ. 148 పద్య

'అడరి యీ దివసము నపరాహ్ణమునకు'

[భార. ద్రోణ. 4. వ ఆ. 309 పద్య.

[పరా + అహ్ణ — పరాహ్ణ; న — పరాహ్ణ, అపరాహ్ణన—ప్ర — అహ్ణ, ప్రాహ్ణ, ఈపదము లుపసర్గోభయ యతులు గనుక, ఇక్కడ అచ్చు చెల్లెను, హల్లున్నూ చెల్లును.] మధ్యాహ్న—ఇట్టిదే—

'శర శరాసనము————అనఘ' (శర — అసన—శరాసన శర — ఆస—శరాస ఇట్టి అసన ఆస ఉత్తరపదముగు బాణాస బాణాసన మున్నగునవన్నియు ఉభయ యతిపదములే ఇక్కడ అచ్చు చెల్లెను. హల్లు శ్రావ్యమే [భార. ద్రోణ. 4. వ ఆ. 322 పద్య.

క॥ బాహాదర్పము నింకఁ గాల్పనా [భార. ద్రోణ. 4 వ ఆ. 336 పద్య.

అచ్చు చెల్లెను హల్లున్నూ చెల్లును.

'పుత్త్రు నొ కో——————కలంక యును' పై దాని వంటిదే- 373

ఇట్లు దూరాహ్వానము కానప్పుడునూ ప్లుతము తెనుఁగులో వచ్చును. దానిని అప్పకవియే గాక అధర్వణుండు (ద్వితీయాచార్యుఁడు) న్నూ విధించినాఁడని యెఱుంగునది. ఇఁక నవీనులు అప్పకవి నాక్షేపింప నక్కఱలేదు. అచ్చు విఱుగ నప్పుడున్నూ అకారాంత సంబోధనముల లకున్నూ పెక్కులు మహాకవి ప్రయోగములు చూపితిమి. ఆ యాక్షేపణ మున్నూ చెల్లనిదే. ఇక్కడికే చాద స్త మైనదని భీతిచే తిక్కనగారి దేవకీ. నందన శతకమునుండి కొన్ని విశేషములు తెల్పి విరమించుచున్నాము.

| | | |
|---|---|---|
| 'నిన్నారాధింతు— — — — — కృష్ణా' | 3 | పద్య |
| 'ఆలం — — — — — — — కృష్ణా' | 16 | పద్య |
| 'ఆది బ్రహ్మ — — — — — కృష్ణా' | 6 | పద్య |
| 'అరయన్ — — — — — — కృష్ణా' | 25 | పద్య |
| 'అంటన్ — — — — — — —కృష్ణా' | 30 | పద్య |
| 'అలనీ — — — — — — — కృష్ణా' | 35 | పద్య |
| 'అని — — — — — — — —కృష్ణా' | 46 | పద్య |
| 'మూర్ధాలంకార — — — — కృష్ణా' | 47 | పద్య |
| 'మూఁడడుగుల్ — — — — కృష్ణా' | 56 | పద్య |
| 'వేదాంత — — — — — — కృష్ణా' | 75 | పద్య |
| 'అంగీకారము — — — — — కృష్ణా' | 78 | పద్య |
| 'ప్రారబ్ధం — — — — — — కృష్ణా' | 85 | పద్య |

'కూడీకూడని' 4 పద్య— —'వండే నేర్పుగల శాకముల్

దండిన్ — కృష్ణా' 10 — (దణలయతి)

'ంబలుమాఱున్ — — పద్మాత్మజా' 15 పద్య (అఖండ యతియో పద్మాత్మ శబ్దోభయ యతియో)

'హాళిన్ — — — కాముకుఁడనై హంకార'— 22 పద్య.
(అహంకార, హంకార,—అకారలోపము)
'ము న్నెలమిన్ —నిర్జించి' 35 పద్య. — — (అఖండయతి.)

'కీర్తియు న్నతుల'— 37 పద్య. (అతుల—దుత్రిత ద్విత్వము)

'ప్రీతతుల్ — — ఏపార'— 37 పద్య. (ఏపు+ఆరు— అఖండ యతియో ఉభయయతి పదమో) 'పోయను— కృష్ణా' 40 పద్య. (పోయెను)— పోయను— 'అయ్యో ... గద్దయెత్తుకొని పోయెన్' అను దానివంటిది.

'మహా గారడం బని—కృష్ణా'—46 ప. (గారడము నైకృతము శ. ర. వైకృతములో సిద్ధ సమాసము) 'పతులు న్నేవురు'— 48ప. 'ధరకు న్నగ్రిజు'— 50ప. (దుత్రిత ద్విత్వములు) 'నిర్వక్రించియ్యేఁడు నటు జేతు' 52 ప. (చేతురు కోతురు వంటిది) 'బాహాబలం, బేలా—నిక్షేపంబు'— 54 ప. (అఖండముగా, బిందుపూర్వకబకారమునకు పకారమునకు యతిచెల్లినది; మవర్ణ విరామము)

'ప్రారంభంబున ... చేతి తడి యాఱన్'— 60 ప. (రఱల యతి)

'అరయ న్నాతని'— 'వేసారుచు న్నెన'— 64—65 (దుత్రిత ద్విత్వము)

వెఱచైనన్ మఱచైన 'ఆదర మొప్పైన'— 65— (ఆదరము — ఒప్పి — ఐనన్—రఱల ప్రాసలున్నూ క్వార్థకేకార సంధులున్నూ)
'ధర న్నొకప్పుడు'— 74—

'ధీర — ఐతే'— 85— 'శ్రీజన్మ— రాజేంద్రుండు'— 86—

'శరణన్నన్—అత్తఱి—కృష్ణా'— (ర ఱ ప్రాసలు, బిందుపూర్వముకాకుండగనే త ణ ల యతియు) 'కరి నేలింది, చేపట్టింది' 100 ప. (ఏలినది) ఏలింది, (చేపట్టినది) చేపట్టింది రూపాంతరములుగా దీనిలో ఇంకా కొన్ని అచ్చు పొరపాట్లో లేఖకాది ప్రమాదములో అని మే మనుకొన్నవి ఉన్నాయి గాని (కాల భేదముచే ఇవి యెల్ల చెల్లు

నని — (ఒకానొక విశేష సమయమున నిట్లున్నా చెల్లు ననుట) ఈ ప్రయోగములు తెల్పుచున్న వని మా యభిప్రాయము— ఇందు కొన్ని వ్యాకరణ విశేషములైనను ప్రసక్తానుప్రసక్తముగా శాఖా చంక్రమణ న్యాయమున నవియు వచ్చినవి.

ఈ మా చూపినవి మేము స్వయముగా మహాకవుల గ్రంథములనుండి విమర్శించి గ్రహించినవే కాని ఇతర విమర్శకుల గ్రంథముల నుండి అనువదించినవి కావు— ఇతరులవి అనువదించునప్పుడు శబ్దరత్నాకరములోనివి, శ. ర. లో; శ. ర. కారుఁడు, చూ. శ. ర. అనియు, తక్కిన వారి అనువాదములు, వారియొక్కయు, వారిగ్రంథముల యొక్కయు నామ నిర్దేశములతోడను తెల్పినాము—

## గ్రంథోద్భోధము

శా॥ విప్ర ప్రాగ్రసరా న్వవాయమున నావిర్భావముం జెంది స
త్క్షిప్ర ప్రజ్ఞుని చెట్టఁబట్టితివి పాతివ్రత్య మాశొంటి సూ
త్మ్మ ప్రేమాత్మకుఁ గాక యంద దది నీ స్వర్ణ ప్రభార్థమ్ము ఘో
షా ప్రౌత్సుక్య మిఁకేల నీకు నిలఁ బ్రస్థానమ్ము గావింపుమీ !

ఇట్లు.
వివరణకర్త:
వేదుల రామశాస్త్రి

# అప్పకవీయ వివరణము

## తృతీయాశ్వాసము

శ్రీ శైల భ్రమరాంబా
ధీశైశానీ విదిజ్మహీతల విలస
త్కాశీ సమ తంగెడ నగ
రీ శమనాశా నివేశ రిపుజన నాశా 1

వివరణము:— శ్రీశైలభ్రమరాంబాపతి యగు మల్లిఖార్జునస్వామికి (ఆతని దేవళమునకు లేక ఆతడు వెలసిన శ్రీగిరికి) ఈశాన్య దిక్కున నున్న కాశీ తుల్యమగు తంగెడయను గ్రామమందు దక్షిణపు దిక్కున వెలసియున్నవాఁడా! ఓగోపాలస్వామీ! అని కృతిపతి సంబోధనము. ఇందు గిడుగువారి పీఠిక గల ప్రతిలో నగరీశ మదాశా నివేశ అని కలదు. అప్పుడు నగరి + ఈశ = నగరీశ, నగరికిఁ బ్రభువా అని యర్థము కుదురును గాని అట్లయినచో ఇట్టి అఖండయతి అప్పకవి కిష్టములేదు గావున స్వవచన వ్యాఘాతముగాఁ బ్రయోగించిన వాఁడగును. కావున గిడుగువారి పాఠము అప్పకవి రచితము కాదని యూహించి పై పాఠము స్వయముగా వ్రాయఁబడెనని యెఱుంగునది—

కం॥ అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమున కాది రాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాం
ధ్ర వచో వ్యాకరణసూత్ర తతిఁ దెనుఁగింతున్ 2

వివ:— అవధారు = అవధరింపుము, చిత్తగింపుము. ఈఅవధారుశబ్దము అనింద్య గ్రామ్య మని ఆధునికులు కొందరంటున్నారు. కాని దీనిని అహోబలుఁడు "పునరాగమః క్రియాణామ్" అను నన్నయ సూత్రము చేతనే తనగ్రంథమున "పున రాగమః క్రియాణామ్ ఇత్యుక్తేః పున రపూర్వే విశేషేచేతి పున రవ్యయ విజ్ఞానాత్, విశేషాగమః క్రియాణా మితిహి తదర్థః, అతఏవ అవధారు దేవి, ఇతి రూపం నిర్బాధం, అవధరింపుము, ఇది తదర్థః" అని 439 వ పేజీ క్రియా పరిచ్ఛేదమందు సలక్షణముగానే సమర్థించెననియు, నన్నయ కలియుగాదిని చింతామణి రచించెనన్న ఇందలి విషయమునకు ఇప్పటి విమర్శకు లెవ్వరు నొప్పరనియు నెఱుంగునది—

కం॥ ఇమ్ముగ వర్ణపరిచ్ఛే
దమ్మునఁ జెప్పంగఁ బడియెఁ దగనేక శ్లో
కమ్మున ముఖ్యవళిప్రా
సమ్ములు సంక్షేపములుగ సామజ వరదా 3

వివ:— శబ్దశాసనునిచే వర్ణపరిచ్ఛేదమను భాగమందు ఒక ఆర్యా శ్లోకము చేత (ఆద్యోవళిః అను దానిచే) ప్రధానములగు యతి ప్రాసల విషయము సంక్షేపముగాఁ జెప్పబడెను.

సూ॥ ఆద్యోవళిర్ద్వితీయో వర్ణః ప్రాసోఽత్రపాద పాదేషు।
స్వస్వచరణేషు పూర్వః ప్రాసస్సర్వేషుచైక ఏవస్యాత్ ॥21

ఈశ్లోకం బొక్కటి యొక సూత్రం బయ్యె నది యెల్ల నిందు వివరించెదను. 4

కం॥ చరణ చరణమున కాద్య
క్షరములు వళులయ్యె నవియె క్రమ్మఱఁ దత్త
చ్చరణముల లోనఁ జెప్పిన
యరవులఁ బొందింప వలయు నెల్ల కృతుల లోన్ 5

తే॥ విరతి విశ్రాంతి విశ్రామ విశ్రమములు
శ్రాంతి విరమణ విరమ విరామ యతులు
ననఁగ నివి తొమ్మిదియు వళి కాఖ్యలయ్యె
భవ్య సత్తు ఫలాయామ్య భాగ గేహ 6

కం॥ భీమన పది చెప్పె ననం
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువది నా
ల్గామీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించి రొగిన్ 7

ఆ॥ పూర్వ కవుల లక్ష్యములు గూర్చి సత్కవి
జనము లవునటంచు సమ్మతింప
విశ్రమంబు లేను విరచింతు నాలుగు
పదుల మీఁద నొకటి విదితముగను 8

వివ:— ఈ యాంధ్రమునందు ప్రతి పద్య పాదము నందును (పాద మనగా పద్యములోని నాల్గవ భాగము) మొదటి వర్ణము రెండుమూడు యతులుండు నప్పుడు వాని మొదటి వర్ణమున్ను (అనగా మొదటి వర్ణ మచ్చయినచో ఆయచ్చు మాత్రమే హల్లయినచో దానిపై నుండు అచ్చుతో గూడిన ప్రాణివర్ణ మంతయున్ను) **యతి యనియు,** రెండవ యక్షరము (అనఁగా మొదటి అచ్చునకున్ను రెండవ అచ్చునకున్ను మధ్యమున నుండు హల్ సముదాయము అంతయు, సముదాయము లేనప్పుడు ఒక్క హల్లు మాత్రమే (పొల్లు) అనియు, యతిలో నున్నట్లు ప్రాసలో అచ్చునకు గ్రహణ ముండదనియు పై లక్షణమందు, బిందు, విసర్గ, జిహ్వామూలీ యోపధ్మానీయములు హల్లులుగా పరిగణింపఁ బడు ననియు అనియెల్ల (ప్రాసలో చేరుననియు ఎఱుంగునది) ప్రాసమనగా అట్టి ప్రాసము ప్రతి పద్యము నందును మొదటి పాదము లోని ప్రాసమే (ఆయక్షరమువంటిదే) అన్ని పాదముల లోను కూర్చవలెను గాని యతిలో నున్నట్లు ప్రతిపాదము నందు విడి విడిగా కుదురు నడదనియు భావము.

యతిలో మొదటి పాదములోని యతి వర్ణమే అన్ని పాదముల యతిలోను ఉండవలె నను నియమము లేదు. ఏపాదమున కాపాదము (కొన్ని యెడల పాదము సగములో నొకయతి మరొకచో మరొక్కటియు) విడి విడిగా యతి కూర్చవచ్చును అనియు పై శ్లోకములో (పద్యములో) మొదటి వర్ణము యతి యనియు రెండవ వర్ణము ప్రాస మనియు (పైని చెప్పిన-యభిప్రాయమున కంతకును) సంగ్రహముగా యతి ప్రాసల సామాన్య లక్షణము నన్నయ చెప్పినాడనియు నెఱుంగునది.

4 పద్యము వివరణ స్పష్టము

5 పద్య వివ:-ప్రతి పాదమునందును మొదటి వర్ణములు వడి, వళి సంజ్ఞ కలవనియు అట్టి పాదాదివర్ణములే తిరుగ నాయాపాదములలో మహాకవి ప్రయోగానుసారముగా లక్షణకర్తలు నియమించిన స్థలములయందు కూర్ప వలె ననియు అనగా ఏపద్యమున కెన్నవ యక్షరము యతి స్థలమని (విశ్రమస్థానమని) లక్షణ వేత్తలు నిర్ణయించి చెప్పినారో అన్నో అక్షరము పాదాది వర్ణమే (అనగా పాదాదివర్ణముతో తుల్యమగునది గాని ఆపాదాది వర్ణమునకు నియమిత మైత్రిగల వర్ణముగాని) అయి యుండవలెనని భావము. ఏయే వర్ణములకు యతిమైత్రియో ముందు తెలుపబడును.

మరియు నిట యతి ప్రాసలకు సామాన్య లక్షణముచెప్పనెంచి, మొదటి వర్ణము యతి (వళి) రెండవ వర్ణము ప్రాస అని చెప్పినను, వళి (యతి) నిర్ణయమునకు (పాదములో) మొదటి వర్ణమాధార మనియు, ప్రాస నిర్ణయమునకు (పరిగణనకు) పాదములో రెండవ వర్ణ మాధార మనియు గ్రహించునది — ఇంతేకాక యతి (వళి) యనునామము పాదాది వర్ణమునకును ఆ యా పద్యపాదములలో నియమిత సంఖ్యగల స్థలము నందలి వర్ణమునకును రెంటికిని వ్యవహరింప బడుననియు, ఆయాని యమిత స్థలములలో నియమ ప్రకారము విశ్రమించునది (మరలనియతము గాకూర్పబడునది) కావున మొదటి వర్ణమునకాపేరు (యతి, విశ్రాంతి) సార్థకమే యనియు, (మొదటివర్ణము) నియతముగా విశ్రమించ వలసిన

స్థలమున నుండునది గావున తక్కిన దానికిని ఆపేరు సార్థకమే యగును, ఈరీతిగా యతి పరిజ్ఞానమునకు ఏపాదమునకాపాదమందే మొదటి వర్ణము నియమితసంఖ్యాక స్థలవర్ణము రెండున్ను మూలములనియు ప్రాసపరి జ్ఞానమునకు నాల్గుపాదములలోని రెండవ (ద్వితీయ) వర్ణములు మూలము లనియు లక్షణ పద్యములోని "అదిమె" అనుచోట గౌణలక్షణచేత పాదాది వర్ణ తుల్యములు. పాదాదివర్ణముతో నియమితమైన మైత్రిగల వర్ణములు అను ఉభయములో నేదియైనను అను నర్థము గ్రహింప వలెనని యును, ఏవర్ణమున కావర్ణమే (అనగా కకారమునకు కకారము గకారము నకు గకారము అను విధముగా) ప్రాసమైత్రి వర్ణములై యుండు ననియు భిన్నవర్ణములు సైతము స్వల్పముగా (దకారమునకు ధకారము థకా రమునకు ధకారము, నకారమునకు ణకారము మున్నగు విధముగా) ప్రాస మైత్రికి సరిపడునవి గలవనియు యతిమైత్రికి పనికి వచ్చునవి మాత్రము స్వస్వ వర్ణములే (స్వజాతీయములే) కాక భిన్నవర్ణములున్ను వివిధములు పెక్కులు కలవనియు అవి యెల్ల నీ తృతీయాశ్వాసముగా విస్తరింపబడె ననియు తాత్పర్యమెఱుంగునది.

మరియు యతికి పూర్వవర్ణ నియమము లేదు (ఒకచోట లఘువు మరియొక చోట గురువు పూర్వవర్ణమై యుండవచ్చును). ప్రాసకు అట్టి నియమముకలదు. అదియెల్ల ముందు తెలుప బడును. సంస్కృత శ్లోక ములలోని యతి పదచ్ఛేదరూపమాత్రమే అనగా యతిస్థానమునందు పాదాంత మందును పదము తెగిపోవలెను. సమాస ముండవచ్చును. మొ దటిపాదములు రెండును పూర్వార్థ మనియు తక్కినవి రెండును ఉత్తరార్థ మనియు భేద వ్యవహారము కలదు. అట్టి పూర్వార్థమునకును ఉత్తరార్థము నకును సమాసముండరాదు. 1, 2 పాదములకున్ను 3, 4 పాదములకు సమాసముండవచ్చును. కొన్ని చిన్న వృత్తములలో (ఉపజాతి మున్నగు వానిలో) ప్రతిపాదాంత మందును ఇచ్ఛానుసారము గురువునకు మాఱుగా (బదులుగా) లఘువుండవచ్చును. (పాదాంత లఘువు వైకల్పిక గురు

త్వము నొందును. మందాక్రాంత, శిఖరిణి, శార్దూలము మున్నగు పెద్ద వృత్తాలలో పూర్వార్ధాంతమందును, ఉత్తరార్ధాంతమందున్న మాత్రము (2 వ పాదము చివర, 4 వ పాదము చివర మాత్రము) గురువునకు బదులు లఘువుండవచ్చును. కాని 1 వ పాదము చివర 3 వ పాదము చివర అట్లుండ రాదు. పై నియమములు తెనుఁగు పద్యములలో లేవు. తెనుఁగు పద్యములలోని యతి నియమితస్థలమున పాదాదివర్ణముయొక్క ఆవృత్తిరూపమున్న నియమితస్థలమున పాదాది వర్ణమైత్రీయుత వర్ణస్థితిరూపమున్న (రెంటిలో నేదియైనను) అనగా పాదము మొదటి వర్ణముతో తుల్యమగు నదిగాని మైత్రిగలదిగాని నియమితస్థలమున నుండుట యతి (వళి) యన బడును. కన్నడమున యతి సంస్కృత శ్లోక యతితో తుల్యమే. అరవమున తెనుఁగునందు వలె సజాతీయ సమైత్రిక వర్ణస్థితిరూప యతి కలదు. సంస్కృతశ్లోకములలో ప్రాస నియమమెందును లేనేలేదు. అనుప్రాస మను శబ్దాలంకారమున్నను నియతత్వములేదు. కన్నడమున ప్రాస నియమము కలదు. తెనుఁగున పెక్కు పద్యములలో యతి ప్రాసలకు రెంటికిని నియతత్వముకలదు. (రెండును తప్పక ఉండి తీరవలయును) కొన్నింటిలో (సీస గీతాదులలో) యతియేని ప్రాసయతియేని (ఏదో ఒకటి) ఉండిన చాలును. యతికి నియతమగుస్థలములో యతికూర్పక, దానికి బదులు ప్రాస కూర్చుట అనగా పాదములోని రెండవ వర్ణమున్ను యతి నియత స్థల మందలి రెండవ వర్ణమున్ను ప్రాస నియమ ప్రకారము కూర్పఁబడుట. ఉదా॥ ॥గీ॥ 'రాముఁడేలుత మము రణ భీముఁడెపుడు' అను నిట్టి గీత పాదమునకు మూడవ గణము పై నాల్గవ గణము మొదట యతి యుండవలయును గావున అట్టియతికి బదులుగా నిక్కడ ప్రాస కూర్ప బడినది. అనగా యతి పరిగణనమునకు మొదటి వర్ణమున్ను ప్రాస పరిగణనమునకు రెండవ వర్ణమున్ను మూలములు గావున నిక్కడ పాదములోని రెండవ వర్ణమున్ను, యతి నియతస్థలమగు నాల్గవ గణములోని రెండవ వర్ణమున్ను ప్రాసమైత్రికలవిగా కూర్ప బడుటచేత ప్రాస యతి. "రాముఁ

జేలుత మము రణరంగ శూలి" అను నట్లు కూర్చినచో యతి ఇక్కడ పాదాది వర్ణమున్ను నాల్గవ గణములోని మొదటి వర్ణమున్ను యతికి పనికివచ్చునవి (సరిపడునవి) కూర్చబడుటచేత యతియన బడును. ఇట్టి పద్యములలో ఇట్లు ఏదైన నొకటి (యతియో, ప్రాసయతియో) ఉండ వచ్చును. మరియు కొన్నిపాదములలో యతియు కొన్నిపాదములలో ప్రాసయతియు నిట్టి పద్యాలలో ఇచ్ఛానుసారము కూర్చవచ్చును. మొద ట యతి కూర్చినచో తక్కిన పాదములలోను యతియే కూర్చ వలెననిగాని ప్రాసయతి కూర్చినచో అదియేమరొకచోటను కూర్చవలెనని గాని నియమ ములేదు. యతియు ప్రాసయు రెండున్ను ఉండవలె నను నియమముగల కంద ఉత్పల చంపకాదులలో ప్రాసయతి పనికిరాదు. (యతికిబదులుప్రాస కూర్చకూడదు) యతియే కూర్చాలి. తెనుగుపద్యాలలో జాతులలోతక్క తక్కినవృత్తములలో సామాన్యముగా సంస్కృతశ్లోకములలో నియతము లగు యతిస్థానములలోనే ఆంధ్రకవులును ఆంధ్రపద్యములలోను తఱచు గా యతులు కూర్చిరి. (కొన్నిఁట భేదమున్నుకలదు) తెనుఁగు ఛందస్సు నకు సంస్కృత ప్రాకృత కర్నాట ఛందస్సులు మూలములై యున్నవి. ఇప్పటికి వెలువడిన తెలుఁగు ఛందస్సులలో కావ్యాలంకారచూడా మణి (విన్నకోట పెద్దన్నది) మొదటిది. కవిజనాశ్రయము కావ్యా లంకార చూడామణి యొక్క అనుకృతియై యున్నది. కవిజనాశ్రయ ఛందోదర్పణముల యనుకృతి యీఅప్పకవీయమైయున్నది అని కొందఱి అభిప్రాయము. సులక్షణసారము అప్పకవీయము సమకాలికము లందురు. యతి ప్రాసలు తెనుగునకు సహజ సిద్ధములగు అలంకారములు. అందు చేతనే ఛందస్సు తెలియని సామాన్య జనులు రచించిన పాటలు మున్నగువాని యందును, సర్వజన సామాన్యముగా వ్యవహరింప బడు సామెత లందును యతి ప్రాసలు పడును.

సంస్కృత శ్లోకములలో సమాస పదములలోను భిన్న పదము లలోను అన్నిటను సంయుక్త వర్ణము పూర్వ వర్ణమును గురువు నొన

ర్చును. ఉదా॥ "రామక్షత్రియ వంశ మండనమణే రామత్రిలోకాధిపతే నమోస్తు" ఇత్యాదులలో భిన్న పదములలో సైతము సంయుక్త పూర్వము గురువే. తెనుఁగు పద్యములలో అట్లు కాదు. సమాస పదములలో సాధారణముగా సంయుక్త పూర్వము గురువేకాని విడిపదములలో సంయుక్త పూర్వము గురువుకాదు. ఉదా॥ "రాముడు త్రిలోకనాథుఁడు రాముడు క్షత్రియోత్తముడు" ఇత్యాదులలో సంయుక్త పూర్వ మెప్పుడును గురువుకాదు. (దీర్ఘాదులు లేనప్పుడు లఘువే) మహాకవుల ప్రయోగము లిట్లే యున్నవి. అయినను కొన్ని నవీన గ్రంథములలో (విచిత్ర రామాయణాదులలో) పైసిద్ధాంతమునకు విరుద్ధముగా (భిన్నముగా) తెనుఁగు పద్యాలలో కూడా విడి పదములోని సంయుక్త మున్ను పూర్వమును గురువుచేయునని కానవచ్చుచున్నవి. వానికి మూలముగా అనంతుని ఛందస్సులో ॥గీ॥ "ద్విత్వమున కాదివర్ణంబు తెనుఁగునందు, ఊఁదకుండును, వలసిన నూఁదియుండు, జానకీ వల్లభుఁడు క్షమా శాలియనఁగ (ఇక్కడ ఊఁదలేదు) దశరథాత్మజుడు స్వామి ధాత్రి కనఁగ" ఇక్కడ ఊఁదియుండెను. అని విడిపదములలో సైతము సంయుక్త పూర్వము ఊఁదఁబడి గురువగునని ఉదాహరణముతో స్పష్టముగా నుండుటచేత ఉదాహరణము తాను కల్పించి చెప్పినను ఊఁదబడును (గురువగును) ఊదబడదు (లఘువగును) అనియు వైకల్పిక గురుత్వము చెప్పుటచేత ఇదియు నొక క్వాచిత్క మతాంతరముగా నంగీకరింపవచ్చును. రకార సంయోగము వికల్పముగా గురువును చేయుట మల్హాది పదములలో వైకల్పిక గురుత్వము కల్గుట క్రమసంయోగము (పాదాది వర్ణసంయోగము) పూర్వ వర్ణమును గురువును చేయకుండుట అడ్రుచు, విద్రుచు మున్నగు వానిలోని సంయోగము గురుత్వమును కలిగించ కుండుట మున్నగు విశేషములు కలవు అని యెఱుంగునది.

మరియు లక్షణ కర్తలెల్ల లక్షణము చెప్పునప్పుడు వడి, వళి అనియే వాడిరి కాని యతి మున్నగు పదములు వాడలేదు. కావున

దీనిని వడి యనుటయే యుక్తము. వడు అను అరవ పదముతో దీనికి సంబంధము కలదు. వడు అనఁగా మార్గమర్థము. పాదమునుండి విశ్రమ స్థలమువరకు ఒక భాగము తక్కినది మరొక భాగము. ఆభాగముల మొదటి అక్షరములు పాదభాగములకు మార్గము చూపించు నట్లుండుట చేతను. మొదటి భాగము యొక్క ప్రథమాక్షరముతో రెండవదాని ప్రథమాక్షరము మైత్రి గలదిగా ఉండవలెనన్న నియమము ఆచారమై యున్నది. గనుకను వడి, వళి అని మీాద చూపించిన స్థలములలో ప్రయోగించి యుందురు. ఈ సందర్భమున వడి (వళి) కి బదులుగా యతి, విరతి మున్నగు పర్యాయ పదములలో మరి యేదిన్ని వాడఁకూడ దన్నట్లే తోచును అని నాయభిప్రాయము అను తాత్పర్యముతో శ్రీయుతులు డాక్టరు గిడుగుసీతాపతిగారు ఛందోదర్పణ ప్రథమముద్రిక ప్రతి ఉపోద్ఘాతములో వ్రాసినారు. అది వారి మతి లేఖన ప్రకారమే కావునను, "సర్వః కాంతమాత్మీయం పశ్యతి" అనుట చేతను అది విమర్శింప బనిలేదు కాని అరవములో వడు అను దానికి మార్గము అను అర్థమున్నంత మాత్రమున పైని వారు చెప్పిన యర్థమల్లదానిలో నిముడ్చుకొని లాక్షణికు లెల్ల రాపదమునే ఇట్టియెడల సాభిప్రాయముగా ఉపయోగించి రనుట మాత్రము మాకు పొసగియుండలేదు. సంస్కృత శ్లోకములలో విశ్రాంతి మాత్రమే ఉండి అక్షర మైత్రి లేకపోతే అందు "అక్షర మైత్రి ఉండాలి" అను నర్థముగల పదముపయోగించ గూడదు. గాని తెనుఁగులో లాక్షణికులు వడి, వళి అను (అక్షరమైత్రి ఉండాలి అను నర్థమొంతమాత్రి మేకోశమున లేని) పద మెందుకు వాడాలి? దాని ప్రయోజనమేమి ? ఆప్రయోజన మీాలక్షణకర్త లే "అన్యత్రి విలస ద్రికారమును వట్రిల విరమణ మొందు, తలపడ రితోడి విరతి తలకొన దెందున్" మున్నగుచోట్ల ఏలయపేక్షింపరు? ఇంతమెందుకు? తక్కిన చోట్ల పర్యాయ పదములుగా అన్నియు వాడి లక్షణము చెప్పునప్పుడు మాత్రి మా పదములు ప్రయత్న పూర్వకముగా మాని వడి, వళి అని

అను విషయము వెనుకనే తెలుప బడినది. మరియు ముందు "వళి" పర్యాయపదములను తెలుపు "విరతి విశ్రాంతి" అనుదాని వివరణములో చర్చింపబడెను.

6వ పద్య వివ:— సక్తుఫలా = జమ్మిచెట్టునకు (కామెపల్లి యందు సుప్రసిద్ధమగు శమీవృక్షమునకు) యామ్యభాగ = దక్షిణదిక్కున గేహ = నివాసము (గుడి) కలవాడా! అక్కడవెలసియున్న గోపాల స్వామీ! అని యర్థము. ఇందలి విరతి మున్నగు పదములెల్ల వడి, యతి అనువాని యర్థమున సంజ్ఞా పదములుగా వాడఁబడినవి. వీనిలో వడి యను నది మాత్రము తెనుఁగు పదమని కొందఱనుచున్నారు. నన్నయభట్టు ఆద్యోవళిః అని వాడినాడు (సంస్కృత విభక్తి చేసి ప్రయోగించినాడు) దానిసిద్ధికి క్లిష్ట మార్గ మక్కఱలేదు. వళి యనునదీ వడి యనునదీ సంస్కృత మన్నను బాధలేదు. (సంస్కృతశ్లోక యతి నిర్ణయము చేయు లక్షణ గ్రంథాదులలో ఈపదము (వడి, వళి) వాడబడక యుండుగాక) వ్యుత్పత్తి శ్రీయుతులు సీతాపతిగారు చెప్పినట్లైనను మరియొకలాగైనను దానికి ప్రాధాన్య మక్కఱ లేదని తెలుపబడియే యుండెను. వడి, వళి అనునవి సంస్కృతపదములైనను సంస్కృత లక్షణ గ్రంథములలో ఇవివాడబడకున్నను తెనుగులో మాత్రము వాడుట వింతకాదు. తక్కిన పదములెల్ల సంస్కృతములే యనుటలో మతభేదము లేదు. వడి, యతి అనునవి తక్క తక్కినవాని కన్నింటికిని నియతస్థలమున విశ్రమించునది లేక విరమించునది (మొదటివర్ణపరము) అనియు, పాదాదివర్ణము నియతముగా విశ్రమించవలసిన స్థలమున నుండునది (యతినియతస్థలవర్ణపరము) అనియు, అర్థముచే నన్వర్థకత యూహింపవచ్చుననియు, యతి యను పదమునకును నియతముగా నొకచోట విశ్రమించవలసిన ప్రయత్నము కలది (పాదాదివర్ణపరము) అనియు పాదాది వర్ణము నియతముగా నేచోట విశ్రమించవలసిన నిర్ణయముండునో యచ్చోట ప్రయత్నముతో నుండునది (ఉండు ప్రయత్నము కలది అని

గాని విశ్రమస్థల వర్ణపరము) అనియు నన్వర్థకత చెప్పవచ్చును. ఇక్కడ విశ్రమించుట లేక విరమించుట యనగా ముందు చెప్పబడురీతిగా యతి మైత్రీకల వర్ణరూపముతో నుండుట యని మాత్రము తాత్పర్యము. ఇక వళి, వడి యను వానికిని సీతాపతిగారు చెప్పినట్లే కాక మరొకవిధముగా చెప్పనగును. వళి యనగా మడత 'కాంతకు ఉదరమున నుండు మడతలు' అవియెట్లు కాంత యుదరమునకు సహజాలంకారములై (శోభను కలిగించునవియై) స్పష్టముగా (విభాగముతో) కానవచ్చునో అట్లే పద్య పాదమునకు సహజాలంకారములై విభాగముతో పాదాదియందును నియత విశ్రమ స్థలమందును స్పష్టముగా కానవచ్చునవి. ఇవి మూడే యను నియమము లేదు. రెండగును. అంత కెక్కుడుగను ఉండవచ్చును కావున వళియని పేరుకలిగెను. లడ లకు లళ లకు అభేదము సుప్రసిద్ధమే కావున వడి యను దానికి పునః ప్రయత్నమక్కరలేదు. ఇట్లు యతి, వళి, వడి యను వానికిని వ్యుత్పత్త్యర్థములు కుదురును. కాని వేటికైనను క్లిష్టమార్గమున వ్యుత్పత్త్యర్థములు కొందఱు వడి శబ్దమునకు కుదిర్చినట్లు కుదర్చ వచ్చుననుట ధ్రువ పరుచుటకే పై రీతి వ్యుత్పత్తులు ప్రదర్శింపబడినవి. వాస్తవమున ఇట్టి పదములలో మాయభిప్రాయము చొప్పున వ్యుత్పత్తుల నవసరములే కనుక వడి, వళి అను వానితోపాటు తక్కిన ఇందలి పదము లన్నియు అవ్యుత్పన్నములగు సంజ్ఞాపదములే అయి వాడబడినవనియు నెఱుంగునది.

7వ పద్య వివ:— ఇందు యతి విశేషములను గురించిన మత భేదములుసంఖ్యతో తెలుప బడినవి. 'అనగా వేములవాడ భీమకవి మతమున యతులు పది రకములనియు, అనంతుని మతమున ఇరువదినాల్గనియు, మఱికొందరి మతమున ఇరువది యేడు విధములనియు తాత్పర్యము.

8వ పద్య వివ:— ఇందు అప్పకవి తనమతమున నలువదియొక్క (41) విధములని చెప్పినాడు. అనంతుడు మొదలు అప్పకవి వరకుగల లాక్షణి

కులు చెప్పిన ఉభయ యతి భేదములలో పెక్కులు భీమకవి ఇష్టపడి చెప్పిన అఖండయతిలో గతార్థములే యగుటచేత అవియెల్ల అధికము లనుట న్యాయ్యముగాదు. మరియువీనిలో గొన్ని కొన్నిటిలో నంతర్భూత ములే, కొన్నియనవసరములే, కొన్ని స్పష్టప్రతిపత్తి కుపయోగించునవియే అయియున్నవి. ఆవిధమెల్ల ఆయాస్థలములలో వివరింపబడును.

మరియు, సామాన్యముగా, యతి మైత్రి విషయమున నాంధ్ర కవులచే మూడుమార్గము లంగీకరింపబడుటు తోచును. 1. వ్యాకరణ శాస్త్ర సిద్ధస్థాన్యా దేశభావము, అభేదము, సావర్ణ్యము, అనుదానివలన కలుగు అక్షరసాజాత్యము, (సవర్ణత్వము, క, ఖ, గ, ఘ, చ చ ఛ, జ జ ఝ మొదలగువాని వర్గయతిలో) 2. తద్భవ ప్రక్రియను బట్టి కల్పించిన అక్షరసాజాత్యము (జ్ఞన, ణ, మొదలైన వాని యతిలో) 3. దేశ కాలాదులచే సిద్ధి చు ఉచ్చారణ స్వభావముచే గలుగు వర్ణ సాజాత్యము, (జ్ఞ, గ, యజ్ఞన్న యగ్గన్న, యెగ్గన్న, యజ్ఞము, యాగ్గము, జ్ఞాపకము, గేపకము మొదలైనవానిలో) అని తెలియుచున్నది.

యతిభేదములు

---

కం॥ స్వరయతులు, వ్యంజనాక్షర,
విరతు లుభయవళులు, ప్రాసవిశ్రాంతులు నాఁ
బరికింప నాల్గు దెలుఁగుల,
విరమణములు, వెలయుచుండు విహగ తురంగా 9

వివ:— తాత్పర్యము—స్వర యతు లనియు (అనఁగా నచ్చులలో బరస్పరము చెల్లవలసిన యతి మైత్రి వర్ణములు అని భావము) వ్యంజనాక్షర యతులనియు హల్లులలో పరస్పరము చెల్లవలసిన యతి మైత్రి వర్ణములని భావము—హల్ మైత్రిలో హల్లులపై నుండు నచ్చులకును నియమిత మైత్రి యుండవలయునని తెలియుచు నది) ఉభయ యతులనియు 'కొన్ని పదములలో, అనఁగా సామాన్యముగా సమాస పదము లయ్యును ఏక పదము వలె

భాసించు నిత్యసమాస పదములు మున్నగు వానిలో—నిత్య సమాస పదము లనఁగా నిత్యసమాస యతి వద్ద వివరింపఁ బడును—పద చ్ఛేదములో రెండవ పదము అజాది పదమైనప్పుడు కేవల పర పదాది స్వరమునకు (పర పదములోని మొదటి యచ్చునకు) మైత్రి గల వర్ణములు మాత్రము యతి నియత స్థలము లందు గూర్పఁ బడుటయు, (లేక) పూర్వ పదాంత మందలి సర్వ విశిష్ట హల్లునకు (హల్లునకును దానితో పొత్తి యుండు అచ్చునకును రెంటికిని) మాత్రము మైత్రి గల వర్ణములు మాత్రము యతి నియత స్థలముల గూర్పబడుటయు, ఇట్లు భయములో నేదియైన చెల్లు పదముల యతు లుభయ యతు లనఁబడును) ప్రాసయతు లనియు (యతి ప్రాసములు రెండును నుండవలెనను నియమములేక అనఁగా యతి మాత్ర ముండవలసిన నియమము గల సీసము గీతము మున్నగు వానిలో యతికి మాఱుగా ప్రాస గూర్చుట ప్రాస యతి యనఁబడును) ప్రథ మమున సామాన్యముగా యతులు నాల్గు విధముల లయ్యెనని భావము. అందు స్వర వళు లెట్టివనిన

స్వర వళులు:—

తే॥ రసను స్వరమైత్రి వళులు స్వరప్రధాన
వళులు లుప్త విసర్గక స్వర వళులును
ఋవళి ఋత్వ సంబంధంబు, ఋత్వ సామ్య
వృద్ధు లన స్వరవడు లేడు విధము లయ్యె 10

వివ:— రసను = భూమి యందు, ॥తా॥ స్వర మైత్రి వళు లనియు పాదాది పదమున్ను యతి నియతస్థల మందలి పదమున్ను, ఉభయమున్ను ఉజాది పదములే యయినప్పుడు అట్టి పదాది స్వరము లకు చెల్లుమైత్రి) స్వర ప్రధాన వళులనియు (సంస్కృత వ్యాకరణ సంధి వశమునఁగాని తెనుఁగు వ్యాకరణ సంధివశమునఁ గాని రెండ చ్చులు గూడి ఒక్కయచ్చుగా మాఱునప్పుడున్ను, పూర్వ పదము చివరనుండు హల్లున్ను పరపదము మొదలి అచ్చున్ను గూడి యొక వర్ణమై (ప్రాణి వర్ణమై) కానవచ్చు నప్పుడున్ను పదచ్ఛేదములో నేర్పడు

పరపదాది స్వరమునకు (రెండవ పదము మొదలి యచ్చునకు మాత్రము చెల్లు యతి) లుప్త విసర్గక స్వర వళు లనియు, ఋవళు లనియు, ఋత్వ సంబంధ వళు లనియు, ఋత్వ సామ్య వళు లనియు వృద్ధి వళు లనియు, స్వర విశేష యతు లేడు విధము లయ్యెనని భావము. ఇందలి మొదటి మూడు స్వర యతులును కవిజనాశ్రయములో చెప్పఁబడిన స్వర యతితో గతార్థము లనియు ఋవళి ఋత్వసంబంధ ఋత్వసామ్యములు మూడును, ఋవర్ణమునకుఁ గల రేఫోచ్చారణమును బట్టియు సంయుక్త యతి స్వాభావ్యమును, అనుసరించియు గల్పింపఁ బడినవి అనఁగా, ఋవర్ణము రెండు రేఫల కూడికచేఁ బుట్టినదను భాషా తత్త్వవేత్తల యభిప్రాయము ననుసరించియు, సంస్కృత వ్యాకరణములో ఋవర్ణములో రెండురేఫలున్ను ఒక అజ్భాగమున్ను ఉన్నవని సిద్ధాంతీకరింపఁ బడుట ("ఋకారస్య మధ్యే ద్వౌరేఫౌ తయో రేకామాత్రా అభితో జ్భక్తిర పరా" అని సిద్ధాంత కౌముదిలో ఋతి సవర్ణే ఋవా ఇత్యాది స్థలములలో చెప్పఁబడుట) ననుసరించియు ఋకార విశిష్ట వర్ణము కేవల ఋవర్ణమున్ను సంయుక్తవర్ణతుల్యమే గావునను (సంయుక్త వర్ణమే యైనను పూర్వ వర్ణము నిది గురువు గాఁ జేయదు గావునను ఋకార మచ్చులలో పరిగణింపఁ బడుట చేతను సంయుక్త తుల్య మనబడును) సంయుక్త వర్ణములలో ఏహల్లు నకేని ఒక్కదానికి మాత్రము మైత్రి కుదిరినచో యతికి పనికి వచ్చును. అను నియమ ముండుటచేతను, ఈ ఋవర్ణ రివర్ణముల యతియు శాస్త్రసిద్ధమే యనియు కొన్ని దేశములలో ఋ వర్ణమునకు గల ఇత్వ సహిత రేఫోచ్చారణను బట్టియు (వృత్తి, విర్రి, కృష్ణ, క్రిష్ణ మున్నగు రీతిగా) నీ ఋవర్ణ రివర్ణముల యతియు న్యాయమే యనియు అందుచే నిది ప్రాచీనుల చేతనే కల్పింప బడెననియు అట్లే, పైని చెప్ప బడినట్లు కకారాదుల మీఁద నుండు ఋకారము (వట్రుసుడి) ఇతరాచ్చుల వంటిది కాక విలక్షణమైనది కావున దీనికి అచ్చ్వ హల్త్వములు రెండున్ను

సిద్ధించి కకారాదులపై నున్నప్పుడున్ను ఇతరాచ్చులకు వలె గాక దీనికి కకారాదుల మైత్రి లేకుండగనే కేవలములగు (కకారాదులపై నుండక విడి విడిగా నుండు) ఇ, ఈ, ఋ, ఎ, ఏలతో మైత్రి సిద్ధించి యుండుట చేత ఇట్టి ఋత్వ సంబంధముచేత సిద్ధించిన ఈఋత్వ సంబంధ యతియు ప్రాచీనుల చేతనే కల్పింప బడ్డదనియు ఇట్లే ఋత్వ సామ్య యతియు సిద్ధించుటచేత అదియు ప్రాచీనులచేతనే కల్పింపబడ్డ దనియు సంయుక్త స్వాభావ్యముచే ఈ మూటికిని జాతిభేదము లేకపోయినను (ఋకార, రికార యతి ఇ, ఈ, ఋ, ఎ, ఏ, కృ, తృ ఇత్యాది యతి కృ, తృ, ఇత్యాదుల యతి అని) స్వరూప భేదకల్పనచే నిట్టి ప్రత్యేకత వచ్చెననియు అనంతుడు రివడిని మాత్రము ప్రత్యేకించి పేర్కొన్నాడు. తక్కినవి ఋకార స్వరూప యతి యని కలిపి చెప్పినాడు అనియు నెఱుంగునది. మరియు కొన్ని దేశములలో ఋకారము నకుగల ఉత్వ విశిష్ట రేఫో చ్చారణమున్ను అట్లే లేఖనమున్ను ఋకారమున కెల్లెడల గల రుకార శ్రుతియు కారణముతై కావలయు. కొందఱు రు కార ఋ కార ములకును (రు వడి) కల్పించుచున్నారు. ఋ, ఉ, ఊ, ఒ, ఓ లకును కొందఱు కవులు యతి కూర్చినట్లు కొన్ని ప్రయోగములు కానవచ్చు చున్నవి.

వైయ్యాకరణ పారిజాతములో బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతా రామశాస్త్రుర్లుగారు, ఈయభిప్రాయమునే (ఋ, రు వడినే) తెల్పి కవి ప్రయోగములు దొరకక సరికావని ముద్రణములో అవి దిద్దివేసిరి అని వ్రాయగా కొన్ని ప్రయోగాలు వ్రాసి శ్రీయుతులు నిడదవోలు వేంకటరావుగారు ఇన్ని ప్రయోగములున్నను పారిజాతములో ప్రయో గములు దొరకక దిద్దివేసిరని యుండుట వింతగానున్నది అని ఛందో దర్పణ ద్వితీయ ముద్రణ పీఠికలో వ్రాసినారు. అందే క్రిందిభాగమున (గీటుక్రింద) అనంతుడిందులో చెప్పినది "రు" వడి కాని "ఌ" వడి

కాదు అని బ్రహ్మశ్రీయుత వఝల చినసీతారామశాస్త్రిల వారు ఇప్పటికి ముప్పదేండ్ల క్రింద తెలిపియున్నారు అనియు వ్రాసినారు.

శ్రీయుతులు నిడదవోలు వెంకటరావుగారి యొక్కయు బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రిలవారి యొక్కయు మరియుం గొందఱ యొక్కయు అభిప్రాయము పైవానివల్ల అనంతుఁడు ఛందోదర్పణములో స్పష్టముగా (రు ఋల వడి, రువడి) వ్రాసిపెట్టినాఁడని తేలపడుచున్నది గదా. ఇది చాలా విపరీతముగా మాకు తోచుచున్నది. అయితే ఆ ఛందోదర్పణములో దీనిని గురించిన లక్షణపద్యము పాఠ భేదములతో నున్నది అయినను దీనిని గురించిన వివరణ హేతు ప్రదర్శన వాక్యములు (పద్యములు) అట్లు పాఠ భేదము లేక స్పష్టముగా విషయమును తేట పఱుచుచునే యున్నవి. కావున శ్రీయుతులు మా మిత్రులు నిడదవోలు వెంకటరావుగారు దీనిని గురించి చూపిన లక్ష్యములున్ను అనంతుని లక్షణ వివరణాది పద్యములున్ను ఇక్కడవిమర్శించ బడుచున్నవి. "అనంతుఁడు రు, ఋ యతిని తా నాదేశించుటయే గాక తన భోజరాజీయ మందే దానిని వాడి యున్నాఁడు అని వ్రాసి మామిత్రులు సీ "గృహధర్మ నిరతులు కొనివచ్చి భక్తి పూర్వకముగా" (3. 27) అను పద్య ముదాహరించినారు. రు వడి యనగా రు, ఋ, లకు మైత్రి కూర్చుటకదా ఇది రు వడి నెట్లు స్థాపించును? ఇందు రు, ఋ, లకు మైత్రి యెక్కడ నున్నది? ఇందు రు వర్ణమేది? గృ, కొ, అనువానికి మాత్రము మైత్రి కాన వచ్చుచున్నది? మరియు భాగవతాదుల నుండి కొన్ని యుదాహరించినారు.

1. "కొని మెల్లన కాలనేమి గృహమున కరిగెన్" (యుద్ధకాండ 1617)
2. "సురనది వీచులం దడియు శృంగములన్" (2527)
3. "క్రూరాస్త్ర చంద్రార్ధ కృత్తోరు బాహులై" (1456)

మార్చినవి 1. "పృథివి బగిల్చి బంగరపుఁ బెంజల యమ్ము" (2015 అచ్చుపాఠము)

"పృథివి బగిల్చి హేమమయ పుంఖ శరంబుల"
(595 పుట క్రిందిపాఠము)

(రెంటిలోనుపృథివి అనుదాని తరువాత అర్ధబిందువులేదు— పకారము వకారమున్ను కాలేదు)

2. "పృథుతర విస్మయ క్రమము పెంపొనరింపఁగఁ జూచి"
(2021 అచ్చు)

"పృథుతరవిస్మయ క్రమముఁ బొంపిరి వోవఁగ"
(595 పుట క్రిందపాఠము)

(క్రమముఁ బొంపిరి ఇక్కడ గసడదవాదేశముకు బదులు ద్రుత కార్యమున్నది. విపరీతము)

మడికి సింగన వాసిష్ఠ రామాయణము :—

"తృణ కణాంశంబు వజ్రమై తుంచు నట్లు" (3—230)

"క ర్తృత్వమును వెలింగి తోఁచు చుండు" (3—12)

(తోఁచు లోఅరసున్న పడలేదు.)

గౌరన నవనాథ చరిత్ర :—

"త్రొడరి దొప్పఁగ దోగి ధృతి దుప్పఁదూలి" (2 ఆ. 57 పుట)

(తోఁగి—ఇందు అరసున్న పోయింది. మరియు గ అనుదాని తరువాత ఉండవలసిన అర్ధబిందువు వెనుకఁ బడినది.)

"నృపునితో నొండు రెండును గాఁగఁజెప్పి" (1 ఆ. 41 పుట)

(తెనుఁగు పదమగు రెండు అనుదానిలో నకారము నడిమి నుండునా? అచ్చులోపడ్డదా ?)

అహోబలపతి కాళిందీ కల్యాణము :—

"మృదువైన చేతులు ముండ్లు పొదలు"

పైని చూపిన ఉదాహరణములలో నొక్కటియు "ఱు" వడిని స్థాపించునది మాకు కనుపడనే లేదు. పాఠాంతరములు మినహాయించి ఇక్కడ చూపిన వన్నియును పరిశీలింప వీని ధోరణి వాల్లుల మైత్రి కుదిరి నప్పుడు వట్రువ సుడికి (కృ, తృ మున్నగు వాని ఋకారము

నకు) ఉ, ఊ, ఒ, ఓల తోడనూ మైత్రిని తెలుపుచున్నది. కాని రు వడిని తెల్పలేదు. కావున మిత్రులు వెంకటరావుగారు ఒకటి చెప్పదలచి వేరొకటి చెప్పినారా! అని సందేహము కల్గుచున్నది. పై ప్రయోగములు సాధువు లనియు ప్రక్షిప్తములు కావనియు ప్రమాణము లనియు నంగీకరించువారు ఉ, ఊ, ఒ, ఓలకును ఋకారము నకును (లేక, హల్లల మైత్రి) కుదిరి నప్పుడు వానిపై నుండు ఋ (వట్రుసుడికి) అను దానికి వానిపై నుండు ఉ, ఊ, ఒ, ఓల తోడనై నను మైత్రి అంగీకరింపక తప్పదు. రు వడి వలన ఇందు 1. వక్రూరాత్ర ...కృత్త'' 2. ''తృణ....త్రుంచు'' అను రెండు మాత్రము సమర్థితము లగును గాని తక్కినవి సాధింప బడవు నేను చెప్పిన బ్లైనచో అన్నియు సమర్థితము లగును ఈప్రయోగములు సాధించుటకు రు వడి యగత్యము లేదు అని తేలింది. అనంతుని భోజరాజీయ పద్యము పైని చూపినది ఎంతమాత్రము రువడి స్థాపనకు పనికిరాదు. కాని రు, ఋ వడి నంగీకరించు వారికి (ఋ, రుల సమశ్రుతి) ఋకారము రుకారము గానే వినబడుట అను గొప్ప యుపపత్తియు మాకు పొడకట్టు చున్నది. (అనగా అప్పకవ్యాదులు చెప్పిన రివడి లో రికార ఋకారములకు ఎంతమాత్రము ఉచ్చారణ తుల్యత లేదు కాని (రు వడికి) రు, ఋలకు అట్లుగాక మిక్కిలి ఉచ్చారణ తుల్యత్వ సంబంధ మెల్లెడల కలదు. మరియు ఋకార మందలి ఉకార శ్రుతిని బట్టి హాల్మైత్రి కుదిరినచో వానిపై నుండు ఋ, ఉ, ఊ, ఒ, ఓల మైత్రి చెల్లుటకు ఉపపత్తి ఉన్నది యని వెనుకనే సూచించబడెను.

ఇక అనంతుడు తన ఛందస్సులో రి వడిన్ని రువడిన్నీ రెండున్నూ చెప్పెనా! రెంటిలో నొక్కటియే చెప్పెనా! (అట్లైనచో) ఏది చెప్పెను? అని విమర్శించు చున్నాము.

అనంతుండు ఋకారమును గురించి ఋకార స్వరూప యతి అని

గీ॥ క్షితి ఋకార రూపస్వర యతులు పరఁగు
ఋగ్యజు స్సామ వినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణి కులజుండు కరుణా సమృద్ధుఁ డనఁగ
హేమ పీతాంబరుఁడు దేవవృష భుఁడనఁగ    1-86

అని యొక పద్యమున్ను

కం॥ విలస [1]దృకారమును వ
[2]ట్రిలు [3]విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వ
త్సుల భుఁడనఁగ నీ యేలకు
దలఁపఁగ రీతోఁడి విరతి తలకొ౦న డెందున్    1-87

(క్రింద 1. ద్రి 2. ట్రిల 3. విరమంబు అని కలవు)

అని మరియొక పద్యమున్ను

(కు, అనుదాని తరువాత అరసున్న పడలేదు. రువడి ఇష్టమగు వారి పాఠమునకు ప్రధానత గలుగునట్లు ముద్రించిరి. కాని దృకార అనుచోట ద్రికార అని ఉండాలి.)

తే॥ తెల్లముగ ఋకారము యణాదేశ శక్తిఁ
గలుగు రేఫయిత్వము నందుఁ గదిసి యతికి
నట్టి రికి నీ యేలతో నన్వయించు
నట్టి సత్త్వంబు లేదది హల్లుగాన    1-88

అని మరొక్కటిన్ని

గీ॥ మును ఋకార మీయేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశ కారణమున
ఘన లకారంబ యగును, ౡకార విరతి
క్ల్పప్తి లేదు శౌరిగుణా [2]వళులకనంగ    1-89

(ప్రా. ము 1 క్ల 2 వళికిననఁగ అని గీటుక్రింద పా॥ కలవు)

అని వేఱొకటిన్ని మొత్తము నాలుపద్యములు చెప్పినాఁడు.

అనంతుఁడు రు వడిని స్పష్టముగా విధించి నాఁడని చెప్పెడి విమర్శ కాగ్రేసరు లెవ్వరును ఈపద్యములు సావధానముగా పూర్తిగా పరికించి నట్లే మాకు తోఁచదు. ఏలయన వెనుక స్వర యతిలో "ఈకి ఋత్వ మునకు నేత్వ మమరు" (1. 81) అని ఇ, ఈ, ఋ, ఎ, ఏలకు యతిని అనంతుఁడు చెప్పియున్నాఁడు. ఇక్కడ ఋకార స్వరూప యతి అని ఋ కారమునకును కాదులపై నుండు ఋకారమునకును (వట్రుసుడికిన్ని) అనఁగా కకారాదుల మైత్రి లేకున్నను ఋకారమునకును వట్రుసుడికిని యతియు, అట్లే హల్లుల మైత్రి లేకుండఁగనే వృ, మృ మొదలగు వట్రు సుడులకును అట్లే వట్రుసుడికిని (వృ మున్నగువాని ఋకారమునకును) హీ, అనుదానికిని (అనగా వట్రుసుడికిని ఇ, ఈ, ఋ, ఎ, ఏలకును ఇ ఈ ఋ ఎ ఏలతో గూడిన హ, యలకును) మూఁడు రకములుగా యతికి లక్ష్యములు స్వకల్పితములు చూపినాఁడు. వీనినే అప్పకవి ఋత్వ సామ్య, ఋత్వసంబంధ వళు లన్నాఁడు. అనంతుఁడు పిమ్మట 2 వ పద్య ములో రువడి (లేక) రివడి చెప్పినాఁడు. అందు రెండవపాదము లక్ష్య మగునట్లున్ను కూర్చినాఁడు. అప్పకవి దీనిస్థానమందు స్పష్టముగా రివడి (ఋ, రివడి) చెప్పినాఁడు (అందు పాఠాంతరము లీవిషయమునకు లేవు) లక్ష్యములెల్ల నట్టివే చూపినాఁడు. అనంతుఁడు ఈ రెండవ పద్యములో 3, 4 పాదములలో రితోఁడ ఈ, (ఇ ఈ) ఏ (ఎ, ఏ) లకు విరతి (యతిమైత్రి కూడదని స్పష్టముగా చెప్పినాఁడు. (ఈవిషయములో పాఠ మత భేద ములు కానరావు) దీనిని బట్టి చూడఁగా స్వర యతిలో సిద్ధించిన మైత్రి గల ఇ, ఈ, ఋ, ఎ, ఏలలో ఒక్క ఋకారమునకు మాత్రమే "రి" వర్ణము తోఁడ మైత్రి (రివడి) కలదనియు (యుక్తమనియు) "ఋ" కారముతో మైత్రి గలవయ్యును, ఇ, ఈ, ఎ, ఏలు, "రి" వర్ణముతో మైత్రి నొంద వనియు (రివడికి పనికి రావనియు) స్పష్టముగా విధించినట్లు తేలుచున్నది (తెలియుచున్నది) మరియు ఇంతేకాక మూఁడవ పద్యములో అట్లు ఋకి "రి" తో చెల్లుటకున్ను ఇ, ఈ, ఎ, ఏలకు

"ఠ్రీ" తో చెల్లక పోవుటకున్న హేతువు కూడా వక్కాణించినాడు. అనగా, సంస్కృత వ్యాకరణములో "ఇకోయణచి" అను సూత్రము చేత (ఋకారమున కచ్చు పరమగు నప్పుడు యణా దేశము (రకారము) వచ్చును. అట్టియాదేశ శక్తి చేత (ఏర్పడిన) రకార మికారముతో గూడి (రి అయి) "ఋ" కారముతో మైత్రి నొందుచున్న దనియు (రికారముతో ఋకారము మైత్రి నొందుచున్నదనిన్నీ) అట్టి రి, హల్లైనను (ప్రాణి) ఋకారమున్ను రకార సంబంధముచే (రెండు రకారములతో నేర్పడుట) హల్లున్ను (ప్రాణి) అగును. గావున ఋకార రికార మైత్రికి ప్రతి బంధక మేమియు లేదనిన్ని తక్కిన ఈ, ఏలు (ఇ, ఈ, ఎ ఏలు) అచ్చులున్ను "రి" హల్లున్ను (ప్రాణి) అగుటచేత స్థాన్యాదేశ భావమున్ను సాజాత్యమున్ను లేక రీకి ఈ, ఏలతో నన్వయించు మైత్రి నొందు సత్వము (శక్తి) కొఱవడె ననియు స్పష్టముగా నిర్ణయించి నాఁడు. మరియును నాల్గవ పద్యములో ఈ విషయమే వివరణగా రెండు పాదములతో చెప్పినాడు. అనగా, ఋకారావస్థలో అచ్చ్వమే యుండుటచే (వివక్షిత మగుటచే) స్వరయతిలో ఋకారము ఇ, ఈ, ఎ, ఏలతో మైత్రి నొందినను ఇప్పుడు రకారావస్థలో (రి అయినప్పుడు) యణాదేశ సంబంధముచేత హల్త్వమే పొందుటచేత (హల్త్వప్రాధాన్యమే కలుగుటచేత) "ఠ్రీ" కి, ఈ, ఏలతో మైత్రి లేక పోయెను) అని పునఃపునః కొందర మతములో "ఠ్రీ" కిన్ని ఇ, ఈ, ఎ ఏలకున్ను మైత్రి ఉన్నట్లున్ను అట్లుండ గూడదని ఖండించు చున్నట్లున్ను చెప్పినాడు. అనగా ఋా కి రీ కి మాత్రమే చెల్లును గాని (రివడి) రీకిన్ని ఇ, ఈ, ఎ, ఏలకున్ను చెల్లదని నిర్ణయించినాడు. కావున ఈ సందర్భమెల్ల రివడిదే గాని ఇందు రువడికి ఏమిన్ని సంబంధములేదు. (రివడినే గాని రువడిని అనంతుడు సూచనగా నైనను చెప్పలేదన్న మాట) కాగా ఈ పద్యముల వైఖరి యిట్లు రివడినే స్థాపించు చున్నది. గాని "రు" వడిని కాదని ఘంటాపథముగా చాటి చెప్పు చుండగా వేరొం

దిన ఈ మహా విమర్శకు లెట్లు "ఋ"వడిని (ఎక్కడ) ఛందోదర్పణ కారు చెప్పినాడని (భ్రమపడి) సిద్ధాంతీ కరించిరో మామిత్రులు తెలుప వలసి యున్నది. (ఈఛందోదర్పణము లోని ఈనాల్గు పద్యములు పూర్తిగా సరిగా సావధానముగా చూడలేదని చెప్పక తప్పకున్నది) మరియు రివడిని చెప్పు పద్యములో అప్పకవియు ఈభావమే వచ్చునట్లు (ఋకారము నకే గాని ఈ, ఏలకు "ర్రి" తో మైత్రి చెల్లదన్నట్లే) చెప్పినాడు. అందు పాఠ భేదాలు కలవు. అవి యెల్ల అక్కడనే విమ ర్శింతుము—

మరియు ఇట్లు విశేషములు చెప్పవలెనని కుతూహలము కలి గినచో ఎన్నియో కల్పించవచ్చును. మచ్చున కొక్కటి మాత్రము చూపుచున్నాను. అకార సహిత రేఫకున్ను (రఅను దానికిని) ఋకార ముతో ర వడిని కల్పించి దాని కాధారముగా

తే॥ రణము మీఁదికిఁ జనుదెంచి పృథుల సైన్య
హర్ష భాషణ ధ్వనులు, దూర్యస్వనములు నెగసి
దివి ముట్ట మైమఱువిడి తలిర్చు
నెలమి గోదండ తూణీరములు ధరించె(భార, భీష్మ, ఆ॥ 169॥

అను పద్యముదాహరణము చూపవచ్చును. కాని వేఱొక ప్రయోగము కాన రాకుండుట ఇదియు పాఠాంతర ప్రక్షిప్త మేమో యను నూహయు (రథముమీఁదికి....పృథుల....అనునట్లుండు నేమో యని) ఏ లాక్షణికులు దీఁని స్పృశింప కుండుట కారణములై ఇంకను ఇది విమలక్ష్యమని తోఁచును.

వృద్ధియతిని మాత్ర మప్పకవి స్వయముగా కల్పించి (ఊహించి) చెప్పెను.

స్వరమైత్రి వళులు 1.

తే॥ అద్వయ మునకు వక్రిత మద్వయంబు
నిద్వయమునకు ఋయుగంబు నెద్వయంబు

నుద్వయమునకు నంత్యవక్రద్వయంబుఁ
జెల్లు స్వరమైత్రివళు లన శేషశయన 11

అకారయతులు

ఆ॥ అబ్జపత్త్రనేత్ర ఆర్తావనచరిత్ర
ఆతతాయిజైత్ర ఐంద్రమిత్ర
ఐందవప్రగోత్ర ఔర్వశేయస్తోత్ర
యనుచుఁ జెప్ప నొప్పు యతులు కృష్ణ 12

ఇత్వవళులు

ఆ॥ ఇందువంశసోమ ఈశ్వరీనుతనామ
ఈడితాంగధామ ఋషభభీమ
ఋక్షజాభిరామ యెట్లు లైన మాభామ
యెడఁ గటాక్ష ముంచి యేలు మనఁగ 13

ఉద్విరామము

ఆ॥ ఉరగరాజశాయి ఊర్ధ్వవిష్టపదాయి
ఊర్జితోరుకీర్తి యొడలికార్తి
యొదవ కుండఁ బ్రోచి యోలి దాసునిఁ గాచి
చేరి కనక కశిపుఁ జీరి తనఁగ 14

11 వ పద్య వివ:— స్వరమైత్రి వళులనఁగా అచ్చులలో ఏయే అచ్చులకు మైత్రి చెల్లునో ఆయాఅచ్చుల కామైత్రివలన జెల్లు యతులని భావము. అట్టి మైత్రీవిభాగము మూఁడువిధములు (1. అ, ఆ, ఐ, ఔ 2. ఇ, ఈ, ఋ, ౠ ఎ, ఏ 3. ఉ, ఊ, ఒ, ఓ, ) ఇట్లు మూఁడు రకముల అచ్చుల యతులు స్వరమైత్రి వళులయ్యెను.

ఐ, ఔల యుచ్చారణలో మొదట అకారము వినఁబడుటచే (అకారశ్రుతిచే) ఐ, ఔలకు అ ఆలతో మైత్రి చెప్పఁబడెను. ఐకారమందు చివర ఇకారోచ్చారణమున్ను (ఇకారశ్రుతి) ఔకారమందు చివర ఉకారశ్రుతియు ఉన్నను, అయ్యది స్వల్పమగుటచేతనున్న

అకారశ్రుతి పరకాలికము (అకారశ్రుతి తరువాతిది) అగుట చేతనున్ను ఉపేక్షింపబడ్డవి. (ఐకారముకు ఇ, ఈ, ఋ, ఎ, ఏలతోడను, ఔకారముకు, ఉ, ఊ, ఒ, ఓలతోడను మైత్రి) తద్వారా యతియు చెప్పబడదయ్యెను. సంస్కృత వ్యాకరణములో అకారముగాని ఆకారముగాని ఇకారముతోగాని ఈకారముతోగాని కూడి ఏకారముగాను అ, ఆలలో నేదియేని ఉ, ఊలలో దేనితోడనేని కూడి ఓకారముగాను మాఱునని గుణవిధానముచే చెప్పఁబడ్డను (అనగా ఏ, ఓ, లలో అకార మేళనమున్నను) అట్లుమాఱిన ఏ, ఓలలో అకార శ్రుతి కొంచెమైనను లేక ఏకారమునకు తాలవ్యోచ్చారణము ఓకారమునకు ఓష్ఠ్యోచ్చారణమున్ను అధికముగా నుండుటచేత ఎ, ఏలకు అట్టి తాలవ్యోచ్చారణ గల ఇ, ఈలతోడను ఒ, ఓలకు అట్టి ఓష్ఠ్యోచ్చారణ గల ఉ, ఊలతోడను మైత్రి చెప్పబడినది. (అకారముతో చెప్పబడలేదు) గృష్టి (గిడ్డి) దృష్టి (దిష్టి) మున్నగు తద్భవ పదములను బట్టిన్ని వెనుక చెప్పఁబడినట్లు కొన్ని దేశాలలో ఋకారమునకు గల ఇత్వసహిత రేఫోచ్చారణను బట్టిన్ని ఋవర్ణము నచ్చుగా నెంచునప్పుడు అట్టిదానికి ఇకారముతోడను తద్వారా ఈ, ఏలతోడను మైత్రి చెప్పబడెను. మరియు సంస్కృత వ్యాకరణమును బట్టి యే, అ, ఆలలో నేదియైనను అట్టి ఏ, ఓలతోగూడి (క్రమముగా) ఐ, ఔలుగాను మాఱుచుండుట చేతను అట్టి ఐ, ఔలలోగల అకారాధిక్యోచ్చారణ చేతను అకార మేళన మధికముగా స్పష్టమగుటచేతను ఐ ఔలకు అ, ఆలతోమాత్రము సిద్ధించెను. గాని ఐ, ఔలలో ఈ, ఊలకుగల స్వల్పోచ్చారణచేతను (ఈ, ఊ మేళన స్వల్పత్వము స్పష్టపడుచుండుటచేత) ఐ ఔలకు (క్రమముగా) ఇ, ఈ, ఎ, ఏలతోడను ఉ, ఊ, ఒ, ఓలతోడను మైత్రి సిద్ధించలేదనియు నెఱుంగునది.

12, 13, 14 పద్య వివ:— ఇవి మూడున్ను అచ్చులమూడు విధములగు వళ్ళకు (క్రమముగా) కల్పింపబడిన ఉదాహరణములు.

'ఆతతాాయి = 'సామాన్య' లక్షణచే దుష్టుడు' దుష్టసంహారకుడా! ఐంద్రమిత్ర= అర్జునుని మిత్రుడా! (లేక) ఇంద్రుని మిత్రుడా! తమ్ముడా = ఇంద్రావరజుడా ఐందవ = చంద్రుని సంబంధమగు గొప్పవంశమున చంద్ర వంశమున (యదువంశమున) బుట్టినవాడా! ఔర్వశేయ= అగస్త్యునియొక్క (లేక' వసిష్టునియొక్క స్తుతులుగలవాఁడా! మునిగేయ గుణా ఋక్షజాభిరామ= జాంబవతీప్రియా! ఊర్ధ్వనిష్టపదాయి= 'భక్తులకు' పుణ్యలోకముల నివాససౌఖ్యము లిచ్చువాడా! లక్షణ లక్ష్య సమన్వయము సుకరము. (సులభము)

స్వర ప్రిధాన వళులు 2.

క॥ తెలిసి పదాంతగతాక్షర
ములతోఁ బై శబ్దములకు మొదలఁ గలుగు న
చ్చులు గూర్చినసంధుల క
వ్వల స్వరములె నిలుచు నుభయవళులను దక్కన్ 15

తే॥ అతులగుణధామ భానువంశాబ్ధిసోమ
వినతసూాభవమిత్ర లంకేశజైత్ర
ఉరుగుణకలాప శకలీకృతోగ్రచాప
నాఁగ నిట్లు స్వరప్రిధానవళు లొప్పు 16

15 వ పద్య వివ:—

తా॥ ఉభయ యతులందు గాక 'ఉభయవళి కర్హమగు పదములందుగాక' తక్కిన పదములందు సమాసపదములందు గాని వ్యస్తపదములందుగాని మొదటిపదము యొక్క చివరనుండు వర్ణమును (అచ్చుగాని కొన్నియెడల హల్లుగాని' పై శబ్దమునకు (తరువాతి పదమునకు) మొదటనుండు అచ్చున్నుకూడి ఏర్పడిన విశిష్టవర్ణమందు (పదవిభాగముచే నేర్పడు) పరపదములోని మొదటి యచ్చునకే మైత్రిగల వర్ణములు యతికి (పనికివచ్చును) చెల్లుబడియగును గాని పూర్వవర్ణ పర వర్ణముల కూడికచే నేర్పడిన విశిష్టవర్ణమునకు (ప్రాణివర్ణమునకు అనగా

పరపదము లోని మొదటిఅచ్చున్ను పూర్వపదములో చివరనుండు అజ్విశిష్టహల్లున్ను (లేక) కేవల హల్లున్ను అనగా పొల్లుహల్లున్ను గాని కూడి ఏర్పడిన విశిష్ట (సమష్టి) వర్ణమునకు మైత్రి గల వర్ణములు యతికి చెల్లుబడికావు (పనికిరావు). ఇట్టి నియమము ఉభయ యతి పదములందు లేదు గావున అట్టివానిలో విశిష్టవర్ణమునకు (ప్రాణికి) సైతము మైత్రిగల వర్ణములున్ను చెల్లుబడి యగును. ఇట్లు ఏర్పడిన విశిష్టము ప్రాణివర్ణమై కన్పట్టుచున్నను దానిలోని పొల్లుహల్ భాగమునకు ప్రాధాన్యములేక (యతిమైత్రిలో సంబంధములేక) ప్రాణియతి చెల్లక అజ్భాగమునకు (అచ్చునకు) మాత్రమే ప్రాధాన్యము (సంబంధము) కలుగుట చేతను (లేక) విశిష్టవర్ణమంతకును ప్రాధాన్యములేక ప్రాణియతి చెల్లక పదచ్ఛేదముచే నేర్పడు (కాననగు) పరపదములోని మొదటి యచ్చునకు మాత్రమే ప్రాధాన్యము కలిగి చెల్లుచుండునది కావున దీనికి స్వరప్రధాన యతియని పేరుకలిగె ననియు భావము గ్రహించునది——

అనంతుండు స్వరమైత్రి వళులు స్వరప్రధాన వళులు అన్నీ భిన్నముగాచెప్పక స్వరయతులను పేరుతోడనే చెప్పినాడు. కాని చిట్ట చివర ప్రాదినిత్య సమాసశబ్దములుగాక తక్కిన పదంబులపై నచ్చు బెరసినప్పుడన్నియు స్వరయతులే యగును అని సాంబగురుఁడు, శ్రీశుడు, పూర్ణేందుడు, అనుపదము లుదాహరించినాఁడు. (ఇది సందేహనివృత్తికి ఇదియు స్వరయతియేయని వివరించినట్లున్నది) మరియు నీతడు అప్పకవి చెప్పిన లుప్తవిసర్గక స్వరయతికి గూఢస్వరయతియని (అన్వర్థకముగా) పేరు పెట్టినాడు. ఋత్వసంబంధ, ఋత్వసామ్య వళులను కలపివేసి ఋకార స్వరూప యతి అన్నాడు. ఋవళిని (రివడిని) భిన్నముగా చెప్పినాడు. అప్ప కవియు అనంతుడును ఈస్వరప్రధాన యతికి ఇచ్చిన లక్ష్యములనుబట్టి ఇది సమాసపదములోనే అన్నట్లు తోఁచునుగాని ఇట్టి సమాసపదములలోనే స్వరయతికాని ప్రాణియతి (అఖండయతి) చెల్లదన్నప్పుడు భిన్నపదముల

కూడికలో బొత్తిగా (సుతరాం) చెల్లదనుట కైముత్యన్యాయసిద్ధమే యనియు అట్టి భిన్నపదముల కూడికలోను ఈ స్వరప్రధానయతి చెప్పినట్లే యనియు లక్షణము రెంటికి (భిన్నాభిన్న పదమేళనకు) చెల్లునట్లే చెప్పిరనియు నెఱుంగునది.

మరియు పదములయొక్క ఆద్యక్షరములయందు అర్థబోధశక్తియు వక్తృ శ్రోతల యాదరమున్ను తన్మూలకమగు ప్రాధాన్యమున్ను నుండుట ప్రాచీన శాస్త్రసిద్ధాంత ప్రసిద్ధమగుటచేత స్పష్టముగా నుత్తర పదముయొక్క విఱుపు స్ఫురించు (రెండుపదములు కలిసియున్నవని స్పష్టముగా గోచరించు) స్థలములలో స్వరప్రధానయతియే శ్రుతిహితము (మనోహరము) గా నుండును. అట్టి విఱుపు స్ఫురింపక ఏకపదముగా తోచు (భాసించు) స్థలములలో అఖండయతియే (ప్రాణియతియే) వాస్తవమున రమణీయత నొందును. అట్టిచోట్ల సైతము శాస్త్రానుసారముగా స్వరప్రధానయతియు మహాకవులచే బ్రయోగింపఁ బడుచువచ్చెను. క్రమముగా పృథక్ప్రయోగయోగ్య పదద్వయ సంధియందును పృథక్పదముల కూడికయందును (అట్టిపదముల సమాసాసమాస ఘటనయందు) సైతము అఖండయతి (ప్రాణియతి) ప్రయోగింపబడినది. అందుచేతనే కవిజనాశ్రయాదులలో అంతటను (పదద్వయమేళన స్ఫురింపకయున్నను వాస్తవమున రెండు పదములకూడిక (కలయిక) ఉన్నచోటులం దెల్ల) అఖండయతియు నంగీకరింపబడ్డది. అప్పకవి మున్నగు శుద్ధలాక్షణికులు అంగీకరింపక మహాకవి ప్రయుక్తములని తోచినవానికి (కొన్నిటికి) మాత్రము నిపాతన్యాయమున (శాస్త్రకర్త సూత్రముచేత సాధుత్వము చెప్పుట వాచనికము. అట్లు చెప్పక విశిష్టరూపము నుచ్చరించి సాధుత్వము తెలుపుట నిపాత (నిపతించుట) శాస్త్రసిద్ధముకాక మహాకవి ప్రయోగములో గానవచ్చుదానికి ఆప్రయోగముచేతనే సాధుత్వమును నిర్ణయించుట నిపాతన్యాయము) సాధుత్వ మంగీకరించి (ఉభయ యతి కల్పనచే వానిని గ్రహించి) తక్కిన స్థలములందెల్ల అఖండయతి

అసాధువేయని అభిప్రాయపడిరి. అట్టి యభిప్రాయమే ఈ పద్యమున స్పష్ట పడుచుండెను. ఈ స్వరప్రధానయతియు ప్రాణియతియు సంయుక్త యతియు మున్నగునవి యతిసామాన్య రూపములుగాని యతిభేదములు కాజాలవనియు గొందఱ మత మొప్పుచున్నది. సామాన్యాఖండయతిని నిర్ణయించు మహాకవి ప్రయోగములే ఇప్పటికిని పెక్కులు కానవచ్చు చున్నవి. కావున మనకు సామాన్యాఖండయతియు నంగీకరింపక తీరదని మున్ముందుగూడ తెలుపబడును.

16 పద్య లక్ష్య లక్షణ సమన్వయము సుకరము —

లుప్త విసర్గ స్వరవళులు 3

తే॥ దైవభాష నదంతసాంతములవిరాఁగ
నత్తు మొదలను గలశబ్ద మతుకునేళ
నమరు నోత్వమునకుఁ జెల్లు నయహాలిఫులు
జగతి లుప్తవిసర్గక స్వరవళు లన 17

తే॥ అంబుదశ్యామ తవ కింకరో హ మనఁగ
యామినీ చర గర్వాత మోర్క యనఁగ
హరిసుతుండును నీవు నన్యోన్యమిత్రు
లయి ప్రవర్తింతు రనఁగ లక్ష్యంబు లయ్యె 18

17 పద్య వివ:— సంస్కృతపదములందలి హ్రస్వాకారాంత పదము (రామ, కృష్ణ మున్నగునవి) ప్రథమావిభక్త్యంతముగా నుండి అట్టిపదమునకు (రామః, రామస్ ఇత్యాది రూపములో నుండుదానికి అనుకరణ వశమున క్వాచిత్కముగా అనుకరణలేకయు కొన్నిమొడల పద్యమంతయు సంస్కృత భాషాపదములతోడనే ఉన్నప్పుడు అనుకరణ లేకయు హ్రస్వాకారము మొదటగల పదము పరముగా నుండునట్లు ప్రయోగింప బడునప్పుడు అట్లు కూడునప్పుడున్ను అనగా ఇట్టి వ్యస్త పదములు కూడికలోనున్న అట్టి అత్తు వెనుకగల సకారాంతపదము (తమస్ మున్నగునది) ప్రథమావిభక్త్యంతముగా నుండునప్పుడు (విడి

పదముల కూడికలో) అనుకరణ వశమునను విభక్త్యంతముగాక సమాస ఘటితమై యున్నప్పుడనుకరణాపేక్షలేకయు (సమాసములోను) ఉండి, దానికి హ్రస్వాకారము మొదటగల పదము పరముగా నున్నప్పుడున్న అట్టి (రామస్ + అధిప, తమస్ + అత్రి, తమస్ + అర్కము) వాని లోని "స్" అనునగు దానికి సంస్కృతవ్యాకరణములోని (ససజు షోరుః అను) సూత్రముచేత రకారము (రు, ర్) వచ్చి పిమ్మట రకార మునకు (అతోరోరప్లుతాదప్లుతే తి అనుదానిచే) ఉకారమున్ను తరు వాత అకార, ఉకారములకు (ఆద్గుణః అనుదానిచే) ఓకారమువచ్చి (ఓ, అయి) పిమ్మట పూర్వపదములోని ఆ, ఓకారమునకును పరపదము లోని మొదటి అకారమునకును ("ఏజఃపదాంతాదతి" అనుదానిచే) రెంటికిని పూర్వవర్ణమగు ఓ, అను వర్ణము (పూర్వరూప మేకాదేశ ముగా) ఒక్కటేవచ్చి (పరవర్ణమగు అకారముపోయి ఓకారము మాత్రమే నిలిచి) రామోధిప, తమోత్రి, తమోర్కఅనియు మున్నగు రూపములేర్పడగా ఇట్టు లేర్పడినవానిలోని ఓకారమునకు అ,య, హ, అను వర్ణములు (అ, ఆ, ఐ, ఔలున్ను అ, ఆ, ఐ, ఔలతో గూడిన హయలున్ను) లుప్తవిసర్గయతి యను పేరుతో యతిమైత్రికి చెల్లుబడియగును. (పనికివచ్చును) అట్టి ఓకారమున్ను, అట్టి అ,య, హ లున్ను, పాదాదినిగాని యతి నియతస్థలమునగాని ఉండి యతిమైత్రి నొందునని తాత్పర్యము.

పరికింపఁగా నిట్లే భేదపరిగణన మెంతమాత్రమున్ను సమంజసమై యుండలేదు. లక్ష్యలక్షణములను బట్టి స్వరప్రధానవళికన్న దీనికి భేద మిసుమంతయును గానరాకున్నది. ఇట్టి స్థలములందెల్ల ఉత్తరపదము మొదటియచ్చు అకారమే యగును గావున దానితో అ, య, హ, లిప్పలు చెల్లుననుట యుక్తము. అప్పుడిది స్వరప్రధానయతియే యగును గదా? ఇట్టిచోట్ల పాణినీయముచొప్పున అకారము లోపించినను శ్రుతిలో (వినికిలో) ఓకారము తుదిని అకారము తగులు చుండుటచేత ఇట్టి

ఓకారమునకు అ, య, హ లు చెల్లుననుట కొంతవరకు సమంజసముగా నుండునని అప్పకవి యభిప్రాయపడెనేమోయని కొందఱందురు. కాని అట్టి యభిప్రాయముతో అప్పకవి ఈయతి నిట్లు కల్పించినట్లు తోచదు. లుప్త విసర్గక స్వరయతియని పేరుపెట్టుటయు, ఓకారమునకు అ, య, హ లిపులు చెల్లుననుటయు మున్నగు హేతువులచేత ఈ యతిలో అకారసంబంధమేమిన్ని స్ఫురించక కేవల మోకారసంబంధము చేతనే అప్పకవిచే నీయతి కల్పింపబడినట్లు విపరీతకముగా స్ఫురించుచున్నది. ఇట్టి స్థలమందు పరపదమునందలి మొదటి అకారమునకు ప్రాధాన్యము నెంచియే మహాకవులచేత అ, య, హ లిపులతో మైత్రి కూర్పబడినది. కానిఓకార సంబంధములేదు. ఓకారసంబంధముచేతనే ఇట్టి స్థలములలో మైత్రిఅంగీకరింపబడినచో కేవల మోకారముతో మైత్రి గల ఉ ఊ, ఒ ఓ, హు, యు మున్నగువానితోడను యతి చెల్లవలసి వచ్చును. మరియు పరపదాదిని అకారముండక హాకారము మున్నగునది (హశ్ ప్రత్యాహారము లోనిది) ఉన్నప్పుడున్ను ఇట్లే ఓకారము వచ్చునుగావున అప్పుడున్ను ఓకారముతో మైత్రిగల వర్ణములు సైతమేల చెల్లుబడికాకూడదు? అట్లెచ్చటను మహాకవులేని మరియొకరేని ప్రయోగించలేదు కదా! ఇంతయేల ఓకారమునకు అ, య, హ, లిపులు చెల్లునట్లు చెప్పుట యెట్లుసరిపడును? మరియు స్వరప్రధానయతులతో పెక్కుచోట్ల పూర్వపదాంత్యవర్ణమున్ను పరపదాద్యవర్ణమున్ను సహజముగా (మొదటనే) అచ్చులయి యుండి సంధివశమున ఏకవర్ణమైనను ఆవర్ణము పరపదాది వర్ణమునకు మైత్రి కలదియే యగుటయు ఈ లుప్త విసర్గక యతిస్థలములలో అట్లుకాక తొలుతొల్త పూర్వపరాంత్యవర్ణము హల్లయి (స్ అనుహల్లయి) పిమ్మట ఉ అను అచ్చయి ఓకారమై ఆఓకారము పరపదాదియగు అకారమున్ను కూడి ఓకారమే అయి పరపదాదియగు అకారమెంతమాత్రము కానరాక యుండుట మొదలగు హేతువులచేత స్వరప్రధానయతి కన్న ఉప

చాలా భేద మున్నదనుకొన్నచో ఇట్టిచోట్ల సంధివశమున పరపదాది వర్ణము (అకారము) పోయి కానరాక ఓకారము మాత్రమే కానవచ్చు చున్నను ఆ ఓకారమునకు ప్రాధాన్యములేక కానరాకున్నను వినికిలో (శ్రుతిలో) స్పష్టముగా తగులుచున్న అకారమునకు ప్రాధాన్యము కలిగి అకారముతో మైత్రిగల అ,య, హ లిపులు చెల్లునని చెప్పి వేరొక పేరుపెట్టుట (అనంతుడు పెట్టినట్లు గూఢస్వరయతి మున్నగునది) సమంజసమని తోఁచుచున్నది. అనంతుఁడు దీనికి ఛందోదర్పణములో గూఢ స్వరయతియని పేరుపెట్టినాఁడు. కాని అందున్న — గీ. "స్వరముతుద నుండి లుప్తవిసర్గకోత్వ మైన స్వరవిరామంబు" అని లుప్తవిసర్గ పదమును లక్షణపద్యములో స్పృశించినాఁడు. (చేర్చినాఁడు) అందు చేతనే కావలయు (ఆలుప్తవిసర్గ పదమును మనంబున నుంచుకొనియె) విపరీతముగా అతనిపేరును దిద్దినట్లు అప్పకవి లుప్తవిసర్గక స్వరయతి యని మార్చినాఁడు. లక్షణపద్యములో లుప్తవిసర్గ అనుపద్యమున్నను అప్పకవి నామముకన్న అనంతుని నామమునకే ఔచిత్యము మిక్కిలి కానవచ్చు చున్నది. (అన్వర్థకతయున్నది)

పైని చూపఁబడిన ప్రక్రియచే నేర్పడిన రామోధిప, తమోత్ర, తమోర్క, మున్నగు పదములలో ఓకారము వచ్చుటకు విసర్గప్రసక్తి లేనేలేదు గదా! అట్టిస్థితిలో ఇచ్చటి ఓకారము లుప్తవిసర్గకస్వర మెట్ల గును? ఇట్టి ఓకారయతికి లుప్తవిసర్గస్వరయతియను పేరెట్లు పొసగును? రామ, తమస్, మున్నగు పదములు సైతము పరపద సంబంధము లేనప్పుడు రామః, తమః, మున్నగు విసర్గయుక్తరూపముతో నుండి (కానవచ్చి) ఇట్లు పరపద సంబంధ మున్నప్పుడు మాత్రము ఆవిసర్గ కాన రాక ఓకారము కానవచ్చుటచేత ఆవిసర్గము లోపించి దానికి మాఱుగా ఓకారము వచ్చినదని యూహించి ఇంగ్లీషుభాషాసంస్కారము విశేష ముగాగల కొందఱు పండితులు ప్రక్రియచెప్పునట్లు ప్రక్రియ కల్పించు కొన్నచో కొంతవఱకే పేరు సమంజసము కావచ్చును గాని అప్పకవివంటి

సంస్కృతవ్యాకరణ మర్యాదలెల్ల పరిపూర్ణముగా నెఱిఁగిన గొప్ప పండితుఁడట్లు ప్రక్రియ కల్పించుకొన్నాఁడనుట యెట్లుసరిపడును. మరి యును పరపదము మొదటిదగు హ్రస్వాకార సంబంధముచేత పైని చెప్పిన ప్రకారమిట్లు ఓకార మేర్పడి పిమ్మట అకార మోకారముతో నైక్యమొందెను. (కలసి కానరాకుండెను) అనిగ్రహింపక విడిగా నున్న ప్పుడు విసర్గముండి ఇట్టిస్థితిలో అది కానరాక పరపదాది నుండు అకార మున్ను కానరాక ఓకారము మాత్రము (క్రొత్తగా) కానవచ్చుట చేతను విసర్గకు మాత్రి మోకారము వచ్చినదని తలఁచి మహాకవుల ప్రయోగములలో నిట్టిచోట్ల అ, య, హ లమైత్రి కానవచ్చుటచేత ఓకారమునకే అ, య, హ లమైత్రి కూర్చిరని యెంచువారు ఓకార మునకు అ, య, హ లు చెల్లునని చెప్పుట సరిపడవచ్చునుగాని పర పదాదినున్న అకారముయొక్క సంబంధమును పూర్తిగా నెఱింగినట్టిన్ని అట్లెఱుఁగుటను స్పష్టముగా (కంఠోక్తముగా) “అత్తుమొదలనుగలబ్ధ మతుకువేళ సమరునోత్వంబునకు” అని తెలుపుచున్నట్టిన్ని అప్పకవి ఇట్లువ్రాయుట (నిర్వచించుట) మిక్కిలి చింత్యమైయున్నది.

ఇట్టిచోట్ల పరపదము మొదలి అచ్చునకే ప్రాధాన్యము కలుగుట చేత ఓకారమునకున్ను ఇట్టివి అప్పకవి మతమున ఉభయయతి పదము లలో జేరవు కావున ఓకారముతో గూడియున్న ప్రాణివర్ణమునకున్ను (అనఁగా కింకరోహం మున్నగు వానిలోని ఓ, రో మున్నగు వానికిన్ని తమోర్క మున్నగువానిలో ఓ, మో మున్నగు వానికిన్ని) యతి మైత్రి కూర్చగూడదనియు అకారమునకు మాత్రము మైత్రిగల వర్ణ ములే కూర్చవలెననియు అన్యోన్య శబ్దములో మాత్రము అట్లుగాక “న్యో” అనుదానికిన్ని (ప్రాణివర్ణమునకున్ను అనగా విడి విడిగా నో యో అను రెండువర్ణములుకున్ను) కూడా మైత్రిగల వర్ణములున్నా కూర్చవచ్చుననియు అన్యోన్యశబ్దము ఉభయ యతులలోని దనియు అట్లగుట నిత్యసమాసాఖండయతి సందర్భమున 136 వ పద్యములో పేర్కొనబడిన నిత్యసమసన శబ్దములలో ఇదియు (అన్యోన్య) ఉండుటయే

స్పష్టపరచు చున్నదనియు ఉభయయతి లక్ష్యమగు నీఅన్యోన్య శబ్దము నిచ్చుట ఉదహరించుట యుక్తముగా లేదనియు నిత్యసమాస పదములను మిక్కిలి సంగ్రహముగాచెప్పి అన్యోన్యపదమందు చేరుటయు చేరకుం డుటయు తెలుపని అనంతుడు గూడ స్వరయతియను నామాంతరముతో చెప్పిన ఈయతి ఉదాహరణములలో అన్యోన్యశబ్దమున్న చెప్పుట చూచి తానిట్లుచెప్పుట (ఉభయయతి పదములలో అన్యోన్యశబ్దమును చేర్చిన అప్పకవి చెప్పుట) పొసగదనియు నెఱుంగునది.

18 వ పద్యము:— ఇది అప్పకవిచే నుదాహరణకు కల్పింపబడినది. లక్షణ సమన్వయము సుకరము.

మరున్నందన శతకమునందు :—

శా॥ కోపాటోపము కుప్పిగంతులు నిజాకుంఠీభవచ్చౌర్యరే
ఖాపాండిత్య మయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనాకుచతటీపై రాపటగ్రాహబా
హాపాటచ్చర రామదాస తవ దాసోహం మరున్నందనా 19

సుభద్రాపరిణయమునందు:—

శా॥ తా స్వైరింప కపర్ది యుండఁగ భవద్గర్భంబునం దాల్చి తే
జోసహ్యున్ శరజన్ముఁ గాంచి యలనీహారక్షమాభృత్కుమా
రీసాపత్న్యము గన్న మోహపుఁబురంధ్రీరత్నము న్నీవ కా
దే సర్వజ్ఞున కేల నిన్నుఁ దలపై నెక్కించుకో జాహ్నవీ (1.114)20

ఉద్యోగపర్వమునందు :—

ఉ॥ దైన్యము దక్క దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోక సా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడిన్
(1—32) 21

19 వ పద్య వివ :— కుప్పిగంతులు = బాలక్రీడా విశేషము—

తా॥ కులస్త్రీల సైతము బలాత్కారముగా చెఱబట్టి వారి పై రాపటములను (పైటబట్టలను) లాగివేయు లంకాపురిలోని దుష్ట జనుల బాహువులను ఖండించువాఁడా! (దుష్టదనుజుల దునుమాడు పరాక్రమము గలవాఁడా! రామభక్తాజీ! ఆంజనేయదేవా!) నీకు కోపవిజృంభణము బాల్యక్రీడయే అయ్యెను. (బాల్యక్రీడయందే భయంకరముగా సూర్యునిసైతము పండని మ్రింగబోయి మిక్కిలి కోపవిజృంభణము జూపితివి) ఇఁక నీయావనమందలి మహాపరాక్రమ విశేషము చెప్ప శక్యమే ! అట్టి నీకు నమస్కారము నన్ను రక్షింపుము— ఇక్కడ గిడుగు వారి పీఠిక ప్రతిలో 'పైతాపతద్గ్రాహ' అనియున్నది. అప్పుడు పైటల యందు పడునట్టి గ్రాహములవంటి (మొసళ్ళవంటి) బాహువులని ఎట్లో అర్థమగుచున్నది. ఇందు దాసోహం అనుచోట అనుకరణము లేకున్నను "అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి" మున్నగువాని యందువలె సాధుత్వమెఱుంగునది.

ఇందు నాల్గవపాదములో మొదటనున్న హా అనుదానికిని యతి స్థలమందు దాసోహం దాసః + అహం అని పదచ్ఛేదమున నేర్పడు అకారమునకున్ను అప్పకవి మతప్రకారమున సోహం అనుదానిలో ఓకారమునకును యతిమైత్రి చెల్లుటచే లక్షణ సమన్వయమయ్యెనని యెఱుంగునది. ఇది అకారాంత పదమునకుదాహరణము ముందు పద్యము లోనిది సాంత పదమున కుదాహరణము.

20 పద్య వివ:— ఇందు రెండవపాదములో మొదటి "తేజో" అనుదానిలోని ఓకారమునకున్ను (తేజోసహ్యా తేజః + అసహ్యా అను విఱుపులో కానవచ్చు అకారమునకు) అందే యతిస్థలములో నీహార అను పదము లోని హాకున్ను మైత్రి చెల్లుచున్నందున లక్షణ సమన్వయ మయ్యెను.

21 పద్య వివ:— ఇందు నాల్గవపాదము మొదలి "న్యో" అను దాని ఓకారమునకున్ను (అన్యోన్య, అన్య + అన్య అనునప్పుడు కానవచ్చు

అకారమునకున్ను) యతి స్థలములోని ఆడిన అనుదాని ఆకారమునకున్ను మైత్రి చెల్లుటచే లక్షణసమన్వయమయ్యెను.

ఋ వ ళి 4

కం॥ ఇత్తైత్వత్వంబులఁదొలఁగక
ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మి
త్రిత్వంబు నెఱపు నెట్టిమ
హాత్త్వము యట్ల నగుఁ గాదులం దున్నపుడున్ 22

22 పద్య వివ:— ఇక్కడ ఇత్వ మున్నగు దానిలోని త్వ ప్రత్యయము స్వార్థమునే చెప్పును. (కారప్రత్యయమువంటిది)

అర్థ:— ఋత్వంబును=ఋకార మొక్కటిమాత్రము (ఇత్వ వళ్యక్షరములగు ఇ, ఈ, ఋ, ఏ లలో తక్కినవానిని విడిచి ఋకార మొక్కటి మాత్రము) ఋవళి యనఁగన్= ఋవళియను పేరుతో ఇత్తైత్వత్వంబులఁదొలఁగక= ఇ, ఈ, ఎ, ఏలను విడువక (ఇ, ఈ, ఎ, ఏలతోఁగూడియున్న) రేఫముతో రి, రీ, రె, రేలతో ఉపలక్షణచే ఌకారముతోడను మిత్రిత్వంబున్= చెలిమిని (యతిమైత్రిని) నెఱపున్= ప్రకటించును (పొందును) ఎట్టిమహాత్త్వము= ఎట్టిశక్తికలదో కాని, కాదులందున్నపుడున్= కకారాదిహల్లులమీద నున్న ప్పుడును (వటుప్రవసుడి యనబడునప్పుడున్ను) అట్లనగున్= ఆవిధముగానే రి, రీ, రె, రేలతో మైత్రినొందును. ఇక్కడ గిడుగువారు 'గలయక (పూ.ము) బెరయక (వా)' అని పాఠాంతరములు వ్రాసిరి. అర్థమువ్రాసిన దాని ఉపయోగము తెలియును. ఇత్తైత్వత్వంబులను గలయక (లేక) బెరయక= పొందక (ఇ, ఈ, ఎ, ఏలను విడిచి) ఋత్వంబును= ఋకార మొక్కటి మాత్రము ఋవళియను పేరుతో (ఇ, ఈ, ఋ, ఎ, ఏలతో గూడిన) రేఫముతో మైత్రిజెందును. (మూలపాఠంబులో ఇత్తైత్వత్వం బుల అనుపదము మిక్కిలి దూరముగానున్న "రేఫముతో" అను పదముతో నన్వయించుటచే దూరాన్వయ క్లేశము గిడుగువారి పాఠాం

తరములో "ఇ, ఈ, ఋ, ఎ, ఏలతో గూడిన" నిల అధ్యాహార క్లేశము రెండును తుల్యములే (అనిపించినది) ఇత్వమైత్రి వర్ణములగు ఇ, ఈ, ఋ, ఎ, ఏలలో ఇ, ఈ, ఎ, ఏలు మైత్రినొందక ఋవర్ణ మొక్కటి మాత్రమే ఇ, ఈ, ఋ, ఎ, ఏలతోగూడిన రేఫముతో మైత్రి నొందుట చేత దీనికి ఋవడియనిపేరు వచ్చినది. మరియు ఋకారముకకారాది హల్లులతోగూడక విడిగ నున్నప్పుడు ఋకార రకార ములకు గల సంబంధముచేత (అనఁగా ఋకారమునకు అచ్చుపరమైనప్పుడు రకారము (యణాదేశముగా) వచ్చుట, కొన్నిచోట్ల ఋకారము సంప్రసారణముగా రకారమునకు వచ్చుట ఋకారములో రెండురేఫలు (అజ్భక్తియు) ఉండుట అను వ్యాకర్ణసమ్మతియుండుట, ఋకారము రేఫద్వయ మేళనచే ఏర్పడినదని పదతత్వ విమర్శకుల యభిప్రాయమగుట, ఈకారణములచేతనే ఋకారమునకు రకార తుల్యత్వము ఆంధ్ర వైయాకరణులచే అంగీకరింపబడుట, అందుచేతనే వాడు + ఋషి ఇత్యాదులలో సంధి రాకుండుట ఆఋషి గట్టిన చీరలు, మున్నగుచోట్ల ఋకార రకారములకు ప్రాస పొసగుట మున్నగు హేతువులచేత సిద్ధించుచున్న సంబంధము చేత (అభేదత్వముచేత) కేవల ఋకారమునకు రకారముతో మైత్రి చెల్లుటలో మహిమ సాధ్యత్వము లేదనియు, ఋకారము కకారాదుల మీఁదనున్నప్పుడు కకారాదులకును రకారమునకున్ను ఎట్టి సంబంధము లేదు గావునను, కకారాదులవలన ఋత్వసంబంధము దుర్బలమైపోయి (అనఁగా కకారాదులతో గూడినప్పుడు ఋకారేతరములైన అచ్చులు కేవలముగా యతిమైత్రికి పనికిరాక కకారాదులకు గూడను మైత్రిగల హల్లులతో గూడియున్నప్పుడే పనికివచ్చునట్లు ఋకారమున్ను కకారాదులతో గూడియున్నప్పుడు కకారాదులమైత్రి లేకుండా పనికిరాక కకారాది హల్లులకున్ను మైత్రిగల కకారాదులతో గూడియున్నప్పుడే పనికివచ్చుట అను దుర్బలత్వము వచ్చి) యుండుటచేతను కకారాదులపై నుండు (వట్టువసుడియగు) ఋకారము ఇ, ఈ, ఎ, ఏలతో గూడిన

రకారముతో (రి, రీ, రె, రేలతో) మైత్రి నొందుటకు మాత్ర మేదియో యొకమహిమ (శక్తి) యుండి తీరవలయునని అప్పకవి యభిప్రాయము స్పష్టపడుచున్నదనియు, అట్టిమహిమ ఋకారము తక్కిన అచ్చుల వంటిదిగాక రకారద్వయ మేళనముచే (హల్మేళనముచే) నేర్పడినది గావున హల్త్వమున్ను గలది గావున అట్టిదానితోఁ గూడిన మరియొక హల్లు సంయుక్త తుల్యమే గావున సంయుక్త వర్ణములలో నే హల్లునకు నైనను ఒక్కదానికి మైత్రి గలిగినది యైనచో చెల్లుబడి యగుట స్వభావసిద్ధమే గావునను, కకారాదులతో గూడిన ఋకారము సంయుక్తమైన రకారము వంటిదేయగుటచే అట్టిదానికి మాత్రము మైత్రిగల రి, రీ, రె, రేలతో (రకారతుల్యమేయగు) కకారాదుల మీఁది ఋకారమునకున్ను (కకారాదుల సంబంధమక్కరలేకయే) మైత్రి గూర్చుటలో విరోధమేమీ లేదనియెంచి (పరిశీలించి) మహాకవులు ప్రయోగించుటయే యనియు నెఱుంగునది.

మరియు కొన్ని ప్రదేశాలలో ఋవర్ణము రివర్ణముగా వినబడుచుండుటచేతను వైకృతములం దట్టి రూపము లుండుటచేతను, ధృ = ధ్రియతే, కృ= క్రియతే, మృ= మ్రియతే ఇత్యాది సంస్కృత పదములందును (రీఙ్ దయగ్లిఙ్ క్షు ఇత్యాది సూత్రప్రకారము) ఋ కారము రివర్ణముగా మారుచుండుటచేతను ఋషి—రిసి అను మున్నగు యుచ్చారణ కన్నడములోతఱచై తెనుఁగులో నరుదై యుండుటచేతను ఈయతి యుక్తమై అంగీకరింపబడెనని మున్ను తెలుపబడినదనియు, తెనుఁగులో ఋ కారము రుకారముగా వినబడు చుండుటచేత అనంతుఁడు ఋ, ఌ లకు రు, లు, లతో యతి (రువడి, లువడి) చెప్పినాడు. అని కొందఱు విమర్శకులు స్పష్టముగా వ్రాసినారనియు అది సరి కాదనియు (అనంతుడు రివడియే చెప్పినాడు కాని రువడి చెప్పలేదు. అట్లే లివడినే కాని లువడికాదు అని) విపులముగా మున్నే విమర్శించి తెలుపఁ బడినదనియు దీనిని రివడియని కొందఱందు రనియు కేవల

ఋకారమున్ను కకారాదులపై నుండు ఋకారమున్ను (వట్రువసుడి యున్ను) ఇ, ఈ, ఋ, ఎ, ఏలతో గూడి రకారముతో (రి, రీ, ర్ఱ, రె, రే, లతో మైత్రి) నొందుననియు ఇట్టి వడికి ఋవళియని పేరనియు ఈ పద్యముయొక్క సారాంశ మెఱుంగునది.

మఱియు నీలక్షణపద్యములో నాల్గవపాదము లో త్వా అను దానికిని తక్కిన పాదములలో "త్వా" అనుదానికిని ప్రాసమైత్రి కాన వచ్చుననియు అది మూడుహల్లులు సంయుక్తమైనప్పుడందు క్రింది రెంటిలో నొకటి లేకున్నను ప్రాసచెల్లునను కొందఱి మతమునుబట్టి కొన్ని ప్రతులలో అంగీకరింప బడినదనియు కొన్నిప్రతులలో అట్లంగీకరింపబడక కావలయు. అన్నిపాదము లందును "త్వ" అను రూపముతోనే ఉన్నదనియు అప్పుడు "సూ. అనచిచ" అను దానిచే ద్విత్వకల్పనచే సాధుత్వము చెప్పవచ్చుననియు నెఱుంగునది.

క॥ రతివల్లభ జనకవి ని
ర్జితకనకవిలోచనాఖ్య ఋగ్యజురాది
శ్రుతిచయ గోచర వాహీ
కృతఖేచర కులలలామ రిప్రజనభీమా 23

సభాపర్వమునందు:—

సీ॥ పా. ఋత్విజుం డని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి. (2.11) 24

విజయవిలాసమునందు:—

ఉ॥ ఆణిమెఱుంగుముత్తెపుటొయారపుముగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతరవాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ గ్రొబ్బొలు మిగులం గనువిం దొనరించు నిత్యక
ల్యాణము పచ్చతోరణము నై జనులందఱు నుల్లసిల్లఁగాన్
(1, ఆ, 83) 25

23 పద్య వివ:— ఇది అప్పకవిచే నుదాహరణకు కల్పితము. ఇందు రెండవపాదము మొదట (ర్జి) రీకిన్ని యతిస్థానమున "ఋ"

అనుదానికిని నాల్గవపాదమున మొదటి కృ యతిస్థానమున రి అను దానికిని మైత్రి కూర్పబడుటచే ఇది రివడియయ్యెను.

24, 25 పద్య వివ:— ఇందు మొదటి ఋ యతిచోటి రి అను దానికిన్ని 25 పద్యములో రెండవపాదము మొదటి (శ్రే) రేఅనుదానికిని యతికడ (హ్మృ) ఋ అనుదానికి యతి కూర్పబడుట నివి రివడి కుదాహరణములు.

ఋత్వ సంబంధ వళులు 5

తే॥ సొరిదిఁ గాదులఁ గలవటు ప్రసుడుల కెల్ల
ఋత్వమిత్రంబు లగునచ్చు తెలయ నైదుఁ
జెల్లు హాయలు స్వరమైత్రిఁజెందునపుడు
వెలయునివి ఋత్వసంబంధవళులనంగ 26

ఆ॥ ఐనతనూభవుండు పృషదశ్వసుతునేసె
ఋభునదీసుతుండు కృష్ణు నేసె
నేమి చెప్ప నపుడు ధృతశక్తి శల్యుండు
హీనబలునిఁ జేసె వృష్ణికులుని 27

జైమినిభారతమునందు:—

సీ॥గీ॥ తండ్రితరమునఁ బెనిమిటితరమునందు
పీసమంతయుఁ బుణ్యంబుఁ జేసియెఱుఁగ
వార్థకంబున నిం కేల వట్టితోడుసు
కృష్ణు దర్శింప కున్న నా కేమి చిక్కు (2,109 28

మనుచరిత్రమునందు:—

సీ॥ తీర్థసంవాసు లేతెంచినా రని
విన్న నెదురుగా నేఁగు ద వ్వెంత మైన
నేఁగి తత్పదముల కెరఁగి యింటికిఁ
దెచ్చుఁ దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ

జేయుఁ జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యుద్ధరఁ గల్గువనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు (1-57) 29

నరశింహ పురాణమునందు:—

సీ॥ పా. ఏదేవులీల లై యొసఁగుజగంబులు
సృష్టిరక్షావసమాపేక్షఁ బరఁగు (2, 30) 30

ఆముక్తమాల్యద యందు:—

చ॥ హితులు భిషగ్గ్రహజ్ఞ బుధ బృంద కవీంద్ర పురోహితుల్ హితా
హితులు ధనార్జనాది నృప కృత్య నియుక్తులు వెండి కేవలా
హితులు దశా దశార్పిత సమృద్ధ రమా చరణే ప్సులోట నా
హితమును నట్లుకాఁజతుర వృత్తిఁ జరించుట నీతి తేనికిన్
(4, 273) 31

సుభద్రాపరిణయము నందు:—

తే॥ చెఱకు విలుకాని బారికి వెఱచి నీదు
మఱుఁగు జొచ్చితిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణ దానమ్ము కన్నను వ్రతము గలదె
యెఱుఁగవే ధర్మ పరుఁడవు నృపకుమార (1, 158) 32

ఎడవల్లి పర్వతన్న చాటుధార:—

మ॥ రణ రంగంబున నీశితాసి యరి నోరంబూరి గైకొన్నఁదా
నణు మాత్రంబును వానిపైని దెగదాహా చిత్ర మూహింపఁగాఁ
దృణమే కావలె దారికట్టు మొనకట్టి ధారుణీ మండలిన్
బ్రణుత ప్రాభవ కంద నోలి పుర గోపాల క్షమా వల్లభా 33

26 పద్య వివ:— లక్షణపద్యము—ఇ, ఈ, ఋ, ఎ, ఏలున్ను ఈ అచ్చులతో గూడిన హాయలున్ను (హి, హీ, హృ, హె, హే, యి, యీ, యృ, యె, యే అనునవియు) వట్రువసుడితో (ఋకార ముతో) గూడిన అన్ని హల్లుల తోడను (తృ, కృ మున్నగు రూప

ముతో నుండు అన్ని హల్లుల తోడను) ఋత్వ సంబంధము చేత (తమకు మిత్రమగు ఋకారముతోc గూడి యుండుట చేత) యతి మైత్రి నొందును. కకారాదుల మీఁది ఋకారము వెనుక చెప్పినట్లు సంయుక్త తుల్యమే యగుట చేతను అట్టి ఋకారమునకు ఇ, ఈ, ఋ, ఎ, ఏలు వానితో గూడిన హాయలున్ను మైత్రిగలవే యగుటచేతను వెనుక చెప్పిన సంయుక్త స్వాభావ్యము చేతను ఇట్లే యతి చెల్లుబడి యగుట ఇట్టి పేరునొందుట యుక్తమే యని యెఱుంగునది.

27 పద్య వివ:— ఇది అప్పకవి కవికల్పితము. ఇందు మొదటి పాదమున ఇ... పృ లకును 2 వ పాదమున ఋ......కృ లకును 3 వ పాదమున నే ఏ.....దృ లకును 4 వ పాదమున హీ.....వృ లకును మైత్రిచెల్లెను.

28 పద్య వివ:— ఇందు 4 వ పాదమున కృ... .నాకు+ఏమి అను విభాగమున నేర్పడు) ఏ లకు యతిమైత్రి కూర్పబడుట చేత నిక్కడ ఋత్వసంబంధయతి యయ్యెను (వట్టి) తోడును= (వ్యర్థ మగు) సంబంధము అని శబ్దరత్నాకరమున గలదు.

29 పద్య వివ:— ఇందు 3 వ పాదము పూర్వార్థ మందు ఇ.....తృ లకు మైత్రి చెల్లెను.

30 పద్య వివ:— ఇందు ఉత్తరార్థమందు నృ...(అప+ఈటు అనియేర్పడు) ఈలకు యతి మైత్రి చెల్లెను.

ఋత్వసామ్యవ

31 వ పద్య వివ:— ఇందు నాల్గుపాదాలలోను (క్రమముగా) హీ.....బృంలకును హి......నృలకును హి.....మృలకును, హి......వృ లకును యతి చెల్లుచున్నది.

32 వ పద్య వివ:— 4 వ పాదమందు (యె) ఏ....నృలకు యతిచెల్లెను.

33 వ పద్య వివ:— ఇందు 3 వ పాదమందు తృ.....(మొన

కట్టు+ఇద్ధారుణి అనిపర్వడు, ఇ అనుదానికి మైత్రిచెల్లెను. దారికట్టు = (పిశాచాది బాధ రాకుండా ఆపిశాచాదులయొక్క) మార్గములను కట్టి వేయు (శక్తిగల) మొనకట్టు= సంస్తభనౌషధి విశేషము (తామెతు, పా....దాదికట్టు= దాది (రక్షణకొఱకు) కట్టునట్టి— మరియొక పా. దారి కట్టు మొరడా ఇది మొనకట్టునకు పర్యాయపదము.

ఋత్వసామ్యవళులు 6

తే॥ వటుత్రివలు చెంది తమలోన వ్యంజనంబు
లన్నియును గూడు ఋత్వసామ్యావళు లనఁగ
వృష్ణివంశాబ్ధిసోముఁడై పృథివిఁబుట్టి
మృతునిఁ గావించెఁ గంసునిఁ గృష్ణుఁడనఁగ 34

34 పద్య వివ:— వట్రువసుడితోఁ గూడి హల్లు లన్నియు (హల్మైత్రి అక్కరలేకయే) పరస్పరము యతిమైత్రి నొందును. ఋత్వ ముతో గూడియుండుటయను సామ్యముచే నిది యిట్లు చెల్లుచుండుటచే దీనికి ఋత్వసామ్యావళియనిపేరు. సంయుక్తస్వాభావ్యము మున్నగు నీ యతిని గుఱించిన యుపపత్తులు మున్నే చెప్పబడెను.

ఇందు 3 వ పాదమునందు వృ....వృలకును 4 వ పాదమున మృ.....కృలకును యతిచెల్లెను.

విష్ణుచిత్తీయమునందు :—

సీ॥గీ॥ తిరుగుదు రయారె సురపురి సురలమఱిగి
బహుళహాలహాలభరితకల్బరిగనగర
నగరపురవరపరివృఢజవనయవన
పృతన భవదసి నఱఁ దెగి కృష్ణరాయ (1, 41) 35

అందే :—

మ॥ గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార[1] పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్య లభ్య[2]ధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో ద్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేలలేరెయితరుల్ నీలీలకుం బాత్రముల్ (2.91)36

1 పర్యంకికా 2 తార్క్ష్యధ్వజ

35, 36, పద్య వివ:— మొదటిపద్యమున 4వ పాదమున పృ... కృ లకును రెండవపద్యమున 1వ పాదమున గృ.....శృంలకును యతిమైత్రి చెల్లుటచే నివి ఋత్వసామ్యవళికి లక్ష్యములగుచున్నవి.

<u>వృద్ధివళులు 7</u>

కం॥ తలకట్టులపై సంస్కృత
ములఁ గదియుపదాదివక్రములకు వరుసతో
నెలకొనువక్రతమంబుల
కిల నుభయముఁ జెల్లుచుండు వృద్ధివళు లనన్ 37

37 వ పద్య వివ :— సంస్కృత పదములందు (కకారాదులపై నుండు) అ ఆ లలో దేనికైన నొకదానికి ఏ ఓ ల నేదియైన పర మగునప్పుడు అ, ఆ, ఏ లకు (అ, ఏలకు, ఆ, ఏలకును) ఐ అను నది యును, అ, ఆ, ఓలకు (అఓలకు, ఆఓలకును) ఔ అను నదియును (సంస్కృతవ్యాకరణమందలి సూ॥ వృద్ధిరేచి అనుదానిచే) వచ్చును. అ ఏలకు రెంటికిని, ఆ ఏలకురెంటికిని ఐ ఒక్కటే ఏకాదేశముగాను అ, ఓలకు రెంటికిని ఆ ఓ లకు రెంటికిని ఔ అనునది ఒక్కటే ఏకాదేశ ముగాను వచ్చును. ఇట్టి ఏకాదేశముచే నేర్పడిన ఐ అను దానిలోని పూర్వ పరస్వరములగు ఆ, ఏలు రెంటియొక్కయు ప్రాధాన్యముచేత అట్టి ఐ, అ, ఆ, ఐ, ఔలతోడను అ, ఆ, ఐ, ఔ లతోగూడిన హాయలతోడను ఇ, ఈ, ఋ, ఎ ఏలతోడను ఇ ఈ, ఋ ఎ, ఏలతో. గూడిన హాయలతోడను ఇట్టి ఏకాదేశముచే నేర్పడిన ఔఅను దానిలోని పూర్వపరస్వరములగు ఆ, ఓలు రెంటియొక్కయు ప్రాధాన్యముచేత అట్టి ఔ అ, ఆ, ఐ ఔలతోడను అ, ఆ, ఐ, ఔలతో గూడిన హాయలతోడను ఉ, ఊ, ఒ, ఓలతోడను ఉ, ఊ, ఒ, ఓలతోగూడిన హాయలతోడను వృద్ధివళియను పేరుతో యతి మైత్రినొందునని తాత్పర్యము.

ఇట్లు వృద్ధిసంధిలోనే పూర్వపదములగు ఉభయ స్వరములకును

మైత్రిగల వర్ణములు యతిమైత్రికి జెల్లుచుండుటచేత దీనికి వృద్ధివళి యని పేరుగలిగెననియు గొందఱందురుగాని వాస్తవము పరికింప నిట్టి చోట పూర్వాపరస్వరముల ప్రాధాన్యముచేత నీయతి పుట్టియుండదనియు, అట్లయైనచో రమా+ఈశ- రమేశ, గంగా+ఉదక- గంగోదక ఇత్యాది పదములలోని (గుణసంధి మొదలైనవానిచే నేర్పడిన ఏ, ఓ, లకున్ను ఉభయవర్ణములతోడను (పూర్వాపరస్వరములగు అ ఆ, ఇ ఈ అను రెండు జంటలతోడను అ ఆ, ఉ ఊ అను రెండుజంటలతోడను) మైత్రిగల వర్ణములెల్ల (క్రమముగా) మైత్రికిఁజెల్లునట్లు మహాకవులచేఁ గూర్పబడియుండు ననియు, అట్లెచ్చటను గానబడ కుండుటచే పూర్వాపర స్వరముల రెంటియొక్కయు ప్రాధాన్యమున నీయతి చెల్లుచుండ లేద నియు వెనుక తెల్పబడిన విధముగా ఉత్తరపదము మొదటి వర్ణమునకు ప్రాధాన్య ముండుననియు, అందుచే నిట్టిచోట్ల ఉత్తరపదము మొదటి వర్ణము వాస్తవమున ఏ, ఓలలో నేదియో యొకటి యగుచుండుటచేత వానికి మైత్రిగల వర్ణములున్ను సంధివశమున గలిగిన మార్పుచే ఐ, ఔలై ప్రత్యక్ష దృశ్యము లగుటచే ఐ ఔలకు (క్రమముగా) మైత్రి గల వర్ణములున్ను ఉభయ వర్ణములున్ను యతిమైత్రికి జెల్లుచున్న వనియు, రమేశ, గంగోదక మున్నగువాని గుణాది సంధుల మార్పులో ఉత్తరపదాది వర్ణములు రెండున్ను (మొదటనున్నదిన్ని సంధివశమున నేర్పడినదిన్ని) సవర్ణములే అనగా మైత్రికలవే (ఈ, ఏ, ఊ, ఓలని తుల్యములే యగుటచేత) యగుటచేత నచ్చట నీప్రసక్తిలేదనియు వాస్తవమున నున్న వర్ణమునకేకాక వృద్ధిచే నేర్పడిన దానికిన్ని (ఇట్లు రెంటికిన్ని) ప్రాధాన్యము కల్గి చెల్లుటచె దీనికి వృద్ధివళియని పేరువచ్చిన దనియు, ఈవిషయమునే అప్పకవి మహాకవుల యుదాహరణ పద్యము లకు శీర్షికగా ముందువ్రాసిన ఏత్వమునకు ఐత్వమునకు ఓకారమునకు ఔకారమునకు అనునవియే మిక్కిలి ధ్రువపఱచుచున్నవనియు నూహిం చుట యుక్తమని తోఁచుచున్నది.

తే॥ ఇభభయవిదార స్వరలోకైకవీర
అఖిలభువనప్రశస్త జిత్రైణహస్త
ఉదధిజాశ్రితవక్ష భక్తౌఘరక్ష
హతపరానీక నందవ్రజౌక యనఁగ 38

ఏత్వమునకు విష్ణుచిత్తీయమునందు:—

మ॥ గురుగుం జెంచలి తుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరము[1] ల్మెక్కి తమిం బసు[2] ల్పొలము వోఁ గ్రేపుల్ మెయిన్ నాకమేఁ
కెరువుంగుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్
(4—134) 39

ఐత్వమునకు విరాటపర్వమునందు :—

ఉ॥ ఆకమలాక్షిరూపమహిమాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు లంగజుఁ డప్రతిమానచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబునవారి కెమ్మెయిన్
గా కెటు లుండు నిట్టియవగాఢపుఁబొత్తు మనంగ వచ్చునే
(3—32) 40

ఓకారమునకు భాస్కరరామాయణమునందు :—

శా॥ నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
కౌకస్సంచయకాళిరాత్రి గళబద్ధోదగ్రకాలహి క
న్యాకారాగతమృత్యు వీజనకకన్యన్ వేగ నొప్పించి లో
కైకత్రాణుని రాముని గనుము నీ కీబుద్ధి గా కుండినన్
(సుం. ప. 448) 41

ఔకారమున కయ్యల[3] రాజు రామభద్రుని చాటుధార :—

క॥ రాజమనోజా విద్యా భోజా దీనార్థికల్పభూజా రిపుసం
ఘాజా వైభవవిజితబిడౌజా రవితేజ గుత్తి యప్పలరాజా 42

ఇవి యేడును స్వరయతిభేదములు

1 మేసి 2 కొముల్ 3 విటరాజు రామభద్రుని (వా) బలరామభద్రుని

38 పద్య వివ:— ఇది ఉదాహరణములకు అప్పకవి కల్పి తము—ఇందు 1వ పాదమున యతిస్థలమున (లోక+ఏక అను విభాగమున నేర్పడు' ఏ కున్ను పాదాది యందలి ఇ అనుదానికిని మైత్రి చెల్లు చున్నది. (ఇట్లే ఈ, ఋ, ఎ ఏ లకున్ను వీనితో గూడిన హయలకున్ను ఇట్టి ఏ తో మైత్రికి లక్ష్యము లూహ్యములు.' 2వ పాదమున యతికడ (జిత+ఏణ—జితైణ అని వృద్ధి సంధిచే కలసి యేర్పడిన' తై అను దాని పై నున్న ఐ కిన్ని అనగా వాస్తవమున ఏకారమే యైనను సంధి వశ మున ప్రత్యక్ష దృశ్య మానమగుచున్న ఐ కిన్ని 2 వ పాదము నందలి మొదటి అ అను దానికిన్ని మైత్రి చెల్లినది. (ఇట్లే ఆ, ఐ, ఔ లకున్ను అ, ఆ, ఐ, ఔ లతో గూడిన హయలకున్ను ఇట్టి ఐ కిన్ని లక్ష్యము లూహ్యములు.' 3వ పాదమున యతివద్ద 'భక్త+ఓఘ అను నప్పుడేర్ప డుచున్న' ఓ అను దానికిన్ని అనగా వాస్తవ మైన ఓకార మున కున్ను అందే పాదాదిని ఉ అనుదానికిన్ని మైత్రి చెల్లెను. 'ఇట్లే ఊ, ఒ, ఓ లకున్ను ఉ, ఊ, ఒ, ఓ లకున్ను ఉ, ఊ, ఒ, ఓ, లతో గూడిన హయలకున్ను ఇట్టి ఓకారముతో మైత్రి చెల్లుట కుదాహరణము లూహ్యములు.' 4వ పాదమున యతి వద్ద 'వ్రజ+ఓక-వ్రజౌక అని వృద్ధి సంధివశమున ప్రత్యక్ష దృశ్య మానమగుచున్న' జౌ అను దానిపై నున్న ఔ అను దానికిన్ని అందే పాదాది యందలి హ అను దానికిన్ని మైత్రి చెల్లు చున్నది. ఇట్లే ఇట్టి ఔ కారమునకు అ, ఆ, ఐ, ఔల తోడను ఆ, ఐ, ఔ లతో గూడిన హయలకున్ను మైత్రి చెల్లుటకు లక్ష్యము లూహ్యము లనియు తాత్పర్య లక్షణ సమన్వయము తెలియం గునది.

పై విషయమున దార్ఢ్యమునకు మహాకవుల ప్రయోగములు చూప బడుచున్నవి— అందు ఏకారము చెల్లుటకు (అనఁగా కకారా దులపై నుండు అ, ఆలున్ను 'తలకట్లున్ను' పర పదము మొదలిదగు ఏ అను నదియున్ను వృద్ధి సంధి వశమున ఐ అను రూపముగా మారితే

నను స్వతస్సిద్ధ మైనది ఏ అనురూపమే గావున అట్టి ఏకార ప్రాధాన్య మున అట్టి ఏకారమునకు పైని చెప్పఁబడిన ప్రకారము మైత్రి చెల్లు వర్ణములలో చేరిన ఎ అను దానితో మాత్రము మైత్రిచెల్లుటకు) ఆముక్తమాల్యద లోని ప్రయోగము చూప బడుచున్నది. ఇట్లె తక్కిన మహాకవుల పద్యములలో నున్న విభాగ మెఱుంగునది.

39 పద్య వివ:— తా॥ అచ్చటి రెడ్డి ప్రభువులు ఆ వర్షా సమయ మందు గురుగు, చెంచలి, తుమ్మి, లేఁదగిరి సాకు = కోమల మైన తంటెపుకూర చింత చిగుళ్లు కలిపి (పొరఁటి నూనెతో ఆన పెట్టిన) (లేక) నూనెతో పొరంటి = పొరఁటి చుట్టు నావిరి బాటె మిగుల వేడి యయిన కుఱుచ యారిక కూళ్లు (చిన్ని యారిక బియ్యపు టన్నము) భుజించి పశువులు మేఁత కేగఁగా వాని దూడలు విశ్వాసముచే దరిఁ జేరి తమ యొడళ్లు నాకుచుండ మేఁక పిడకలతో తయారు చేయబడిన (మిక్కిలి కాఁకవచ్చు) కుంపట్లు క్రిందుభాగమున గలుగు మంచములపై సుఖించిరి. (ఇందలి గురుగు మొదలైన వన్నియు వర్షముచే గలుగు శైత్య బాధ లేకుండఁ జేయు సాధనము లనియు) అనితాత్పర్యము.

ఇందు నాల్గవ పాదమున యతి స్థల మందలి (ప్రభుత్వ + ఏకాప్తి అనుసప్పు డేర్పడు) ఏకారము నకును పాదాది యందలి (మేఁక + ఎరువు అను సప్పు డేర్పడు) ఎ అనుదానికిని మైత్రి చెల్లుచుండుటచే లక్షణ సమన్వయము.

40 పద్య వివ:— వెనుక చెప్పఁబడిన రీతిగా ఐకారము చెల్లు టకు విరాటపర్వ పద్యము లక్ష్యముగా చూపబడినది. ఇందు 2 వ పాదము మొదట (పూర్వోక్త విధముగా నేర్పడిన గై అను దాని పై నున్న) ఐ కిన్ని యతి స్థలమందలి (పురుషులు + అంగజుడు అనుసప్పు డేర్పడు) అ అను దానికిన్ని మైత్రి చెల్లుట చేత లక్షణ సమన్వ యము గలిగినది. మరియు నిందు అవగాఢము, అను దానికి = అపాయ కరము అనియర్థము. ఇంతేకాక అవగాఢపుఁ బొత్తు అనుచోట మిక్కిలి

వ్యాఖ్యాపేక్ష యున్నను అది కేవల వ్యాకరణ విశేషముగుటచే ఇక్కడ విమర్శించబడక అన్యత్రి విమర్శింప బడుననియు నెఱుంగునది.

ఓకారము చెల్లుటకు :—

41 పద్య వివ.— ఇందు పాదాదిని (లంకా + ఓకః అను విభాగమున గానవచ్చు ఓకారమునకును యతి వద్ద (బద్ధ + ఉదగ్ర అను నప్పుడేర్పడు ఉకారమునకును పైని చెప్పినట్లు మైత్రి) చెల్లుచున్నది. మరియు నిందు ఆనుషంగికముగా నాల్గవ పాదమున (లోక + ఏక అను నప్పుడున్న ఏఅనుదానికిన్ని (నీకున్ + ఈబుద్ధి అనునప్పుడేర్పడు) ఈకిన్ని యతి మైత్రి యున్నది గావున నిది ఏకారము చెల్లుటకున్ను ఉదాహరణమగు చున్నది అనియెఱుంగునది.

ఓకారమునకు వెనుక చెప్పినట్లు చెల్లుటకు అయ్యల రాజు రామభద్రుని చాటు ధార కంద ముదాహరింప బడినది.

42— 4వ పాదము మొదట (బిడ + ఓజ బిడౌజ అని వృద్ధివలన వచ్చిన డౌ అనుదానిపై) ఔకారమునకున్ను అప్పల అనుదాని మొదటి అ అను దానికిన్ని మైత్రి చెల్లినదని లక్షణ సమన్వయము—ఇందలి రిపుసంజ్ఞాజా అనుచోట రిపు = శత్రువులకు సంజ్ఞాజా = యముఁడా, అంతకుడా (యముడు సూర్యుని భార్యయగు సంజ్ఞ ఛాయా దేవికి బుట్టిన వాడు గావున సంజ్ఞాజుఁ డయ్యెననియు నెఱుంగునది.

వ్యంజనాక్షరవిరతులు

సీ॥ క్రమమునఁ బ్రాణి వర్గజ బిందు తద్భవ
వ్యాజ విశేషసమాహ్వయములు
మహి ననుస్వార సంబంధాను నాసికా
క్షర ముభిన్న కి ముకారయతులు
మొగి మవర్ణ విరామములు ఋజు
ప్రత్యేక భిన్నైకతరముల భేదవిరతు
లొలి నభేదవర్గోష్మ విశ్రాంతుం
సరస సంయుక్తవిశ్రామములును

తే॥ గరిమ నంత్యోష్మసంధి వికల్ప సంధి
విరమములు నాఁగ వ్యంజనాక్షర విరతులు
నిఖిల సుకవి ప్రయోగముల్ నెమకిచూడ
నేక వింశతి భేదంబు లెఱుఁగ వలయు 43

ప్రాణి విరామములు 8

తే॥ ప్రాణములు నాఁగ స్వర సమాహ్వయము లయ్యె
నవి కలిమిఁజేసి హల్లులు ప్రాణులయ్యెఁ
బొల్లుహల్లుల నచ్చులు పొంద కునికిఁ
బ్రాణు లని పల్కఁగూడదు వాని నెందు 44

తే॥ వ్యంజనంబులు స్వరమైత్రివలనఁ దమకు
దాము ప్రాణి విరామాభిధానములను
జెంది మూఁడు తెఱంగులై చెల్లుచుండు
వాని నెఱుఁగక కృతిసేయ వలను గాదు 45

కం॥ చెలులు తలకట్లు నాచా
ఫులునై త్వోత్వములు మిత్రములు గుడి గవయున్
సుడి గవయు నేత్వ యుగమును
జెలువగు చుట్టములు ద్వివిధ శృంగాత్వంబుల్ 46

సీ॥ కల శాబ్ధి గంభీర కాంచనా చల ధీర
కాళి యోరగ వైరి కైటభారి
కైలాస పతి మిత్రి కౌశికస్తుతి పాత్ర
కిల్బిషాద్రి సురేంద్ర కీర్తి సాంద్ర
కీలాల రుహనాభ కృష్ణ జీమూతాభ
కృతవర్మతో నేఁగి కెలఁకులాఁగి
కెరలి చైద్యుఁడు సూడ గేకయుల్ గొనియాడఁ
గుండినేశుని పట్టిఁగూడ ముట్టి

తే॥ కూర్మి వలకేల సింగంపుఁ గొదమ లీలఁ
గొని శతాంగంబుపై నుంచి కోర్కెమించి

ద్వారకకు వచ్చు నీవై భవంబు బొగడ
శక్యమే యనఁ గాకు లక్ష్యంబు లయ్యె 47

43 పద్య వివ :— ప్రాణి, వర్గ, బిందు, తద్భవవ్యాజ, విశేష, అనుస్వారసంబంధ, అనునాసిక, మువిభక్తి, ముకార, మవర్ణ, ఋజు, ప్రత్యేక, భిన్న, ఏకతర, అభేద, అభేదవర్గ, ఊష్మ, సరస, సంయుక్త, అంతోష్మసంధి, వికల్పసంధి, యతుల్లని, హల్లుల యతు లిరువదియొక్క 21 విధమ్ములుగా మహాకవుల ప్రయోగములలో నున్నవి. వీనిలో ప్రాణి, మువిభక్తి, ప్రత్యేక, భిన్న, ఏకతర, సంయుక్త, అంతోష్మసంధి, వికల్పసంధి మున్నగునవి కొన్నికొన్నిటిలో నంతర్భూతములే (జాతిభేదశూన్యములు) యనియు, కొన్నివిశేషములు తెలుపు తలఁపుతో అప్పకవిచే ఇట్లు ప్రత్యేకింపబడి యుండుననియు ఆవిధమెల్ల నాయాచోట్ల వివరింపబడుననియు నెఱుంగునది.

ఆంధ్రశబ్దచింతామణిలో భట్టారకుఁడు సూ. "హలస్స్యుః సమాసతః ప్రాణినః" (సామాన్యముగా వ్యంజనములన్నియు ప్రాణిసంజ్ఞ కలవి) అని చెప్పుటచేతను పై సూత్రము తెనిగించుచు తానున్న "ఇలఁ బ్రాణులను పేర నే పారు హల్లులు," అని వ్రాయుటచేతను ఇక్కడ దానికి విరుద్ధముగా 'పొల్లుహల్లులను ప్రాణు లనఁగూడదు అనుటకు కావలయు) వ్రాయుటకు హేతువు కనబడదు అని కొందఱు విరుద్ధముగా విమర్శించిరి. కాని పరికింప నిక్కడ పూర్వోత్తర విరోధమేమియూ లేదు. సంస్కృత భాషలో హలంత పదములు పెక్కులు 'క్, గ్ మున్నగు పొల్లుహల్లులు చివరగలవి' గలవు. అందుచేతను పాణినీయమున హల్ ప్రత్యాహారమునందు అట్టి అజ్రహితములగు పొల్లు హల్లులకే గ్రహణ మగుట చేతను ఆసంస్కృతభాషలో హల్లులంటే పొల్లుహల్లులే ఐనను తెనుఁగుభాషలో పొల్లులతో గూడిన పదములు లేకపోవుట చేతను (ఎక్కడనేని కానవచ్చు వచ్చున్ కొడుకల్ మున్నగు వానిలోనివిన్ని అచ్చుపోగా మిగిలినవే) ధాతుప్రకృతులు పై తము

సంస్కృతములో వలె హలంతములు (పొల్లులు చివరగలవి) లేక అజంతములే (ప్రాణ్యంతములే' కొట్టు, తిట్టు మున్నగు రూపములతో నుండుటచేతను సంస్కృతములోని హలంతములు (పొల్లులు చివరగలవి) సైతము తత్సమ దశలో అజంతములే 'రుక్కు, వాక్కు మున్నగు విధముగా) అగుటచేతను ఈ తెనుఁగు భాషలో హల్లులనఁగా (సాధారణముగా) అజ్విశిష్టములే గ్రహించుకోవలెననియు, అట్టివానికే ప్రాణులనియును పేరనియు సంస్కృతములోని హల్లుల వంటివానిని (క్, గ్ మున్నగు పొల్లులను) తెలుపవలసినప్పుడు పొల్లులు (లేక) పొల్లు హల్లులు అని తెలుపవచ్చుననియు చింతామణి "ప్రాణాస్సమాసతోచః" అని అచ్చులకు ప్రాణ అను పేరుపెట్టి "హలస్స్యుస్స మాసతః ప్రాణినః" అని హల్లులకు ప్రాణి అని పేరుపెట్టుటచేత అది అన్వర్థకమై (ప్రాణ మనఁగా అచ్చు ఆదికలది ప్రాణి అని అర్థమును బోధించుచు) ఉండుట చేత అజ్విశిష్టములే తెనుఁగు భాషలో హల్లులనియుఁ బ్రాణులనియు వ్యవహరింపఁ బడుననను విషయము తప్పక గ్రహింపవలయుననియు సంస్కృతములోకన్న భిన్నముగా కొన్నివిషయములు గ్రహించుట కొరకుఁ తగాదు. 'పదమధ్యానుస్వారకు పరసవర్ణముచేయుక అనుస్వారతోడనే గ్రహించుట మున్నగురీతిగా' అదియెల్లరు నంగీకరించిరనియు ఇట్టి యభిప్రాయముతోనే అప్పకవి చింతామణి సూత్రమునకు తెనుగు నేయు సందర్భమున "ఇలఁ బ్రాణులను పేరనేపారు హల్లులు" అని హల్లు అను పదముతోడను ఇచ్చట "పొల్లుహల్లులనచ్చులుపొందకునికి" అని పొల్లుహల్లు అను పదముచేతను జాగ్రత్తగానే వాడుటచేత ఇక్కడ పూర్వోత్తర విరోధము 'స్వవచనవ్యాఘాతము) లేదనియు నెఱుంగునది.

45 పద్య వివ:—హల్లులుప్రాణులు ఏహల్లునకు ఆహల్లు విడివిడిగా కకారమునకు కకారమే, గకారమునకు గకారమే అనురీతిగా తనపై నుండు స్వరమున్ను (అచ్చున్ను)' రెండవదానిపై నుండు స్వరమున్ను 'అచ్చున్ను' వెనుక తెల్పబడినప్రకారము మైత్రిసరిపడిన వైనచో

యతికి గూర్పవచ్చుననియు అట్టిహల్లులు సైతము తమపై నుండు అచ్చులు మైత్రి సరిపడనివైనచో (ఒకటి క మఱియొకటిఅని, కి అనుమున్నగు రూపముగానున్నచో) యతికి చెల్లవనియు, ఇట్టి ఈయతికి ప్రాణియతియని పేరనియు తాత్పర్యము.

ముందు వర్గయతి మున్నగునవి చెప్పబడు చుండుటచేతను సవర్ణత్వాదులచేత వర్గీయాక్షరాదులకే అనగా క, ఖ, గ, ఘ, మున్నగువానికే (భిన్నవర్ణములకే) పరస్వరము మైత్రి చెల్లుచుండుట చేతను స్వ స్వవర్ణములకు (సజాతీయములకు అనగా కకారమునకు కకారము చకారమునకు చకారము మున్నగురీతి గలవానికి) పరస్పర మైత్రికై ముత్యన్యాయ సిద్ధమగుటచేతను పైనుండు అచ్చులమైత్రి సరిపడనిచో ఏ హల్లులకున్ను ఏయతియు చెల్లక పోవుటచేతను ఇట్లే యతి భిన్నముగా చెప్పుట అనవసరమేయనియు స్పష్టప్రతిపత్తికి మాత్రమే చెప్పబడియుండుననియు తోఁచుచున్నది.

ఇట్లే యతి వెనుక చెప్పబడినట్లు స్వరమైత్రి మూడువిధము లగుటచేత మూడువిధములై (క, కా, కై, కౌ అనునట్లు) అ, ఆ, ఐ, ఔ లతోఁగూడి ఒకవిధముగా ను(కి, కీ, కృ, కె, కే, అనురీతి) ఇ, ఈ, ఋ, ఎ, ఏలతోఁగూడి ఒకవిధముగాను (కు, కూ, కొ, కో, అను రీతి ఉ, ఊ, ఒ, ఓ లతోఁగూడి ఒకవిధముగాను మూడుప్రోవులై మూడు త్రికములై) ఏప్రోవున కాప్రోవు చెల్లుబడి యగుననియు నెఱుంగునది. (అనంతుడీ యతికి ప్రాణియతికి ఏపేరున్ను పెట్టక మిక్కిలి సంగ్రహ ముగా "కదియువడులు స్వరముకై వడి" అను పద్యముచే చెప్పినాడు.)

46 పద్య వివ:— తలకట్లున్= కకారాదులపై నుండు (అనగా విధింపఁబడు మైత్రిగల కకారాదులపై నుండు) అకారములున్ను ఆచాపులున్= అట్టివానిపై నుండు ఆకారములున్ను (అనగా ఆకార దీర్ఘములున్ను) ఐత్వౌత్వములున్= అట్టివానిపై నుండు ఐ, ఔలున్ను ఈనాల్గున్ను మైత్రిగలవనియు, (అట్లే గుడిగవయున్= అట్టిహల్లుల

పై నుండు ఇ, ఈలున్ను సుడిగవయున్ = అట్టిహల్లులపై నుండు ఋ, ౠలున్ను (అట్టివానిపై నుండు వటువ్రినుడులున్ను) ఏత్వయుగమున్ = అట్టి హల్లులపై నుండు ఏ, ఏలున్ను (ఈఆరున్ను షట్కము) పరస్పర మైత్రి గలవనియు, ద్వి విధ శృంగోత్వంబుల్ = (అట్టి హల్లుల మీది ఉ, ఊ, ఒ, ఓలున్ను (ఈనాల్గున్ను చతుష్కమున్ను) పరస్పరము మైత్రిగలవి అనియు, ఇట్లు ప్రాణి వర్ణముల పై నుండు అచ్చుల మైత్రి మూడు విధములని భావము.

"అ ద్వయమునకు" అను స్వర మైత్రి వళి లక్షణముచే నిది గతార్థమే యైనను కకారాదుల మీఁది స్వరములకు (అచ్చులకు) తలకట్టు మున్నగు ప్రత్యేక నామములుండుటచేత అట్టి కకారాదుల మీది అచ్చులకు మైత్రిలో భేదముండునేమో యను సందేహానివృత్తికి (కేవలములకున్ను కకారాదుల మీది యచ్చులకున్ను యతి మైత్రిలో తుల్యత్వమే గాని, అనగా కేవలములగు అకారాదులకు వలెనే తలకట్లు మున్నగు కకారాదుల మీది అచ్చులకున్ను యతి మైత్రిలో అభేదమే గాని భేదము లేదని తెల్పుటకే) ఇది యుపయోగించుచున్నది.

కొంగలి మతములో (కవిజనాశ్రయములో మ, య, ర, ల, వలు అనియు, కావ్యాలంకార చూడామణిలో మ, ఱ, ర, ల, వ, లు అనియు, ఛందో దర్పణములో మ, ర, ఱ, ళ, వ లు అనియు (ఎక్కటి యతిని గురించి) ఉండుటచే ల డ లకు అభేద యతి యును ప్రాసయును ఉండకూడదని కావలసి కొన్ని ప్రతులలో సుళి గవయు అని మార్పబడియున్నది. అప్పకవికి ల డ ప్రాసమిష్టమై యుండే చెప్ప బడుటచేతను మార్పు పాఠము కన్న ప్రకృత పాఠమే ఇచ్చటి యర్థము నందు రమణీయము సుప్రసిద్ధము నగుటచేతను ఇదియే గ్రహింపబడెను.

47 పద్య వివః—ఇందు కకారమును ప్రాణి సంబంధమగు త్రి విధ యతి మైత్రికిని లక్ష్యము లప్పకవిచే గల్పింపఁబడనవి. (అనగా 1 పా 2 పా. సగముచేతను క, కా, కై కౌల పరస్పర యతియు 2 పా.

తక్కిన సగముచేతను 3 పా. 4 పా. సగముచేతను కి, కీ, కృ, కె, కే ల యతియును (కృా అనునది సంస్కృతములో సైతమరుదని కావలయు చూపఁబడలేదు) 4 పా. తక్కిన సగముచేతను గీతములోని 1, 2 పా. లచేతను కు, కూ, కొ, కో అనువాని యతియు తెలుపబడినవి. ఇట్లే తక్కిన గ, ఘ మున్నగువానికిని లక్ష్యములు తెలుసుకోవచ్చును.

వర్గజ యతులు 9

ఆ॥ శబ్ద సూత్రములను జగతి నేకస్థాన
సంభవంబులగుచు సంధివేళఁ
గల సవర్ణ సంజ్ఞ దలపోసి యతులకుఁ
గూర్ప వచ్చు మఱియుఁ గొన్ని కృతుల 48

కం॥ తమ తమ యనునాసిక వ
ర్ణములు విడిచి వెనుక లిపులు నాల్గును దమలోఁ
దమకు[1]నర లేక నిలిచిన
యమరా హిత దమన వర్గ యతులనఁ బరఁగున్ 49

ఆ॥ కంధి మధ్య గేహ ఖండితారి సమూహ
ఖంజనాభ దేహ గాన మోహ
గరుడ పక్షి వాహ ఘన వాహజ స్నేహ
భర్గ వినుత యనిన వర్గ యతులు 50

వ. తక్కిన నాల్గు వర్గములకు ఈలాగున నే తెలిసి కొనునది.

48, 49 పద్య వివ:-వర్గయతులకు ఇవిలక్షణమును చెప్పుచున్నవి.

తా॥ సంస్కృత వ్యాకరణములోని అ, కు, హ విసర్జనీయానాం కణ్ఠః మున్నగు స్థాన నిర్ణయ వాక్యములచేతను (స్పృష్టం ప్రయతనం స్పర్శానాం అను ఆభ్యంతర ప్రయత్న నిర్ణయ వాక్యముచేతను) ఒకే స్థానమునందు (ఒకే ఆభ్యంతర ప్రయత్నముచేత) నుద్భవించిన వై (అట్టి వర్ణములు పద్యపాదములలో) కలసి యున్నప్పుడు (అనగా

1 నెరి (వా)

పాదాదిని యతి స్థలము వద్ద నున్నప్పుడు) వెనుక రీతిగా సిద్ధించిన సవర్ణ సంజ్ఞచేత కొన్ని (అట్టి వర్గీయాక్షరములలో పంచమాక్షరములు కాక తక్కినవి నాల్గేసి ఏ వర్గులోనివి ఆవర్గులో వానికి (పరస్పరము) యతి మైత్రికి చెల్లుబడి యగు ననియు ఇట్టి యతికి ఏకవర్గములో పరస్పరము చెల్లు యతి గావున నిది వర్గ యతి యనఁబడు ననియు భావము.

50 పద్య వివ :— అప్పకవిచే గల్పింపబడిన లక్ష్యము ఇందు మొదటి వర్గులోని క, ఖ, గ, ఘ అను) వానికి పరస్పర మైత్రి) కూర్చఁబడినది. చూపబడినది) అనఁగా 1వ పా. లో క, ఖ లకు 2వ పా. లో ఖ, గా లకు 3వ పా. లో గ, ఘ లకును, మొత్తము 4 పాదములలో క, ఖ, గ, ఘ అను ప్రథమ వర్గీయాక్షర మైత్రి) చూపఁ బడినది. మరియు ఏక వర్గీయము లకు న్ను స్వర మైత్రి) భేదముచే నేర్పడుచున్న మూఁడు విధములలో మొదటి దగు అకార యతిలో అ, ఆ, ఐ, ఔ లతో గూడిన క వర్గీయ యతి ప్రోవులో అ, ఆ లతో గూడిన క వర్గీయ యతి కే ఉదాహరణములు చూపబడినవనియు, తక్కిన ఐ, ఔ లతో గూడిన క వర్గీయ యతికిన్ని తక్కిన ద్వి విధములకును (ఇ, ఈ, ఋ, ఎ, ఏ లతో గూడిన క వర్గీయ యతి భేదము నకును ఉ, ఊ, ఒ, ఓ లతో గూడిన క వర్గీయ యతి భేదమునకును) ఉదాహరణము లూహ్యము లనియు, మరియు తక్కిన వర్గము లకును ఇట్టి భేదములచే మూఁడు విధములుగా (ఒక్కొక్క వర్గము నకున్ను) ఏర్పడుచున్న యతు లన్నియు నెఱుంగ వచ్చు ననియు భావము.

బిందు యతులు 10

క॥ పనిఁ బూని నిలుచుఁ దమ తమ
యనునాసిక ములకు బిందు యతు లన వెనుకన్
గనుపట్టు నాల్గు లిపు లును
వెను సున్నలు డాసి తమకుఁ బిఱుఁదఁ గదియుచోన్ 52

తే॥ జ్ఞాన వేద్యాయ తప్త కాంచన విభూష
ణాయ మేచక వర్ణ కంఠ ప్రియాయ
నగ ధరాయ నమోస్తు సౌందర్య విజిత
మనసి జాతాయ గోప డింభాయ యనఁగ 53

వివ :— పై దానిలో 'వర్గ యతిలో' మినహా యింప బడ్డ వర్గీయ పంచ మాక్షరములకు బిందు యతులు చెప్పఁబడుచున్నవి.

52, 53 పద్య:— 1 లక్షణ పద్యము, 2 లక్ష్య పద్యము అని యెఱుంగునది.

5 వర్గులలోను చివరవగు అనునాసిక వర్ణములకు (పంచమ వర్ణములగు ఙ, ఞ, ణ, న, మ, అను వానికి) పూర్వ వర్ణములగు నాల్గేసి వర్ణములకున్ను (క, ఖ, గ, ఘ, చ, ఛ, ఛ, జ, జ, ఝ, ట, ఠ, డ, ఢ, త, థ, ద, ధ, ప, ఫ, బ, భ అను ఐదు ప్రోవుల లోని వర్ణములకున్ను) పిఱుఁద = వెనుక 'పూర్వ భాగమందు అనఁగా వర్గులలో పూర్వ వర్ణములగు నాల్గేసి వర్ణములకు మాత్రము) పూర్ణ బిందువు (నిండు సున్న) అనుసరించి యున్నప్పుడు ఆపూర్వ వర్ణములగు ఇరువది రెండున్ను తమ తమ అనునాసికవర్ణములకు (పంచమ 'చివర' వర్ణములగు ఙ, ఞ, ణ, న, మ, అనువానికి) యతి మైత్రికిఁ గూర్పఁ దగినవి యగును. అనఁగా ఏవర్గులలోనివి ఆవర్గులలోని పంచమాక్షరము లకు (బిందు పూర్వకములై) యతులకు చెల్లుబడి యగును. ఇట్లు బిందు సంబంధముచేత చెల్లునది కనుక దీనికి బిందుయతి యని పేరు వచ్చెను.

మరియు నీవర్గీయ వర్ణములకున్ను పంచమ వర్ణములకున్ను వెనుక చెప్పినట్లు స్థాన ప్రయత్నైక్యముచేత సవర్ణత్వమున్నను (సదృశ ములైనను) పంచమ వర్ణములకు (ఞ, మ, ఙ, ణ, నానామ్ నాసికా చ అను వాక్యముచే) నాసికా స్థాన మెక్కువగా (అధికముగా) నుండు టచేత వానికి అట్టి నాసికాస్థానము కొఱవడిన (లేనట్టి) తక్కిన నాల్గేసి వర్ణ ములున్ను సదృశతమములు కానందుచేత (స్థానేంతరతమః = ప్రసంగము కలిగినప్పుడు అనఁగా సదృశములున్ను సదృశతమములున్ను ఉన్నప్పుడు

సదృశతమమే (మిక్కిలిసదృశమైనదే)ఆదేశమగును అను దానివలన సిద్ధించిన న్యాయముచేత మైత్రికి పనికిరాక అపూర్వవర్ణములకు పూర్ణబిందువు (నిండుసున్న) వెనుక (పూర్వ భాగమందు) ఉన్నట్లైతే ఆ పూర్ణబిందువుయొక్క సంబంధముచేత వానికి నాసికాస్థానమున్ను కలిగి (ఆ బిందువుయొక్క నాసికాస్థానము వానికిన్ని సంక్రమించి) అవియున్ను అనునాసికములై అనునాసికము లని నామాంతరము నొందిన పంచమ వర్ణములకు న్ను సదృశతమము లై పంచమ వర్ణములతో యతి మైత్రికి చెల్లుచు న్నవి (అర్హము లగు చున్నవి) కావున దీనికిట్టి ప్రత్యేకత అవసరమున్ను ఉచితము న్ను అగుచున్నది. అచ్చుల మైత్రి భేదముచే గలిగిన ఈయతి లోని భేదములు న్ను వెనుక వలెనే గ్రహించునది. ఈ యతి అనంతుఁడు అనుస్వార యతి అనునామముతో చెప్పినాడు అని యెఱుంగునది.

53 లక్ష్య పద్యములో 1వ పా (జ్ఞా) ఞా.....ంచ అను వానికిని 2వ పా. ణా...ంఠ అను వానికిని 3వ పా. న....ంద అనువానికిని 4వ పా. మ... ....ంభా అను వానికిని మైత్రి చెల్లుబడి యయ్యెను.

తద్భవ వ్యాజ విశ్రమములు 11

సీ॥ విజ్ఞాన మునకు భావింప విన్నాణంబు
విజ్ఞాపన మునకు విన్నపంబు
సంజ్ఞకు సన్న యజ్ఞ మునకు జన్నంబు
నాజ్ఞ ప్తి కానతి యాజ్ఞ కాన
యని యిట్లు సంస్కృత వ్యాహార మధ్యావ
సానంబుల ద్వితీయ సరళమునకు
నడుమునఁ గల తాలుజా నునాసికములు
తద్భవంబున ద్విత్వంబు గాంచి
తే॥ వెలయుటను తద్భవ వ్యాజ విశ్రమ మన
జరిగి న ణ లకు రెంటికి జ్ఞా తనర్చు

జ్ఞాని చేతోం బుజాత శోణకర యనఁగ
జ్ఞాతి విద్వేషి నృప నాశన కర యనఁగ　54

గణితము నందుఁ బావులూరి మల్లన్న :—

ఉ॥ శ్రీ నిధి యైన శివ్వన ను జిమ్మన నున్ మఱి సూర్య దేవునిన్
ధీ నిధిఁ బోల నార్యులను దేజమునన్ రవి తుల్యు లైన యా
సూనుల నల్వురం బడసె సూరి జన స్తుత సత్య భారతీ
జ్ఞానులఁ బద్మ గర్భ వదనంబులు నాలుగుఁ బోలె వారిలోన్ 55

54 పద్య వివ:— విజ్ఞాన విజ్ఞాపన సంజ్ఞ యజ్ఞ ఆజ్ఞప్తి ఆజ్ఞ మున్నగు సంస్కృత పదము లలో సంయుక్త మై యున్న జ్ఞ అను దాని లో రెండవది యగు ఞ అను నది న అను వర్ణముగా తద్భవావస్థలో మాఱు చుండుట అను సంబంధముచే (జ్ఞా కు) జ్ఞ అను వర్ణము నకు న, ణ అను వర్ణములు రెండున్ను ఇట్టి సంబంధముచే న అను నది యు ఇట్టి నకారముతో మైత్రి కలది యగుటచే (మిత్రుని మిత్రుడు తనకున్ను మిత్రుఁడే అను సంబంధముచే ణ అను నది యు యతి మైత్రికిఁ గూర్ప వచ్చును. (అనఁగా జ్ఞ న ణ లు పరస్పరము యతి మైత్రికి చెల్లుబడి యగును) పై రీతిగా నిదియు నవ్వర్థక నామ మని యెఱుంగునది. ఇందలి గీతములోని 3, 4 పాదములందు జ్ఞా...ణ లకును, జ్ఞా...న లకున్ను ఈ యతికి లక్ష్యములుగా మైత్రి కూర్పబడెను. ఈ పద్యములో గిడుగు వారి పీఠిక ప్రతిలో సైతము 3వ పా. లో "వ్యాహార" అను చోట వ్యవహార అనియు గీతము 1వ పా. లో "విశ్రమ మన" అను చోట విశ్రమమున అనియు ముద్రితము లై యున్నవి. వాని సాధుత్వము విమృశ్యము. (వ్యాహార = ఉక్తి, మాట, పలుకు) ఈ యతి ననంతుఁడు చెప్ప లేదు.

55 పద్యములో 4 వ పాదమందు జ్ఞా.......న అను వానికి యతి చెల్లెను.

విశేష వళులు 12

తే॥ ప్రౌఢ కవులు కొందఱు జ్ఞ కారంబు నకును
ప్రథమ వర్గంబు తొలి యక్కరములు నాల్గు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళుల నుచు సోమయాజులు వాడు కతన 56

శాంతి పర్వము నందు :—

క॥ జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశ విధిఁ బ్రకాశము సేయం
గా నది సకల ధరిత్రీ
దానంబునకంటె నధికతర ఫలద మగున్ (4, 255) 57

56 పద్య వివ:— శాంతిపర్వము 4వ ఆశ్వాసములో 255 పద్యములో 2 వ పాదమున జ్ఞా కా లకు యతి కూర్చె నను హేతువుచే కొందఱు మహాకవులే జ్ఞ, క, ఖ, గ, ఘ లకు విశేష వళి యను పేరుతో యతి మైత్రి కూర్తురని భావము. ఇక్కడ ప్రౌఢకవులు కొందఱు సోమయాజులు అను పదములచేత ఇట్టీ యతి తిక్కన గారు వాడుటకున్ను దాని ననుసరించి కొందఱ నుమతించుటకు న్నూ హేతువులేని ప్రౌఢత్వమే (స్వేచ్ఛా నువృత్తి శీలత యే) అని అప్పకవి యభిప్రాయము తోఁచు చున్న దనియు కొందఱు న్ను; కవు లెవ్వరు నీ యతిని వాడి నట్లు లేదు. అప్పకవియు నిది యొక్కటే ఉదాహరించెను. (తాను కల్పించియు వేఱొకటి యుదాహరింప లేదు) అందుచేత ఈతనికి గూడ ప్రయోగాంతరము దొరక నట్లే తోఁచును. ఇప్పటి ముద్రిత ప్రతులఁ బెక్కింటిలో జ్ఞానికి.....ప్రజనితము అని యుండెను. ప్రాచ్య లిఖిత పుస్తక భాండా గారమున పెక్కు తాళ పత్ర లిఖిత ప్రతులలోను ఈ పాఠమే సంవాదముగా నగపడు చున్నది. దానిం బట్టి ప్రకాశము అను పాఠముతో నున్న ప్రతి యేదేని యొక్కటి గాని అట్టి పాఠమే సంవాదముగా గల పెక్కు ప్రతులు గాని అప్ప కవికి లభించి యుండెనా లేక అప్పకవియే ఏ హేతువుచేత నేని స్వయముగా నీ యతిని కల్పించి దాని యుదాహరణ దార్ఢ్యమున కై తిక్కన గారి

పాఠము నిట్లు దిద్ద సాహసించె నా అనియు (లేక) ప్రయోగాంతరము లగపడకుండుట చేత పాఠకులును లేఖకులును ఈయతి నంగీకరింపక "ప్రజనితము" అని సవరించి యుందురా అనియు అందుచేత నిట్టి వికల్ప పరంపర కవకాశము కల్గు చుండె ననియు కొందఱు న్ను విమర్శించు చున్నారు. మరియుం గొందఱు "జ్ఞానికి.....ప్రచారము" అను పాఠ మున్న దనియు ననుచున్నారు.

వాస్తవము పరికింపఁగా జ్ఞ అను నది వ్యవహారములో కొన్ని పదములలో గ అను వర్ణముగా నుచ్చరింపబడుటయు, (సంజ్ఞ, సయిగ, సైగ, ప్రజ్ఞ+పగ్గె, పగ్గియ, జ్ఞాపకము+గేపకము మున్నగు రీతిగా) అని తద్భవ పదములుగా కొందఱచే గ్రంథములలో సైతము వాడ బడుటయు వెనుక చెప్పిన ప్రకారము తెఱచుగా యతి నియమము పాటింప బడు సామెతలలో సైతము సహజముగా "జ్ఞాతికి కళ్లల్లోను పాముకి పళ్లలోను విషముండును" అను రీతిగా జ్ఞా కు ను కకారమునకును గల సహజసంబంధ మగపడు చుండుటయు మరియు "జ్ఞానవంతులమ్మ గవిరెమ్మ మీారు" మున్నగు గ్రామ్య పదములలో గూడ జ్ఞా గాల స్వభావ సిద్ధ సంబంధ మగపడుటయు అన్నిటికన్న ముఖ్యముగా (లేఖనములో నగపడ కున్నను) ఉచ్చారణములో జ్ఞా అను వర్ణమందు ముందుగ (తొలు తొల్త) అనునాసికత్వముతో గ కారము వినఁబడు చుండుటయు కారణములుగా నీ యతి యావిర్భవించి యుండుననియు ఉచ్చారణములో గ అను నది జ్ఞాలో తగులు చుండుటచేత దానిలో గకారము గుప్త మై యున్నట్లంగీకరించియు పై కారణములబట్టి ఔచిత్య మెంచియు గకారమునకు మైత్రి గలిగిన వర్ణము లెల్ల జ్ఞాతో మైత్రికి పనికివచ్చునని యెంచియే తిక్కనగారు ఈ యతి యుక్తమనియే ఈ పద్యములో ఈ యతికి లక్ష్యముగా ప్రయోగించి యుందురనియు పైని చూపబడిన విధమెల్ల పరికింపక జ్ఞా లోని గకారోచ్చారణమును గ్రహింపకయు ఈ యతి నంగీకరింపక కొందఱట్లు పాఠాంతరములు

కల్పించి యుండురనియు అందుచేత పై వికల్ప పరంపరకు బనిలేదనియు పాఠాంతరములలో కన్న ప్రకృత పాఠములోనే అర్థ వైశద్యము మార్దవము ఔచిత్యము స్పష్టముగా స్ఫురించు చున్న వనియు కొన్ని వర్ణముల యుచ్చారణములో వర్ణాంతరములు వినబడుచున్నను అవి యిట్లు ప్రత్యేకముగా గ్రహింపబడక ఇక్కడ మాత్రమే విశేషించి గ్రహింపబడిన వర్ణముచేత నేర్పడినది గావున (లేక) లేఖనములో కాన రాకున్నను ఉచ్చారణములో విశేషించి వినబడు వర్ణము (గకారము) యొక్క ప్రాధాన్యముచే నేర్పడినది గావున దీనికి విశేష యతి యని పేరు వచ్చె నని యన్వర్థకతయు నూహింపవచ్చు ననియు ఈయతి యుక్తమే యనియు తోఁచు చున్నది. (ఇదియు అనంతుడు చెప్పనిదే)

57 పద్య:- ఇందు 2 వ పా. లో జ్ఞా.....కా లకు యతి చెల్లుబడి యగు చున్నది.

అనుస్వార సంబంధ యతులు 13

ఆ॥ ఆది పూర్ణ యుతము లై ట త వర్గా క్ష
రములు తుదను గలుగు వ్రాలు దక్కఁ
బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వార సం
బంధ యతులు నాఁ బ్రబంధములను 58

మనుచరిత్రమునందు:—

శా॥ శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయమున్
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలుఁ డీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్య క్షేత్రముల్ పెక్కు చం
దాలం బండు నొకప్పుడుం దఱుఁగ దింటన్ బాఁడియుం బంటయున్
(1, 55) 59

రావిపాటి తిప్పరాజు చాటుధార:—

మ॥ సరి బేసై రిపు డేల భాస్కరులు భాషా నాథ పుత్రా వసుం
ధర నంద్రొక్కఁడు మంత్రియయ్యె వినుకొండన్ రామయామాత్య భా

స్కారుఁ డో యశా నయితే సహస్రకర శాఖ ల్లే వడే యున్న వే
తిర మై దానము సేయుచో రిపుల హేతిన్ వ్రేయుచో వ్రాయుచో 60

ఆముక్త మాల్యద యందు:—

మ॥ దవ ధూమంపు తమంబులోఁ దమ రస ద్రవ్యంబు పంకేజ బాం
ధవ భాను ప్రతతుల్ హరింపఁ గుయి వెంటన్ వెళ్లు శూన్యోరు కూ
ప వితానంబుల జాడఁ జూడఁ బుడమిం బాటిల్లి పై విప్పులై
యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళిన్ రజశ్చక్రముల్
(2, 48) 61

58 పద్య వివ:— ట వర్గ త వర్గ వర్ణములలో చివర వర్ణము లగు ణ, న అను రెండు వర్ణములు తక్క తక్కిన నాల్గేసి వర్ణములు (ట ఠ డ ఢ, త థ ద ధ అను నవి యెన్మిదిన్ని) తమకు వెనుక (పిఱుంద పూర్వ భాగమందు) పూర్ణ బిందువులు (నిండు సున్నలు) కలిగినచో (ఉన్నప్పుడు) యతి మైత్రికి తగి యుండును. బిందు పూర్వకము లగు ట ఠ డ ఢ లు బిందు పూర్వము లగు త థ ద ధ లకును బిందు పూర్వము లగు త థ ద ధ లు బిందు పూర్వము లగు ట ఠ డ ఢ లకును అనఁగా బిందు పూర్వము లై యున్నప్పుడు ట ఠ డ ఢ త థ ద ధ లు యెన్మిదిన్ని పరస్పరము (ఒకదాని కొకటి) యతి మైత్రికి చెల్లుబడి యగును. అనుస్వార సంబంధముచే చెల్లు చున్నది గావున దీనికి అనుస్వార సంబంధ యతి అను పేరు సార్ధకమే. పై నుండు అచ్చుల మైత్రీ భేదముచే నిదియు మూఁడు విధములై యుండు నని వెనుక వలెనే యెఱుంగునది. సామాన్య నిర్దేశముగా నున్నప్పుడు (హల్లు అకారముతో మాత్రము నిర్దేశింప బడి నప్పుడు) హల్లు లన్నిటికిని ఇట్లే భేద త్రియ మెఱుంగునది.

సంస్కృత పదములలోను తెనుఁగు పదములలోను గలుగు బిందు పూర్వము లగు ట ఠ డ ఢ లు, ణకార పూర్వకములు గాను బిందు పూర్వకము లగు త థ ద ధ లు, న వర్ణ పూర్వకములు గాను

(ణకార నకార సంయుక్తములు గాను అనగా ట ఠ డ ఢ ల వెనుక నుండు పూర్ణ బిందువు ణకారము వలెను త థ ద ధ ల వెనుక నుండు పూర్ణ బిందువు నకారము వలెను) ఉచ్చారణములో వినఁబడు చుండుట చేతను తెనుఁగులో విధానము లేకుండుటచే మాఱక పోయినను సంస్కృతములో శాస్త్రవిధానముచేతనే ట ఠ డ ఢ ల వెనుక బిందువు ణకార రూపముగను, త థ ద ధ ల వెనుక బిందువు నకార రూపము గను తఱచుగా మాఱుచుండుట చేతను బిందు పూర్వక ట ఠ డ ఢ లు, ణకార సంయుక్తములున్న (సంస్కృత పదములలో) ణకార సంయుక్త తుల్యములున్న (తెనుఁగు పదాలలో) అట్టి త థ ద ధ లు నకార సంయుక్తములును (సంస్కృత పదములలో) నకార సంయుక్త తుల్యములును (తెనుఁగు పదాలలో) అగుటచేతను సంయుక్త వర్ణము లలోనే యొక దానికేని మైత్రి కుదిరినను చాలు నను వెనుక తెల్పబడిన నియమముచేతను, న ణ లకు ముందు చెప్పఁబడు నట్లు సరస యతి అను పేరుతో మైత్రి సిద్ధించుట చేతను, బిందు పూర్వకము లగు ట ఠ డ ఢ త థ ద ధ లకు మైత్రి సిద్ధించె నను హేతువుచే ఈయతి ఆవిర్భవించి నది. (అనగా పైని చెప్పబడిన తాత్పర్యానువాద మే ఈ యతిగా నేర్ప డెను) అనియు పై విషయమును అనుస్వార సంబంధ యతి యను పేరే స్పష్టపరుచు చున్నదనియు నెఱుంగునది.

మరియు గొందఱు అనితివి, అంతివి, అంటివి, అనుదురు, అందురు, అండు రు, మొదలగు పదముల ప్రక్రియలోని సాజాత్యమును బట్టియు ఈ యతి చెల్లుట సయుక్తికమే అన వచ్చు ననుచున్నారనియు నెఱుంగు నది. మరియు ట త, వర్గీయాంత్యములగు ణ న లు (తమకు) బిందు పూర్వక త్వము లేకుండఁ గనే త థ ద ధ లకు ను ట ఠ డ ఢ లకును మాత్రము బిందువు పూర్వమందు న్నప్పుడు త థ ద ధ లకును ట ఠ డ ఢ లకును (క్రమముగా) మైత్రికి తగినవై యుండుటచేత వాని కొఱకు ప్రత్యేకముగా ననునాసికా క్షర యతి చెప్పబడుచుండుట

యు క్తమె దీనిలో న ణలు పర్యాద స్తము లయ్యె (మినహాయింపబడ్డవి) అనియు నెఱుంగునది. ఇట్లుండ నవీనులు గొందఱు త థ ద ధ ట ఠ డ ఢ లలో దేని కేని యొక దానికి మాత్రము బిందువు వెనుక నున్న ప్పుడున్ను మరికొందఱు దేనికిన్ని (ఉభయమునకును) బిందువు వెనుక లేకుండగను యతి మైత్రి గూర్తురు. అప్పుడు అనుస్వార సంబంధము రెంటను గలిగి అన్వర్థకముగా చెల్లుచున్న ఈ యతికి ప్రస క్తి లేకుండుట చేతను, మరియే యతిలోను చేర్చుటకు సంబంధము హేతువు లేకుండుట చేతను, మహాకవుల ప్రయోగము లట్టివి కానరాకుండుటచేతను, ఈ నవీన సిద్ధాంత మగ్రాహ్య మని తోచు చున్నది అని కొంద ఱందురు. కాని డాయు దాయు, మున్నగు పదముల యభేద సంబంధ మీ నవీన మత మును మహాకవి ప్రయోగసిద్ధముగానే చెల్లించు నను మా యభిప్రా యము. ప్రాసల సంబంధములో ముందున్నూ తెలుపబడును. ఈయతి యొక్క బలమునకై మహాకవుల ప్రయోగములు చూపబడుచున్నవి.

59 పద్య:-ఇందు 4వపాదము మొదట ం దా అను దానికిని యతి స్థలమున ంట అను దానికిని మైత్రి చెల్లుటచే లక్షణ సమన్వయ మగు చున్నది.

60 పద్య తా॥ నారదుఁడు తండ్రి యగు బ్రహ్మను ఓ వాణీ మనోహరా సూర్యులు పన్నిద్దరు అని యుండగా నిప్పుడు పదునొకండ్రే యున్నా రేమి? (సరి సంఖ్య వారు బేసి సంఖ్య వారయి యున్నా రేమి?) అని యడుగ ఓ పుత్రా ఆ పన్నిద్దరిలో నొకండు పుడమిలో వినుకొండ యను నూరిలో మంత్రియై పుట్టినాఁడు అని చెప్ప మరల నారదుఁడు అతడు రామయామాత్యుని పుత్రుడగు భాస్కరమంత్రియా అని యడుగ ఔను అని బ్రహ్మ చెప్పెను. అట్లైనచో సూర్యున కుండవలసిన సహస్ర కరములు (కిరణము లనియు చేతులనియు శ్లేషచే రెంటికి నభేదము) లేవేమి అని నారదుడు ప్రశ్నింప లేకేమి అవిగో దానము చేయు నప్పుడును శత్రువులను ఖడ్గముతో నరకు నప్పుడును

వ్రాయునప్పుడున్ను ఆ సహస్ర కరత్వము చూపట్టుచునే యున్నది, చూడుము అని బ్రహ్మ చెప్పెను. అనగా భాస్కరమంత్రి సూర్య తేజశ్శక్తులు గల వాడనియు దానము చేయు నప్పుడు వేయి చేతులతో నిచ్చు చున్నట్లున్ను శత్రువులను నరకు నప్పుడు వేయి చేతులతో నరకు చున్నట్లున్ను వ్రాయు నప్పుడు వేయి చేతులతో వ్రాయు నట్లున్ను కానవచ్చునని భావము. ఇందు 2. వ పా. ంధ......ండ లకు మైత్రి చెల్లుచున్నది.

61 పద్య:– 2 వ పా. ంధ.........ంట లకు మైత్రి చెల్లినది. మరియు నిందు గిడుగు వారి పీఠిక ప్రతిలో సైతము 3 వ పా. స "కూప వితానంబులఁ జూడఁ జాడ" అని కాన వచ్చు చున్నది. అది లేఖక ప్రమాదమో ముద్రణ ప్రమాదమో కాక పరిష్కర్తల పాఠమే యైనచో దీని భావ మెట్లు బోధ పడెనో తజ్ఞు లరయుదురు గాక.

మద్గృహీత పాఠ భావము– సుడి గాలియందు దుమ్ము చక్రా కారముగా పైకెగయ దానిని కవి దావాగ్ని ధూమ మను చీకటిలో తమ (పాడు నూతుల) ఉదక మను ద్రవ్యమును సూర్యుని సంబంధు లగు (సూర్యునితో నెప్పుడును అవినా భావముగా నుండునవి గావున కిరణములు సూర్యుని బంధువులుగా చెప్పబడెను) కిరణములు దొంగి లింప (కొల్లవెట్ట వేసఁగిని నూతుల నీరు హరింపబడె ననుట) నీ బంధు వులు మా ద్రవ్యమును దోచుకొన్నారు, మా ద్రవ్యమును మాకిప్పింపవే యని మొత్తు వెట్టుచు సూర్యుని కడ కేగుచున్న పాడు నూతులో యను నట్లున్నవి అని యుత్ప్రేక్షించినాఁడు. చూడన్ = చూడగా (పరికింపఁగా) కూప వితానంబుల జాడన్ = కూప వితానముల రీతిగా (కూపవితానములో యున్నట్లు– జాడ అను నది ఉత్ప్రేక్షా వాచకము) రజశ్చక్రము లెగసెను అని యన్వయము. బ్రహ్మశ్రీ వావిళ్ళ రామ స్వామి శాస్త్రులవారి వ్యాఖ్యతో ఉన్న ప్రతిలో "కూప వితానం బన" అని యున్నది. అది హృద్యమే అయి యుండగా గిడుగు వారి పీఠిక

ప్రతిలో నెందుకు విపరీతము (ఉత్ప్రేక్ష స్వరూపమే లేనట్లు) గా మార్చ బడెనో విమృశ్యము.

మరి కొన్ని ప్రతులలో "కుయి వెట్టన్ వెళ్ళ్ళు" అని యున్నది. అందు అర్థ సౌకర్య మున్నది గాని అప్పకవి మతమునకు విరుద్ధము. (బిందువు వెనుక లేనిదే అప్పకవి మతమున నీయతి చెల్లదు గావున) అని యెఱుంగునది. (ఈ యతియు ననంతుఁడు చెప్పనిదే)

అనునాసి కాక్షర యతులు 14

---

తే॥ అల దు్రతంబునకును మధ్య మానునాసి
కమునకును జెల్లు ననునాసిక యతు లనఁగ
డాపలను బూర్ణములు గల్గు ఙ ఞ ణ న లును
త థ ద ధ లును గ్రమంబున దాన వారి 62

క॥ మను సంతతి మండన ఙం, ఢన నిర్జిత కార్తవీర్య నరనాయక ఖం
డన పక్షి స్యందన నం, దన చందన చక్రవారణ లస త్కీర్తీ 63

కిష్కింధా కాండమునందు :—

కం॥ బలవంతుఁ డైన వాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి త్వరతో నలుది
క్కులకుం బాఱె మహీ మం, డల మెల్లను జూచినాఁడ నాఁడు నరేంద్రా
(ప. 614)

రాజశేఖర చరిత్రమునందు:—

మ॥ కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాక వ్రాతముల్ పిండివం
టలు పాత్రేనియ జున్ను వెన్న యిఁడె యానాలుక్కెరల్ చక్కెరల్
ఫలముల్ పానకముల్ రసాయనము లంబళ్లూ రుబిండ్లూ రుగా
యలు బజ్జుల్ దధి పిండఖండములు నం దావిర్భవించెన్ వెసన్
(2, 127) 65

పరమయోగి విలాసమునందు :—

సీ॥ పా॥ నిగమ చోరకుని ఖండించిన యలంత మో
యబ్ధిలో గిరి మోచి నట్టి యలఁ తో (2,104) 66

67

చిత్రభారతమునందు:—

తే॥ నకుల సహదేవులార భండన పటిష్ఠు
లార సౌందర్య లక్ష్మీ కుమారులార
పోయితిరె మీరు నేడు నా పొందు విడిచి
యనుచు విలపించు నలుదిక్కు లాలకించు　　　　67

హరిశ్చంద్రోపాఖ్యానమునందు:—

సీ॥ పా. పల్లవా రుణ జటా పటల భారముతోడ
నవ్య పలాశ దండంబుతోడ　　　　(1—8　68

62 పద్య వివ:— న ణ లకు పూర్ణ బిందు పూర్వకములగు ట ఠ డ ఢ త థ ద ధ లకును యతి మైత్రి చెల్లును. బిందువు వెనుక గలిగిన ట ఠ డ ఢ లు నకారమునకును అట్టి త థ ద ధలు ణకారము నకును యతి మైత్రికి పనికివచ్చును. వెనుకటి యతిలో తెల్పబడిన హేతువులే (యుక్తులే) ఈ యతి యావిర్భావమునకును హేతువులనియు అనునాసికములకును అనునాసిక సంయుక్త తుల్యములకును చెల్లు నట్టిది గావున నిది అనునాసి కాక్షర యతి యయ్యెను (అన్వర్థక నామమే) అనియు నెఱుంగునది. (ఇదియు అనంతుని ఛందోదర్పణమున చెప్పబడలేదు.)

63 పద్య:-అప్పకవికల్పిత లక్ష్యము ఇందు 2 వ పా. ండ...లకున్ను 4 వ పా. ంద....ణలకున్ను యతి చెల్లినది కావున లక్షణ సమన్వయము.

64 పద్య:- 4 వ పా. ండ......నా లకు యతి చెల్లెను.

65 పద్య:- 2 వ పా. ంట....నా లకు యతి చెల్లెను.

66 పద్య:- 1 వ పా ని......ండి లకు మైత్రి చెల్లెను.

67 పద్య:- 1 వ పా. న.........ండ లకును 68 వ పద్య పా. 2 వ భాగమందు న.......ండ లకున్ను యతి మైత్రి చెల్లుచున్నది అనిలక్షణ లక్ష్య సమన్వయము.

ము విభక్తి యతులు 15

తే॥ పున్నపుంసక తత్సమంబుల కడపలఁ
దత్సమాంధ్ర దేశ్య శబ్దముల తుదలఁ
గదిసిన మకార శృంగముల్ కావ్యములను
బొసఁగు ము విభక్తి యతు లనఁ బు పు బు భు లను 69

తే॥ పుష్కరము సూక్ష్మ మధ్యమ ముగ నొనర్చె
ఫుల్ల పంకేరుహము వక్త్రముగ నొనర్చె
బొండు మల్లెలు దరహాసముగ నొనర్చె
భోజనృప కన్యకకు నిక్కముగ నజుండు 70

ఆది పర్వమునందు:—

క॥ ఎట్టి విశేష కులమ్మునఁ
బుట్టిన సదస ద్వివేకములు గలిగినఁ దాఁ
గట్టిన కర్మ ఫలంబులు
నెట్టన భోగింప కుండ నేర్తురె మనుజుల్ (5, 58) 71

69 పద్య వివ:— (అమహత్తులు) పుల్లింగములు నపుంసక లింగములు (మహత్తులు మహతులు = మహతీ వాచకములు) నపుంసక లింగములు నగు (వృక్షము, వనము, మిత్రము, కళత్రము మరియు నుప లక్షణచే స్త్రీలింగములలో కంధరము మొదలగు) నవి మరియు వాని విశేషణములగునట్టివియు నగు తత్సమ పదములందును అట్టి తత్సమ పదములతో (ము విభక్తి నొందుట అను ధర్మముచే) సమాన పదము లగు (నిక్కము, అందము, చందము మొదలగు) దేశ్య శబ్దములందును చివర (ము అను రూపముతో) కొమ్ములోఁ (శృంగముతో అనగా ఉకారముతో గూడిన మ వర్ణములు (విభక్తి ము) పు, ఫు, బు, భు లతో ఉ, ఊ, ఒ, ఓ లతోఁ గూడిన ప, ఫ, బ, భ లతో ము విభక్తి యతి యను పేరుతో యతి మైత్రి వడయును. మరియు నిక్కడ ఉపలక్షణచేత ఇట్టి వాని ప్రథమా బహువచనాదులలో ఆగమ

ముకారములును ఇట్లే చెల్లునవి (యదాగమాః అను పరిభాషయు ఈ యర్థమునకు సాధకము) అనఁగా ఉ, ఊ, ఒ, ఓ లతో గూడిన ప, ఫ బ, భ లు పూర్వభాగమునందు పూర్ణ బిందువుతో గూడ కుండఁగనే విభక్తి మువర్ణముతోడను ఆగమ ము వర్ణముతోడను మాత్రము యతి మైత్రి నొందు ననియు, కనుకనే దీనికి ము విభక్తి యతి యని పేరనియు తాత్పర్యము.

సరసము + రూపము, నిక్కము + జగము, సరసపురూపము, నిక్కపుజగము మున్నగు సమాస పదములలో ము విభక్తి పు అను వర్ణముగాను 'వనము' వనంబు మొదలగు రూపాంతరములలో విభక్తి ము వర్ణము బు అను వర్ణము గాను మాఱుచుండుట యను సంబంధముచే ఈ యతి యిట్లు పుట్టి యుండుననియు ఇట్లుమాఱుట విభక్తి ము వర్ణమునందే యుండుటచే విభక్తి మువర్ణమె నప్పుడే ఈ యతి చెల్లు ననియు ఈ యభిప్రాయము దీని పేరే ధ్రువ పఱుచు ననియు నెఱుంగునది.

70 పద్య వివ:— ఇందు 1, 2, 3, 4 పాదముల మొదట పు, ఫు, బొ, భో అను వానికిని 1, 2, 3, 4 పాదముల యతి స్థానములందు ము విభక్తికిని 1, 2, 3, పా. తత్సమ పద ము వర్ణము, 4వ పా. తత్సమాంధ్ర దేశ్య పదము వర్ణము (నిక్కము అను దానిలోనిది) యతి మైత్రికి చెల్లిన దనియు తక్కిన వానికి "పుడమిలో నర్జునుఁడు మిత్రము గద నీకు, పొలుపుగా రుక్మిణి కళత్రము గద నీకు, పొనఁగ వనమాల కంధరమున నురమ్యముగ ధరింతువు కృష్ణ న త్పుణ్య లభ్య" మొదలగు చోట ఉదాహరణము లెరుంగునది.

71 పద్య వివ:— ఇందు 2 వ పాదమున (పుట్టిన అను దాని) అను పు ... (విభక్తి) ము అను దానికి మైత్రికి చెల్లుచున్నది యని లక్ష్మణ సమ న్వయము—

## ముకార యతులు 16

క॥ హెచ్చరికను పు ఫు బు భు లకు
నచ్చపు మా కొమ్ము లే మహాకవు లాదిన్
మెచ్చులుగ నిలిపి రచ్చట
నచ్చటను ముకార యతు లటం చును గృతులన్ 72

వసంత విలాసమునందు:—

క॥ అత్తటి విట నాగరకులు
చిత్తమున వసంత కేళి చిగు రొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరుల తోడి బుట్టట కొమ్ముల్ 73

శ్రీరంగ మాహాత్మ్యమునందు:—

చ॥ పరిచరుఁ గాఁగ నేలె నిరపాయ చరిత్రునిఁ బాప కానన
స్ఫుర దురు వీతిహోత్రుని సముజ్జ్వల మేరు సమాన గాత్రునిన్
బరమ పవిత్రునిన్ ముని సుపర్వ పర స్తుతి పాత్రుని న్మనో
హర ఫల శేముషీ కబళి తాంబుజ మిత్రుని వాయు పుత్రునిన్ 74

హరిశ్చంద్ర కథయందు:—

ద్విపద॥ ముందు మీ రెఱిఁగిన భూత లాధీశు
లందు రాజ్యంబుఁ బో నాడి క్రిమ్మఱను 75

72 పద్య వివ:— ఉత్సాహముతో (స్వతంత్రులు గావున ఇష్టపడి) మహా కవులు కొందఱు విరళముగా (క్వాచిత్కముగా) ముకార యతి యను పేరు చెల్లు నట్లు పు, ఫు, బు, భు లకును (ఉ ఊ ఒ ఓ లతో గూడిన ప ఫ బ భ లకును) విభక్తి మువర్ణము కాక పోయినను కేవల ము వర్ణమునకు న్ను (ప్రకృతి స్థ ముకారమునకు న్ను) తమ గ్రంథముల యందు యతి మైత్రి కూర్చినారు కావున ఇట్లు న్ను యతి చెల్లుబడి యగుచున్నది అని భావము.

ఈ యతి నంగీకరించి నప్పుడు అప్పకవి "అచ్చపు మా కొమ్ములే" అని ము అను ఉకార విశిష్టమునకే అని అర్థము కలుగు నట్లు

లక్షణము చెప్పి అట్టి లక్ష్యము లే చూపినను) ఇట్టి మహాకవుల మరి కొన్ని లక్ష్యములను బట్టి అప్పకవి చెప్పిన "మా కొమ్ములే" అను నదిన్ని అతఁడు చూపిన లక్ష్యములున్ను ఉపలక్షణము లని యెంచి మూ, మొ, మో లున్ను గ్రహించు కో వలసియున్నది. అట్లు కానిచో "బొడ్డు పల్లెను గొడ్డేది మోసపోతి" (శ్రీనాథుఁడు), "మ్రొక్కులు గైకొను సమస్త భువనాధీశా" (ఛందో దర్పణము), "భూషణమ్ము లంద్రుఁడు మూఢజనులు" (ఆధునికము) మొదలగు ప్రయోగములకు సాధుత్వము లేక పోవును (మహాకవి ప్రయోగ వ్యాకోపము సంభవించును) అని యెఱుంగునది. కావున మొత్తము మీఁద ఉ, ఊ, ఒ, ఓ లతో గూడిన ప ఫ బ భ ల కెల్ల ఉ ఊ ఒ ఓ లతో గూడిన మకార మాత్రముతో నెల్ల యతి చెల్లుబడి యగు నని ఈముకార యతి తాత్పర్య మైయున్న దని యెఱుంగునది.

మఱి యు ఈ ముకార యతికి ము విభక్తి యతియే మూలము (కారణము) గాని సరి యైన మరొ క హేతువు లేద ని తోఁచును. (అనఁగా) పై యతిలో (ము విభక్తి యతిలో) తెల్పబడి నట్లు విభక్తి ము వర్ణము (కొన్ని యెడల) పు, బు అను వర్ణములు గా మాఱు చుండె నను యుక్తి చే (కారణముచే అనఁగా నిట్టి సంబంధము కలుగుటచే) నన్నయాది మహాకవు లెల్లరు (ఆది కవులు లేక పరమ ప్రామాణికు లగు కవులు) విభక్తి ము వర్ణమునకే పు, ఫు, బు, భు లతో మైత్రి కూర్చి రనియు (అట్లే వారి ప్రయోగము లెల్ల కాన వచ్చుచున్న వని యు) ఆ సంగతిని ము విభక్తి యతి యను నామ మే తెల్పుచున్న దనియు ఆయుక్తిని ఆ పేరును ఆ ప్రయోగములను సరిగా గ్రహించక గాని లేక అవి యెల్ల (స్వతంత్రులుగావున) పాటించక గాని కొందఱు మహా కవులే విభక్తి ము వర్ణమునకు చెల్లగా తక్కిన ము వర్ణ మాత్రమునకు ను తత్సజాతీయ ములకు ను (మూ, మొ, మో లకును) మాత్రి మేల చెల్ల రాదు అని యెంచి ఉ, ఊ ఒ, ఓ లతో గూడిన మ వర్ణమున కెల్ల

ఉ, ఊ ఒ, ఓలతో గూడిన ప, ఫ, బ, భ లతోడ నెల్ల (బిందు పూర్వ కత్వము లేకుండగనే) యతి మైత్రి విరళముగా కూర్చి యుందు రనియు ఇట్లే యతి క్రమముగా అనఁగా మొదట ము విభ క్తి యతియు దానిని బట్టి తరువాత ము కార యతియు నావిర్భవించి యుండుననియు నన్న యాది మహా కవుల గ్రంథములలో నెచ్చట నేని ఈ యతి కాన రాదనియు, అప్పకవీ గూడ మిక్కిలి ప్రసిద్ధి లేని లక్ష్యములనే ఈ యతికి చూపుటచేత ఆతనికిని ప్రాచీన సుప్రసిద్ధ మహా కవి లక్ష్యము లేవియు దొరక లేదనియే యెంచవలసి యున్న దనియు కొందఱు విమర్శింతురు. (అప్పకవి చూప కున్న నేమి ఈ యతి కిన్ని ఆది కవుల ప్రయోగము లున్నూ పెక్కు లున్నవి. అందు గొన్ని పీఠిక చూపును. దీనికిని క్రమ మిట్లు తోఁచుచున్నది.) కొంతకాలము ము విభ క్తి యతియే వాడబడి తరువాత విరళముగా నేని ముకార యతియు కొందఱు మహా కవులచేతనే వాడబడి యుండుట చేతనే ముఖిభ క్తి యతి ముకార యతి అని విభాగ మేర్పడిన దనియు, అట్లు కాక మొదటి నుండియు ఈ యతి (ముకార యతి) వాడబడినచో దీని విశేషమే యగు ము విభ క్తి యతి యిట్లు విభాగముగా నేర్పడుట యసంభవము. (కారణము లేనిది అనగా ప్రయోజనము లేనిది) అనియు ముకార యతిచే ముఖిభ క్తి యతియు సిద్ధించి గతార్థమే యగు ననియు, ఇట్లే యతుల ఉత్ప త్తి క్రమమును తెల్పుటకే ఈ విభాగము చేసినా డనియు, ఎట్లైన నేమి (క్వాచిత్కముగా నేని క్రమ క్రమముగా నేని) మహా కవులే ఈ యతియు వాడి యుండుటచే అవశ్య గ్రాహ్యమై ఈ యతి పుట్టిన పిమ్మట ముఖిభ క్తి యతి అనవసరమే యనియు, ఇప్పటి మహా కవులును నిరాఘాటముగా బహుళముగా నీ యతిని వాడుచునే యున్నారనియు, అనంతుఁడు పోలిక వడి యను పేరుతో (కేవల ముఖర్ణము విభ క్తిముఖర్ణము అను మాట లె త్తక సామాన్యముగా "ముకారముగ" అని మాత్రము) చెప్పి ఉదాహరణము మాత్రము విభ క్తి ముఖర్ణముతో గూడినదే, "సరో

రుహములు" అని చూపినాఁడు. కావున అనంతుడు చెప్పినది ముకార యతి యా మువిభక్తి యతి యా లేక రెంటికి సమాన గ్రహణమా అని సందిగ్ధముగా నున్నది. ఎట్లైన నొక్కటియే కాని రెండుమాత్రము చెప్ప లేదు అని మాత్రము ధ్రువ మగుచున్నది అనియు నెఱుంగునది. (పేరు చేత మాత్రము ఇదివరకే విభక్తి ము యతి సిద్ధించి నట్లున్న దాని పోలి కచే నీ యతి తాను చెప్పినట్లున్న మాకు స్ఫురించుచున్నది.)

73 పద్య వివ:— ఇందు 4 వ పా. (ముత్తెపు అను దాని మొదటి దగు ప్రకృతిస్థ మగు) ము అను దానికిని బు అను దానికిని యతి చెల్లిన దనియు, 74 వ పద్య. 2 వ పా. (స్ఫుర దురు అను దానిలోని) ఫు అను దానికిని (సముజ్జ్వల అను దానిలోని కేవల) ము కారమునకును యతి చెల్లినదనియు, 75 వ పద్య. 1 వ పా. (ముందు అను దాని) ము కారము నకును (భూతలా అను దాని) భూ అను దానికిని యతి చెల్లినద నియు లక్షణ సమన్వయము.

మ వర్ణ విరామములు 17

సీ॥ మర్దిత దైత్య సంయమి మనోబ్జాదిత్య
మహిత మేఘాభ సంరక్షితేభ
మాయాప్రవర్తి సంలబ్ధ నిర్మల కీర్తి
మణిహార సురవశంవద విహార
మందర ధైర్య వంశీ నినాద చాతుర్య
మాభూప యువతి పుంష ండ రూప
మంజుల స్వాంత కంస ధరావర కృతాంత
స్మరహరారాధ్య సింహ నిభ మధ్య
తే॥ యనుచుఁ జరమాను నాసికంబునకు నిట్లు
గ్రాలుఁ గృతుల మవర్ణ విరామము లన
దండి సున్నలు దాపల నుండె నేని
పెలుచ నంతస్థములు నూష్మములును గృష్ణ 76

భీమన చాటుధార:—

చ. గరళపుముద్ద లోహ మవగాఢ మహోశని కోట్లు సమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోఱలు పట్టుకార్లు ది
క్కరటి శిరమ్ము దాయి లయకాలుఁడు కమ్మరి వైరి వీర సం
హరణ గుణాభిరాముఁడగు మైలము భీమన ఖడ్గ సృష్టికిన్ 77

అనంతుని ఛందమునందు:—

తే॥ య ర ల వ లు శ ష స హ లును నాది బిందు
యుతము లై మకార విరామ యుక్తి దనరు
మారుతాత్మజుఁ డరిది సంయమి యనంగ
మదన జనకుఁడు దనుజ సంహరుఁ డనఁగ (1,117—) 78

76 పద్య వివ:— ఇందు మొదటి సీస పాదములు నాల్గున్ను లక్ష్యములుగను గీత పాదములు లక్షణముగను కూర్పబడినవి.

ఇందు సీసపాదములు నాల్గింటిలోను (క్రింద అడ్డు గీటు గీయఁబడిన చోట్ల) కూర్పఁబడినట్లు చరమానునాసికమునకు (అనఁగా అనునాసిక వర్ణములనఁబడు ఙ, ఞ, ణ, న, మ అనువానిలో కట్టకడపటిదగు మ అను వర్ణమునకు) పెద్ద సున్నలు (పూర్ణానుస్వారములు) వెనుక గల (పూర్వమందుగల) అంతస్థ వర్ణములనుపేరుగల య ర ల వ లున్ను ఊష్మ వర్ణములను పేరుగల శ ష స హ లున్ను (బిందు పూర్వకములగు య ర ల వ శ ష స హ అను నెన్మిది వర్ణములు న్ను అనగా వీనిలో నేవి యైనను) యతి మైత్రికి గూర్ప వచ్చు ననియు దీనికి మవర్ణ విరామ మని పేరనియు భావము.

ఇందు సీస పాదములు నాల్గింటి మొదటి వర్ణములును ఆ నాల్గింటి అయిదవ గణముల మొదటి వర్ణములు నగు మవర్ణములకు (మకారములకు) వాని యతి స్థలములందు క్రమముగా బిందు పూర్వకములగు ంయ, ంర ంల, ంవ, ంశ, ంష, ంస, ంహ అనునవి యతిమైత్రికి గూర్పఁబడుటచే నిది మవర్ణ విరామమున కుదాహరణ మగుచున్నది.

మఱియు సంస్కృతమందుఁ గొన్ని చోట్ల మ, న అనునవి (మకార నకారములు అనఁగా మ్, న్ అను హల్లులు) రెండున్ను (ఏదియైనను) అనుస్వార రూపమును బొందుచుండినను (సాధారణముగా సంస్కృత పదములలోని అనుస్వారము లెల్లను మకార నకారముల వల్ల నేర్పడినవి యే యైనను) అందు బహుళముగా (పెక్కులు) మకారమువలన నేర్పడినవే (మకార స్థానమున వచ్చినవే) యుండుటచేతను (మోనుస్వారః, నశ్చాపదాంతస్యఝలి అను సూత్రద్వయముచే విధింపబడినవి) అట్టి అనుస్వారము పూర్వ భాగమందు న్నప్పుడు (య ర ల వ శ ష స హ లకు వెనుక నున్నప్పుడు) మకార శ్రుతి యుండుట చేతను (అనఁగా అనుస్వారమునకు పరముగా హల్లు ఉన్నప్పుడు దాని ప్రతిబంధమున "సంయమి" ఇత్యాదులలోని అనుస్వారము మకారము వలెనే వినఁబడుట స్వభావ సిద్ధము గావునను) మఱియు "సింహ" మున్నగు వానియందు వలె నకారమునకు వచ్చిన అనుస్వారము సైతము మకారము వలెనే వినఁబడుట సహజమై యుండుటచేతను (అనఁగా హల్లునకుఁ బూర్వ భాగమున నున్నప్పుడు అనుస్వారకు సైతము నాసికా స్థానోచ్చారణకన్న ఓష్ఠ స్థానోచ్చారణమే సుకరమై (సహజమై) నాసికా స్థానో చ్చారణ కష్ట సాధ్య మగుటచేతను (సహజము కాక పోవుటచేతను) ఎల్లెడ నుండు అనుస్వారము మకారాత్మకమే (మకారాత్మకము మకార తుల్యము) అగుటచేతను అట్టి అనుస్వారముతో గూడిన వర్ణము (పర వర్ణము) మకార సంయుక్తము వంటిదే యగుటచేతను సంయుక్తములో నేదానికైన నొకదానికి మైత్రి కుదిరినను చెల్లుబడి యగుటచేతను ఈయతి పుట్టి యుండుననియు ఇది సయుక్తికమే (కారణముతో గూడినదే) యగుచుండెననియు ఇట్టి సంస్కృత పదములలోని యాచారమే తెనుఁగు పదములలోనికిని మకార నకారాన్యతర స్థానీయము గాకుండా సహజముగా పుట్టుకలోనే ఏర్పడిన అనుస్వారముతో గూడిన తెనుఁగు పదములలోనికిని ఈయతి వచ్చియుండును.

తెనుఁగు పదములలోని బిందువునకు నకార మకార స్థానికత్వమును తెల్పు విధానము లేకపోయినను అట్టి అనుస్వారమునకు పరసవర్ణ రూపమునొందు విధానము లేకపోయినను లేఖనములో నెక్కడను ఇట్టి చోట్ల అనునాసికములగు వర్గీయ పంచమాక్షర సంయుక్త రూపములు కాన రాకున్నను అనుస్వారకు మకారోచ్చారణము (మకార శ్రుతి) మాత్రము సహజమై యుండుటచేత తెనుఁగు పదములలో సైత మీయతికి మిక్కిలి అవకాశము హేతువు నున్నది. అందుచేతనే వానియందును చెల్లుచున్నది అనియు తోఁచుచున్నది.

మరియు అట్లైనచో బిందు పూర్వకములగు కొన్ని స్పర్శ వర్ణములున్ను ఇట్టి వే యగుటచేత వానియెడ నీయతి ఏల చెల్లదు అని ఆశంక వచ్చుచున్నను దానికి స్పర్శ వర్ణములలో కొన్నిటికి (వర్గీయములలో మొదటి నాల్గేసి వర్ణములకు) వెనుకనుండు అనుస్వారకు పరసవర్ణ విధానముండుటచేతను అనుస్వారకు పరములగు వర్గీయములలోని మొదటి నాల్గేసి వర్ణములకును తమ తమ యనునాసికములతో (యుక్తమై) బిందుయతి పుట్టి యుండుటచేతను ఆవర్గీయములలో పవర్గీయములు గాక తక్కిన వానికి మకారేతర స్వ స్వ పంచమాక్షర శ్రుతియు సహజమై యుండుటచేతను, ఈయతిలో నవి పాల్గొనకుండుట యుక్తమే యని సమాధానము గలదనియు ఇట్లు మకారమునకే చెల్లు యతి గావున నిది యన్వర్థమే యనియు నెఱుంగునది.

మఱియు నిట్టి చోట్ల మవర్ణము అనురీతిగా సామాన్యముగా అకారముతో హల్వర్ణ నిర్దేశము చేయబడినప్పుడు (అకారముచ్చారణార్థమై) ఆ యా హల్ జాతి కంతకును గ్రహణమగును. కావున (ప అచ్చులతో గూడిన హల్లుల కైనను చెల్లును గావున) ఇక్కడ గూడ మత్వ జాతి కంతకును గ్రహణము కలిగి అచ్చుల మైత్రి కుదిరినప్పుడు మత్వ జాతి కంతకును ఈ యతి చెల్లుటకు ప్రతిబంధము లేదనియు అందుచేత ఉదాహరణము లొక్క అ, ఆ, ఐ, ఔ లతో గూడిన మకారమునకు

మాత్రమే చెల్లునవి చూపబడినను తక్కిన ఇకారాదులతో గూడిన మకారమునకును ఉదాహరణము లూహించుకో వచ్చుననియు నెఱుంగు నది. ఇక్కడ మవర్ణ యతి అనుపేరులోను మకారము జాతి పరమే యనియు ఇట్టి పూర్వోత్తర యతులయందెల్ల నిట్లే యనియు మరియొక రీతిగా (ముకార యతి మున్నగువానిలో వలె ఉకారాదులతో విశేష నిర్దిష్టమైనప్పుడు వ్యక్తి పరమై (జాతిపరము కాక) నిర్దిష్టమగు అచ్చునకు మైత్రిగల అచ్చులతో గూడినప్పుడే అది చెల్లు ననియు మువిభక్తి యతిలో మరియు విశేష నిర్దిష్ట మగుటచేత విభక్తి మువర్ణమందే చెల్లు ననియు నెఱుంగునది.

77 పద్య. 4 వ పా. ంహ..మై అనువానికిని, 78 వ పద్య. 3 వ పా. మా... ంయ లకును, 4 వ పా. మ... ంహా లకును యతి మైత్రి చెల్లుటచే లక్షణ సమన్వయము.

77 వ పద్యమునందు సంహరణ గుణాభిరాముఁడగు నైలము 'ఐలము' భీమన అను పాఠాంతరము గలదని కొందఅనుచున్నారు. ఇందే గిడుగువారి ప్రతిలో "కోరలు" అని లఘురకారముతో నున్నది.

మరియు ఎందుచేతనో అప్పకవి ఈయతికిని ప్రామాణిక గ్రంథ ప్రయోగములు చూపలేదు. చూపినవానిలో భీమన చాటుధారలో పాఠాంతర ముండుటచేత అది యంత ప్రయోజనకారి కాకుండెను. తక్కినది లక్ష్యమునకే అనంతునిచే గల్పితముగావున అదియు నట్టిదే యగుచు న్నది. అనంతుఁడును మరియొక మహాకవి లక్ష్యము చూపలేదు అనియు నెఱుంగునది. (చెల్లవలసిన హేతువులున్నను ఇది అంత ప్రసిద్ధముగా తోచదనుట)

ఋ జు యతులు 18

తే॥ మొదలి యంతస్థ వర్ణంబు తుదిని బొదలు
నూష్మమును ఋజు సంజ్ఞచే నొకటి కొకటి
యతులగు నపార శూర సంహార యనఁగ
హార ముఖార్చిత పాద తోయజ యనంగ 79

79 పద్య వివ:- 1,2 పా. లు లక్షణము 3,4 పాదములు లక్ష్యము ఋజు యతి యను నామముతో యకార హకారములు యతి మైత్రికి పరస్పరము చెల్లుబడి యగును. 3వ పా. న య హో అను వానికిని 4 వ పా. న హాయ లకును యతి కూర్చబడుటచే లక్షణ సమన్వయ మయ్యెను. హాయలకు యతి మైత్రి సరళముగా నుండుటచేత దీనికి ఋజు యతి యను వచ్చియుండు నని కొందఱందురు. ఈ యతి మిక్కిలి ప్రసిద్ధమే గావున మహాకవి లక్ష్యములు చూప నవసరము లేక పోయెను.

మఱియు నిందు "మొదలి యంతస్థ వర్ణంబు" అనియు "తుదిని బొదలు నూష్మము" అనియు యహాలను సామాన్యముగా అకారముతో నిర్దేశించుటచేత హాయ లెట్టి అచ్చుతో గూడిన నైనను పై నుండు అజ్మైత్రి ననుసరించి అన్నిటికి అ, ఆ, ఐ, ఔ లతో గూడిన హాయలు మాత్రమే కాక తక్కిన ఇ, ఈ, ఋ, ఎ, ఏ, లతో గూడిన హాయలకు పరస్పరమునకును ఉ, ఊ ఒ, ఓ లతో గూడిన హాయలు పరస్పరమున కును చెల్ల వచ్చునని వెనుక నే తెల్పఁబడిన భావము గ్రహించ వలసి యున్నది. అట్లు కాక అప్పకవి చూపిన ఉదాహరణమును మాత్ర మను సరించి అత్వ మైత్రి చెల్లు అచ్చులతో గూడిన హాయలు మాత్రమే గ్రహింప బడినచో మిక్కిలి ప్రయోగ వ్యాకోపము, లక్ష్య విరోధము, కలుగును. కావున పై ని చెప్పి నట్లే గ్రహించ వలయు ననియు మఱియు సరస యతిలోను ఇట్లే గ్రహింప వలయును. గావున (చూ- సరస యతి) అ, య, హ లు పరస్పరము యతి మైత్రి నొందునని చెప్పుట యుక్త మనియు ఇట్లు అప్పకవి యతి ద్వయము చెప్పుట గౌరవాధాయకమై ప్రాచీ నానుసరణ మాత్ర మగుట కన్న ప్రయోజనకారి కాదనియు నెఱుం గునది.

మరియు తద్భవ ప్రక్రియలో య, హ ల పై నుండు అచ్చులు మిగిలి య,హలు లోపించుట (హరితాళము = అరిదళము, యుగము = ఉగము, హంస = అంచ, హిమము = ఇమము, ఇవము మున్నగు

వానిలో) సహజము గావున యతి విషయమున తెనుఁగులో నెల్ల పదము లలో నుండు హ యలలోని పొల్లులగు హ్ య్ అను రూపములకు అవిద్యమాన వద్భావము వచ్చి (ఉన్నను లేని యట్టివై) అచ్చులకు మాత్రమే మైత్రిగల వర్ణములెల్ల పరస్పర మైత్రి నొందునని చెప్పుట యుక్తి యుక్తమై యుండును. ఇట్లు చెప్పినచో ఋజు యతి సరస యతి యను విభాగ మక్కరలేక (సరస యతిలో అహాయలు చేర నక్కర లేక) యతి ద్వయ కల్పనా గౌరవ దోషము లేక సర్వ లక్ష్య సిద్ధి సౌకర్య ము గలుగును. అట్లు కానిచో గౌరవాదులట్లుండ "ఎల్ల సురలకు నీ యంత హితుఁడు గలుగ"-వసు. 3వ ఆ.8 వ పద్య., "హిత సుమనో మనోరథము లెల్ల ఘటింపగ జాలు"-వసు.3వఆ.9 వ పద్య., "హిత మెఱుంగవు నీవనూ యిరుఁడ వెపుడు", "ఇపుడు నీకోర్కె నే ఘటియింతు ననుచు", "ఎపుడు నీ విట్టులగుట నూహింప నైతి" మున్నగు ప్రయోగములును, "ఎదను లచ్చిని ధరియించె ననఁగ" మున్నగు అప్పకవి ప్రయోగములును సరసముగా సాధువులు కావు. ఇట్లుండ అప్పకవి అకార విశిష్ట య హల యతి మాత్రమే ఋజు యతి యన్నట్లు లక్ష్యములు చూపుటయు య హలకు అకారముతో చెల్లునప్పుడు మాత్రమే సరస యతి యను నట్లు లక్ష్య మిచ్చుటయు దోష యుక్త మగుటచే యుక్తముగా లేదనియు కొందఱు వక్కాణింతురు. (మా వివరణము దోషమును వారించి యే యున్నది.)

ప్రత్యేక యతులు 19

తే॥ ఉత్తర పదాద్య లిపి లోప మొదవ కుండు
తఱిని బ్రత్యేక యతి నాఁగఁ దనరు చుండు
నరయ శార్ఙ్గంబు హరిచేతి యదియు నాఁగ
దివ్య చాపంబు శూలి చేతిది యనంగ 80

80 పద్య వివ:- 1, 2 పా. లు లక్షణము, 3, 4 పా. లు క్రమముగా ఉదాహరణ ప్రత్యుదాహరణములు.

ఉత్తర పదము (సమాస చరమావయవము) లోని మొదటి వర్ణమునకు

(అనగా చేతియొక్క + అది - చేతియది, చేతియొక్క + అది - చేతిది మున్నగు సమాస పదములలో ఉత్తర పదమగు అది అను తచ్ఛబ్దార్థక పదము యొక్క మొదటి వర్ణమగు అ అను దానికి సూ. "శబ్దాత్తచ్ఛబ్దాతః" = (తెనుఁగులో తచ్ఛబ్దముయొక్క అర్థముగల అది అను శబ్దములోని అకారమునకు వికల్పముగా లోపము వచ్చును అను దానిచే లోపము వికల్పము గావున లోపము రాక చేతియది మున్నగు రూపముతో నున్నప్పుడు అట్టి అది శబ్దములో కానవచ్చు చున్న అకారమునకు మైత్రి గల వర్ణములు యతి మైత్రికి కూర్చబడి నప్పుడు (ప్రత్యేకముగా అనగా లోపము నొందక కానవచ్చు చున్న దానికి చెల్లు యతి కావున) దానికి ప్రత్యేక యతి యని పేరనియు అట్లు కాక లోపము వచ్చి (చేతి + అది) చేతిది మున్నగు విధముగా నేర్పడు నప్పుడు లోపించిన అకారమునకు చెల్లక పూర్వ పదములోని చివర నుండు తి మొదలగు దానికి (ప్రాణికి) యతి మైత్రి చెల్లినచో (కూర్చ బడి నప్పుడు) అది ప్రత్యేక యతి కాదనియు భావము గ్రహించ వలసినది.

ఈ 80 వ పద్యములో మూడవ పాదమున యతి చోట (చేతి + అది) చేతియది అను దాని లోని అ అను దానికిని పాదాదిని అరయ అను దాని మొదటిదగు అ అను దానికిని మైత్రి కూర్పబడుటచే ఇది ప్రత్యేక యతి గావున నుదాహరణ మనియు నాల్గవ పాదములో యతి దగ్గర (చేతి + అది) చేతిది అను దానిలో లోపించిన అకారమునకు మైత్రి కూర్పక పూర్వపదాంత్య వర్ణమగు తి అనుదానికి మైత్రి గలది అను నది పాదాదిని కూర్చబడినది గావున నిదిప్రత్యేక యతి కాక పోవుటచే ప్రత్యుదాహరణ మనియు లక్షణ సమన్వయము.

ఇట్టి యతి ప్రత్యేకముగా చెప్పఁబడినను దీనితాత్పర్యము ఇట్టి చోట్ల (చేతి + అది_చేతిది మున్నగు పదములలో) అది అను ఉత్తరపదము మొదలి వర్ణము (అ అనునది) పైని చెప్పిన సూత్ర ప్రకారము లోపించి నప్పుడు ఆ లోపించిన వర్ణముయొక్క శ్రుతి (వినికి) కూడ ఉచ్చా

రణలో పై తము లేక పోవుట చేత (కావలయు) ఆ లోపించిన వర్ణమును బట్టి స్వర ప్రధాన యతి (అకారమునకు మైత్రిగల వర్ణములెల్ల యతి మైత్రి చెల్లదనియు (కూర్చ గూడదనియు) వెనుక చెప్పినట్లు ప్రాణి యతి మాత్రమే చెల్లు ననియు చెప్పుటయే అని మాత్రము గ్రహించవలసి యున్నది. అంతియు కాని అప్పకవి (మున్నగువారు) చెప్పినట్లు ఇది యొక ప్రత్యేక యతిగా చెప్పుట కవసరము కానరాదు. సహజముగానే చేతిది మున్నగు చోట్ల తి మున్నగువాని ప్రాణి యతియు, చేతియది మున్నగు చోట్ల అకార యతియు ఎవ్వరూ చెప్ప నక్కర లేకయే సిద్ధించు ననియు ఇట్టి చోట్ల లోపించన అకారమునకు మాత్రము (గూఢ స్వర యతి మాత్రమేని) చెల్లుట ఇష్టమై నప్పుడును (చేతిది) మున్నగు రూపములోనే అకార యతియు (స్వరప్రధాన యతియు) తి మున్నగువాని (ప్రాణి) యతియు రెండున్ను అనగా ఉభయ యతి చెల్లుట యేని యిష్టమైన ప్పుడును గూఢ స్వర యతి యప గాని ఉభయ యతులలో నిదియు నొక భేదముగా గాని చెప్పుట మాత్రము సమంజసము గాని అట్లు ఎంత మాత్రము ఇష్టము లేనప్పుడు ఎట్లును ఈయతి ప్రత్యేకత కవకాశము లేద నియు మఱియు నిట్టి చోట్ల (చేతిది మున్నగు రీతిగా ఉత్తర పదాది వర్ణ లోపము వచ్చినప్పుడు) పై తము ఉభయ యతి (స్వర ప్రధాన యతియు ప్రాణి యతియు రెండున్ను) చెల్లుట కొందఱు మహాకవులకు పై తమిష్టమే యైనట్లు "అనఁగఁ దన్మూల మెట్టిదియొ యనఁగ" కళా. 5 వ ఆ. 58 (ఎట్టి + అది — ఎట్టిది) అను పింగళి సూరన్నగారి ప్రయోగముచే నూహింప వలసి యున్న దనియు ప్రయోగాంతరమునకు వెతుక వలసి యున్నదనియు పై పాదములో మల్లాదివారు ఇది తప్పనియు అందు చేత "అనఁగఁ దన్మూల మెయ్యదియొ యనఁగ" అని దిద్దితి మనియు వారు క్రొత్తగా విశేషములతో అచ్చొత్తించిన ప్రతిలో వ్రాసి అప్ప కవి ననుసరించి నారనియు అప్పకవికిని పై ప్రయోగము గాని ఇట్టిది మఱి యొక్కటి గాని దొరకకయో లేక దొరకినను తనకిష్టము లేక అపి

పాటింపకయో అది వరకే ప్రసిద్ధమై యున్న ప్రత్యేక యతి యను పద మున కిట్లు వ్యాఖ్యానము చేసి గతి కల్పించి భిక్ష పెట్టినాఁడేమో యని తోఁచు చున్న దనియు నెఱుంగునది.

భి న్న య తు లు 20

తే॥ గుడుసు పై క్రియ నడుము నా గుడుసు వచ్చి
భిన్న యతి యగు రాని-చోఁ బెఱ యతి యగు
నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లను బోర హరించె ననఁగ 81

81 పద్య వివ:- ఇందును 1, 2 పా. లు లక్షణమున్ను 3, 4 పా. లు లక్ష్యమున్ను (3, 4 పా. లు క్రమముగా ఉదాహరణ ప్రత్యుదాహరణములు) అనియు నెఱుంగునది.

ధరించు మున్నగు కొన్ని క్రియా పదములలో నడుమ నుండు ఇంచుగాగమము లోని (రి మొదలగు ప్రాణి వర్ణములో పై నున్న) ఇకారము (గుడుసు) నకు తరువాత మఱియొక ఇకారము (గుడుసు బాలవ్యా-క్రియా. 50వ సూత్ర ప్రకారము వైకల్పికముగా) వచ్చినప్పుడు ధరియించు మున్నగు రూపము లేర్పడఁగా అట్టి రూపములలో అట్లాగమముగా వచ్చిన ఇకారమునకు మైత్రిగల వర్ణములు (అనఁగా ఇ, ఈ, ఋ, ఎ, ఏ లున్ను ఇ, ఈ, ఋ, ఎ, ఏలతోఁగూడిన హాయలున్ను) యతికిఁ గూర్పబడినప్పుడు అది భిన్నయతి యగుననియు అట్లాగమము గా మఱియొక ఇకారము (గుడుసు) రానప్పుడు ధరించు మున్నగు రీతి గానే యున్నప్పుడు రి మున్నగు వానిపై నుండు ఇకారమునకు యతి కూర్పక (చెల్లక) అనఁగా స్వరప్రధాన యతి చెల్లక (అనఁగా ఇంచుగాగ మములోని ఇకారమునకు యతి మైత్రి పనికి రాక) రి మున్నగు రీతి ప్రాణి వర్ణమునకే యతి చెల్లు నప్పుడది పెఱ యతి (అభిన్న యతి) యగుననియు ఇందు 3వ పా. న ధరియించె అను దానిలోని ఆగమముగా

వచ్చిన ఇకారమునకు పాదాదిని ఏ అనునది కూర్చబడుటచే నిది భిన్న యతి కుదాహరణ మనియు 4 వ పా. న హరించె అను ఆగమము రాని రూపములో రి అను ప్రాణి వర్ణమునకు పాదాదిని రి అనునది (ప్రాణి యతి) కూర్చబడుటచే నిది ప్రత్యుదాహరణము (పెఱ యతి, ఇ భిన్న యతి) అనియు భావ మెఱుంగునది.

మఱియు అప్పకవి మతమున ఇట్టి చోట్ల (ధరించు, హరించు, మున్నగు చోట్ల) ప్రాణి యతియే కాని రి మున్నగు ఇంచుగాగము విశిష్ట వర్ణమునకే యతి చెల్లును కాని రి మున్నగువానిలో కలిసి యున్న ఇకారమునకు మైత్రి స్వరప్రధానయతి చెల్లదనియు (అప్పుడు) స్వర ప్రధానయతి ఇట్టి చోట్ల చెల్లదని తెల్పుటయే ఈ లక్షణము యొక్క తాత్పర్యమై గ్రహించ వలసియున్నదనియు, ఈ లక్ష్యములు చూపుటయు అందుకే ఉపయోగించు ననియు, వాస్తవమున నిట్లు ధరించు, హరించు మున్నగు చోట్ల రి మొదలగు ప్రాణి యతియు ధరియించు హరియించు మున్నగు రూపములలో ఇకార యతియు ఇట్లు ప్రత్యేకముగా చెప్ప నక్కర లేకయే సహజముగానే (వెనుకటి యతిలో, ప్రత్యేకయతిలో) వలెనే సిద్ధించు ననియు ఇదియు నొకయతి భేదము కాదనియు పై యతిలో వలెనే ఇక్కడను భిన్న యతియను ప్రాచీన ప్రసిద్ధి కిట్లు వ్యాఖ్యానము చేసియుండుననియు నెఱుంగునది. మఱియుం గొందఱ మతమున (బాలవ్యా:- క్రియా. 50 వ సూత్రి) ప్రకారము ఇ యుగాగ మమున కవకాశము గల ధాతువులలో (ఆ ఇ యు గాగమము వైకల్పిక మగుటచే ఇయుగాగమము రానప్పుడు ఏర్పడు) హరించు, ధరించు మున్నగు రూపములలో సైతము ఇంచుగాగమ సంబంధి ఇకారమునకు గూడ (స్వర ప్రధానయతియు) యతి మైత్రి ఇష్టమే యనియు, మఱియుం గొందఱ మతమున ఇయుగాగమము వచ్చుట కవకాశమే లేని ధాతువులలో (పోషించు మున్నగు వానిలో) సైతము ఇంచుగాగమ సంబంధి యగు ఇకారమునకును యతి మైత్రి చెల్లు ననియు నవీన ప్రయోగములు తెల్పు

చున్నవనియు, ఇందు కొంఱకు ప్రాచీన ప్రయోగము లింకను పరిశీలించ వలసియున్నదనియు, ఇంతే కాక ఇంచు అనునది చేయు అను నర్థమున వేఱు (క్రియా) పదముగా (పృథక్పదముగా) నన్నెచోడుఁడు మున్నగు వారిచేఁ బ్రయోగింపఁబడి యుండుటచేత అది పృథక్పదముగానే ప్రాచీన భాషలో వ్యవహరింపఁబడినట్లు మనము గ్రహింపవలసి యున్నదనియు, క్రమముగా నయ్యది ఆగమముగా మాఱిన దనియు, కావుననే వినుతించు మొదలగు వానిలో ఇకారమునకును ఇకారవిశిష్ట హల్లునకును (ఆ మున్నగుదానికిన్ని) భిన్న భిన్నముగా గూడ యతులు చెల్లనచ్చు నని కొందఱు పద తత్త్వజ్ఞులు తలంచి యున్నారని కొందఱు విమర్శకులు వాక్రుత్తు రనియు నెఱుంగునది.

విజయ విలాసమునందు:—

ఉ॥ చిత్తజుఁ డల్గి తూపు మొనఁ జేసినఁ జేయఁగ నిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచియించెదఁ గల్గిన మాట గట్టిగా
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాస రస ప్రవాహముల్
క్షత్తుకబంటి తామరలకుం దల మున్కలు గండు మీలకున్
(3, 15) 82

అందే:-

ఉ॥ చెట్టతనంబునన్ జనకు జీవన మంతయు వెల్లివుచ్చి తోఁ
బుట్టిన యాపె యి ల్వెడలిచి పుట్టిన బిడ్డనికిం బగ్గెన నీ
యిట్టి నిశాట కృత్యమున కెవ్వఁడు రోయక సమ్మతించు నీ
వెట్టి ప్రదోష వేళ జనియించిన వాఁడవొ గాక చంద్రమా 83

82 పద్య వివ:— ఇందు 2 వ పా. న వచియించె అను చోటి ఆగమ సంబంధి ఇకారమునకును పాదాదిని ఎత్తిన అనుదాని ఎకారము నకును 83 వ పద్యమున 4 వ పాదమున జనియించిన అనుదాని ఆగమ

1 చెఱచి (వా) అని గిడుగువారి ప్రతిలో పాఠాంతరము గలదు.

సంబంధి ఇకారమునకును పాదాదిని ఎట్టి అనుదాని ఎకారమునకును యతి మైత్రి కూర్పఁబడుట చేత లక్షణ సమన్వయ మయ్యెను.

పెఱ యతి

ఆగమము రానందులకు శ్రీరంగ మాహాత్మ్యమునందు:—

ఉ॥ గందపుఁ గొండ నెత్తములఁ గందువ మేలిమి తీవ యిండ్ల లోఁ
గొందలిరాకు పాన్పున సుఖించి నితాంత రతి శ్రమంబునుం
జెందిన చంచు గుబ్బెతల చెక్కులఁ జిమ్ము జవాది వాసనల్
విందులు సేయుచు న్మెలఁగు వేఁకువఁ గోమల గంధవాహముల్ 84

ఇందు చంచు అనుచోట చెంచు అనియుండె చంచు (ప) అని గీటు క్రింద గిడుగువారి ప్రతిలోఁగలదు. అప్పకవికి చెంచు అను పాఠము సమ్మతము కాదు.(చూ. అప్ప. 2 వ ఆ. 132 వ ప.) ఆగమము రాని పదములో ప్రాణి యతికి లక్ష్యము చూపఁబడుచున్నది.

84 పద్య వివ.- ఇందు 2వ పా. న యతి వద్ద సుఖించి అనుదాని (ఆగమము రానిదానిలోని) ఖ అనుదానికి పాదాదిని కె అనునది (ప్రాణి యతి లోని వర్గయతి) కూర్చబడుటచే నిది పెఱ యతి (అభిన్నయతి) యగుచుండె నని లక్షణ సమన్వయము. ఇయ్యెడఁ గొన్ని ప్రతులలో 83, 84 పద్యముల నడిమిని (మధ్య) పెఱ యతి అను శీర్షిక లేదు అది యుండుటయు ననవసరమే యని తోఁచును.

ఏకతర యతులు 21

తే॥ మహిని రేఫాక్షరంబును మఱి శతాంగ
నామక ఱకారమును సవర్ణంబు లయ్యుఁ
గావ్యములయందు నొకటి కొక్కటి గలయక
దమకుఁ దామయె యగు నేకతర యతు లన 85

ఆ॥ రార బాలకృష్ణ రచ్చల గమిఁ గూడి
ఱాఁగ యంచు నిన్ను నవ్వఁ బెట్టు

వాండ్రి యిండ్లకేఁగి వాదేల దెచ్చెద
వనిన నేక తరము లై పొసంగు 86

85 పద్య వివ:— ఇది లక్షణ పద్యము. శకటరేఫయు రేఫయు (ర, ఱ అను లఘ్వలఘు రకారములు) ఒకదాని కొకటి (పరస్పరము) స్థాన ప్రయత్నైక్యముచే (రెండున్ను ఒకటే స్థానమం దొకటే ప్రయత్నమువల్ల పుట్టిన వగుటచేత) సవర్ణములే యయినను ఒకదాని కొకటి యతిమైత్రికి (ప్రాసకున్ను) కూర్పబడక దేని కదే (రకారమునకు రకారమే, ఱకారమునకు ఱకారమే) ఏకతర యతులను (దానికదే గాని మరియొక వర్ణము చెల్లనిది యను) నన్వర్థక నామముతో చెల్లుబడి యగును (రకారమునకు ఱకారము, ఱకారమునకు రకారము కూర్చ గూడదు) అని భావము.

86 వ పద్య. 1వ పా.న రా, ర అను రేఫలకును, 2 వ పా. న ఱా.. ఱ అను బండిఱాలకున్ను యతిమైత్రి చెల్లెనని లక్షణ సమన్వయము. 3, 4 పా. లు పద్య పూర్తికే కూర్చబడ్డవి.

సవర్ణాక్షరము (రాకు ఱాయున్ను ఱాకు రాయున్ను) కలిగినను దానితో చెల్లక దానికదే (ఒంటిగా) మాత్రము చెల్లునది కావున దీనికి ఏకతర యతి యని పేరు కలిగెను. మఱియు రా కు రా, ఱాకు ఱా యున్ను పైనున్న యచ్చులనుబట్టి అనుసరించి (త్రివిధముగా) ప్రాణి యతులగుటచే ఇట్లు మైత్రి చెల్లుట సిద్ధించియే యున్నను సవర్ణత్వము వలన వచ్చుచున్న ర, ఱ, ల పరస్పర మైత్రిని నిషేధించుటయే ఈ యతికి (ఏకతరయతి ప్రత్యేకతకు) ఫల మనియు ఇట్టి ఫలసిద్ధికొఱకే (మహాకవులు కొందఱు వాడి యున్నను లాక్షణికులు కొందఱు పరస్పర మైత్రిని చెప్పినను) అప్పకవి యీ ర, ఱ ల మైత్రికి మిక్కిలి పరాఙ్ముఖుఁడయ్యెను.

మఱియు ర, ఱ లకు మైత్రి యొప్పినచో నన్వర్థకమగు నీయతికి లక్ష్యమే లేక పోవలసివచ్చు ననియు సూ. "రయోస్తు నిత్యంస్యాత్"

అను వాగనుశాసనుల యనుశాసన ముల్లంఘించుట యగు ననియు అందుచే నిపుడు భారతాదులలో విరళముగా కనుపించునవియు లాక్ష ణికులు కొందఱుదాహరించినవియు ప్రక్షిప్తములు గానే (అధునాతనులు క్రొత్తగా జొనిపినవే అనగా తెచ్చి పెట్టినవే యని యూహింపక తప్ప దనియు వక్కాణించుచు గొందఱప్పకవికి సహాయపడు చున్నారు. మఱియుం గొందఱు అదివరకే ప్రసిద్ధమై యున్న ఏకతర యతియను నామమునకు తన మత ప్రకారము వ్యాఖ్యానము జేసి దాని దార్ఢ్యము నకు అప్పకవియే సూ. "రయోస్తు నిత్యంస్యాత్" అని సృష్టించి చింతా మణిలో (ప్రక్షేపించినాఁడనియు) ఘటించినాఁడనియు పెక్కు ప్రతు లలో నేకముఖముగా నుండుటచే ర, ఱ ల మైత్రిని తెల్పు మహాకవి ప్రయోగములు ప్రక్షిప్తము లనుటకు బలము చాల దనియు మిక్కిలి యుచ్చారణ భేదముగల సవర్గ్యాక్షరములకున్ను (క, ఖ, గ, ఘ మున్నగు వానికి ) మిక్కిలి యుచ్చారణ భేదమున్ను అసవర్ణత్వము (సవర్ణత్వము లేమి) న్ను గల్గు చ ఛ జ ఝ, శ ష స లకున్ను అయ లకున్ను హాయలకున్ను మైత్రియంగీకరించి ఇంచుకేని యుచ్చారణభేదము లేక సవర్ణత్వమున్ను కొఱవడక (సవర్ణములైన) ఈ పదము నందలిది రా అనియు ఈపదమునందలిది ఱా యనియు తెలియఁజేయు (విధించు) సరి యైన ప్రమాణము (అనుశాసనము) లేక సరిగా తెలుసు కొనుటకును వీలు లేక సర్వధా తుల్యములై యున్న ర ఱ లకు ఉచితజ్ఞుఁడగు నన్నయార్యుఁడేల మైత్రి నంగీకరింప కుండు ననియు వక్కాణించుచు అప్ప కవి మతమును త్రోసివేయుచున్నారు మఱియుం గొందఱు ఒకవేళ అప్పకవి చెప్పినట్లు చింతామణి నన్నయ విరచితమే యయ్యు అది భీమకవిచే దగ్ధము చేయఁబడుటయు సత్యమే యయినచో నన్నయభట్టు తరువాత బాలసరస్వత్యప్పకవుల వరకును గల మహాకవుల కందఱకును "రయోస్తు నిత్యంస్యాత్" అను అనుశాసనము లేదు కనుక (అట్టిది పుట్టినను అప్పుడే నశించుటచే తరువాతి వారెఱుఁగరు గావున) అనఁగా సాధకము లేక

పోయినను బాధకమున్ను (నిషేధమున్ను) లేదు గావున అట్టి మహా కవుల ప్రయోగము లలాక్షణికము లని నిందించుటయు లాక్షణికుల నజ్ఞులని దూరుటయు కేవల సాహసమే యనియు ఇంత గ్రుద్దులాడిన తన సీస మాలికలలోను తానే చూపిన కొన్ని లక్ష్యములలోను రేఫ అకారముల కలయిక (యతిప్రాసల మైత్రి) కానవచ్చుచునే యున్నది కాని నూనినది కాదనియు నన్నయ తరువాత కొందఱు గొప్ప లాక్షణికు లును ర ఱ లకు యతిప్రాసల రెండిటి మైత్రియు, కొందఱు ప్రాస మంగీకరింప కున్నను యతిమైత్రి నంగీకరించియే యుండి రనియు, ద్వితీయా చార్యుఁడు (అథర్వణుఁడు) ఇట్టి మత ద్వయమును తెల్పియు ర ఱ లకు మైత్రి నిషేధించుట తనమత మని అహోబలుడు వ్యాఖ్యానము చేసినను అది పొసఁగి యుండ లేదు కావున ఆథర్వణములోని ర ఱ ల మైత్రీ నిషేధ వాక్యము ప్రక్షిప్త మని స్పష్టముగా సహృదయులకు గోచరించు చునే యున్నదనియు అందుచేత బాహిర ముగా ర ఱల మైత్రి కూర్ప వచ్చుననియు నుద్ఘోషించు చున్నారు.

దానిపై మఱియుం గొందఱు ర ఱలకు మైత్రి కలిగి యతి ప్రాస లకు వాడఁగూడదను నియమమున్ను లేక పోయిన యెడల సంస్కృత ములో నెచ్చటను ఱ యను భేదము (భిన్నాక్షరము) లేక ఒకించుకేని యుచ్చారణ భేదమున్ను ఒక్కింతయేని స్థానప్రయత్న భేదమున్ను లేక యున్న ఱకార మిట్లు ఆంధ్రములో వేఱుగా (క్రొత్తగా) నుద్భవించు టకు ప్రయోజన మే యుండదనియు, అల్ప సంఖ్యాకములగు (తీరు తీఱు మొదలగు వానిలో మాత్రము) పదములలో రద్వయ భేదముచే అర్థ భేద మున్నను (అర్థభేద మున్నదని కొందఱు చెప్పినను) ఆ ప్రయోజ నము సార్వత్రికము (అన్ని పదములలోను) కాక పోవుటచేతనున్ను, అట్టి పదములలో సైతము (తీరు, తీఱు మున్నగువానిలో గూడ) రకా రము మాత్రమే ఒప్పి (అంగీకరించి) నను సంస్కృతములోను ఆంధ్రము లోను ఒకే పదమున కర్థభేదములుండుట సహజమే గావున నట్లే ఈపద

ములలోను అంగీకరించినను బాధ లేదు గావునను ముఖ్యమగు ప్రయోజనము ర, అల వేర్పాటునకు యతి ప్రాసలలో మైత్రి లేకుండుటయే యనియు అందుచేత నే సర్వజ్ఞుడగు వాగను శాసనుడు "రయోస్తు నిత్యంస్యాత్" అని రఅల మైత్రిని నిషేధించి నాడనియు పై సిద్ధాంతము మున కడ్డుగీత గీయుచు అప్పకవి మతమునకు ప్రాణము పోయుచున్నారు.

మఱియుం గొందఱు విమర్శకులు ప్రయోగముల వైఖరి పరిశీలింప దొలుతొల్త నన్నయ "రయోస్తు నిత్యం" అని యనుశాసించియు, పిమ్మట భారత రచనకుం బూని మొట్టమొదట కేవల ప్రౌఢత్వము చూపుటకు మిక్కిలి నిబంధనలతో కవిత్వము వ్రాయఁబూని కొంతరచించినపిమ్మట ఆరి తేరి కేవల రసలోలుడై సౌకుమార్యంబునందే తగులవడి మైమరచి యానిబంధనలు విడచి కవిత్వమునందు మాధుర్యము నింపుట కవికి సహజ ధర్మము గావున అట్లే కొన్ని నిబంధనలతో ర, అ లకు మైత్రి కూర్చు కుండుట సర్వప్రాస సీసములు సర్వయతి సీసములు మున్నగు వానితో కొంత రచన సాగించియు చిట్టచివర కవి పాటింపక కేవల మార్దవ లోలుఁడై ర, అల మైత్రియు వాడిన వాడియుండ వచ్చునని యూహింప వచ్చుననియు అప్పకవికి నన్నయ రచితమగు చింతామణి లభించుట నిక్కము కాదని ఒకవేళ సిద్ధాంత పడినను భట్టారకుని ప్రయోగములలో నేమి తరువాతి ప్రామాణిక కవుల ప్రయోగములలో నేమి యెక్కువగా ర అల మైత్రి లేనివే చూపట్టె మిక్కిలి స్వల్పములే ర అల మైత్రి కలవియు నగపడినను అవి ప్రక్షిప్తములుగా తోఁచి వానిని త్రోసిపుచ్చి ర అల మైత్రికి అప్పకవి ప్రతిఘటించి యుండు ననియు నూహింప వచ్చుననియు విమర్శించుచున్నారు.

ఇట్టి నిబంధనము వకారము పట్లనూ గలదు. అది యెట్లన ఆది కవుల యొక్కయు మరియు ఇతర ప్రామాణిక కవులయొక్కయు ప్రయోగము లెల్ల పరిశీలింప మొదట వకారమునకు ప ఫ బ భలతో మైత్రి వాడఁబడ నట్లే స్పష్టపడుచుండెను. (ముకార యతియు నట్టిదే) మిక్కిలి

పరిశీలింప మొట్టమొదట వాడఁబడకున్నను కడపటికి ప్రామాణిక కవి ప్రయోగము లందును స్వల్పముగా నయినను (విరళముగా నైనను) వ, ప, ఫ, బ, భ లకును, ర, ఱ లకును, పు, ఫు, బు, భు లకును ముకారమునకును) మైత్రి వాడబడినట్లు అగపడుచుండెను. ఇట్టి వైఖరి చూచియే కాబోలు (కావలయు) మైత్రి కన్పట్టు ప్రయోగములను ప్రక్షిప్తములు గా నూహించి వానిని పాటింపక కొందఱు (లాక్షణికు లును) వకారమును గూడ ఏకతర యతిలో చేర్చి వ, ప, ఫ, బ, భ,లకు మైత్రి కూడదనుచున్నారు.

ర ఱల మైత్రియు వ ప ఫ బ భల మైత్రియు కూడదని నన్నయ అను శాసించినను లేకున్నను ఆదికవులందఱు సమ్మతి యున్నను లేకపోయినను కొందఱు లాక్షణికులేని వాని మైత్రి నంగీకరించుటచేతను ఆదికవి ప్రయోగ మొక్కటి యేని వాని సాధుత్వమును సాధింపజాలుటచేతను అధునాతను లెల్లరచే (ఏ యొకరిద్దరో తప్ప) విద్వత్కవులచేతను బహుళముగా వాడబడుచునే యుండుటచేతను (ర ఱలమైత్రి వ ప ఫ బ భలమైత్రి సామా న్యాఖండ యతిమైత్రి) ఇవి శారదావివాహములు వోలె నంగీకరింపక తీరవని తోఁచు చున్నది. అప్పకవి మతమునకు ఛందోదర్పణము కావ్యా లంకారచూడామణి, సర్వలక్షణ సారసంగ్రహము, కవిజనాశ్రయమున్ను మూలములు కాని వానిలో ల, మ, వ లున్న ఎక్కటి (ఏకతర) అను నామములతో చెప్పఁబడినవి. ఈతఁడు ర, ఱలు మాత్రమే ఏకతర యతులన్నాఁడు.

మరియు రివడి యనుపేర రీకి ఋకారముతో మైత్రి చెల్లుచుండుటచే నిదియునేకతర యతి కానేరదని వచ్చుచున్న యాక్షేపణకు ఋవర్ణము అజ్భక్తితో గూడిన రకారమే కావున (రకారముతో మిక్కిలిభేదము లేనిదే కావున అతి 'తనతో నతి భిన్నముకాని' రీకి ఋకారమునకును మైత్రిచెల్లుచున్నను ఇతరాచ్చులతోగూడిన రకారము మఱియే వర్ణముతో డను మైత్రి నొందకుండుటచేతను పైని చెప్పిన 'లేవనెత్తిన) యాక్షేపణ

పాటింప నక్కఱ లేదనియు దీని ఏకతరత్వ సార్థకతకు ప్రతిబంధకము కానేర దనియు సిద్ధాంతము సమాధాన పరుచుచున్నను కేవల ఋకారమునకు మాత్రము (వ్యంజనముతో కూడుకొనని దానికి మాత్రము) రీ తో మైత్రి కలిగినచో నట్లు ఒప్పుకొన్న ఒప్పుకొన వచ్చును గాని ఏహల్లుతో గూడిన ఋకారమున కైనను (కృ, తృ మున్నగువానికిన్ని) రీ తో మైత్రి గల్గుటచేత ఈ కృ తృ మున్నగు ఋత్వవిశిష్ట వర్ణములకును రీకిన్ని మిక్కిలి భేదమే కావున పైని జెప్పిన ఏకతర యత్యన్వర్థకతా సిద్ధాంతము దుర్బలమై పోయెనను వాదము తలయెత్తి మిగిలి పోవుచున్నను దానికి గూడ హల్లుల పై నున్న ఋకారమున్ను రకార ద్వయ మేళనతో నావిర్భ వించినదే గావునను (వెనుక తెల్పినట్లు) సంయుక్త యతి స్వాభావ్యముచే కృ, తృ మున్నగు వానిలోను రకారమునకే రివడి చెల్లుచుండెను కాని తదితర వర్ణములకు (తృ, కృ మున్నగువానిలోని తకార రకారాదులకు) కాదను యుక్తి సమాధాన మగుచున్నదనియు గొందఱు విమర్శించు చున్నారు. మఱియుం గొందఱు మకారమునకు బిందు పూర్వక ప ఫ బ భలతోడను బిందు పూర్వకములగు అంతస్థోష్మములతోడను యతి మైత్రి చెల్లుచున్నను అచ్చటి బిందువుకూడ మకారసదృశమే యగు టచే మకార యతులు గూడ నేకతర యతులే యనుట లెస్స యనియు, అందుచేతనే కావ్యాలంకార చూడామణి కవిజనాశ్రయ ఛందోదర్పణా దులలో మకారము కూడ నెక్కటి యతి వర్ణములలో బరిగణింపం బడిన దనియు వక్కాణింతురు. కాని ముకారయతి ఉకార సవర్ణ విశిష్ట మకారమునకు ఉకార సవర్ణ విశిష్ట ప ఫ బ భ లతో బిందు పూర్వ కత్వము ప ఫ బ భ లకు లేకయే చెల్లునను యతి దానికి బాధక మగుచున్న దని తోంచుచున్నది.

## అ భే ద వి ర తు లు 22

తే॥ వేదముఖమున వబయో రభేద యనుట
వలన వబ లొక్క టొక్కటి నిలుచు విరతి
కవని లడలకు లళలకు నట్లకలిమిఁ
జేసి తమలోన నివియును జెల్లుచుండు 87

ఆ॥ వసుమతీ కళత్ర బక జైత్ర గాన క
లా లస త్కలాప [1] డంభ గోప
లలిత దేహ పింగళ పుర దక్షిణ గేహ
యన నభేద విరతు లప్రమేయ 88

87 పద్య వివ:- ఇది లక్షణ పద్యము. వ్యాకరణ శాస్త్రమందు "వబయోరభేదః" మున్నగు వాక్యములచే వ బ లకును, అట్లే ల డ లకును ల ళ లకును అభేదము చెప్పఁబడినది గనుక వ బలకు పరస్పరమున్ను లళలకు పరస్పరమున్ను లడలకు పరస్పరమున్ను (విడి విడిగా, ఏజంటకాజంట) యతి మైత్రికి చెల్లుబడి యగును. అభేదవిధానమునుబట్టి చెల్లుచుండుటచే సార్థకనామము పదములలో వకారమున్నప్పుడు అట్టి పదముయొక్క అర్థమే కాక బకార ఘటిత పదముయొక్క అర్థమున్ను అట్లే బకారమున్నప్పుడు అట్టి పదముయొక్క అర్థమే కాక వకార ఘటిత పదముయొక్క అర్థమున్ను అట్లే లడ అనువానిలోను ల ళఅనువానిలోను ఏదేని ఒకవర్ణమే పదములో నున్నప్పుడు ఉభయ వర్ణ ఘటిత (రెంటిలో దేనితో గూడిన) పదముయొక్క అర్థమెనను చెప్పుకొనుట, వాల చాపలము అనుచోట బాల చాపలము = శిశు కృత్యము, వాల చాపలము = తోఁక కదల్చుట అనియు, ఇట్లే బాలచాపలము అని యున్నప్పుడును రెండర్థములు చెప్పుకొనుటయు, అట్లె విసము = గరళము, విసము, బిసము = తామర తూడి అని తెనుఁగుపదములలోను, లడలకు ఉదా. జడధి = మంద బుద్ధి, జడధి, జలధి = సముద్రము (లళల

1 డంబ (పూ. ము) అని గి...వారి ప్రతిలో గలదు

యభేద మెల్లెడల సుప్రసిద్ధమే.) ఇట్టి అర్థ ద్వయమున్ను పైని చెప్పిన అభేదముచేతనే చెల్లుచున్నది. అట్లే యతి ప్రాసములలోను ఈయభేదము చెల్లుచున్నది యనియు నెఱుంగునది.

మఱియును దేనికైనను(తెనుఁగులో ముఖ్యముగా) శిష్ట వ్యవహార మే ప్రధాన హేతువు గావున "యమకాదౌ భవేదైక్యం డలోర్వబోరలో స్తథా", "వబయోర్లడయో శ్చైవ లళయో రలయో స్తథా" మున్నగు దర్పణ కారాది వచనములచేత రలలు మున్నగు మఱికొన్నిటికిని అభేదా నుశాసన మున్నను అంతమాత్రమున (తెనుఁగులో శిష్టవ్యవహారము అనగా ప్రామాణిక కవి ప్రయోగములలో లేక పోవుటచేత) రలలు మున్నగువానికి యతి ప్రాసముల మైత్రి వాడ కూడదని అప్పకవి యభి ప్రాయము గ్రహించ వలసి యున్నది. అప్పకవి మతమున ఇప్పుడు మనకు కనిపించుచున్న మహాకవుల ప్రయోగములలోని రల (రఱ) మున్నగువాని మైత్రి ప్రక్షిప్తమే యనక తప్పదు. స్వయముగ (అను శాస నాపేక్ష లేక యే) ఉచ్చారణములో గాని స్థాన ప్రయత్న ములలో గాని ఇంచుకేని భేదములేని ర, ఱలకే (తన యభిప్రాయము చొప్పున శిష్ట వ్యవహారము లేదని) మైత్రి నిషేధించినప్పుడు ఉచ్చా రణచేతను స్థానముచేతను మిక్కిలి భేదమే కలిగి కేవలానుశాసన మాత్ర మ్మున నభేదము గల రలల కేల మైత్రి నంగీకరింపఁడూ అని యడుగుట కవకాశమే లేదు. ఈ రలల మైత్రి విషయమున ముందు విరివిగా చర్చించి నిర్ణయింపఁబడును. (చూ. పీఠిక) మఱియును వబ లకును లడలకును కొన్ని దేశాలలో నుచ్చారణ భేదము లేకుండుటయు (వేపి, బేపి) ఆబిడ, ఆవిడ, జబిడ, జవిడ, సవబు, సబబు మున్నగు నచ్చతెనుగు లలో గూడ నీ యభేదముండుటయును గూడ నీ యతి పుట్టుటకు హేతువై యుండు ననియు కొందఱు విమర్శకులు చెప్పుదురు అనియు నెఱుంగునది.

88 వ పద్య. 1వ పా. న వ బ లకును 2వ పా. న ల డ లకును 3వ పా. న ల ళ లకును అభేద మైత్రి చెల్ల నప్పకవి కూర్చినాడు గావున లక్షణ సమన్వయము. (శ—ర లో దంభ అని యే కాని డంభ లేదు, దంభ ఇక్కడ చెల్లదు.)

ఆది పర్వమునందు:—

చ॥ నుత జల పూరితంబులగు నూతులు నూటిటి కంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూటిటి కంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుత శతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు చూడఁగన్
(4, 94) 89

ఆరణ్య పర్వమునందు:—

చ॥ ప్రతి బల దర్ప భంజనుఁడు పార్థుఁడు దారుణ బాణ వర్ష ము
న్నతి నతి ధీరుఁడై కురిసినం బరముండు మహాంబు వృష్టి ప
ర్వతము [1] గ్రహించు నట్లు తన బాహుల వాని గ్రహించి పోర న
క్షత తనుఁ డయ్యె వాని నతి గర్వితుఁ బార్థుఁడు చూచి యాత్మలోన్
(1, 311—) 90

భీమన చాటుధార:—

చ॥ *బిసరుహ గర్భ [2] వ్రాఁతయును విష్ణుని చక్రము [illegible] ... మునకును చెప్పినట్లు
దెసలను రాము బాణము యుధిష్ఠిరు కోపము [3] [illegible] నత్రో= డ

1 మూలములో గ్రసించు అనియు గ్రహించు (పూ. [illegible] ... దము గలది
2 శాపమును (వా): పాశమును (ప) గిడుగువా[illegible] ... మైత్రి చెల్లును.
3 కొన్ని ప్రతులలో మౌని రోషము [illegible] ... దగుటచే లకారము
*పాఠాంత[illegible] ... ప్రత్యక్ష విధానముచే

చ॥ బిసరుహ గర్భు వ్రాఁతయును విష్ణు[illegible] ... క్షత లక్షణాచే స్వాభిన్న మే
దశరథ సూను బాణమును ధర్మజు[illegible]

మసకపు పాము కాఁటును గుమారుని శక్తియుఁ గాలు దండమున్
బసవని కొతు శూలమును బండిత వాక్యము రిత్త వోవునే     91

చమత్కార మంజరి యందు:—

ఉ॥ బంగరు దుప్పటంబు వలెవాటుగ నొప్ప హాస న్ముఖాబ్జుఁడై
రింగున నారిఁ గోల నమరించి తటాలునఁ ద్రుంచె నాధను
శ్శృంగుఁడు గోప యాావత భుజంగుఁడు మోచిత సంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్త దర్ప బల[1]భంజన మంత్రము మత్స్య యంత్రమున్ 92

89 పద్య వివ:— 2వ పా. న (వ్రి) వ బా లకును, 90 లో 3 వ పా. న (ర్వ) వ బా లకును, 91 లో 1 వ పా. న బి వి అను వానికిని 92 లో 1వ పా. న బ వా లకును యతి చెల్లు చుండుటచే నివి వ బల అభేద యతుల లక్ష్యము లయ్యెనని లక్షణ సమన్వయము. ఈ పద్యములో భంజన యంత్రము అని యున్నను మంత్రము అనియే కవి రచిత పాఠ మనియు, అందు అర్థ సౌందర్య మున్నదనియు తోఁచుటచే అట్లే వ్రాయఁబడినది.

తే॥ పెద్ద లాకును దనకు నభేద మగుట
ల ళ లకు నభేద మట్లన కలుగు కతన
క్షితిని మూఁడవ సరళంబు యతులఁ బ్రాస
ములను లఘ్వలఘు లకారములకు నిలుచు     93

---

మసకపు పాము కాఁటును గుమారుని శక్తియుఁ గాలు దండమున్
బశుపతి కంటి మంటయును బండిత వాక్యము రిత్త వోవునే

ఇందు శ స లకు ప్రాస మున్నదని కావలయు పై పాఠము వచ్చినదని తోఁచును. (కొందఱు మతమున శ స లకు నభేద మున్నది.) చూ. పీఠిక.

1 భంజన యంత్రము అని పా.

93 పద్య వివ:— ఈ పద్యమున మాకు లభించిన ప్రతు లన్ని టను పెద్ద ళాకును అనియే కలదు. పెద్ద లాకును అనియే యుండ నగు నని తోఁచినది. ఇందును ప్రాసల సందర్భములో 366 లో పెద్ద లాకును అనియే కలదు. మఱియు నిందే (2వ ఆ. 219 లో) స్పష్టముగా ళ అను దానిని దొడ్డ (పెద్ద) అను పేరుతోడను, (2వ ఆ. 246 లో) ల ళ లు దొడ్డ సన్నములు (క్రమాన్వయమా, కాదా అని) సందియము గాను కలదు. మఱియు అప్పకవి నీళ్ళు మున్నగాఁ గల పదముల యాదేశ ళకారమును నెళవు, పళ్లెరము మున్నగు వాని సిద్ధ ళకారమును రెంటిని ఒకే పదముతో (దొడ్డ ళా అని) వాడినాఁడు. ఈ పద్యమున సందిగ్ధ ముగా (ఏది లఘువో ఏది యలఘువో తెలిసికొనుటకు వీలు లేకుండగా) ల ళ లను లఘ్వలఘు లకారములకు అని చెప్పినాఁడు. బాలవ్యాకరణ మున పర. చిన్న యసూరి తల, నెల మున్నగు వాని లకారము లఘు వనియు ర ల డల కాదేశమగు ఏళ్ళు, మేళ్ళు, ఏళులు, కీళ్లు మున్నగువాని ళకారము అలఘువనియు (మంగళము నెళవు మున్నగు వాని) వర్ణ సమామ్నాయ ళకారము (సిద్ధళకారము) భిన్నము (లఘ్వలఘులలో చేరక) క, గ మొదలగు వర్ణముల వంటిది యనియు చెప్పినాఁడు. ఈ పద్యములో పెద్దలా అనియే పాఠ మనియు పెద్దలా అనగా లకారమే యనియు ఇచ్చటి సందర్భము ధ్రువ పఱుచు చున్నది.

పెద్ద లాకును= లకారమునకును, తనకును= డకారమునకును (మూడవ సరళమునకును) అనగా లడల కభేదము (వెనుక చెప్పినట్లు) కలుగుటచేతను, అట్లే లళల కభేదము చెప్పబడుటచేతను తనతో= (డ కారముతో) సభేదముగల లకారముతో ళకారము అభేదము గలది యగుటచేతను డ కారమునకు లళలతో యతిప్రాసల మైత్రి చెల్లును. అనఁగా తనతో ప్రత్యక్ష విధానముచే నభేదము గల దగుటచే లకారము తోడను తనతో నభేదముగల లకారముతో ప్రత్యక్ష విధానముచే నభేదము గల దగుటచే (స్వాభిన్నాభిన్నము లక్షిత లక్షణచే స్వాభిన్నమే

యగుటచే) ళకారముతోడను, ఇట్లు రెంటితోడను డకారమునకు మైత్రి గూర్పవచ్చు ననియు, ఇట్లుభేదముచే చెల్లునది కావున నిదియు అభేద యతియే యనియు తాత్పర్యము.

అనంతుని ఛందమునందు డ ళ లకు:—

క॥ కాకు స్వర యతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్రి
శ్నాకలిత దీర్ఘమున నితఁ
డే కవ్వడి రథముఁ గడపె నిమ్ముల ననఁగన్ (1, 95) 94

94 పద్య వివ:— ఈ పద్యమున కడపె అను చోట కడిపె అని గిడుగువారి ప్రతిలో ఉంది (చూ. కడపు శ॥ర.) ఇందు 2 వ పాదమున డే......ళి అనువానికి యతి చెల్లుటచే డళల యతిమైత్రి కుదాహరణ మని లక్షణ సమన్వయము.

మరియు లడల యతి మైత్రి సుప్రసిద్ధమే యని కాబోలు 'కావలయు' దానికి ప్రామాణికు లగు అన్యకవుల లక్ష్యములు చూపక దీనికి మాత్రము (ళడలకు) కాకు స్వరయతిని చెప్పు సందర్భమున కల్పించిన (అనంతుడు స్వయముగా రచించిన) ఈ పద్యమును మాత్రి ముదాహరించుటచే అప్పకవికిన్ని మరియొక ప్రామాణిక కవి లక్ష్యము దొరక లేదనియు, పైని చెప్పిన విధముగా ఈ యతి యిట్లు చెల్లుటకు (సబబు) యుక్తియు కలిగినను ఇది యెందుచేతనో విరళమే యని కొంద అందురు గాని ళ వర్ణము స్వభావముచేతనే (ళ వర్ణము పదములలో విరళమగుట) ఈ యతి విరళమయ్యె గాని మరియొక హేతువు కాద నియు నెఱుంగునది.

లళలకు నాదిపర్వమునందు:—

చ. అలసత నోరఁగాఁ దరుణి యమ్మని పుంగవు క్రోాల నున్న నా
మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి బాల పై

వలు వెడల న్బయ ల్పడియె వల్ద కుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళ త్రివళీ యుత రోమ రాజియున్
(4, 42) 95

(ఇందు "మోాల నున్న యామిళిత" అని మేము చూచిన ప్రతు లన్నిటను గాన వచ్చుచున్నను అర్థ సందర్భము కుదురక ఇట్లు నా అని వ్రాయఁబడినది. ఇప్పుడు తరుణి మోాల నున్నన్— ఉండఁగా ఆమిళిత అని అర్థము కుదురును అని యెఱుంగునది.) వారి పాఠమున గిడుగువారి కర్థ మెట్లు కుదురునో తెలుప వలసియున్నది.

నిర్వచనోత్తర రామాయణమునందు:—

శా॥ చేసేతం బృథివీశు లందుకొనఁ గాశీ పుణ్యా తోయంబునన్
జేసెన్ మజ్జనమున్ గుటంబున హరించెన్ బల్లవోర్వీశు ను
ల్లాసంబై తగ పాల లోచనము లీలం గట్టెఁ గావేరి వే
లా సాధ్యాఖల దిఙ్ముఖుండు కలికాళ క్ష్మా విభుం డల్పుఁడే
(1, 26) 96

(ఇందు శ్రీపుణ్యా, హసించెన్ అనియు 1, 2 పాదములలో పాఠ భేదములు గలవు.)

పారిజాతాపహరణమునందు:—

మ॥ అలి నీలాలక నీవు నీ పతి రహస్య క్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధు సంగరంబునకు నుల్లాసంబు గల్పించును
జ్జ్వల దీపాంకురమై రతి శ్రమ తనూ సంజాత ధారాళ ఘ
ర్మ లవంబుల్ దొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్ఛారతిన్
(1, 60) 97

95 పద్య వివ:— ఇందు 4వ. పా. న ల...ళ లకు యతి చెల్లినది గాన లక్షణ సమన్వయము.

మఱియు నిది ల ళల ప్రాసము నకు నుదాహరణ మగు చున్నది. 96 పద్య 4వ. పా. న లా.........ళ లకు మైత్రి చెల్లినది.

97 పద్య 2వ పా.న ళ 'ల్లా' లా లకు యతి చెల్లినది అని యెఱుంగునది. రేఖా ఇత్యాదులలో లకార మనిన అప్పకవి ఇది లకారములే అన్ననూ అనవచ్చుననియు నెఱుంగునది.

అ భే ద వ ర్గ య తు లు 23

క॥ తన కరలేని బకారం
బునకు స్వ వర్గజములైన మొదలి లిపుల రెం
టను బై లిపి నొకటను వా
యను బ్రాయి యభేద వర్గ యతి నా నెనయున్ 98

(ఇందు లిఫి అనియు, భకారం 'పూ. ము. 1902' అనియు గిడుగువారి ప్రతిలో)

98 పద్య వివ:— తనతో 'వకారముతో' అభేద విధానము గల బకారమునకు సమాన వర్గులోనైన (బకార మేవర్గు లోనిదో ఆవర్గులోనివే యగు) ప ఫ అను వర్గుమొదటివి రెండును వర్గులో నాల్గవది యగు భ అనునదియు 'ప ఫ భ లు) వకారముతో యతి మైత్రికి చెల్లును. అభేదము గల వర్ణ మేవర్గులోనిదో ఆ వర్గులోని వానికి (అభేదము గల వర్ణమునకు సవర్ణములగు వానికి) చెల్లునది గావున నిది అభేద వర్గయతి యని సార్థక నామము.

మఱియుఁ గొన్ని చోట్ల (ప్రథమా విభక్తి పదము మీఁది) పకారము వకారముగా మాఱుచుండుటయు నట్టి పకార వర్గీయము లగుటయుఁ గూడ నీయతికిఁ గారణములనియు తోఁచుచున్నది. వబల కభేద యతి యనియు వ ప ఫ భలకు అభేద వర్గ యతి యనియు నెఱుంగునది. మఱియు వ ప ఫ బ భ లకు మైత్రి చెల్లుటకు ఓష్ఠ రూప స్థానైక్యమున్ను హేతు వన వచ్చు ననియు గొందఱందురు. మఱియు మకారమున్ను ఇట్టిదే యైనను మకారమునకు బిందుపూర్వక వకారము తోడనే మవర్ణ యతి యను పేరుతోడనే చెల్లుటకును ఈయతి చెల్ల కుండుటకును స్వతంత్రులగు మహాకవుల ఇచ్ఛ మాత్రమే హేతువని కొంద రనుచున్నారు.

మఱియుం గొందఱు ఈ యతి వకారముతో నభేదము గల బకారము ద్వారా చెల్లవలసినది గావునను బకారముతో మిక్కిలి సదృశములగు ప ఫ భ అనునవియే ఇక్కడ చెల్లుచున్నవనియు మకారమున్ను వర్గీయమే యైనను నాసికాస్థాన మెక్కువ గలదియై మిక్కిలి సదృశము (అంతర తమము) కాక పోవుటచే ప ఫ భ ల మాడ్కి నీయతిలో చెల్లుబడి కాకుండె ననియు వకారమునకు ప ఫ బ భలతో మైత్రి చెల్లుటకు మొత్తము మీద అభేదత్వము అభేద వర్గీయత్వమే కాక వెనుక తెల్పినట్లు ఏక స్థానికత్వమున్ను 'అనధిక స్థానికత్వమున్ను' హేతు వనియు వకారమునకు గల దంత స్థానికత్వము కొఱవడుటలో ప ఫ బ భ లున్ను చేరినను (వకార యావత్స్థానికములు కాక పోయినను) తద్భిన్న స్థానికములు— వకారమునకు లేని స్థానము గలవి కానివి యగుటచేత వకారముతో ప ఫ బ భ లకు మైత్రి చెల్లుచుండె ననియు, ఇట్టి సంబంధమున్ను (వకార భిన్నస్థానికము కాదు అను యుక్తియు) లేనిది కావున మకారమునకు వకారముతో మైత్రి చెల్లుట లేదనియు అనగా వకారమునకు గల స్థానములెల్ల లేక పోవుటయే గాక వకారమునకు లేని స్థానము గలదియు నగుటచేత వకార మొక స్థాన మెక్కువ గలదియు మకారము మరియొక స్థాన మెక్కువ గలదియు నను భేదమున్ను 'విసదృశత్వమున్ను కలవియగుట చేత వకార మకారముల మైత్రి చెల్లుటకు యుక్తి కొఱవడె ననియు అందుచేతనే వకారమునకు బిందుపూర్వకత్వము కలిగినప్పుడు ఆబిందు సంబంధముచే వకారముతో మకారమున్ను తద్భిన్నస్థానికము— 'దానికి లేని స్థానము గలది' యను విసదృశత్వము లేనిదై వకార భిన్న స్థానికము కాదు అను సంబంధముః (యుక్తి) కలిగి మవర్ణయతి యను నామముతో మకారవకారములకును యతి మైత్రి చెల్లుచుండెననియు లోతుగా విమర్శించుచున్నారు.

మఱియు అనంతుని ఛందము కావ్యాలంకార చూడామణి సర్వ లక్షణ సార సంగ్రహము మున్నగు వాని ననుసరించి కావలయు కొందఱు వకారమున్ను ఏకతర యతులలోని దని గట్టి యభిప్రాయము నొంది అప్పకవి మున్నగువారు చూపిన లక్ష్యములకుఁ బాఠభేదములు తమ యభిప్రాయ ప్రకారము కల్పించి తెలుపుచు అప్పకవి మున్నగు వారు చూపునవి ప్రక్షిప్తములకాఁ దలంచి యూ నీ యభేద వర్గ యతియు వ బ ల యభేద యతి యును గూడ నొప్పుకొనకున్నారు. పరికింపగా వెనుకనే చెప్పినట్లు ఆదికవుల యభిప్రాయము మొట్టమొదట అట్టిది యే యేమో అని తోఁచుచున్నను తుట్టతుదకది యట్టిది కాదని వారి ప్రయోగముల వైఖరిచేతనే తోఁచుచుండుటచేతను ఇప్పుడు ప్రాచీను లును అధునాతనులును అగు మహాకవుల ప్రయోగము లట్టివి (అప్పకవి చూపిన వాని వంటివి) లెక్కకు మిక్కిలి యగపడుచుండుట చేతను, తలఁపు గల్గిన చో తమ తమ మత ప్రకారము ఎన్నియేని మార్చివేయుట సులువే యగుటచేతను, అట్టి ప్రయోగ బాహుళ్యము ప్రక్షిప్తము సేయుట అనుచితము అప్రయోజనము అప్రతర్క్యము నగుటచేతను వబల అభేదయతి యొప్పుకొనకుంట; మఱియు నట్టిది యగుటచేతను అతి బహుళ మహాకవి ప్రయోగ నిరసన దోషము సంధిల్ల జేయునది యగుట చేతను అది యేని (వబల యతియేని) యొప్పినచో వకార మేకతర యతి కాకపోవుట ధ్రువమే కావునను ఏకతర యతులలోని దగుటచే వకారము నకు ప ఫ బ భ లతో యతి మైత్రి కూడ దను వాదము నిలువక దూరాపాస్తమగును కావునను ఈ అభేద వర్గయతియు ననింద్యము నార్యగ్రాహ్యము ననియు ఈగ్రంథమందే రెండవ యాశ్వాసములో అనంతుని ఛందము మున్నగు వానిలోని ఏకతర (ఎక్కటి) యతుల విధించు పద్యములు చూపియు అప్పకవి ర ఱ లను మాత్రము ఏకతర యతులుగా గ్రహించుటయు, ఇట్టియతిని చెప్పుటయు మున్నగునవి వెనుకటి కొందఱ మత మెఱింగియే తాను వారిమత మిష్టము లేని

వాఁడయ్యె నని ధ్రువపరుచు చుండె ననియు నెఱుంగునది.

ఆది పర్వమునందు:—

ఉ॥ ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దత్కులం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము కావున న్మహీ
వల్లభ తక్షకాధము నెపంబున సర్వము లెల్ల నగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్ప యాగ మతి ధీ యుత చేయుము విప్ర సమ్మతిన్
(1, 126) 99

అందే:—

క॥ ఉరగ కళేబర మంసాం
తరమునఁ బడి వ్రేలుచునికిఁ దలఁపక యచల
స్థిరుఁడై పరమ ధ్యానో
పరతేంద్రియ వృత్తి నున్నవాని శమీకున్ (2, 172) 100

అరణ్య పర్వమునందు:—

క॥ కోరి యనేక యుగంబు ల
పార తపో యుక్తులైన వారికిఁ బడయన్
దూరము నీ సభ [1] మఱి నీ
కారుణ్యము నంతకంటెఁ గడు దవ్వెందున్ (1, 371) 101

ఫకారమునకు సాంబోపాఖ్యానమునందు:—

క॥ మురసంహరు నాటోప
స్ఫురణమ్మునకున్ సదాశివుండైన రణ
స్థిర నిలువఁ గలఁడె బాణా
సురునకుఁ దోడుపడ వచ్చి సొలయుట వినరే 102

ఆది పర్వమునందు:—

మత్తకోకిల॥ ధీరు లీ ధృతరాష్ట్ర పాండు లతిప్రశస్త గుణుల్ ప్రసి
ద్ధోరు కీర్తులు నాకు నిద్దఱు నొక్క రూప తలంపఁగా

1 మేదిని (పూ. ము.) అని గిడుగువారి ప్రతిలో

వీరు వారను నట్టి బుద్ధి విభేద మెన్నఁడు లేదు గాం
ధారి పుత్రి శతంబునందుఁ బృథా తనూజులయందునున్
(8, 29) 103

99 పద్య వివ:- 3 వ. పా. న వ...ప లకును, 100 లో 4 వ. పా. న ప......వా లకును, 101 లో 2 వ. పా. న పా.......వా లకును, 102 లో 2 వ. పా. న (స్ఫు) ఫు.....వు లకును, 103 లో 3 వ. పా. న వీ...భే లకును యతి మైత్రిలు చెల్లు చుండుటచే నివి అభేదవర్గ యతులకు మహాకవుల యుదాహరణములు అని లక్షణ సమన్వయము. వీనిలో (వకార మేకతర యతులలోని దను వారి) పాఠాంతరములు 99 లో (నెపంబున అనుచోట) నెవంబున, 100 లో (ధ్యానోపరత— ధ్యాన+ఉపరత) ధ్యానావరత—ధ్యాన+అవరత, 101 లో (అపార) అవార 102 లో (సదాశివుం డైన) ప్రమథ విభుండైన, 103 లో (వీరు వారను నట్టి బుద్ధి విభేదము) వారు వీరను నట్టి బుద్ధి వివాదము అనియు నెఱుంగునది. పరికింపఁగా ఈ పాఠము లన్నిటను మూలపాఠము లలో వలె పదసరళత్వము అర్థ స్ఫూర్తియు (అర్థ ప్రసిద్ధియు) లేక చక్కఁదనము (సౌందర్యము) కొఱవడె ననియు, 102 లో సాభిప్రా యత్వము సమమే యైనను పదసౌకుమార్యము కొఱవడి పాదము కుంటు వడియె ననియు, అందుచేత మూలపాఠములే సహజములు, ఇవియే ప్రక్షిప్తములు ననియు నెఱుంగునది. మఱియు అప్పకవి (స్వయముగా) నిట్టి యతిని విధించియు (అంగీకరించియు) 2 వ ఆశ్వాసములో 249, 251 పద్యములలో లాతి వాకును (పకారమున కాదేశముగ వచ్చిన దానికి అనఁగా వాఁడు+పడె—వాడువడె అను నట్లు మాఱిన దానికి) జాతి వా కును (సహజముగా పదములలో నుండు వాఁడు మున్నగు వాని వాకున్ను) ప్రాసము మాత్రము గూర్ప వచ్చు ననియు, యతికిఁ గూర్ప రాదనియు అనఁగా రెంటికిని ప్రాస పట్ల సవర్ణత్వము శంక లేక (నిస్సం దేహముగా) ఉండు ననియు లాతి వా సహజముగా పకార మగుట చేత

సహజ పకారమగు జాతి వారకు యతికి పనికి రాదనియు చెప్పి జాతి లాతి వాలకు ప్రాసము చెల్లు నట్లును అవని.....పట్టువడి (పట్టు+పడి) అనియు, లాతి వారకును (అది సహజముగాపకారమే కావునఁ గాబోలు) పకారమునకును "పడుచు కొమ్మల....చెట్టవట్టి" (చెట్ట+పట్టి) అని మాత్రము యతి చెల్లు నట్లును (వలపుతో హరి, సిరి, చెట్టవట్టె నవని మున్నగు చోట్ల యతి మైత్రి చెల్లదను నట్లున్న) లక్ష్యములు స్వకల్పితములు చూపి జాతి లాతి వాలకు ప్రాసములలోఁ గల సవర్ణత్వము యతులలో ఏల లేకపోయినది, అంత గంభీరముగా వక్కాణించుటకేమి యధికారము వచ్చెను అని యెవ్వరేని యడుగక మానరని కావలయు విరుద్ధముగా జాతి లాతి వాలకు వడి నిల్పఁ గూడ దని సూత్రముతో నన్నయ భట్టు ఎక్కడా చెప్పలేదని ఎంచఁగూడ దనియు ఆతఁడు పంచమామ్నాయములో (తెనుఁగు భారతములోని 1, 2, 3 పర్వము లలో అనగా ఆది సభా పర్వములలోను ఆరణ్య పర్వములో రమారమి 4 ఆశ్వాసములలోను) కూర్చిన లక్ష్యములకు (అనఁగా జాతి లాతి వాలకు ఎక్కడను యతి చెల్లనట్లు తెలుపక పోయినను చెల్లునట్లు తెలుపునవి కావు అనునట్లే కూర్పబడినవానికి) మాఱు పలుక (అట్లు కాదనుటకు) నెవరికి శక్యము, ఎవ్వరికిని తరముగాదు అని చెప్పి ఆది పర్వములోని 1వ ఆ 157 వ పద్యము ప్రత్యుదాహరణముగాఁ జూపినాఁడు. ఈచూపిన పద్యములో "భూనుత కీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగఁ దోడనె పుట్టు" అని భూ.....పు అను వానికి యతి చెల్లుచున్నట్లు లిఖించినాఁడు. అనఁగా బ్రాహ్మణుఁడు+పుట్టఁగ— బ్రాహ్మణుఁడు వుట్టఁగ అను నట్లు గసడదవా దేశము చేయక నన్నయ సూత్రములకు ("గసడదవా స్స్యుః ప్రథమా మాత్రాత్ న వికృతి శబ్దాత్ పరత స్సంస్కృతికానాం భవంతి గసడదవాః" అను వానికిని వాని కహోబలుడు చేసిన వ్యాఖ్యకును) విరుద్ధముగా వ్రాసినాఁడు. మఱియు ఇది యిట్లు అచ్చువేయించిన వారి (సంస్కరించినవారి) పాఠము మాత్రమై అప్పకవి పాఠము బ్రాహ్మణుఁడు

వృట్టఁగ అను గ స డ ద వాదేశ యుక్తమే యైనచో పై నిర్వచనమునకు అప్పకవి యభిప్రాయము నన్నయ భట్టు లక్ష్యములలో లాతి వాకు ప ఫ బ భ లతో మాత్రము చెల్లునవే కాని జాతివాతో చెల్లునవి (జాతి లాతి వాలకు చెల్లునవి లేకపోవుటయే అని ధ్రువపడి పై యాక్షేపణము గ స డ దవాదేశము రానట్లు సంస్కరించిన వారికే చెల్లి అప్పకవికి చెల్లకపోయి నను లాతి జాతి వాలకు నన్నయ యే విధముగాను యతి మైత్రి నిషేధము చెప్పక (అప్పకవికి నన్నయ ప్రయోగములలో లాతి జాతి వాలకు యతిని తెల్పునవి కానరాక) పోయినను స్పష్టముగా రెంటికిన్ని చెల్లునట్లు వా యను వ్రాయి అని లక్షణములో చెప్పుటచే జాతి వాకే (సహజ వకారమునకే) ప ఫ (బ) భ లతో యతి చెల్లు నని చెప్పిన వాఁడై అట్టి నన్నయ ప్రయోగములున్ను చూపిన వాఁడు సహజముగా పకారమే (ప ఫ బ భ లలో చేరినదే) యయి ఆదేశముచే వ కారమై తన జాతిదే అనగా తనతో స్థాన ప్రయత్నోచ్చారణములలో నేమియు భేదము లేనిదియై లేఖనములోను (ఆకారములోను) కొంచెమైన వికృతి లేనిదియు నయి యున్న లాతి వాకు జాతి వాకు యతి మైత్రి కూడదని నిషేధించుట పూర్వోత్తర విరుద్ధమై మిక్కిలి హాస్యాస్పదమగుచున్న దనియు నన్నయ భట్టుది జాతి లాతి వాలకు ప్రాస మైత్రి చెల్లునది చూపక పోయినను నన్నయ అభిప్రాయము కూడా జాతి లాతి వాలకు ప్రాస మైత్రి యిష్టమే యను నట్లు చెప్పినప్పుడు ప్రాస మైత్రియే చెల్లునప్పుడు యతి మైత్రి చెల్లక పోవుట యెందును మిక్కిలి విరుద్ధమే యనియు ప్రాసమైత్రి చెల్లువానికి యతిమైత్రి చెల్లుటలో మఱియొక ప్రమాణ మక్కఱలేక యెందును సహజముగానే చెల్లు ననియు యతి చెల్లువాని కెల్ల ప్రాస మైత్రి చెల్లుట సహజము కావ నియు ప్రాసములలో అచ్చుల ప్రాధాన్యమే లేదు గావున అచ్చట ఈసిద్ధాంత మేల చెల్లదు (ప్రాసలలో ఏయచ్చైనను పనికి వచ్చి అట్లు యతుల కేల పనికిరావు) అని యడుగుట కవకాశము లేదనియు అప్ప

కవి 2 వ యాశ్వాసములో చేసిన సిద్ధాంత మెట్లును విరుద్ధ మనక తప్పదనియు "భూనుత కీర్తి" అనునది ప్రత్యుదాహరణ మని యెఱుంగక కావలయు. గిడుగువారి పీఠిక చెల్లదన్న దానికి నుదాహరణమని చూపుట యెట్లు అని యాక్షేపించు చున్నది అనియు నెఱుంగునది.

ఊష్మాక్షర విశ్రాంతులు 24

తే॥ అంత్య వర్ణంబుఁ బాసి యూష్మాక్షరంబు
లూష్మ విశ్రాంతులనఁ జెల్లు నొకటి కొకటి
శతమఖోపల భూషానుషంగ యనఁగ
షడ్జయుత వేణునాద ప్రసంగ యనఁగ 104

వివ:— శ ష స హ యను ఊష్మాక్షరములలో చివర దగు హకారము కాక (తప్ప) తక్కిన శ ష స అను వర్ణములు మూడున్ను పరస్పరమును (ఒకదాని కొకటి) ఊష్మ యతి యను నామముతో యతి మైత్రి నొందును. 3, 4 పా. లలో శ......ష లకును, ష...స, లకును యతి చెల్లుటచే లక్షణ సమన్వయము.

"శషోస్సః" అని ప్రాకృతవ్యాకరణ విధాన ముండుటచేతను సంస్కృత వ్యాకరణమున శ్చుత్వ ష్టుత్వ ములచే సకారమునకు శ ష లు వచ్చుచుండుటచేతను, మఱియు సూ. ఆదేశ ప్రత్యయయోః అను దానిచే సకారమునకు షకారమున్ను, "ధాత్వాదేష్షస్సః" అను దానిచే షకారమునకు సకారమున్ను వచ్చుచుండుటచేతను కొందఱి మతమున శ స ల కభేదముండుట చేతను అంశువు పశువు అసువు పసువు మున్నగు వానిలో ఉచ్చారణాభేదము శ స లకు స్పష్టమే యగుటచేతను, (కొన్నిచోట్ల కొందఱియుచ్చారణలో ష సలకైక్యము వినఁబడుచుండుట చేతను గూడ) నీ యతి పుట్టియుండుననియు ఆభ్యంతర ప్రయత్న తుల్యత్వమున్నను హకారమునకు బాహ్య ప్రయత్నములలో సంవార నాద, ఘోషములున్ను, శ ష స లకు వివార శ్వాస అఘోషములున్ను అని భేదము కల్గుటచేతను హకారమునకును శ ష స లకును పై రీతి

స్థానాదేశ భావాదులున్ను లేకపోవుటచేతను 'సరళత్వముచే' హాకార మునకు యకారముతో ఋజుయతి సుప్రసిద్ధమై చెల్లుచుండుటచేతను, ముఖ్యముగా శిష్టవ్యవహారము లేకపోవుటచేతను ఈ యామ్నాయతిలో హాకారము పాలు గానక వెలి యయ్యెననియు నెఱుంగునది.

ఇది మిక్కిలి సుప్రసిద్ధమగుటచే మహాకవుల లక్ష్యములు చూపఁబడలేదు.

సరస వళులు 25

క॥ హ య లత్వమునకు శ ష సలు
నయవర్గన చ ఛ జ ఝ లకు నలి మధ్యమ వ
ర్గ యుతా నునాసికము ని
శ్చయముగ దురితమునకు జెల్లు సరస వళులనన్ 105

వివ:— హాకార యకారములు అకారమునకును (అ, ఆ, ఐ, ఔ లతోఁ గూడిన హాయలు అ ఆ ఐ ఔలతోడను, ఇ, ఈ, ఋ, ఎ, ఏలతోఁ గూడిన హాయలు, ఇ, ఈ, ఋ, ఎ, ఏ లతోడను, ఉ, ఊ, ఒ, ఓలతోఁ గూడిన హాయలు ఉ, ఊ, ఒ, ఓ, లతోడను అని తాత్పర్యము) శ ష స అను వర్ణములు చ (చ) ఛ, జ (జ) ఝ అను వర్ణములతోడను (పైనుండు అచ్చుల మైత్రియొక్క త్రివిధత్వముచే వెనుకవలెనే ఇక్కడను న ణ లలోను మఱియు ముందున్ను మైత్రీ త్రివిధత్వమెఱుంగునది) మధ్య వర్గులో (ట వర్గులో) అనునాసికమగు (పంచమ వర్ణమైన) ణకారము దురిత మనఁబడు నకారముతోడను (ఇక్కడ దురిత మనఁగా నకారమాత్రము అనగానే యచ్చుతో గూడిన నకారమైనను దురితమే అనియు ఈదురిత నిర్ణయము విషయమై పెక్కు మత భేదములున్నను అది వ్యాకరణ విషయమని యెంచఁబడి అందే అనగా మద్విరచితమగు అహోబలపండితీయ వివరణమునందు చర్చింపఁబడి నిర్ణయింపఁబడిన దనియు నెఱుంగునది) సరసవళు లను నామముతో యతి మైత్రికిఁ జెల్లుబడియగును. అనఁగా పైని చెప్పిన విభాగముతో అ, య, హాలు

పరస్పరమున్ను చ చ ఛ, జ జ ఝ, శ ష సలు పరస్పరమున్ను న ణ లు పరస్పరమున్ను సరస యను సార్థక నామముతో (యోగ రూఢిచే) యతి మైత్రి నొందు నని భావము.

ఇందలి నామ సారస్య మెట్టిదో యొక్కింత విస్పష్ట మగు చున్నది.

వెనుక చెప్పఁబడిన ప్రకారముగా యు క్తమై ఋజుయతి యను పేర హా యలకు మైత్రి కలుగుటచేతను అట్టి హాకారమునకు (యకారముతో మైత్రి చెల్లు హాకారమునకు ఏక స్థాన ప్రయత్న సంబంధముచే అకారముతో మైత్రి యు క్తమే యగుటచేతను 'అహా లకు భాష్య మతమున ప్రయత్న భేదముచేతనే సవర్ణత్వము కొఱవడి నను సూత్రకార మత ప్రకారము "నాజ్ఝ్ కా" అను నిషేధముచే సవర్ణత్వము లేక పోయినను ఆ సవర్ణత్వాభావము వ్యాకరణ శాస్త్ర ప్రయోజనమునకే యని యూహింపవచ్చుటచేతను సవర్ణత్వము లేక పోయినను సూత్రకార మత ప్రకారము ఒకే స్థానము ఒకే ప్రయత్నము (స్థాన ప్రయత్నైక్యము) కలుగుట అను సంబంధమునకు ప్రతిబంధము లేకపోవుటచేత అ హాలకు మైత్రి యు క్తమే కావున అది సరసమే యనియు హాకార సంబంధి యగుటచేత యకారముతోఁడను అకారము నకు మైత్రియు సరసమే యనియు అనగా సమస్థాన (ఏకస్థాన) ప్రయత్న ములు కలుగుటచే అకార హాకారములకు సాక్షా త్సంబంధమున్ను సంబంధి సంబంధి యగుటచే అకార యకారములకు పరంపరా (లక్షిత లక్షణచే) సంబంధమున్ను కలుగుటచే అకారమునకు హా య లతో మైత్రి సరసమే యనియు కొన్ని చోట్ల శ వర్ణమునకు ఛ వర్ణము శ్యా. సూ. శశ్ఛోటి యను దానిచే సంస్కృత పదములలో వచ్చు చుండుటచేత అట్టి స్థానాదేశ సంబంధముచే ఛ శ లకున్ను శవర్ణముతో ఊష్మ విశ్రాంతి యను పేర ష సలకును ఛ వర్ణముతో వర్గజ యతి యను పేర చ (చ) జ (జ) ఝ లకును వెనుక చెప్పిన ప్రకారము మైత్రి

చెల్లుటచే పైని చెప్పినట్లే శ ఛ లకు సాక్షా త్సంబంధమున్ను తక్కిన వానికి (ష స, చ చ, జ జ ఝ లకు) సంబంధి సంబంధిత్వ రూప పరంపరా సంబంధమున్ను కలుగుటచేతను, హంస, అంచ, అనురీతిగా సకారము చకార మగుటచేతను మొత్తము చ చ ఛ జ జ ఝ, శ ష సలకు పరస్పర మైత్రియు సరసమే యనియు వ్యా సూ "అట్కు ప్వాఙ్ నుమ్ వ్యవాయేపి రషాభ్యాం నోణ స్సమాన పదే" మున్నగు వానిచే నకారమునకు ణకారాదేశమున్ను "ణో నః" అను దానిచే ణకారము నకు నకారమున్ను సంస్కృత పదములలో కొన్ని చోట్ల వచ్చుచుండుట మున్నగు సంబంధముచేతను 'నణల యభేదవిధానము మొదలగు వాని చేతను) న ణల మైత్రియు సరసమే యనియు ఈ యతి యందలి సరసత్వ మిట్లు సూక్ష్మ దృష్టిచే తెలియబడుచున్న దని యెఱుంగునది.

మఱియు దీనిపై అ, ఆ, ఐ ఔలకు హకారమునకు నట్టి సర సత్వము చెప్పినం జెప్పనగును గాని ఇ, ఈ, ఋ లకును ఉ, ఊ లకును హకారముతో స్థానైక్యము కొఱవడుటచే వాని మైత్రి సరసత్వము నకు భంగము వాటిల్లుచున్నదను నొక పూర్వపక్షము వచ్చుచున్నను వాని పట్ల మాత్రము స్థానైక్య సంబంధము లేక పోయినను ప్రయ త్నైక్య సంబంధము పైని చెప్పినట్లు కలుగుటచేతను "ఏక దేశాను మత్యా సర్వస్యాప్యనుమతిః" (పెద్దలు అనగా ప్రామాణిక వచస్కులు సామాన్యముగా చెప్పినవానిలో కొన్నిటికి (ఏకదేశమునకు) హేతు యుక్తి మున్నగు ప్రమాణము గోచరించి కొన్నిటికి మన బుద్ధికి అట్టి ప్రమాణము గోచరించక పోయినను మనకు గోచరించక పోయినప్పటికి వానికిని ప్రమాణముండియే తీరునని (అపేక్షా బుద్ధిచే) విశ్వసించి అన్నియు నంగీకరించుట యని తెలుపు ఆర్యోక్తిచే వానికిని తగిన సంబంధ మున్నదనియే ఊహించుట న్యాయ్య మగుటచేతను పై పూర్వ పక్షము సమాధానపరుచుచు పైని చెప్పిన సరసత్వమునకు తృప్తి పడవచ్చు ననియు వెనుక చెప్పినట్లు యతి పట్ల హాయల కవిద్యమా

నవద్భావ మంగీకరించినచో నే బాధయు లేదనియు నెఱుంగునది.
(చూ. ఋజుయతిలో)

తే॥ హరిహయాది సురాధ్యక్షు యంబుజాక్షు
యతిజన మనోఽంబుజ విహార యఘ విదూర
నరక దైత్య విరోధి ఘృణా పయోధి
యనఁగ సరసాఖ్య వళ్యుదాహరణము లగు 106

తే॥ శకట దానవ సంహారి చక్రి ధారి
షట్పద శ్యామ మూర్తి స్వేచ్ఛా ప్రవర్తి
స్వర్ణ పట పరిధాయి భుజంగ శాయి
కరుణ ననుఁబ్రోవు మన నయ్యె సరస వళులు 107

106, 107 పద్య వివ:— మొదటి దానిలో 1, 2, 3 పా. లో హ అలకును య, అ లకును న ణా లకును రెండవ దానిలో శ, చ లకును ష (చ్ఛా), ఛా లకును (స్వ) స జ లకును క్రమముగా యతి మైత్రి చెల్లు నట్లప్పకవి కూర్చినాఁడని లక్షణ సమన్వయము మొదటి పద్యములో 4 లో పాదాది యతినియత స్థలముల నెక్కడనేవర్ణ మున్నను ఉండవచ్చునని మాత్రము తెలుపుచు అ హాల కభ్యుచ్ఛయ ముగా యతి మైత్రి పడిన దనియు ఈయతియు మిక్కిలి ప్రసిద్ధమే యగుటచేఁ గావలయు మహాకవుల లక్ష్యములు చూపలేదనియు నెఱుంగునది.

సంయుక్త విశ్రామములు 26

ఆ॥ ఒకటి రెండు జడ్డ లుండెడు వర్ణంబు
విశ్రమ స్థలమున వెలసె నేని
యవల దాని కెద్ది యైన సంయుక్త వి
శ్రామ సంజ్ఞచేఁ బొసంగు చుండు 108

వివ:— విశ్రమ స్థానమందు ఒకచోట 'పాదాదియందు గాని యతి నియతస్థలమునఁ గాని' లేక రెండుచోట్లనూ ఒకటిరెండు

సంయుక్త వర్ణములతోఁ గూడిన విశిష్ట వర్ణ మున్నప్పుడు తక్కినచోట అనగా యతి మైత్రి కూర్పవలసిన ఇతర స్థలములయందు ఆ సంయుక్త (విశిష్ట) వర్ణములో కూడి యున్న ఏ హల్లు (ఏ ప్రాణికి) నకు నేని యొకదానికి యతిమైత్రి (తక్కిన వర్ణముతో) సరిపడినను చెల్లుబడి యగును. (విశిష్ట వర్ణములోని అన్ని ప్రాణులకును యతి మైత్రి కుదుర నక్కరలేదని తెల్పుటయే ఈ యతి కథన తాత్పర్యము కాని ఇది యొక యతిభేదమే యని చెప్పుట కాదని గ్రహించ వలసి యున్నది యని యెఱుంగునది. సంయుక్త వర్ణమనఁగా నడుమ (మధ్య) అచ్చులేని హల్లుల కూడిక మఱియు నిక్కడ నొకింత శాస్త్రి చర్చ యవసర మగుచున్నది. అనఁగా ఈ సంయుక్త సంజ్ఞా విషయమున ప్రత్యేక సంయోగ సంజ్ఞ యనియు మిళిత సంయోగ సంజ్ఞ యనియు పక్ష ద్వయము చెప్పఁబడెను అందు నడుమ నచ్చు లేని హల్ సమూహ ములో నొక్కొక్క దానికి (విడి విడిగా నన్నిటికిని) సంయోగ సంజ్ఞ కలుగుట (మధ్య నచ్చులేని వియు ఒకటి కన్న నెక్కువ సంఖ్య గలవియు నగు సంయుక్త వర్ణము లన్నియు మొత్తముగా గాక విడి విడిగా దేని కదే మొదటిదీ సంయుక్తమే, రెండవదీ సంయుక్తమే, మూడవదీ సంయుక్తమే యను నట్లు అన్నియు సంయుక్తములే యగుట ప్రత్యేక పక్షమనియు అట్లు విడివిడిగా అన్నిటికిని చెల్లక మొత్తము సమూహ మంతకును కలిపి రెండు గాని మూడు గాని మఱియు సంభవించినచో నంతకు నెక్కువ సంఖ్య గలవి గాని కలసి యేర్పడిన విశిష్ట వర్ణ మంత కును మాత్రము సంయోగ సంజ్ఞ కలుగుట మిళిత సంజ్ఞాపక్ష మనియు ఇట్టి రెండు పక్షములలో నిష్టానుసారముగా నేపక్ష మైనను గ్రహింప వచ్చు ననియు ఇక్కడ ప్రత్యేక సంజ్ఞా పక్షమే గ్రహించినచో (ఒకటి కన్న నెక్కువ హల్లులు మధ్య నచ్చు లేకుండా కూడి నప్పుడే గాని ఏ సంయుక్తమూ కాదు గావున, ఒకజడ్డ (ఒక్క సంయుక్త వర్ణమే) యుండుట సంభవింప దనియు రెండవ పక్షమున 'మిళిత సంజ్ఞా పక్ష

మందు) రెండు జడ్డలు (రెండు సంయుక్తములు) ఉండుట (ఎన్ని హల్లులు మధ్యమందు అచ్చు లేకుండా కూడినను మొత్త మన్నిటికిని కలిపి ఒకటే సంయుక్త మను పక్షము గావున రెండు సంయుక్తము లుండుట సంభవింప దనియు ఇట్లు రెండు పక్షములలో నేపక్షము గ్రహించినను విప్రతిపత్తి వచ్చుచున్నది (అర్థము కుదుర కున్నది) యనియు అందుచేత ఇక్కడ ఒకటిరెండు జడ్డలు అనఁగా ఒకటియు రెండున్నూ కలసి మూడు జడ్డలు (సంయుక్తములు) కల వర్ణము అని అర్థమనియు ఈమూడు అను నది అనేక వర్ణములు అనుదానికి ఉపలక్షణ మనియు అప్పుడు రెండు గాని మూడు గాని అంతకు నెక్కువ గాని జడ్డలు (సంయుక్తములు) కూడిన వర్ణము అని యర్థము పొసఁగు ననియు అప్పుడు ప్రత్యేక సంయోగసంజ్ఞా పక్షమునకే ఇది చెల్లును గావున ప్రత్యేక సంజ్ఞాపక్షమే గ్రహించుకో వచ్చు ననియు ఇట్టి క్లేశ మిందు గాన వచ్చుచున్న దనియు కొందఱు ఒకటి రెండు జడ్డలు అనఁగా ఒకటిగాని రెండుగాని జడ్డ లనియు ఒకజడ్డ యనగా నడుమ నచ్చు లేని రెండు పొల్లు హల్లుల సమూహ మనియు రెండు జడ్డ లనగా మూడు పొల్లుహల్లుల గాని అంతకు నెక్కువహల్లుల గాని సమూహమనియు ఎట్లో అర్థము గ్రహించి సమర్థించుకొని తృప్తి పడుదురనియు కొందఱు ఒకటి యనుచో నొకపక్షమున్నూ రెండు అనుచో మరొక పక్షమున్నూ గ్రహించుకొని సమర్థింతు రనియు నెఱుంగునది.

తే॥ క్ష్మాధరం బాతపత్రము గా ధరించె
క్ష్మాకుమారునిఁ బోరను సంహరించె
క్ష్మారుహంబునకై నిలింప పతి నొంచెఁ
జక్రి యనిన సంయుక్త విశ్రామము లగు 109

వివ:— ఇందు 1, 2, 3 పాదములలో వరుసగా సంయుక్తము లోని అన్నివర్ణములు విడివిడిగా చెల్లు నట్లు అప్పకవి కూర్చినాఁడు.

అనఁగా 1 వ. పా. న. (శ్రీ) కా......గా లకును (ఇది సంయుక్తములో మొదటిది చెల్లుటకు) 2 వ. పా. న. (శ్రీ) పా.........సం లకును (ఇది సంయుక్తములో రెండవది చెల్లుటకు) 3 వ. పా. న (శ్రీ) మా......ంప అను వానికిని (ఇది సంయుక్తములో మూఁడవది చెల్లుటకు) యతి మైత్రులు కూర్చుటచే నిది సంయుక్త విరామమునకు లక్ష్యము మఱియు 4 వ. పా. న రెండవ చోట (పాదాదినికాక యతి నియతస్థలమున) సంయుక్త వర్ణ మున్నప్పుడున్ను ఇట్లే యనుటకు సంయుక్త వర్ణములలో నొక్కదానికి మాత్రము మొదటిదానికి మాత్రము (జ.....(శ్రా)) శాలకు యతి కూర్చి యుదాహరించినాఁడు ఇట్లే తక్కిన సంయుక్త వర్ణముల కెల్ల నెఱుంగునది. మఱియు రెండు చోట్లను సంయుక్తము లున్నప్పుడున్ను వానిలో దేని కైనను చెల్లుటకు

శ్రీ సురావన లోల యుగ్రి లిపు కాల
శ్రీ సుతా ప్రేమ వర్తి విస్తార కీర్తి
శ్రీ జనా నంత భక్తి సంప్రాప్త రక్తి
శ్రావక ధర సయుక్త విశ్రాంతు లివియు

అని యుదాహరణము తెలుంగునది.

బహు యతి నియతి

క॥ ఏక పదంబున విరతు ల
నేకమ్ములు గలిగి యుండు నేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ
బ్రాకటముగ నిలుచు సీస పదములఁ దక్కన్ 110

ఆ॥ ఒక్క పదములోనఁ బెక్కు విశ్రమములు
జఱుగుచోట మొదల జడ్డ లున్న
నడుగు వెడలు దనుక నందొక్కటియె కాని
యుండ దొకట నదియు నొకట నిదియు 111

జయ భద్ర రగడ

క్ష్మా పుత్రికా లోల కమనీయ గుణ జాల
ఘన నీల యని చెప్పఁగా బహు విరతు లొప్పు
క్ష్మా పాలక లలామ కంధి గర్వ విరామ
సంగ్రామ భీమ యన మహిని రెంటికిఁ దప్పు 112

తే॥ ఒంటి యడుగున బహుయతు లుండు నపుడు
నడుమ నొక దాన జమిలి వర్ణంబు గదియ
నందుఁ జరణాదికి సవర్ణ మయ్యె నెద్ది
దాని కయ నిల్చు విరతి ముందరను గృతుల 113

విజయ మంగళ రగడః—

వైరి మద తమః పతంగ స్వ జన పోషి తాంత రంగ
వ్రజ వధూ భుజంగ యనఁగ వలయుఁ బెక్కువడుల యెడల
దారిత క్షమా కుమార ద్వారకా పురీ విహార
వ్యాస సన్నుత ప్రచార యనఁగఁ దప్పు కడకు వెడల 114

110 పద్య వివః— సీస పాదములలో కాక తక్కిన పద్యముల పాదములలో 'సీస పాదములలో మాత్రి మీాచెప్పఁ బోవు నియమములు లేవనుట) ఒకే పాదమునందు 'ఒక పాదమునందే' అనేకములగు యతులు 'పాదమున రెండు చోట్ల నే కాక ఇంకా ఎక్కువ చోట్ల యతులు) ఉండ వలసిన నియమ మున్నప్పుడు 'చంపకము మొదలైన వానిలో వలె రెండు చోట్ల నుండు వర్ణములకే యతి మైత్రి కుదుర వలయుటగాక సీస పాదములో వలె నాలుగు చోట్ల నుండు వర్ణములకు (మరియు నెక్కువ చోట్ల నుండు వర్ణములకును యతి మైత్రి కుదుర వలసినప్పుడు' పాదాది యందున్న వర్ణమే అన్ని (యతు లుండ వలసిన) చోట్లను ఉండవలయును పాదాది యందున్న వర్ణమునకు 'లక్షణ కర్తలు నియమించిన ప్రకారము' యతి మైత్రిగల వర్ణములే అన్ని చోట్లను గూర్పవలయును గాని సీస పాదమునందు వలె కొన్ని యతులు పాదాది వర్ణమునకు మైత్రి గల వర్ణములతోడను తక్కిన

యతులు పాదములో మొదటి సగము కాక తక్కిన సగములో మొదటి వర్ణముతో మైత్రి గలవి గానో లేక మరొక విధముగానో భిన్నముగా కూర్ప గూడదు అని భావము.

111 పద్య వివ:— ఒక్క పాదమందే ఒకటి కన్న నెక్కువ యతులు (అనగా రెండుచోట్లనే కాక ఇంకా ఎక్కువచోట్ల యతి మైత్రిగల వర్ణములు) ఉండవలసిన నియమ మున్నప్పుడు పాదాది యందు సంయుక్త వర్ణములు న్నప్పుడు ప్రత్యేక సంజ్ఞా పక్షమును బట్టి సంయుక్త వర్ణములు అనఁగా జడ్డలు అనిద్వివచన బహువచనములు రెండును చెల్లునట్లు అనగా సంయుక్త వర్ణములే లేక జడ్డలే అనునట్లు చెప్పఁబడినది. ఇట్లే సంయుక్తములు (లేక జడ్డలు అనిచెప్పి నపుడెల్ల ప్రత్యేక పక్షమే యని యెఱుంగునది.) అనఁగా కూర్పఁబడినప్పుడు ఆ పాదాది సంయుక్త వర్ణములలో ఏదో ఒక్క వర్ణమే పాదము పూర్తియగు వరకు అన్ని యతులలోను ఉండవలయును. (పాదాది సంయుక్త వర్ణములలో నిచ్ఛా నుసారముగా ఏదో యొక సంయుక్త వర్ణమునకే మైత్రి గల వర్ణములే యతిమైత్రి యుండవలసిన అన్ని చోట్లను కూర్పవలయును గాని ఆ పెక్కుయతు లుండవలసిన చోట్లలో నొకచోట లేక) కొన్నిచోట్ల ఆపాదాది సంయుక్త వర్ణములలో నొక దానికి మైత్రి గల వర్ణమున్ను (లేక) అట్టి వర్ణములున్ను మరి యొక చోట (లేక) మరి కొన్ని చోట్ల పాదాది సంయుక్త వర్ణములలో మరి యొక దానికి (ఇంకొక దానికి) మైత్రి గల వర్ణమున్ను (లేక) అట్టి వర్ణములున్ను చెల్లుబడి కావు. 'కూర్ప గూడదు' సంయుక్త యతి స్వభావముచే నట్లు చెల్ల వలసినను ఇట్టి యెడల నట్లు చెల్లదని నియమింపఁబడె నని భావము.

112 పద్య వివ:— ఇందు 110వ పద్యముచే చెప్పిన నియమము నకును, 111 లో చెప్పిన నియమమునకును రెంటికిని మొదటి పాదముచే నుదాహరణముగాను రెండవ పాదముచే ప్రత్యుదాహరణముగాను

అప్పకవిచే కూర్పఁబడినది. అది యెట్లన ఇందు మొదటి పాదమున మొదట నున్న క్ష్మా అనుదాని మొదటిదగు కా అను దానికే మైత్రి గల వర్ణములే అన్ని చోట్లను అనగా కా అని మొదటను, రెండవచోట (కమనీయ) క అనియు, మూడవచోట (ఘననీల) ఘ అనియు, నాల్గవ చోట (గా బహు) గా అనియు మొత్తము అన్నిచోట్లను, కా, క, ఘ, గా అని అన్నియు మొదటి వర్ణమునకు మైత్రి గలవే కూర్పఁ బడుటచేత ఈ మొదటి పాదము 110 వ పద్యమునందలి నియమమున కుదాహరణమగుచున్నది యనియు ఈ మొదటి పాదమందే మొదటి వర్ణము సంయుక్త వర్ణములతో గూడినది కావున ఈసంయుక్త వర్ణములలో నొకటియగు అనగా మొదటి దగు కా అను దానికి మైత్రి వర్ణములే అన్నిచోట్లను పైని చూపినట్లు ఉండుటచేతను ఈపాదాది సంయుక్త వర్ణములలో ఒకదానికి కొన్నిచోట్లను మరియొక దానికి మరికొన్ని చోట్లను మైత్రి గల వర్ణములగు నట్లు భిన్న భిన్నములుగా కూర్పబడలేదు (అట్లు లేవు) కావునను ఈ పాదమే 111 వ పద్యములో చెప్పిన నియమమునకున్ను ఉదాహరణ మగుచుండె ననియు ఇందే రెండవ పాదమున పై నియమములు (110, 111 పద్యముల నియమములు) చెల్లకుండ అనగా పై నియమములు రెంటికిని భిన్నముగా నుండుటచే అనగా పాదాది వర్ణ మగు 'క్ష్మా' కా యను దానికి రెండవచోట మైత్రిగలది గా, క అనియు మూడవచోట పాదాది వర్ణమగు కా అనుదానికి మైత్రి లేనిదే యగు స అనునదియు నాల్గవ చోట పాదాది కా అనుదానికి మైత్రిలేనిదే మ అను నదియు కూర్ప బడుటచేతను, మొత్తము మీద భిన్న భిన్నములుగా కా, క, స, మ అని కూర్పబడుటచేతను మరియు ఈ రెండవ పాదమందే పాదాది సంయుక్త వర్ణములలో మొదటి దానికి (కాకు) రెండవచోట క అనియు మూడవ చోట పాదాది సంయుక్తములలో రెండవది యగు షా అనుదానికి చెల్లునట్లు స అనియును నాల్గవ చోట పాదాది సంయుక్తములలో

మూడవది యగు మూ అనుదానికి చెల్లునట్లు మ యనియు ఇట్లు త్మో యను దాని సంయుక్త వర్ణములకు భిన్నభిన్నములకు మైత్రి గలవిగానే కాని ఒక దానికే మైత్రిగలవిగా కూర్పబడక పోవుటచేత ఈ రెండవ పాదమే 111 వ పద్యములో చెప్పిన నియమమునకున్ను ప్రత్యుదాహరణ మయ్యెననియు గ్రహించునది.

మరియు 112లో 2 పా. లో గూర్చినట్లు సీస పాదములో నున్ను గూర్చ గూడదు. ప్రతి సీసపాదమందును పాదములో సగములో మొదటి వర్ణమునకు మైత్రిగలది రెండవ చోటను రెండవ సగములో మొదటి వర్ణమునకు మైత్రిగలది ఆరెండవ సగములో రెండవచోటను యతులు చెల్లును. సీస పాదమునకు వలెనే పెక్కుయతులు కూర్పవలసిన ఈ జయ భద్రరగడ మున్నగు వానికి అట్లున్ను సీసమునకు వలె పాదము సగములో నొక యతియు తక్కిన సగములో మరొక వర్ణమునకు మైత్రిగల యతియు "త్రా పాలక లలామ కంధి గర్వవిరామ సంగ్రామ భీమ యన జగతి రెంతః దప్పా" అన్నట్లు చెప్పినను చెల్లదు (కూర్చగూడదు) అనియు సీసపాదములలోను పాదములో మొదటి సగములో మొదటిదానికి అందు రెండవ చోట మాత్రము గూర్చి రెండవ సగములో మొదటిదానికి అందు రెండవచోట గూర్పక మొదటి సగములో మొదటి దానికి మైత్రి గలది రెండవ సగములో మొదటను (లేక మొదటి సగములో మొదటి దానికి సంబంధించనిదిగాని రెండవ సగములో మొదటను) ఆ రెండవ సగములో మొదటిదానికి సంబంధించనిది (పాదాది వర్ణమునకు సంబంధించనిది) ఆ రెండవ సగములో రెండవ చోట గూర్చినప్పుడున్ను ఈరెండవ పాదములో గూర్చినట్లు పాదాది సంయుక్త వర్ణములలో మొదటిదానికి మొదటి సగములో రెండవచోటను రెండవసగములో మొదట పాదాది సంయుక్తములలో రెండవ దానికి మైత్రిగలదియు రెండవ సగములో రెండవచోట పాదాది సంయుక్తములలో మూడవ దానికి మైత్రిగలదియు గూర్చినప్పుడున్ను చెల్లుబడి కాదు (అట్లు కూర్చ గూడదు) అనియు నెఱుంగునది.

113 పద్య వివ:— ఒక్క పాదమందే బహు (అనేక) యతులు కూర్పవలసి నప్పుడు (పాదాది వర్ణము కాక) తక్కిన యతి స్థలములలో ఒక చోట (అంతకన్న నెక్కువ చోట్లను) సంయుక్త వర్ణములు (జమిలి వర్ణము= జడ్డలు) ఉన్న యెడల (ఉన్నట్టయితే) పాదము సమాప్తి యగు వరకు (పాదములో నన్ని యతిస్థలములలో నున్న) పాదాది వర్ణమునకు (పాదాదియందున్న జడ్డలున్నచో ఆజడ్డలలో నేదో యొక వర్ణమునకే) తక్కిన చోట్లనుండు (వర్ణములలో) జడ్డలలో నేది మైత్రి గలది యగునో ఆ వర్ణమే (ఆవర్ణముతో మైత్రి గలదే) ఉండవలయును. (కూర్పవలయును) గాని ఆజడ్డలలో నొకచోటిది పాదాదివర్ణమునకు మైత్రి చెల్లునదియు, మరియొకచోటిది పాదాది వర్ణమునకు మైత్రి చెల్ల దనియు (పాదాది వర్ణము సంయుక్త మైనచో పాదాది వర్ణ సంయుక్త ములలో నొక దానికి తక్కినచోట్ల జడ్డలలో నొకటియు, మరొక దానికి తక్కిన జడ్డలలో మరొకటియు యతి మైత్రి చెల్లునట్లున్న కూర్చం గూడదు అని తాత్పర్యము. పాదముయొక్క రెండు సగములలోను విడి విడిగా యతి మైత్రులు కుదురుటయే కాని ఈ నియమము సీస పాదములలో లేదు.

114 పద్య వివ:-పెక్కు వళ్ళుండవలసిన ఇట్టి వానిలో దీని మొదటి పాదమునందు వలె కూర్చ వలయును. ఈ పాదములో రెండవ యతి స్థలమందును, మూడవ స్థలమందును సంయుక్త వర్ణములు స్వ వ్రి అని యున్నవి. వీనిలో పాదాది వర్ణమునకు మైత్రి గలది (వ) యనునది అన్ని చోట్లను (తక్కిన నాల్గవ చోటను) వ అనునదియే కూర్చబడినది. (ఇట్లు వకారమునకు మైత్రి గలదేది యైనను గూర్ప వచ్చును. మరియు నిందు పాదాది భిన్నములగు వానిలో రెండు చోట్ల సంయుక్తములు కూర్చ బడ్డవి. ఇట్లొకచోట సంయుక్తములు కూర్చి నప్పుడును ఉండ వలయును. కూర్పవలెను) కావుననిది పై నియమమున కుదాహరణమయ్యె.

ఇందు రెండవ పాదములో 1 దా 2 ద్వా 3 వ్యా 4 య అని

కూర్పబడ్డవి. అనఁగా 2, 3 చోట్ల నున్న సంయుక్తములలో 2 వ దాని సంయుక్తములలో నొకటి (దా, పాదాది వర్ణమునకు మైత్రి గలదియు 3 వ దానిలో (వ్యాలో నేదియు (వా యా లలో నేదియు) పాదాది వర్ణమునకు మైత్రి లేనిదియు (రెండవ దానిలో నొకటి యగు వాకు మైత్రి గలదిగా 3 వ దానిలో నొకటి యగు వ్యాలో నొకటియగు వా యనునది కూర్చఁబడినప్పటికిన్ని) 4 వ చోట య అని పాదాది వర్ణమునకు మైత్రి లేనిదియు (2 వ దానిలో నొకదానికిన్ని ద్వా, దా, వా లలో నొకదానికిన్ని మైత్రి లేనిదియు, 3 వ దానిలో (వ్యా లో) ఒకటియగు యా అనుదానికి మైత్రి గలది యగునట్లున్నూ కూర్చఁ బడుటచే నీపాదములో పై నియమము (చివర అనగా) 3 వ చోటను 4 వ చోటను తప్పి పోయినది కావున నిది ప్రత్యుదాహరణము. పాదార్థ ములు రెంటిలోను విడి విడిగా మైత్రి కుదిరినచోఁ జెల్లునను నియమ మున కిందు భంగము లేదు. గావున నిట్లు సీస పాదములలో గూర్ప వచ్చు ననియు నెఱుంగునది. మఱియు నిందు "వారిత క్షమా కుమార" అని కొన్ని ప్రతులలో గలదు. అప్పుడు 1, 2, 3 చోట్ల వా యనునది పాదాది మైత్రిగలది ఉండుటచే దానిలో తప్పక పోయినను 4 వ చోట వా కూర్పక య కూర్పబడుటచే అక్కడ (చివర) పై నియమము తప్పుటచే ప్రత్యుదాహరణమే యగు ననియు గ్రహించునది.

ఇందు 1, 2 పాదములలో (ఉదాహరణ ప్రత్యుదాహరణము లలో) 2, 3 చోట్ల సంయుక్త వర్ణములున్నవి. ఇట్లు కాక 2, 3, 4 లలో నేదో యొకచోట సంయుక్తములున్ననూ ఇట్టి నియమమే చెల్లవల యును గావున వానికి "వైరి మద తమః పతంగ స్వజన పోషితాంతరంగ వరద మమ్ము బ్రోవు మనఁగ వలయుఁ బెక్కు వడుల మెడల", "వైరి మద తమః పతంగ వర సురేంద్ర పుత్ర సంగ వ్రజ వధూ భుజంగ యనఁగ వలయుఁ బెక్కు వడుల మెడల", "వైరి మద తమః పతంగ వర సురేంద్ర పుత్రసంగ వరద మమ్ముఁ బ్రోవు మెపుడు స్వజను

ననఁగ వళ్ళు చెల్లు" అని ఉదాహరణములు. "దారిత క్షమా కుమార ద్వారకా పురీ విహార వాసవ స్తుత ప్రచార వరద యనఁగ నిదియుఁ దప్పు", "దారిత క్షమా కుమార దైత్య గర్వ హార విహార ధ్యాన మాని గమ్య తత్వ యనఁగ దప్పుఁ గడకు వెడల", "దారిత క్షమా కుమార దైత్య గర్వ హార విహార (తప్పు నిట్లు పెక్కు వళ్లు ధ్యాన సన్నుత యన) వరద వళ్లు తప్పు నిట్లు ధ్యాన సన్నుత యన", "వళ్లు తప్పు నిట్లు వరద ధ్యాన గమ్య యనఁగ" మున్నగునవి ప్రత్యుదాహరణము లని యెఱుంగునది.

109—110 పద్యములకు నడుమనున్న శ్లోకలో గిడుగువారి ప్రతిలోను—యతి నియతి అనిమాత్రము కలదు. బహు యతి నియతి అనియే యుండుట యుక్త మని మా యభిప్రాయము.

అంత్యోష్మ సంధి పదులు 27

---

పాణినీయ సూత్రము:—

ఝయో హో ఽన్యతరస్యామ్

వృ॥ ఝయః పరస్య హస్య పూర్వ సవర్ణో వా స్యాత్ వాక్ హరిః ఘోష వత్త్వాది గుణవతో హస్య వర్గ చతుర్థః పూర్వ సవర్ణ స్స్యాత్ వాగ్ఘరిః

సీ॥ కైరవ కామధు గ్ఘర వాహ కవి కుంద
హైరణ్య గర్భ వా గ్ఘంస బృంద
డిండీర భోగి రా డ్ఢిమ శైల కైలాస
హరి ధవళాంబురు డ్ఢరి నివాస
దేవాశ్వ సుర సరి ద్ధీర ముక్తా కాశ
హరిచంద నైణభృ ద్ధాత్రిదీశ
పారద ప్రాక్కకు బ్భస్తి కంబు క్షీర
హలధర శారదా బ్భయ పటీర

తే॥ పాండుసత్కీర్తి యని యిట్లు వర్గహల్లు
పొల్లులకుఁ బైహకారంబు పొందునపుడు
కంధిబంధన యంత్యోష్మ సంధివిరమ
ణాఖ్యచే దాని కెయ్యది యైనఁ జెల్లు 115

పాణినీయ సూత్రాది వివరణము:—

ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప అను ఝయ్ ప్రత్యాహారములోని వర్ణములలో దేనికైననూ పరముగా (అనంతరముగా) హకార మున్నప్పుడు, అనఁగా ప్రత్యాహారములలోని హకారాదులపై నున్న అకార ముచ్చారణ సౌకర్యమునకే గాని ఇత్సంజ్ఞ మున్నగు ప్రయోజన మేదియు పొందునది కాదు. గావున ఆ అకారము పరిగణింపఁబడనిదే యగుటచేత ఝయ్యు లనఁగా పైని చూపిన ఝకారాదుల (ఝ్, భ్, గ్ మొదలగు) పొల్లు లని భావము ఇట్టి పొల్లులకు హకారము అనఁగా ఇక్కడ సూత్రములో హః అని పొల్లుయొక్క షష్ఠ్యంత రూపమే చెప్పఁబడినను ఈ హః అనునది లక్ష్యములలోని హకారముయొక్క అనువాదమే గాని అపూర్వ మగు ప్రత్యాహారముతో ననువాదము కాదు గావునను లక్ష్యానుసారముగాను సామాన్యముగానే యచ్చుతో గూడినను గ్రహణము కలుగుటకే మీఁది అచ్చు విడనాఁడి నిర్దేశింపఁబడినట్లున్న, అందువలన నేయచ్చుతోఁ గూడిన హకారమైనను పరముగా నున్నప్పుడు అట్టి దానిలోని పొల్లునకు 'హ్'అనుదానికి అనియే గ్రహించవలసినట్లున్న భావము చెప్పుకొన వలయును. గావున అట్టి హకారము పరముగా నున్నప్పు డట్టి హకారమునకు హ్ అను దానికి పూర్వ వర్ణముతో (ఆ వెనుక చూపిన ఝ్ మున్నగు వానితో) సవర్ణ సంజ్ఞ గల వర్ణము 'సవర్ణ సంజ్ఞ యనగా సమాన స్థానమున్ను సమానాభ్యంతర ప్రయత్నమున్ను కలుగుట' ఆదేశముగా వచ్చును. (హకారము పోనాడిదాని తావున నుండును.) ఇక్కడ "అన్యతరస్యామ్"

అనుటచే ఈ యాదేశము వికల్పము గావున పూర్వ సవర్ణాదేశము వచ్చిన రూపము రాని రూపము రెండును ఉండును. మరియు నిక్కడ పూర్వసవర్ణాక్షరములు ప్రతివర్గములోను ఐదేసిన్ని (స్థాన ప్రయత్నైక్య ముచే) అగుటచే ఒకదాని కనేకములు వచ్చుట అసంభవమున్ను, అపూర్వమున్ను అగుటచే వానిలో నేది వచ్చును అని శంక రాగా ఆశంకను ఆంతరతమ్య నిర్ణయముచే పరిహరించుచున్నాఁడు. అనఁగా నొకదానికి అనేకములు సవర్ణము లైనప్పుడు వానిలో నేది స్థాని వర్ణమునకు (ఇక్కడ హకారము స్థాని) మిక్కిలి సదృశము అగునో ఆ వర్ణము ఆదేశమగును. అను నర్థముగల "స్థానేంతరతమః" అను పరిభాష చేతను ఆంతరతమ్య పరీక్ష చేయ వలసినప్పుడు ఒకప్పుడు స్థాన ప్రయత్నములు మాత్రమున్నూ ఉపయోగించిననూ ఒకప్పుడు వివార సంవారాది బాహ్య ప్రయత్నము లుపయోగపడును అను నర్థము గల అభియుక్తోక్తి నియమముచేతను (బాహ్యాప్రయత్నములకు గుణము లనియు నామాంతరము) ప్రతివర్గములోని అయిదేసి వర్ణములలోను చతుర్థ వర్ణమే (ఘ, ఝ, ఢ, ధ, భ అను వానిలోనిదే) ఘోషవత్వము (ఘోష, నాద సంవార మహాప్రాణ ప్రయత్నములు) మున్నగు గుణములు (బాహ్యాయత్నములు) కల హకారమునకు వచ్చును (ఇట్టి గుణములు గల హకారమునకు ఇట్టి గుణము లన్నియు గల ఆ యా వర్గులలోని నాల్గవ వర్ణమే వచ్చును.) కావున వాక్ + హరిః అనుచోట కవర్గములోని చతుర్థ వర్ణము ఘకారము (ఘ్ అనుపొల్లు) హ్ అను పొల్లునకు వచ్చును. అప్పుడు వాక్ + ఘరిః అయి పిమ్మట కకారమునకు "ఝలాం జశోऽన్తే" అను సూత్రముచేత గ్ వచ్చి వాగ్ ఘరిః, వాగ్ఘరిః అని యయ్యెను.

115 పద్య వివ:— ఇందు గిడుగువారి ప్రతిలోను మేము చూచిన ప్రతులన్నిటను "వాగ్ఘరిసబృంద" అనియే కలదు. గిడుగు వారి కిక్కడ ఎట్లర్థము కుదిరెనో గాని మాకు మాత్రము హరిసబృంద

అనుదాని కర్థ మిక్కడ కుదురక "హంస బృంద" అను పాఠమూహింప బడ్డది. (దిద్ద సాహసించితిమి.) గిడుగువారు సిద్ధాంతీకరించినట్లు అన్ని ప్రతులను ఒకేవిధముగా నుండుటచే అచ్చు తప్పుకాక సంస్కర్తల దోషమే కావలయును.

అర్థ:—అబ్భయ, అపః, హాయతీతి, అబ్భయ, హాయ—గతౌ, ఉదకమును (పొందునది) జల ధరము ఇచ్చునది,- అబ్దము మేఘము; హాయ శబ్దమునకు యోగరూఢిచే గుఱ్ఱ మర్థమైనను ఇక్కడ కేవల యౌగికముగా అనఁగా అప్ అనుదానితో గూడి విశిష్ట మొకయౌగిక పదమైకవి వివక్షచే మేఘమున్ను కావచ్చును గనుక అట్లు గ్రహింపఁబడినది. అనఁగా ఇక్కడ అబ్భయ శబ్దమునకు మేఘ మని అర్థము చేసుకోబడ్డది, హాదినీ= వజ్రము, ఈశ= శివుఁడు—తక్కినవి సుగమములు. (ఈయతికి మహాకవి ప్రయోగములు మాపీఠిక చూపినది చూ. పీఠిక.)

ఈ పద్యములో చూపఁబడినట్లు వర్గములు నాల్గింటి లోని (చవర్గీయమునకు హాకారము పరమగునప్పుడు "చోఃకుః" అను సూత్రముచే కవర్గీయము వచ్చును గావున చ వర్గ మిందు గ్రహింపఁబడదు.) మొదటి వర్ణములు నాల్గింటికిన్ని (ప్రత్యాహారములో తక్కినవియు అనఁగా తరువాతి మూడేసిన్ని చేరినను వాని ప్రయోజన మిందు లేదు గావున నవి గ్రహింపఁబడలేదు.) అనఁగా ల్, ట్, త్, ప్ అను ఝయ్యులకు పరముగా హాకారమున్నప్పుడు ఆ హాకారము వికల్పముగా పైని చెప్పబడిన రీతిగా పూర్వ సవర్ణము వచ్చి చతుర్థ వర్ణమై ఘ, ఢ, ధ, భ అనువాని పోల్లులుగా మారినను (ఆ మాఱుట వికల్పముగావున ఆ యాదేశముచే మాఱిన రూపమునకును సహజము హాకారముగావున హాకారమునకు రెంటికిని ప్రాధాన్యము గలిగి చతుర్థ వర్ణమై మాఱినప్పుడున్ను ఘ్, ఢ్, ధ్, భ్ అను రూపముతోనే ఉన్నప్పుడున్ను ఉభయమునకును అనఁగా ఆ యా వర్గీయములకును (నాల్గేసింటికిని) హాకారమునకును (లక్ష్యములలో హాకార మొక్కటియే

యున్నను దానితో మైత్రి గలవన్నియు చెల్లుటకు ప్రతిబంధము లేదు. ఉభయమునకు మైత్రి గల వర్ణము లెల్ల యతికి పనికి వచ్చును. ఇట్లు అంత్యోష్మ వర్ణమగు హకారసంధిలో చెల్లునది గావున నీ నామము సార్థక మగుచున్నవి. లక్ష్యమును బట్టియు తెలియు చుండుటచే అజ్ఞ్మైత్రి భేదముచే గలుగు భేదత్రయమున్ను ఇట్లే యెఱుంగునది. క్రమముగా పై సీస పాదములు నాల్గింటను లక్ష్యములు గ్రహించు కొనుట సుకరము.

మఱియు హకారమునకు వర్గీయ చతుర్థ వర్ణములు ఆదేశములై వచ్చినను అట్టిరూపములో గూడ హకారశ్రుతియు నుండుట నీయతి పుట్టుకకు బీజ మనవచ్చును గాని దీని తరువాతి దగు వికల్ప విరమణ ములో అట్టి శ్రుతియు (స్థాని శ్రుతి) ననుభవ విరుద్ధము కావున మొత్తము మీఁద (అన్నిట సరిపడునట్లు) శాస్త్ర విహిత మగు నాదేశ వికల్పతయే ఈ వికల్ప యతుల కాధారమని తోచుచున్నది. దీనిలోను తరువాతి దానిలోను సంయుక్తము లుండుట తప్పదు గనుక సంయుక్త యతి చెప్పి ఇవి చెప్పుట క్రమప్రాప్తమే యగు చున్నది.

మఱియుం బరికింప ఈ హ కారమునకు వచ్చు నీ యాదేశము వికల్పమగుటచే వాగ్ఘరిః, వాగ్ఘరి అను రూపములువలె (తక్కిన వర్గీయ వర్ణములతో) ట త ప అను ఝయ్యులంగూడిన పదములలోను చతుర్థ వర్ణ ఘటితములు హకార ఘటితములు నయి రెండేసి రూపము లేర్పడుటచే హకారమైత్రి చెల్ల వలసినప్పుడు ఆదేశముచేయని రూపము చేతను తత్తద్వర్గీయ యతి చెల్లవలసినచో ఆదేశము చేయని రూపము చేతను (పూర్వ వర్ణమును బట్టి సంయుక్తయతి స్వభావముచేతను) ఆదేశము చేసిన రూపముచేతను ఉభయ యతులు (దీని యపేక్ష లేకయే) సిద్ధించుచున్నను ఇట్లేల ఈయతి చెప్పవలసెను అని యాక్షేపణ వచ్చుచున్నను దాని కొక శాస్త్రీయ సమాధాన మూహింప వచ్చును. అనగా సంధి వికల్పమైనను ఇట్టివానిలో సంధి కూర్చిన రూపము లే

విరివిగా నుండును గావునను అట్టిరూపములు ఆదేశము వచ్చినప్పటివే ఉచ్చారణ సౌకర్యము కలవియై ఆదేశము చేయనివి కఠినోచ్చారణ (బెట్టుగా నుచ్చరింపబడుట) కలవియై శ్రమాధాయకము లగుటచేతను ఆదేశ రూపముతో నుచ్చరించుటయు అట్లు లిఖించుట యుక్తమగుట చేతను అట్లాదేశరూపములలోనూ ఇట్టి ఉభయ యతి చెల్లుట ఈయతి లేక సిద్ధించ దను సమాధానమే కాక మరియు వికల్పముగా కార్యములు విధింపఁబడి నప్పుడా కార్యములు చేసిన రూపములు ప్రయోగించి నప్పుడే దృష్ట ఫలము (శబ్ద సాధుత్వమున్ను అదృష్టఫలమూ (పుణ్య రూపమున్నూ) ఉభయమున్ను సిద్ధించుటచేతను ఆకార్యము (వైకల్పికత్వముచే) చేయని రూపములు ప్రయోగించి నప్పుడు (దృష్టఫలమే కాని) శబ్దసాధుత్వమే కాని అదృష్ట ఫలము (పుణ్యము) సిద్ధించదను శాస్త్రీయ నియమ ముండుటచేత ఆనుషంగికముగా పుణ్యమున్ను సిద్ధించుటచే (ఏ అర్థద్వయము కూర్చవలసినప్పుడో కాక) మరొకప్పుడు సాధారణముగా కవికి అట్టిరూపములే (ఆదేశ ఘటిత రూపములే) ప్రయోగించుట సహజముగా నపేక్షిత మగుటచేతను, అట్టి రూపములలోను ఉభయ వర్ణ మైత్రి ఘటించుటలో కవితా సౌకర్య ముండుట చేతను అట్లుభయ యతి (సహజమగు హాకారమునకును మైత్రి చెల్లుట) ఈయతి లేనప్పుడు సిద్ధించదు కావున ఇట్టియతి పుట్టినదనియూ నూహింపవచ్చును. ఇట్లే తరువాతి యతి విషయమునను శంకా సమాధానము లున్నవి. (ఊహింప వచ్చును కాని ఈ యతియును ముందరి యతిలో (వికల్ప విరమణములలో) నంతర్భూతమే (ఏకదేశమే) అనఁగా దానిచేత సిద్ధించునదియే గావున ఇట్లేల వేఱుగాఁ జెప్పఁబడియెను అను నాక్షేపణకు మాత్రము సమాధానము దొరకదనియే తోఁచుచున్నది. కావున నీయతియు ముందరి యతియొక్క ప్రపంచరూపమే యనియు మొత్తము మీద వికల్పసంధి యతులన్నియు నిట్టివే యనియు వీనికి పైని చెప్పినట్టి ఫలమున్నను అత్యంతావసరములు కావనక తప్పదేమో యని యును తోఁచుచున్నది.

## వి క ల్ప వి ర మ ణ ము లు 28

పాణినీయ సూత్రము :—

సూ॥ యరోఽనునాసికే ఽనునాసికో వా.

వృ॥ యరః పదాన్తస్యానునాసికే పరే అనునాసికో వా స్యాత్.

ఏతన్మురారిః, ఏతద్మురారిః, మయటి నిత్యమ్ వాచ్యమ్, చిన్మయః.

వివ:— యర్ (అను వర్ణ సమామ్నాయములోని) ప్రత్యాహారములోని య, వ, ర, ల, ఞ, మ, ఙ, ణ, న, ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప, శ, ష, స అను అనఁగా హకారము గాక తక్కిన హల్లు లన్నియు ఇట్టి వర్ణములతో సదృశములగు పదాంతమున నుండు వర్ణములలో దేని కైనను ఇట్టి వాని పొల్లులకు ఇట్లే ప్రత్యాహార రూపముగా నున్నప్పు డెల్ల వెనుకముందుల నెఱుంగునది. ప్రత్యాహారమనఁగా వర్ణ సమామ్నాయములోని వర్ణములలో ఎన్ని వర్ణములు సంగ్రహముగా (అణ్, అచ్, హల్ అను చిన్నపదములతో) తెలుపవలెనో ఆవర్ణముల మొదటి దానిని (అ, ఇ, హ, య మొదలైన వానిని) వాని చివరనుండు (ఎన్ని వర్ణములు కావలెనో ఆవర్ణముల కట్టకడ నుండు) పొల్లుతో (ణ్, క్, చ్, ల్ మొదలగు వానిలోని దానితో) కలిపి (ఉచ్చరింప లేక) వ్రాయ అణ్, అల్, అచ్, యర్, హల్ మున్నగు రూపము లేర్పడును. అట్టి వానిని లాఘవమునకు సూత్రములలో (ఆ యా విభక్త్యంతములతో గూర్చి (ఇకః, అచః, హలి మున్నగు విధముగా) చెప్పుట మొత్తము మీద "ప్రత్యాహ్రియంతే వర్ణాః అత్ర" అనగా దీనియందు అనేక వర్ణములు (ప్రత్యేకముగా విస్తరముగా తెలుప నక్కఱలేకుండా) సంగ్రహింపబడును. చిన్నమాటతోఁ దెలుపఁబడును కావున దీనికిఁ బ్రత్యాహార మనిపేరు అను వ్యుత్పత్తిచే సంగ్రహముగా తెలుపుట అని యెఱుంగునది. అనునాసిక వర్ణము ఏయచ్చుతోఁ గూడినట్టిదైనను ఞ, మ, ఙ, ణ, న అనువానిలోని ఏవర్ణమైనను

అని యర్థము వచ్చుచున్నను సంభవమును బట్టి యిక్కడ అనునాసిక వర్ణము అనఁగా మ, న అనునవి అనియు పైని యరః అనఁగా క్, ట్, త్, ద్, ప్ అను నయిదు వర్ణములకు మాత్రము అనియు గ్రహించుకొనవలయును. చతుర్ + ముఖ - చతుర్ముఖ మున్నగువానిలో ర్ అనునది (రకారము మున్నగునది యరులలోనిది) సంభవించుచున్నను ఇట్టివర్ణములపట్ల "స్థానేంతరతమః" అనుదాని సప్తమ్యంత పక్షము ననుసరించి మిక్కిలి సదృశమగు స్థాని కాకపోవుటచేతను (ఆదేశ వర్ణమునకున్న స్థానప్రియత్నములలో స్థానైక్యమొక్కటియే కలుగుట చేతను; అట్టి స్థానప్రియత్న ద్వయసాదృశ్యము కలిగిన స్థానులు స్పర్శ వర్ణములలోని క్, ట్, త్, ప్ అనునవి కలుగుటచేత వానియందు చరితార్థ మగుటచేతను ఈవిధి చెల్లదు. చతుర్ముఖ మున్నగు వానిలో నీసూత్రముచేత అనునాసికాదేశము (ణ్ అనునది) రాదు. చతుర్ముఖ అనఁగూడదు. ఇట్టి అనునాసికవర్ణము పరమైనప్పుడు వెనుక చెప్పినట్లు గ్రహించుకోవలసిన యరులలోని (క్, ట్, త్, ద్, ప్ అను వాని లోని) దానికి అనునాసికవర్ణము (వాని వాని పంచమ వర్ణములగు ఙ్, ణ్, న్, మ్ అను వానిలోనిది) వికల్పముగా వచ్చును. అప్పుడు ఏతద్ మురారిః అనియుండ ఆదేశమువచ్చి ఏతన్మురారిః, అది రాక ఏతద్మురారిః అనియు మున్నగు రూపద్వయము లేర్పడును. మఱియు మయట్ ప్రిత్యయములోని మ అను ననునాసికము పరమగు నప్పుడు పైని చెప్పిన అనునాసిక వర్ణాదేశము నిత్యము గానే వచ్చును అను నర్థముగల వార్తికముచేత చిన్మయః అని ఒక్కరూపమే యేర్పడును. చిత్ + మయ- ఇందలి మయ అనునది మయట్ అను ప్రిత్యయములోనిది యగుటచేత చిన్మయ అనియే కాని చిద్మయ అని కాదు అనిభావము గ్రిహించు నది. మఱియు నిక్కడ మయట్ ప్రిత్యయ మొక్కటియే గ్రిహింపబడి నను ఇది "ప్రిత్యయే భాషాయామ్ నిత్యం" (వేదములో కాక) లౌకిక భాషలో ఏ ప్రత్యయములోని యనునాసికము పరముగా నున్నను పైని

చెప్పిన యాదేశము నిత్యముగా వచ్చును అను నర్థముగల వార్తికము యొక్క ప్రపంచమే అనియు (స్పష్టముగా తెలుపుటకు సమూహముగా చెప్పిన దాని ఏకదేశమును విడిగా చెప్పుట) అందువలన నే ప్రత్యయము లోని యనునాసికము ముందున్నను (పరముగా నున్నను) ఈయాదేశము నిత్యమే యనియు అందువలన తన్మాత్రమ్ (తద్ + మాత్రమ్ ఇది మాత్రచ్ ప్రత్యయాంతము) కావున ఒక్కరూపమే యగును. తన్మాత్రమ్ అని కాదు. ఇట్లే తక్కిన ప్రత్యయాంతము లండెల్ల ఒక్కొక రూపమే అనియు గ్రహించునది.

తే॥ వ్యాకరణ సూత్రముల సంధు లతుకు నపుడు
రెండు విధముల రూపంబు లుండెనేని
వసుధ నయ్యక్కరముల కవ్వల వికల్ప
సంధి విరమణ మన రెండు సాగు చుండు 116

వివ:—(పైని చూపిన "యరోఽనునాసికేఽను నాసికోవా" మొదలగు) సంస్కృత వ్యాకరణ సూత్రముల చేత ఆదేశములు వికల్ప మగుట చేత (పైని చూపిన విధముగా) రెండేసి రూపములేర్పడు పదములలో ఆదేశమువచ్చిన రూపములోనే ఆయా దేశముగా వచ్చిన వర్ణమునకు మైత్రి గల వర్ణములున్ను, ఆదేశము రానప్పుడు సహజముగానుండు వర్ణమునకు మైత్రి గల వర్ణములున్ను, (ఉభయవిధ వర్ణములున్ను) వికల్ప సంధి యతులను నామముతో చెల్లుబడి యగును. యతి స్థానమున గాని పాదాదిని గాని ఉండు ఆదేశముగా వచ్చిన వర్ణమునకు పాదాదిని గాని యతిస్థానమున గాని పైని చెప్పిన ఉభయ విధ వర్ణములును ఏవియైనను కూర్పవచ్చును అని భావము.

తే॥ నంద సుకుమార గూఢ పాన్మద విహార
దళిత శిశుపాల గోత్ర భిన్మణి వినీల
నాగ పర్యంక శాయి సన్మార్గ యాయి
ధాతృ నుత నామ యోగి హృన్మధ్యధామ 117

[1]ఆది పురాణమునందు:—

మ॥ ఒక నాఁడిందు ధరుండు ౘార్వతియు లీలోద్యాన కేళీ సరి
న్నికటానేక వన ప్రదేశముల దై తేయేంద్ర కన్యాప్సరో
నికురుంబంబులు పారిజాత కుసుమానీకంబు పైఁ జల్ల ద
ర్పక బాణంబుల కెల్ల నెల్ల యగు సౌభాగ్యంబు శోభిల్లఁగాన్ 118

మనుచరిత్రమునందు:—

మ॥ అకలంకౌషధ సత్త్వముం దెలియ మాయా ద్వారకా వంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగముల నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్రమిమ్మ్రుంచుకొం
డకు రాఁ జెల్లునె బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్
(2, 16) 119

తే॥ హాల ధరానుజ మయటి నిత్యం బటంచుఁ
బలుకు వాక్యంబుచే మయ పదముగూడు
నప్పుడ ననాసికమ్మె నిత్య మయి నిల్చు
నళిన లోచను మేను చిన్మయ మనంగ 120

ఇవి వ్యంజనాక్షర విరతి భేదంబులు.

117 పద్య వివ:—ఇందు 1, 3 పాదములలో 'గూఢపాత్ + మద—గూఢపాన్మద అను చోటి—న్మ) న అను యతిస్థల వర్ణమునకును ఆదేశము వచ్చిన దానికిని దానికి మైత్రి గలదియై పాదాది యందున్న న అనుదానికిని, అట్లె సతీ+మార్గ—సన్మార్గ అను చోటి (న్మా) నా అను యతిస్థల వర్ణమునకును (ఆదేశ వర్ణమునకును) దానికి మైత్రిగల పాదాది నా అదానునికిని యతి మైత్రి చెల్లుచుండుటచే నివి రెండును ఆదేశము వచ్చిన దానికి చెల్లుటకును, 2, 4 పాదములలో యతిస్థలమున

1 ఆదిత్యపురాణమునందు (ప) ఇది సోముని ఉత్తర హరి వంశములో ఉన్నది. ఇందు ధరోపాఖ్యానమునందు మొదటి పద్యము అని గిడుగు వారి ప్రతిలో.

(గోత్ర+భిత్+మణి-గోత్రభిన్మణి అని) ఆదేశము వచ్చియున్నను సహజ ముగా 'మొదటనున్న (ఆదేశము నొందనప్పటి) వర్ణమునకే (తకారము నకే) మైత్రిగల పాదాది దకారమునకును అట్లే హృత్ + మధ్య —హృన్మధ్య అను చోట (యతిస్థలమున) తకారమునకును పాదాది ధాకు న్ను యతి చెల్లుచుండుటచేత నివి రెండును ఆదేశమునొందని సహజ వర్ణమునకు చెల్లుటకును ఉదాహరణము లని లక్షణ సమన్వయము.

118 పద్య వివ:— దార్ఢ్యమునకుఁ జూపిన మహాకవి ప్రయోగము. (ఇట్లే తరువాతిదిన్ని)

ఇందు 2వ పాదమున పాదాదిని సరిత్ — నికట—సరిన్నికట అను దాని (న్ని) ఆదేశము వచ్చి యేర్పడినను ఆదేశము రానప్పటి త్ (తి) అను దానికిని యతివద్ద (దానికి మైత్రిగల) తే అనుదానికి మైత్రి చెల్లు టచే ఇది సహజ వర్ణమునకుఁ జెల్లుటకున్ను, 119 లో 4 వ పాదములో మొదట నున్న ౦డ అనుదానికిని (అను స్వార సంబంధ యతి నియమ ముచే) దానితో మైత్రి గల యతి స్థలము నందలి ఉన్మాద (ఉత్ + మద) ఆదేశము వచ్చినప్పటి (న్మా) నా అనుదానికిని చెల్లుటచే ఆదేశము వచ్చిన వర్ణమునకు చెల్లుటకును ఉదాహరణము లనియు నెఱుంగునది.

120 పద్య వివ:— పైని చెప్పిన ప్రకారము మయట్ అను ప్రత్య యములోని మకారము పరమగు నప్పుడు పై యాదేశము నిత్యముగావున ఒకప్పుడైనను సహజ వర్ణఘటిత రూప ముండదు గావున (అట్టిమయ పద ముతోఁ గూడి నప్పుడు చిత్ + మయ—చిన్మయ అని ఒక్క రూపమే యే ర్పడుటచే అట్టి దానిలో ఆదేశ వర్ణమునకే కాని సహజవర్ణమునకు తకా రమునకు) మైత్రిచెల్లదు. అనగా అనునాసిక వర్ణమునకు (నాకు) మైత్రి గలవే గాని త కారమునకు మైత్రిగలవి పనికిరావు. ఈ పద్యములో 4 వ పాదములో యతి వద్ద చిన్మయ అనుదాని నకారమునకును, పాదాదిని న అనుదానికిని మైత్రి చెల్లెను. ఇక్కడ తకారమునకు మైత్రిగలవి చెల్లవు.

ఇట్లే తన్మాత్రము మొదలగు వానిలోను ఆదేశము వచ్చిన దానికే గాని సహజ వర్ణమునకుఁ జెల్లదు గావున అట్టి లక్ష్యము లూహించుట సులభము.

మఱియు మతుప్ ప్రత్యయాంతములలో కొన్నిచోట్ల మతుప్పు లోని మకారమునకువచ్చు వకారము నిత్యమైనను వకారముతోఁ గూడిన రూపమొక్కటే యేర్పడినను ఆ వకారమునకే కాక మొదటి సహజమగు మతుప్ లోని మకారమునకును ఈ ఆదేశయతి చెల్లవచ్చు ననియు అప్పుడు దానికి మతుప్ మకార యతి అనియో (మరియొకవిధముగానో) పేరు పెట్టి దాని కుదాహరణముగా ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములోని క్రిందఁ జూపఁబడు పద్య ముదాహరణముగాఁ జూపవచ్చుననియు అందు చేత క్రొత్తగా నిట్టి యతియు నొకటి కల్పించవలెనేమో యనియు లక్ష్యాంతరమునకు విమర్శించ వలయు ననియు తోఁచుచున్నది. పైనిచెప్పిన పద్యము :

చం॥ మది మది నుండి యేను బలవంతుఁడనై బెడిదంపుఁ గయ్యా
మెట్లొదవు నో యంచు నాప్తసచివోక్తుల కెన్నఁడు వీను లొగ్గ కి
య్యద నది పొందఁ బాలయితి నక్కట మెచ్చని దైత్య దానవ
త్రిదశ వరుల్ గనుంగొనఁగ దీనత వచ్చెనె నేర్పు చాలమిన్

(హరి. ఉ. 8 వ ఆ. 213 వ పే.)

ఇక నుభయ వళు లెట్టి వనిన వివరించెద.

సీ॥ సర్వేశ యుష్మ దస్మ చ్ఛబ్ద యతులును
బరరూప విరతులు ప్రాది యతులు
వెండి నిత్యసమాస విశ్రాంతి దేశ్య నిత్య సమాస ని
త్యా భిధానములును
రాగమ సంధి విభాగ నామాఖండ
పంచమీ వికృతి విభక్తి యతులు
కాకు స్వర ప్లుతాక్షర యుగ విశ్రామ
ములు నన నుభయాఖ్య వెలయు వళులు

తే॥ క్రమత శబ్దాను శాసన ప్రభృతి పూర్వ
కవిజనంబుల కృతుల లక్ష్యములు కలిమిఁ
బదియు రెండు విధంబులై పరఁగు చుండుఁ
దద్విధంబులు దెలియంగఁ దగు ముకుంద 121

యుష్మ దస్మ చ్ఛబ్ద యతులు.

వివ:— యుష్మ దస్మ చ్ఛబ్ద యతి మున్నగు పేరులతోఁ జెప్పఁ దగిన 12 విధముల ఉభయ యతులు నన్నయ మున్నగు మహాకవుల ప్రయోగముల నుండుటచేత అవి యెల్ల లక్ష్య లక్షణములతోఁ దెలుపం బడుచున్నవి. ఉభయ యతి యనగా అచ్చునకు (పరపదాది నుండు అచ్చునకును' పూర్వమున నుండు హల్లునకును మైత్రి వర్ణములు (అట్టి వర్ణములలో నేవి యైనను' యతి మైత్రికిఁ బనికి వచ్చుట అనఁగా స్వర ప్రధానయతియే గాక ప్రాణియతియు 'అఖండయతియు' జెల్లుట- అందుయుష్మ దస్మ చ్ఛబ్ద యతు లెట్టి వనిన:

క॥ క్షితి నస్మ ద్యుష్మ త్పద
యతులనఁ గావ్యముల యుష్మ దస్మ చ్ఛబ్ద
ద్వితయమునకుఁ బైఁ బ్రాణము
లతికిన నుభయంబుఁ జెల్లు నభయ విహారా 122

సాంబోపాఖ్యానమునందు:—

క॥ చతురానన నందన ది
వ్య తపోధన వర్య యుష్మ దాగమనమునఁ
గృత కృత్యుఁడ నైతిని నే
నతిపావనమయ్యె నస్మ దన్వయ మెల్లన్ 123

అధర్వణాచార్యుల విరాట పర్వమునందు:—

ఆ॥ ధర్మ తనయ యుష్మ దాజ్ఞా నిగళ విని
బద్ధమగుచుఁ జిక్కువడియెఁగాక
విజయ మత్త గజము విడి వడ్డచో నడ్డ
పాటు గలదె విష్టప త్రియమున 124

ఆది పర్వమునందు:—

> క॥ ప్రస్తుత ఫణి సత్ర భయ
> త్రస్తాత్ముల మైన యస్మ దాదులకెల్లన్
> స్వస్తి యని పలుక నవసర
> మస్తికున కయ్యె నిప్పు డంబుజ నేత్రా 125 (2, 219)

122 పద్య విన:- యుష్మద్ అను శబ్దమునకును అస్మద్ అను దానికిని పరముగా అజాది పదము గూడినప్పుడు యుష్మద్—ఆగమ నము—యుష్మదాగమనము, అస్మద్ — ఆది—అస్మదాది మున్నగు రీతిగా నేర్పడఁగా ఆ పర పదాది నుండు అచ్చునకు మైత్రి గలవిన్ని పూర్వ మున నుండు పొల్లుతో (అనఁగా) ద్ అనుదానితో పర పదాది నున్న అచ్చు కూడగా నేర్పడిన (దా) అను దానికి మైత్రి గల వర్ణములున్ను యతి మైత్రి నొందును. స్వర ప్రధాన యతియు వ్యంజనాక్షర యతియు అనఁగా ఖండాఖండ యతులు రెండున్ను చెల్లుచుండును. అట్లు యుష్మ చ్ఛబ్దములోఁ జెల్లి నప్పుడు యుష్మచ్ఛబ్ద యతి యనియు అస్మ చ్ఛబ్ద ములోఁ జెల్లినచో నస్మచ్ఛబ్ద యతియు మొత్తము మీఁద యుష్మదస్మ చ్ఛబ్ద యతి యని యన్వర్థక నామము.

123 పద్య విన:- ఇందు 2వ పా. న యుష్మదాగమన అను చోట నున్న (పైని చూపినట్లేర్పడిన) దానిలోని యుష్మద్+ఆగమన అన్నప్పటి స్వరముయొక్క ప్రాధాన్యమున ఆ అనుదానికి మైత్రిగలది పాదాదిని (వ్య) య అనునది చెల్లినది కావున నిది స్వరప్రధాన యతి చెల్లుట కున్ను (అనఁగా యుష్మచ్ఛబ్దములో చెల్లుటకున్ను) అట్లే 4 వ పా. న అస్మద్ — అన్వయ అను నప్పటి అ అను దానికి పాదాదిని అ అనునది కూర్పబడి చెల్లుటచే అది అస్మచ్ఛబ్దమున స్వరప్రధాన యతి చెల్లు టకును 124 లో 1 వ పా. న (యుష్మద్ — ఆజ్ఞా) యుష్మదాజ్ఞా అను దానిలోని దా అనుదానికి మైత్రి గలది పాదాదిని ధ అను నది కూర్పఁబడి చెల్లుటచే నది యుష్మచ్ఛబ్దములో వ్యంజనాక్షర యతి

(అఖండయతి) చెల్లుటకున్ను 125 లో 2వ పా. న (అస్మద్+ఆదుల) అస్మదాదుల అను-చోట దా అనుదానికి పాదాదిని (త్రి) త అనునది మైత్రి) గలది కూర్పబడి చెల్లుటచే నది అస్మచ్ఛబ్దములో అఖండయతి (వ్యంజనాక్షరయతి) చెల్లుటకును ఉదాహరణము లయినవి.

మఱియు నిట్టి యుభయ యతిపదములలో దప్ప దక్కిన చోట్ల నఖండయతి అప్పకవి మతమున లేదనియు, ఈ రెంటివంటి పదము లనేకములున్నను వాని యందిట్లు చెల్లకుండుటకు అట్టి మహాకవి ప్రయోగము లాతనికిఁ గానరాకుండుట అనుటకన్న మరొక సరియైన హేతు వప్పకవికిని ఉండదనియు నెఱుంగనగునది.

మఱియుఁ బైని చూపిన లక్ష్యము లెల్ల యతి నియత స్థలమున నున్న యుష్మ దస్మ చ్ఛబ్దములకేఁ జెల్లు నట్లున్నను అవి పాదాదినున్నను ఇట్లె చెల్లుబడి కావచ్చు ననుటకు:

ఆ॥ అఖిల మౌని పూజి తాంఘ్రి యుగళ యుష్మ
దాగమమున జన్మ ధన్య మయ్యె
నాగమౌఘ వర్ణి తాతి మహిమ యస్మ
దఘము దునిమి ప్రోవు దయ దలిర్ప

ఆ॥ నంద గోప బాల నందితామర యుష్మ
దాఖ్య లెన్న శుభము లలము గోనును
సర్వ లోకనాథ సన్ను తించెద నస్మ
దఖిల వాంఛితమ్ము లర్థి నొసఁగ

అనియు నుదాహరణము లూహింపవచ్చును.

పై మహాకవుల లక్ష్యములలో నుపసర్గ యతి చేతనే గతార్థ మగుచున్న దనియు అందువల్ల అప్పకవి ఇట్లు చెప్పుట ప్రపంచార్థమే యనియు (నిర్గళితార్థానువాదమే సిద్ధించిన దానిని స్పష్ట ప్రతిపత్తికి చెప్పుట) విమర్శించు కొందఱు నవీన విమర్శకాగ్రగణ్యుల యభిప్రాయము అప్పకవి నిర్వచనము చొప్పున కుదుర దనియే వెనుక విమర్శింపఁ బడిన దనియు నెఱుంగునది. (చూ. పీఠిక)

## 2 పరరూప విరతులు

సూ. అచోఽన్త్యాది టి

వృ. అన్త్యాచ్ ప్రభృతి శబ్ద ష్టి సంజ్ఞ స్స్యాత్

వివ:— అచ్చులలో చివరనుండు అచ్చు ఏసమూహామునకు మొదట నుండునో (మనస్) అస్ (పతత్) అత్ మున్నగు విధముగా నుండునో ఆ సమూహామంతకును (అస్, అత్ మున్నగు అజ్ఝల్ సమూహామునకు) కొన్ని చోట్ల సమూహా ముండకపోయినను ఆచివర నుండు వర్ణ మొక్కదానికిని (కర్క — అంధు—కర్కంధు అను చోట కర్క అనుదాని పై నున్న అ అను నది యొక్కటియే చివరనుండు అచ్చయి దాని తరువాత హల్లు లేక సమూహాము కాకపోయినను ఆ యొక్క దానికిన్ని, ఇట్లే అన్ని చోట్లను) టి యని సంస్కృత వ్యాకరణములో పై సూత్రముచేత పేరు పెట్టఁబడినది అని తాత్పర్యము. ఒక్క అచ్చే గల పదమైనప్పుడున్ను అది హాలంతమైనచో (వాక్ మున్నగు విధముగా) అక్ మున్నగు సమూహామునకును; మా, శ్రీ మున్నగు విధముగా అజంత మైనప్పుడు ఆ చివరనున్న ఆ ఈ మున్నగు వర్ణమునకును మఱియు అ, ఇ మున్నగు ఏకాక్షరూప పదములయందును ఆ ఒక్క వర్ణమునకును టి యనియే పేరనియు నెఱుంగునది.

వా. శకం ధ్వాదిషు (షేః) పరరూపం వాచ్యమ్

వివ:— శకంధ్వాది గణములోని పదములయందు (ఇక్కడ శకంధు శబ్ద మాదిని గల సమూహాము (గణము) ఒక్కటి యే యగుటచే శకంధ్వాది అని బహువచనాంత మెట్లు పొసఁగెను అని శంక వచ్చినను అనేకములను (పదములను) ఒకే పదముతో (లాఘవ మునకు) చెప్పు నప్పుడు (ఆ పదములలో నొక పదము పేర అనఁగా భూ ఆదిని గలది-భ్వాది, ప్ర ఆదియందు గలది - ప్రాది, శకంధు ఆదిని గలది-శకంధ్వాది మున్నగు విధముగా నిర్దేశించు నప్పుడు) ఆ సమూహా మొక్కటియే గావున సమూహా (అవయవి) వివక్షచే ఏకవచనాంతము

గాను అందవయవములు (పదములు) అనేకములు గావున అవయవ పదభేదవివక్షచే బహువచనాంతము గాను ఉండవచ్చును అను శాస్త్ర నిర్ణయముచే నిక్కడ నవయవ భేదవివక్షచే బహువచనాంత మయ్యె నని సమాధానము టీకి పరరూపము చెప్ప వలసినది. అనఁగా పర పదము అజాది యై పూర్వ పదము హలంతము గాని అజంతము గాని అయి సమాస వశమున (వృత్తి వలన) నేర్పడిన (శక+అంధుః) శకంధు మున్నగు ఈగణములో (నిర్దిష్టములగు) పదముల సిద్ధి విషయమై పూర్వ పదములోని టీ కిన్ని (వెనుక చెప్పినట్లు టి అను పేరు గలదానికిన్ని) పర పదము మొదటి యచ్చునకును రెంటికిని (మాఱుగా) బదులుగా పర పదాది నున్న అచ్చొక్కటియే వచ్చును. వానికి వెనుకటి విధానములచే రావలసిన సవర్ణదీర్ఘ గుణాదు లేవియు రావు; ఇట్టి పర రూపమే వచ్చును. ఇక్కడ (వార్తికములో) శః అను పదము లేకయు శకం ధ్వాదిషు అనుదాని సప్తమిని విషయసప్తమిగా వివక్షించుట చేత వచ్చిన యర్థమును వృత్తిలో ఇట్లు చెప్పెను. (శః అనుపదమున్ను గూర్చి చెప్పఁబడ్డది అనగా శకంధ్వాదుల సిద్ధివిషయమున ఎట్లు పర రూపము చెప్పఁకొన్నచో శకంధు మున్నగురూపము లేర్పడునో అట్లు పరరూపము చెప్పనది అని యర్థమగుటచేత టీకి పరరూపము వచ్చి నప్పుడు గాని ఈ పదములు సిద్ధింపవు గావున టీకి పరరూపమువచ్చు నని చెప్పబడ్డది. అందువలన శక+అంధు అనియుండ పూర్వపరాచ్చు లకు సవర్ణదీర్ఘమురాక ఈపరరూపము వచ్చి శకంధు అయినది. శకాంధు అనికాలేదు. ఇట్లే పతత్ — అంజలి, మనస్ — ఈషా అనువానిలోని టి, అత్, అస్ అనునదిగావున ఆ టి కిన్ని పరపదాది యగు అచ్చునకున్ను రెంటికి ఒకటే పర పదాద్యచ్చు వచ్చి (అత్, అస్ అనునవి పోయి) పతంజలి మనీషా అని యైనవి అని తాత్పర్యము గ్రహించునది. ఈ గణము లోని అన్ని పదములకు నిట్లే నిష్పత్తి గ్రహించునది. అట్టి యీగణములోని పదములను శ్లోకములతోఁ జెప్పి వివరించుచున్నాడు.

శ్లో॥ శకంధు రథ కర్కంధూః కుద్దాలో ఉలక్త పర్కటీ,
లాంగలీషా హలీషా చ మనీషా చ పతంజలిః.
కుత్కీలోష్ణీషమంజీర మస్తిష్క కులటాదయః,
తథా వృకంధు సీమన్తా శకంధ్వాదిగణే స్మృతాః.

శకానాం దేశానాం అంధుః కూపః శకంధుః, శకంధు వనఁగాను శకదేశమునందలి బావిపేరు. కర్కస్యాంధూః, కర్కంధూః. 'కర్కంధూర్బదరీ కోలీ'త్యమరః. కర్కంధు వనఁగాను రేఁగు చెట్టు. కం శిరః, ఉష్ణవీర్యత్వా దుద్దాలయతీతి కుద్దాలః; కుం భూమి ముద్దాలయతీతి వా. దళ విశరణే. ఉ దిత్యుపసర్గః. 'కుద్దాలో బహువారకః' ఇత్యమరః. కుద్దాల మనఁగాను విరిగిచెట్టు. పాద మలతీత్యలక్తః. అల భూషణే-'యావో లక్తో ద్రుమామయ' ఇత్యమరః. అలక్త మనఁగాను లత్తుక పేరు. పర్చ్యతే పరస్పరం స్పృజ్యత? ఇతి పర్కటీ. పృచి సంసర్గే. 'ప్లక్షో జటీ పర్కటీ స్యాత్' ఇత్యమరః. పర్కటి యనఁగాను జువ్వి చెట్టుపేరు. లాంగలస్యేషా లాంగలీషా, 'ఈషా లాంగలదండ స్స్యాత్' ఇత్యమరః. హలస్యేషా హలీషా. ఈ రెండును ఏడికోల పేళ్లు. మనసః ఈషా లాంగలదండ వత్సంబద్ధా మనీషా. 'బుద్ధి ర్మనీషా ధిషణా' ఇత్యమరః. మనీష యనఁగా బుద్ధి పేరు. పతత్ అంజలిః పతంజలిః. పతంజలి యనఁగాను వ్యాకరణమునకు మహాభాష్యము చేసిన నాగము పేరు. కోర్భూభమే రుత్కీలః కుత్కీలః. 'అగ కుత్కీల జీమూత సానుమ న్నగ పర్వతాః' ఇత్యమరః. కుత్కీల మనఁగాను గట్టుపేరు. ఉష్ణస్య ఈషః, ఉష్ణీః. 'ఉష్ణీష శ్శిరోవేష్ట కిరీటయోః' ఇతి నానార్థే. ఉష్ణీష మనఁగాఁ దలపాగ పేరు. మంజు రుచ్యా మీార యతీతి మంజీరః ఈర స్వనే. 'మంజీరో నూపురో స్త్రియా' మిత్యమరః. మంజీర మనఁగాఁ గాలిగజ్జె పేరు. మస్తం శిర ఇష్యతి ప్రాప్నోతీతి మస్తిష్కం, ఇష గతౌ. 'తిలకం క్లోమ మస్తిష్కం' ఇత్యమరః. మస్తిష్క మనఁగాఁ దలమెదడు పేరు. కులం విటకుల మటతీతి కులటా, అట గతౌ. 'అసతీ కులటే త్వరీ' త్యమరః. కులట యనఁగా

లంజె పేరు. ఆది శబ్దముచేత వేదండ సారంగములు మొదలైనవి మఱి కొన్ని గలవు. వేదః సామవేదః అండః జననకారణం యస్య సః వేదండః, సామోద్భవ ఇతి ప్రసిద్ధిః. 'సామజ స్సింధురో ఽ పి స' ఇత్యమరః. వేదండ మనఁగా నేనుఁగు పేరు. సారాణి అంగాని యస్యసః సారంగః. 'సారంగ శ్చాతకే భృంగే కురంగే చ మతంగజే' ఇత్యమరః. సారంగ మనఁగాను చాతకాదుల పేరు. వృకస్య అంధుః వృకంధుః. వృకంధు వనఁగాను వృకదేశమందున్న బావి పేరు. సీమ అంతః సీమంతః. సీమంత మనఁగాఁ బాపట పేరు. ఇవి శకంధు శబ్దము మొదలుగాఁ గలవి గనుకను శకంధ్వాది గణ మనఁబడును.

క॥ విరతికి వ్యాకరణమునను
వరరుచిచేఁ జెప్పబడిన వాక్యమువలనన్
బరరూపము నిత్యంబై
పరఁగు శకంధ్వాదులకు నుభయముం జెల్లున్ 126

వివ:— కర్కస్య అంధూః కర్కంధూః బదరీ కోలీత్యమరః అని అప్పకవి వ్రాసినాఁడు. కర్కంధూ శబ్దమునకు రేఁగుచెట్టు అను నర్థమున లింగాభట్టీయములోను సిద్ధాంతకౌముదిలో ఉణాదులలోను కర్కాణి లోహితాని పర్ణాని ఫలాని చ ధత్త ఇతి కర్కంధూః; కర్క మనఁగా నెఱుపు ఎఱ్ఱనియాకులును పండ్లును గలది యనియు, కర్కం దధాతీతికర్కంధూః అనియు విగ్రహములు వ్రాయఁబడినవి. ఇప్పటి సిద్ధాంతకౌముదులలో శకంధ్వాది గణములో కర్కంధుః అని హ్రస్వాంత పాఠము గలదు. అప్పుడు కర్కాణాం రాజ్ఞాం అంధుః అని ప్రౌఢ మనోరమా వాక్యము ననుసరించి కర్కరాజుల బావి అని యర్థమగుచున్నది. అప్పకవి నాఁటి సిద్ధాంతకౌముదిలోను 'శకంధు రథ కర్కంధూ' అనుశ్లోకమందును కర్కంధూః అని దీర్ఘాంతమే యుండవచ్చును. అప్పుడు పైని చూపిన విగ్రహములవలన కర్కంధూ శబ్దము శకంధ్వాదులలో చేరుటకును పరరూప విరతులలో నదియు నొక పద

మగుటకును అవసరము (ప్రయోజనము) లేదు. అనఁగా కర్కం ధత్త ఇతి, కర్కం దధాతీతి కర్కంధూ అను నప్పుడు కర్క+ధా, కర్కంధూః అని కర్క అను దానికి ధా ధాతు సంబంధమున నేర్పడుటచే ఉత్తరపద మజాది (అచ్చు మొదట నున్నది) కాకపోవుటచే పరరూప సంబంధమూ లేదు, స్వరప్రధాన యతి సంబంధమూ లేదు కావున అప్పకవి ఉభయ సిద్ధికొఱకీ యుత్పత్తి యూహించివ్రాసి యుండును. ఇప్పుడును కర్కస్య—ఎఱుపురంగునకు, అంధూః—బంధన మైనది అనఁగా ఆకులయందును పండ్లయందును ఎఱుపు రంగును బంధించునది. ఎఱ్ఱని యాకులును బండ్లును కలది అని యే అర్థ తాత్పర్యములు చెప్పుకొన వచ్చును కాని ఇట్టి చోట్ల శాస్త్రప్రక్రియాసిద్ధికొఱకు 'కర్క జస్ అంధూజస్' అని అలౌకిక విగ్రహమే కాని ప్రయోగార్హ మగు లౌకిక విగ్రహ ముండక విశిష్ట పదమునకే 'రథంతరమ్' మున్నగు పదములకు వలె వివక్షితార్థము కల్గుటయే సిద్ధాంత మని యెఱుంగునది. ఇట్టి పదములలో వ్యుత్పత్తి పక్షమందున్నూ అవయవార్థ మక్కరయే లేదు అనుట. ఇక్కడ గిడుగువారి పీఠికలో 'శకంధు కర్కంధులు ఆ యా యి దేశమందలి నూతుల కర్థము గాని కర్కంధు రేఁగు చెట్టున కర్థము కాదు' అని వ్రాయఁబడి యున్నది. మొత్తము మీఁద నీ వాక్య తాత్పర్యము కర్కంధూ శబ్దమునకు రేఁగుచెట్టు అను నర్థములేదు (రాదు) అని యే కదా తేలుచున్నది. 'కర్కంధూ ర్బదరీ కోలీ' అని యమరమున్నూ కర్కం దధాతీతి కర్కంధూః, బదరీ అని సిద్ధాంతకౌముదియు నుద్ఘోషించుచుండ వీరింత గంభీరముగా కర్కంధూ శబ్దమునకు రేఁగుచెట్టు అను నర్థము లేనే లేదని వ్రాయ సాహసించుటకు బల మెక్కడిదో చెప్ప వలసి యున్నది. అయితే కర్కంధూ అను దీర్ఘాంత శబ్దమునకు రేఁగుచెట్టు అను నర్థము కలుగ వచ్చును గాని కర్కంధు అను హ్రస్వాంత శబ్దమునకు రేఁగుచెట్టు అను నర్థము లేదు అని వారితాత్పర్యమేల గ్రహింపరాదు అని ఎవ్వరేని అడుగుదు రేని అందే వారే తర్వాత

వ్రాసిన కర్కన్ధూః అని అప్పకవి వ్రాసి రేఁగుచెట్టు అర్థము వ్రాసినాఁడు అను వాక్యము దీర్ఘాంతమునకును రేఁగుచెట్టర్థము లేదని యే వీరి భావమును తేట పఱుచు చుండుటచే పై వారి సమర్థనమున కడ్డమువచ్చుచున్నది. అనగా అట్టి సమర్థన కవకాశము లేదు. మఱియు వీరే అంధు శబ్దము ఉకారాంత మే గాని ఊకారాంతము లేదు అని పెద్ద అనుశాసనము చేయుచున్నారు. చూడుఁడు- 'అంధూ దృంభూ జృంభూ కర్కంధూ, దిధుషూ ఏతే కూ ప్రత్యయాంతా నిపాతితాః అంధూ ర్బంధనమ్' అను ఉణాదులలోని పఙ్క్తులు చూడక పోవు గాక; 'అంధూ దృంభూ జృంభూ కర్కంధూ దిధుషూ రిత్యుణాది సూత్రేణ వ్యుత్పాదితాః' అను శబ్దాధికారములోని పఙ్క్తులు కూడ చూడక యిట్లు వ్రాయుట సాహస మనక తీరదు. అది యట్లుండు గాక; అంధూ శబ్దము అంధు శబ్దము రెండున్ను గలవనియు, అంధూ శబ్దము నకు బంధన మర్థము, అంధు శబ్దమునకు నూయి అర్థముఅనియు; కర్కంధు కర్కంధూ శబ్దములు రెండున్ను గలవనియు, కర్కంధు అనఁగా కర్క రాజుల నూయి యనియు, కర్కంధూ అనఁగా రేఁగు చెట్టనియు అప్ప కవి నాఁటి సిద్ధాంతకౌముదిలో కర్కంధూ అనియే యుండుటచేత అట్లు అర్థవ్యుత్పత్తులు వ్రాసియుండు ననియు తెలుపుటకే పై ప్రసంగము చేయఁబడిన దనియు సారాంశ మెఱుంగునది. ఇఁకమీఁద 'కర్క మనఁగా నేమిటో అర్థము వ్రాయరైరి' అను వీరికసందేహము తొలఁగి పోవచ్చు నేమో! మఱియు వీరిప్రతిలో ఉష్ట్రిష అని టకారమున్ను కాన వచ్చు చున్నది. ఉచ్చారణములో అది (ట) అట్లు సహజముగా వినఁబడునే గాని అట్టి వానిలో టకారమున్ను ఉండుటయు అట్లు వ్రాయుటయు శాస్త్రసిద్ధమున్ను సంప్రదాయ సిద్ధమున్ను కాదని యెఱుంగునది.

ఉద్దాలము—విరిగి చెట్టు, కుద్దాలము—త్రవ్వు నట్టి యొకానొక సాధనము (గుద్దలి) - కాంచనపు చెట్టు అనియు ప్రాచీనపు నిఘంటువుల ప్రతులలో వ్రాయఁబడి యుండగా నిచ్చట అప్పకవి కం శిరః

(శిరస్సును) ఉష్ణవీర్యత్వాత్ ఉద్దాలయతీతి కుద్దాలః అనియు, కుం భూమిం ఉద్దాలయతీతి వా దళ విశరణే, ఉదిత్యుపసర్గః, కుద్దాలో బహువారకః ఇత్యమరః. కుద్దాలమనఁగా విరిగిచెట్టు అని వ్రాసినాఁడు. ఇట్లు వ్రాయుటకు కారణము అతనికి దొరకిన ప్రతులలో అట్లుపాఠ ముండెనేమో యని యూహింప వలసి యున్నది. వ్యుత్పత్తి యెట్లయి ననూ సరి పెట్ట వచ్చును గాని యిప్పటి లింగాభట్టీయ గురుబాల ప్రబోధిక ప్రతులలోను, శబ్దరత్నాకరములోను ఉద్దాల శబ్దమునకు విరిగిచెట్టనియు, కుద్దాలశబ్దమునకు [1] గుద్దలి-త్రవ్వుసాధనము, [2] ఎఱ్ఱ కాంచనపు చెట్టు అనియు నర్థములుండుటచే అప్పకవీయపాఠము ఇప్పటి నిఘంటువుల ప్రతులకు సరిపడకున్నది కావున నిచ్చటి కుద్దాలశబ్దమునకు కాంచనపుచెట్టు అని గాని గుద్దలి (గౌద్దాళికము అనియు వాడుక) అని గాని అర్థము గ్రహింప వలసి యున్నదని తోఁచు చున్నది. మఱియు మిక్కిలి పరికింప కుద్దాల శబ్దమునకు వృక్ష విశేష మర్థమున్న నుండ వచ్చును గాని కుం ఉద్దాలయతీతి కుద్దాలః అను వ్యుత్పత్తి గుద్దలి యను నర్థమునకు మిక్కిలి సరి పడుట (అనుభవముచే నెల్లరకు సమ్మతమగుట) చేతను అచ్చ తెనుఁగు పదము (కుద్దాలశబ్ద తద్భవము) గుద్దలి అని యుండుటయు, ఈ గుద్దలి శబ్దమునకు త్రవ్వు సాధనమే యెల్లెడ ప్రసిద్ధ మగుటచేతను ఈయర్థమే కుద్దాల శబ్దమునకు మిక్కిలి సరిపడి యుండు ననియు గ్రహించునది. ఈ విమర్శ మేమియు అప్పకవీయ మంతయు గోళించి (గాలించి) విమర్శించి వ్రైచిన గిడుగువారి బుద్ధికి తగులకుండుట వింత యనక తీరదు. ఇట్టి కుద్దాల శబ్ద మీ శకంధ్వాదులలోఁ బఠింపఁ బడుటచే కుద్దాల అనిగాని కోద్దాలిఅనిగాని అనిష్ట రూపములేర్పడక కుద్దాల అని సాధురూపము (ఇష్టరూపము) ఏర్పడు నని భావము గ్రహించునది.

అలక్త పాద మలతీ త్యలక్తః అల భూషణే అనియే ఇప్పటి (మాకు దొరకిన) అప్ప కవీయపు ప్రతులన్నిటను కన పడుతున్నది. పరికింపఁగా అప్పకవి ఇట్లు వ్రాసి యుండఁడు. తర్వాతి పరిష్కర్తల

ప్రమాదముననో లేఖకుల దోషముననో తప్పు పడియుండును. ఎందుచేత ననఁగా కర్కంధూ శబ్దమునకు వ్రాసిన వ్యుత్పత్తులు గ్రహించినచో పొసఁగి యుండ లేదని (పైని వ్రాసినట్లు) పొసఁగి యుండు నట్లు వ్యుత్పత్తి యూహించి వ్రాసిన యుచితజ్ఞుఁడు ప్రయోజనములు గలుగు నట్లు గురుబాల ప్రబోధికలో 'అలతి పాదాదిక మిత్యలః అనక్తి వస్త్రాదిక మిత్యక్తః అల శ్చాసౌ అక్తశ్చ అలక్తః అల భూషణాదౌ అంజూ వ్యక్తి శ్లక్ష్ణ కాంతి గతిషు' పాదాదుల నలంకరించునది గనుకను వస్త్రాదులఁ బ్రకాశింపఁ జేయునది గనుకను 'అలక్తము' అని వ్రాయఁబడి యుండఁగా ఇప్పుడు అల, అక్త అను పద ద్వయ సమావేశములో సవర్ణ దీర్ఘము వచ్చి అలాక్త అని అనిష్ట రూప మేర్పడకుండగా ఈ గణపాఠముచే పరరూపము రెండు అకారములకు ఒక అకారము వచ్చి ఇష్టరూప మేర్పడుటయు, అట్టి పదములోని పరపదాది వర్ణమునకు స్వర ప్రధానయతియు పూర్వవర్ణమునకు (ల అను దానికి) వ్యంజనాక్షర యతియు, ఈ పరరూప యతిచే నుభయ యతులు సిద్ధించు నట్లు కన పడుచుండఁగా దానికి విరుద్ధముగా అనఁగా అలతీత్యలక్తః అని మాత్రమే వ్యుత్పత్తి యైనచో అల ధాతువున కొక్కదానికే ఔణాదిక ప్రత్యయ కల్పన మాత్రముచే అలక్త అను రూపము సిద్ధించును గాని అప్పుడు పద ద్వయమే లేక శకంధ్వాది పాఠమున్ను, అట్టి దానికి ఉభయ యతికొఱకు ఇందు నిర్వచించుటయు అప్పకవి యుచితజ్ఞతకు మిక్కిలి భంగముగా ఆతఁ డెట్లు వ్రాయుట పొసఁగును అని యనక తప్పదు గావున అప్పకవి పాద మలతీ త్యలః అల భూషణే అనక్తి వస్త్రాదికమ్ అక్తః అంజూ వ్యక్తిశ్లక్ష్ణ కాంతి గతిషు అలశ్చాసౌ అక్తశ్చ అలక్తః పాదాదుల నలంకరించునది గావు నను, వస్త్రాదులఁ బ్రకాశింపఁ జేయునది గావునను అలక్తము 'యావో ఒలక్తో ద్రుమామయ ఇత్యమరః' అనియే వ్రాసి యుండఁగా మొట్టమొదట ఏ లేఖకుని ప్రమాదముచేతనో (తాళపత్ర) ప్రతిలోనిదో మరియొక ప్రతిలోనిదో

అప్పకవి ప్రతిలోనిది మరియొక ప్రతిలోనికి వ్రాయు నప్పుడు) 'పాద మలతీత్యలః అలభూషణో' అని మాత్రము పడి (చేరి, అనగా వ్రాయఁబడి) తర్వాతిది యావో లక్తో ద్రుమామయ ఇత్యమరః అనువాక్యము మొదటివరకు నున్న భాగమెల్ల భ్రష్టమై యుండఁగా (వ్రాయఁబడ కుండ) అదిచూచి ఎక్కువ విమర్శ శక్తిలేని మొట్టమొదటి పరిష్కర్తయో మరొకఁడో అచ్చటి సందర్భము అలక్త శబ్దము సంబంధి గావున అది ప్రాసంగ లేదని మాత్రము గ్రహించి పైని చెప్పిన విరుద్ధత్వ (విప్రతిపత్తి) మొకింతయును గ్రహించక అలః అను దానిని అలక్తః అని మాత్రము మార్చి (పరిష్కరించి) యుండును. అందుచేత పైని వ్రాసిన మధ్య భాగమంతయు భ్రష్టమై ఇప్పటికిని (గిడుగువారి ప్రతిలోనికిని) అట్టి అపపాఠమే అనువాదముగా (పై విప్రతిపత్తి గోచరించక పోవుటచే) వచ్చి యుండు ననియు, అందుచే అప్పకవికి ఈపాఠము మాత్రము లేని కళంకమును తెచ్చి పెట్టుచున్నదనియు మాయభిప్రాయ మెఱుంగునది. ఈ చర్చయు గిడుగువారి ప్రతియు నెఱుంగక పోవుట వింత యగును.

పర్కటి-దీనికి అప్పకవి వ్రాసినట్లే గురుబాల ప్రబోధికలో నున్న వ్యుత్పత్తి యుండెను. కాని మఱి యొక వ్యుత్పత్తి యూహింపని యెడల ఈ శబ్దముఃకీ గణ పాఠమున్ను, దీని కిట్టి యుభయ యతి చెల్లుటయు ప్రాసంగ నేరవు. (పృచ్ అను ధాతువునకు ఒక్క దానికే ఔణాదిక ప్రత్యయ మాత్రకల్పనమున అటీ అనునదియంతయు ప్రత్యయముగా గ్రహించి పిమ్మట కుత్వము నిపాత కల్పనాదులచే నూహించి మిక్కిలి క్లిష్టముగా రూప నిష్పత్తి యెట్లో కుదిర్చినను అప్పుడు పద ద్వయమే లేకపోవుటచే గణపాఠోభయతులు కుదరవు.) కావున పర్కం, అన్యోన్యసంసర్గమ్ (జటాసు-ఊడలయందు) అటతీతి(పొందునదిగావున) పర్కటీ (పర్క — అటీ అని ఉభయము కుదురు నట్లు) అని వ్యుత్పత్తి ఊహించుట కనువై యుండఁగా ఇట్లు వ్రాయక (ఇట్లో కుదురునట్లు మరొకరీతినో వ్రాయక) పోవుటచే అప్పకవి యుచితజ్ఞత ఇక్కడ కొఱవడుచున్నది

గావున పర్కట్ — అటతీతి—పర్కటీ అని వ్యుత్పత్తి గ్రహించి ఉభయ సిద్ధిపైని చెప్పినట్లూహించ వలసి యున్నదని యెఱుంగునది. (ఇదియు గిడుగువారికిఁదోఁచలేదు కాబోలు.) మఱియు గిడుగువారి ప్రతిలో 'స్పృజ్యతే' ఇతి అని పకార యుక్తముగా నున్నది. అదిపొరపాటు కాని-చో స్పృజ్యతే అను రూప మేధాతువువలన నేర్పరుచు కొన్నారో పర్కటీ అని ఏట్లేర్పరుచుకొన్నారో తెలుసుకోవలసి యున్నది. (మా దృష్టి కెందును గానరాలేదనుట.) హాల — ఈషా—హాలేషా అని (గుణ ముచే) అనిష్టరూప మేర్పడక హాలీషా అని ఈగణపాఠముచే సిద్ధించి ఉభయ యతి సిద్ధించుచున్నది. ఇట్లే లాంగ లీషా అనునదియు నేర్పడు చున్నది అని యెఱుంగ వచ్చును. మనస్ — ఈషా—మనఈషా అని యనిష్టరూపమేర్పడక పైని చెప్పినట్లు పూర్వపదము టీ యగు అస్ అనుదానికిని పరమాది యగు ఈ అనుదానికిని పరరూప మొక్కటి ఈ అనునది మాత్రము వచ్చి మన్ — ఈషా — మనీషా యయ్యె ననియు అందుచేత ఉభయ యతి సిద్ధించు ననియు నెఱుంగునది.

పతంజలిః—పతత్ — అంజలిః—ఇది పతంజలి శబ్దమునందలి పద ద్వయ ప్రదర్శనమే గాని వ్యుత్పత్తి ప్రదర్శనము గాదనియు, విగ్రహము పతంతః, అంజలయః, యం, సః (ఎవనిని, దోసిళ్లు—ఎల్లరచే మోడ్పులు అనఁగా నమస్కారములు పొందునో అనగా చేతులు జోడించి ఎల్లరచే నెవ్వఁడు మ్రొక్కఁబడునో) అతఁడు పతంజలి యయ్యెను అని గాని లేక శబ్దేందు శేఖరాద్యనుసారముగా అంజలేః, పతన్—పతంజలిః అని గాని (ఈవ్యుత్పత్తి కనుకూల మగు పతంజలి జన్మవృత్తాంతము శబ్దేందు శేఖరాదులయందే చూచుకొనునది.) గ్రహించుకోవలయును. అప్పుడు పతత్ + అంజలిః- పతదంజలిః అని యనిష్టరూప మేర్పడక ఈ గణపాఠ ముచే నిష్టరూపము పతంజలిః అని సిద్ధించి ఉభయ యతియు సిద్ధించు నని యెఱుంగునది. ఇక్కడ మాకు దొరకిన పూర్వప్రతులలో నిట్లే పతత్, అంజలిః అనియే ఉన్ననూ గిడుగువారి ప్రతిలో అపూర్వముగా

పతత్ + అంజలిః అని గిడుగువారి పరిష్కారముతో నున్నది. 'వ్రాత ప్రతులలో సరిగా నున్నను తిన్నగా చూడక అర్థము చెడిపోవునట్లు అసందర్భముగా పూర్వపు పండితమ్మన్యులు పరిష్కరించి' అనియు, మఱియు నెన్నియో రీతులఁ బ్రాసిన పరిష్కర్తలను మిక్కిలి తూల నాడి పరిహాసించిన మహాపరిశోధకు లిట్లేల (అవి యన్నియు తమకును వర్తించునట్లు) పరిష్కరించిరో తెలియ వలెను. అయితే పతత్ అనుదానిలోని త్ అను పొల్లు మాత్రము న్ అను పొల్లుగా మార్చిన మాత్రమున అంత పెద్ద తప్పుగా పరిగణించ వలయునా అందురేమో, చూడుఁడు—మార్పు స్వల్పమే గాని దానివల్ల వచ్చు హాని యనల్పమే. అదియెట్లన పతత్ అంజలిః అన్నప్పుడు పదద్వయ ప్రదర్శన మనుటకు వీలై విగ్రహ ప్రదర్శనము కాదని అల్పజ్ఞునకైనను గోచరించి విగ్రహము పైని చెప్పినట్లు ఊహించుకొని ఇష్ట సిద్ధి నొందవచ్చును. పతన్ అంజలిః అనిమాత్రము మార్పగానే (పతన్ అజలేః అని యేని మార్పక) పదద్వయ ప్రదర్శన మను కొనుటకును వీలు గాక విగ్రహ ప్రదర్శనమే అయి, యం సః, యస్య సః మొదలగు అన్యపదము లేక వర్తిపదములు మాత్రమే యుండుటచే (సమసించ వలసిన పతన్ అంజలి అనునవి మాత్రముండి ప్రధాన మగు అన్యార్థమును తెలుపునవి లేక) బహువ్రీహి యనుకొనుటకు వీలు లేక అంజలేః అని పంచ మ్యంతముగా లేక ప్రథమాంతముగా నుండుటచేత మరియొక (ఏవ్యధికరణ తత్పురుషయో ఏ సుప్సుపా సమాసమో) విధముగా చెప్పకో వీలు లేక కర్మధారయ సమాసమేయై పడుచున్న అంజలి యే పతంజలి (భాష్యకర్త) అని పరిహాసాస్పదమైన యర్థము విద్వాన్ మున్నగు పరీక్షలకు చదువు వారికేని (వారికి మరియొక పాఠము చెప్పఁగూడదు. గిడుగువారి పీఠికతో గూడినదె పఠనీయము గావున వాళ్ళు తక్కిన ప్రతుల పాఠములకు గాని గురువు మార్చి చెప్పిన దానికిగాని ఒప్పుకొనరు గావున) ఉపాధ్యాయులు బోధించక తీరదు గదా! అప్పుడెట్టి పాండిత్యము

విద్యార్థులకు గలుగునో నే నేల చెప్పవలెను (అనఁగా దైవ వశమున ఈ పదమును గూర్చియే ప్రశ్నము పరీక్షలో రాఁగా వారెట్లువ్రాసి యే మగుదురో యూహించుకో వచ్చుననుట.) తాము విగ్రహ మను కొని అప్పుడు పతత్ అంజలి యని ఉన్నచో అంజలి శబ్దము పుంలింగ మని యెఱుంగక దాని విశేషణము నపుంసకముగా వ్రాయుటచే అప్ప కవికి పాండిత్యభంగము వచ్చునని గావలయు, నిజముగా నాతనికిలేని లోపముఁ దీర్పనెంచి విపరీతముగా పతన్ అంజలిః అని దిద్దివైచి ఇట్టి చిక్కు దెచ్చుకొన్నారేమో యనియు తోఁచుచున్నది. ఇట్టివి వెనుక ముందుల నెన్ని తెల్పినను ఎవ్వనికేని మనుష్య మాత్రునకు భ్రమ ప్రమాదము లుండక తీరవనియు అవి బుద్ధికి సహజములనియు నిందా స్పదములు కావనియు తెల్పుటకు మాత్రమే యని గ్రహింపవలయును గాని మరియొక దూరు కొఱకు గాదని సాంజలి బంధముగా మనవిజేయు చుంటిని.

కుత్కీలము, కోః భూమేః ఉత్కీలః కూత్కీలః (సవర్ణ దీర్ఘముచే) అని అనిష్ట రూపము గాకుండఁగా ఈ గణ పాఠముచే పూర్వాపరస్వరముల కిక్కడ ఉ అను పరస్వరమొక్కటే వచ్చి ఇష్టరూపము కుత్కీలము (భూమికి ఉన్నతమగు కీలము అనఁగా చీలవంటిది. కీలమువలె భూమిని కదలకుండ స్థిరముగా నుండునట్లు చేయునది. గట్టు — పర్వతము అని యర్థముతో) అని సిద్ధించినది.

ఉష్ణీషము, ఉష్ణస్య — ఎండవేఁడిమికి, ఈషః — హింసించునది లేక గ్రహించునది. అనగా ఉష్ణబాధ లేకుండఁ జేయునది. ('ఈష, గతి హింసా దానేషు' అని ధాతు పాఠముచే) అని వ్యుత్పత్తి చేఉష్ణ+ఈష (గుణము వచ్చి)- ఉష్ణేష అని కాకుండఁగా ఈ పరరూపము వచ్చి ఉష్ణీష అని యయినది. దీనికి గురుబాల ప్రబోధికలో ఉష్ణవారణార్థమ్ ఇష్యతే, ఉశ్యత ఇతివా ఉష్ణీషః ఇషు ఇచ్ఛాయామ్ వశకాంతౌ ఉష్ణ నివారణార్థమై ఇచ్ఛయింప బడునదిగా వున ఉష్ణీషము అని వ్రాయబడి

యున్నది. అయినను అట్లు వ్యుత్పత్తు వలంబించిన యెడల మఱొక విధముగా (ఏ పృషోదరాదిత్వముచేతనో) సాధుత్వ మూహించుకో వలయును గాని ఈ గణపాఠము వలన ఇష్ట రూపమేర్పడకుండుటయే కాక, ఉష్ణ, ఇష- ఉష్ణిష, ఉష్ణ, ఉశ-ఉష్ణుశ అని అనిష్ట రూప మేర్పడును కావున నట్టి యిబ్బంది లేకుండఁగా ఈ వ్యుత్పత్తి యూహించి అప్పకవి లిఖించినాఁడని యెఱుంగునది.

మంజీరము, మంజు రుచ్యమ్ యథా తథా (శ్రోత్రసుఖముగా) ఈర యతీతి- మోగియునది గావున మంజీర మనఁబడెను. ఈర స్వనే ఈర ధాతువు ధ్వని యను నర్థమందుండును అనఁగా పాదమునకు భూషణముగా ధరింపఁబడు అందె అని యర్థము పై వ్యుత్పత్తిచే వచ్చినది. ఈ పాఠముచే మంజీర అని సిద్ధించెను, మంజ్వీర అని అనిష్టరూపము కాలేదు. మస్తిష్కము మెదడు అని యర్థము- మస్త + ఇష్క-- (గుణముచే) మస్తేష్క- అని కాకుండా మస్తిష్క- అని ఇష్టరూప మీగణపాఠముచేత సిద్ధించినది.

కులటా కులమ్—విటకులమ్, అటతి ప్రాప్నోతీతి కులటా(విట సమూహమును పొందునది) అని విగ్రహము; ఇది తాత్పర్యము వలన వచ్చిన యర్థము నెఱింగించు విగ్రహము (అప్రధాన విగ్రహము) అట తీత్యటా కులస్య అటా అని ప్రధాన విగ్రహము దీనికిం బ్రమాణము. అటతీత్యటా పచాద్యచ్ పశ్చాత్ కులేన సంబంధః అన్యథా కర్మణ్యణ్ ఇత్యణీ ప్రసంగః అను ఏజి పరరూపమ్ అను సూత్రములోని వార్తికమగు దీనియందలి కెయట మనియెఱుంగునది. దీని ననుసరించి ప్రౌఢ మనోరమలోను శబ్దరత్నములోను ఇట్లే వ్రాయఁబడెను. పైని వ్రాయఁబడిన కైయటాదికమునకు భావ మేమనఁగా కులమటతీతి అని విగ్రహ మైనచో కర్మ వాచకముపపదముగా నున్నచో అచ్ ప్రత్యయమున కపవాదమగు (కర్మణ్యణీ అనుసూత్రముచేత) అణ్ ప్రత్యయము వచ్చి తర్వాత 'అత ఉపధాయాః' అనుదానిచే ఉపధావృద్ధివచ్చి 'టిడ్ఢాణఞ్' అను సూత్రముచే జీప్పున్ను వచ్చి కుల — ఆటీ- కులాటీ అని అనిష్ట రూపమేర్పడును.

అటతీత్యటా అనినచో ఇప్పుడు కర్మసంబంధము లేదు గావున అణ్ మొదలైనది రాక అచ్‌ప్రత్యయమే వచ్చి అటా అని యయి పిమ్మట కులస్య అటా అని కులశబ్ద సంబంధము నొంది కుల, అటా సవర్ణదీర్ఘము రాకుండగా ఈగణ పాఠముచే పరరూపమే వచ్చి కులటా అను సాధు రూపము సిద్ధించుననియు మొత్తముమీఁద విటకులమును పొందునది; (వ్యభిచారార్థము) విటులను పొందునది కావున లంజెకు కులట యని పేరు గల్గినది అని యెఱుంగునది. (ఇట్లే ఇట్టి చోట్ల వెనుక ముందుల దాత్పర్య మెఱుంగునది.)

వేదండము వేద, అండః — జననకారణమ్ యస్యసః సామవేదమువలనఁ బుట్టినది గావున ఏనుఁగునకు వేదండము అని పేరు గల్గినది. ఈ యర్థమునే సామజము మున్నగు పదములును కొన్ని పురాణములును తెల్పుచున్నవి అనియు నెఱుంగునది. వేద — అండ-వేదాండ అని కాక వేదండ అని (ఈ గణ పాఠములో గ్రహింపబడుట చేత అనఁగా పై శ్లోకములోని కులటాదయః అనుచోటి ఆది పదము చేతను మఱి కొన్ని గ్రహింపవచ్చును గావున) శిష్ట రూప మేర్పడు చున్నది అనిభావము.

సారంగము, సారంగః పశు పక్షిణోః పశువు పక్షి అను నర్థము లందు (ఈ గణములోనిదై) పరరూపముచేత సారంగ అని సిద్ధించును. ఇతరార్థములందు శ్రేష్ఠమైన అంగములు గల వాఁడు మున్నగు అర్థము లందీ గణమున జేరక సవర్ణ దీర్ఘముచేత సారంగ అని యగును అని భావము.

దీనికి గురుబాలప్రబోధికలో 'సంహత్య అరం గచ్ఛతీతి సారంగః' (తనజాతివానితో గూడి త్వరితముగాఁ బోవునది) అనియు మఱొక వ్యుత్పత్తి వ్రాయఁబడెను గాని, అది ఇక్కడ గ్రాహ్యము గాదు. (మఱొక విధముగా ప్రక్రియ యూహింప వలసినది గాని ఈగణపాఠము నకుఁ బనికి రాదు.) మఱియు 'చాతకే హారిణే పుంసి సారంగ శ్శబలే త్రిషు' అని యమరములోనే చెప్పఁబడుటచేత పశు పక్షి భిన్నార్థము

చెప్పు నప్పుడున్ను సారంగ అని యుండ వచ్చునని స్థూలదృష్టికి (పై పైకి) తోఁచును గాని అది వ్యుత్పత్తి భేదముచేత (అనఁగా సారం—నానావర్ణం గచ్ఛతీతి సారంగ అని వ్యుత్పత్తిచేత) సిద్ధించు నది గాని ఈగణములో చేరునది కాదని యెఱుంగునది. అనఁగా సారాణి అంగాని యస్య సః అను నప్పుడే ఈ గణములో చేరుటవలన ఫల ముండును గాని మఱొకప్పుడుండదు. అప్పుడున్ను పశు పక్ష్యన్యతార్థముననే గాని ఇతరార్థ మందీగణములో చేర దనియు, అప్పుడు సారంగ యనియే యగు ననియు సామాన్యముగా లింగ త్రియమునందును వర్తించు చిత్రి వర్ణము (శబల వర్ణము) గల వస్తు మాత్రమును చెప్పు నప్పుడు సారం చిత్రవర్ణమ్ శబలవర్ణముగచ్ఛతి అనివ్యుత్పత్తిచేతనో మఱొక యాణాదిక కల్పనచేతనో సారంగ అని సిద్ధించుననియు, అది యీగణమునఁ జేర దనియు నెఱుంగునది. వృకంధు- దీనికిని ప్రయోజనము పూర్వమందు వలెనే యెఱుంగవచ్చును.

సీమంత- సీమ — అంత-సీమంత (సీమన్ — అంత అని యుండ వ్యా. 'నలోపః ప్రాతిపదికా న్తస్య' అను సూత్రముచేత నకారలోపము రాగా సీమ, అంత అని యగును. అప్పు డీ గణపాఠముచేత పరరూపము వచ్చి సీమంత) అని యయ్యెను అని భావము. ఈ యభిప్రాయముచేతనే అప్పకవి సీమంత శబ్దములోని పద ద్వయము ప్రదర్శించుటకు దానిలోని నకారమునకు ఈ గణపాఠాపేక్ష లేకుండగనే పైని చెప్పఁబడినట్లు వచ్చు లోపము చేసి సీమ, అంత అనియే వ్యాకరణ మహాభాష్యములో నుండుటచేత అట్లే సీమ, అంత అనియే వ్రాసియున్నాడని తోఁచు చుండఁగా పతంజలి శబ్దమందు వలెనే ఇక్కడను పదద్వయ మాత్ర ప్రదర్శనమును విగ్రహ ప్రదర్శన మనుకొని కావలయు అప్పకవికి మేలు సేయ నెంచి గిడుగువారు వారి ప్రతిలో సీమ్నః, అంత అని పరిష్కరించి కీడే యొనర్చినారు. (అనఁగా కొన్ని నవీన నిఘంటువుల వ్రాతల ననుసరించి కావలయు స్థూల దృష్టిచే సీమ్నః అంతః అని

పరిష్కరించుటచేత అది కీడే అయినది.) ఇట్టి వానికి వ్యుత్పత్త్యర్థాదులు గ్రహించుట యెల్లరకు నరిది గదా! పద ద్వయ ప్రదర్శనమును విగ్రహ ప్రదర్శన మనుకొనుట కేవలము గిడుగువారి ప్రమాదమే కాదు, కొన్ని ప్రతులలో నే లేఖక ప్రమాదముననో సీమ, అంత అనుటకు మారుగా సీమస్య, అంత అని పడియున్నది. సీమన్ శబ్దమునకు షష్ఠ్యేకవచనాంతము సీమ్నః అనియే గాని సీమస్య అని కాదు. (ఆకారాంతమున్నను) అకారాంత సీమ శబ్దము లేదు అని యెఱుఁగుదురు గావున అర్థసాంగత్యము మాత్రము పరిశీలింపక సీమ్నః అంతః అని పరిష్కరించి యుందురు. సీమ అంత అని గాని లేక సీమా అంత అని గాని వారు చూచిన ప్రతిలోనున్నచో నేమను కొందురో గాని సీమ్నః, అంతః అని కొన్నిట నేని యుండుట చేతనే కావలయు విగ్రహ ప్రదర్శన మనుకొని యిట్టి చిక్కు తెచ్చుకొన్నారు. (అర్థమును పద నియమమును చెడగొట్టివైచిరి) ఇంత ధ్రువముగా నిరసించుటకు సీమ్నః అంతః అని విగ్రహ ప్రదర్శనము చేసినను నేమి, దోష మేమి, అర్థ మేమి చెడును, పద నియమమున కేమి హాని వాటిల్లును అందురేమో — దీనికొఱకు వ్యాకరణ మహాభాష్యములోకి పోయినం గాని తేలదు, అది సుబోధము కాదు గదా! అయిన నేమి, అది యొకింత ముచ్చటించక తప్పదు. 'ఏఙి పరరూపం' అను సూత్రమునందలి పై వార్తికమునకు మహాభాష్య మెట్లున్నదో గమనింపుఁడు: కుల + అటా-కులటా, సీమ + అంతః-సీమన్తః-కేశేష్వితి వక్తవ్యమ్ యో హి సీమ్నోఽన్తః సీమాంత స్స భవతి. సీమ, అంత అను పద ద్వయము కూడు కొనగా నీ గణపాఠముచే సీమంత అని యగు ననియు ఈ పదము కేశము లందలి వీధి (పాపట) అను నర్థము చెప్పు నప్పుడే ఈగణములోని దగుననియు, సీమ్నః, అంతః అని యెప్పుడు చెప్పుదుమో అప్పుడు ఈ గణములో చేరక సవర్ణ దీర్ఘముచే సీమాంత అనియే గాని సీమంత అని కాదనియు తాత్పర్యము సులభముగానే యగుచున్నది గదా. మొత్తము మీఁద సీమంత శబ్దము

సీమ్నః, అంతః, అని వ్యుత్పత్తిచే సిద్ధించ దని తేటపడుచున్నది. పాపట అను నర్థములో అట్టి వ్యుత్పత్తి చెప్పఁగూడదని ధ్రువముగా చెప్పుచున్నది. సీమ్నః అను వ్యుత్పత్తిచే సీమాంత అనియే యగును, సీమంత అని కాదు అని ఘోషించుచున్నది. అయితే పాపట యను నర్థమున వ్యుత్పత్తి (విగ్రహము) ఎట్లు అన వచ్చును? అప్పుడు మహాభాష్యములో వ్రాయక పోయినను సీమే వాంతః (సీమేవ, అంతః, సీమ వలె—పొలిమేర, హద్దు గట్టు వలె రమ్యమైనది. ‘అంతోఽస్త్రీ వసితే రమ్యే అని నిఘంటువు) అని వ్యుత్పత్తి చెప్పుకో వచ్చును. మఱియు వెనుక చెప్పినట్లు లౌకిక విగ్రహ మక్కర లేకయే విశిష్ట పదమునకే ఆయర్థము వచ్చును.)

క॥ విరతికి వ్యాకరణమునను
వరరుచిచేఁ జెప్పబడిన వాక్యమువలనన్
బరరూపము నిత్యంబై
పరఁగు శకంధ్వాదులకు నుభయమున్ జెల్లున్ 126

వివ:-పైని తెల్పిన విధముగా పైని చూపిన సూత్రి వరరుచి వార్తికమువలనఁ బరరూప సంధి నిత్యముగా వచ్చు పైని చూపిన పదములకు పైని చెప్పినట్లు స్వర ప్రధాన యతియు వ్యంజనాక్షర యతియు నేదియైనం జెల్లునని తాత్పర్యము. ఇట్లు పరరూపము వచ్చినప్పుడు ఉభయము నకును జెల్లునది గావున ఉభయ యతులలోఁ బరరూప యతి యనఁబడు చుండెను.

మఱియు మిక్కిలి పరికించినం గాని ఈ గణములోని శకంధు లాంగలీషా హలీషా అను నవి తక్క (కాక) తక్కిన వెల్ల భిన్న పదములు కూడి యున్నట్లు తెలియని నిత్య సమాస పదములే యన వచ్చును గావునను వీనియందును అచ్చు విరుగుచున్నట్టు అజాద్యుత్తర పద మున్నట్లు తెలియదు గావునను ఆ మూడును తత్తుల్యములే యగుట చేతను వ్యంజనాక్షర మైత్రియు వాస్తవమున అజాద్యుత్తర పద

ముండుటచేత (అనఁగా అచ్చు విరుగుటచేత) ఆ యచ్చునకున్ను (స్వర ప్రధాన యతియు) రెండున్ను చెల్లుట యుక్తమే కావునను ఇది ముందు చెప్పఁబోవు నిత్య సమాస యతిలో నంతర్భూతమే యనియు స్పష్టముగా తెలుపుటకు (అనఁగా తక్కిన వానిలో వలె సవర్ణ దీర్ఘాది సంధులున్నూ లేక వీనికి విధానముచే క్రొత్తగా పరరూపము కలిగి అజాది పదమున్నట్లు మిక్కిలి దుర్బోధ మగుటచేతనే కావలయు దీనికిట్టి ప్రత్యేకత వెనుక నుండియు వచ్చి యుండుటచేత ఇట్టి వానిలోని అఖండయతి దుష్ట మెంత మాత్రమును కాదనియు రెండున్ను చెల్లుట మిక్కిలి యుక్తమేయనియు తెల్పుటకు) సామాన్యాఖండయతి యొప్పని యప్పకవి తనమతము చొప్పున నిట్లు చెప్పినాఁడనియు కొందఱి మత ప్రకార మదియు నిదియు, మరియు నుభయ యతులన్నియు ఒక్క రూప ముగా సామాన్యాఖండయతిగా చెప్పుటయే యుక్త మనియు మహాకవుల ప్రయోగముల వైఖరింబట్టియే యూహించక తీరదని తోఁచుచున్నది. ఈ ఉభయ యతులలో కొన్ని ప్రత్యేకార్హము లని ముందు తెలుపఁ బడును.

వేదండ శబ్దమున కాది పర్వమునందు:—

మత్తకోకిల॥ దండితాహిత వీర సూరి నిధాన దాన వినోద కో
దండ పార్థ పరాక్రమ ప్రియ ధామ దిక్పరిపూరితా
ఖండ పాండు యశో నిధీ పరగండభైరవ వైరి వే
దండ దండ విదారి ఘోరతరాసి భాసి భుజార్గళా

(3, 228) 127

వివ:— ఈ పద్యములో కొన్ని ప్రతులలో 4 వ పాదమున 'వే దండ మండల చండ తుండ విదారణాసి భుజార్గళా' అని పాఠాంతర మున్నది కాని ఆ పాఠ మప్పకవి పాఠముకాదు. ఎందుచేత ననఁగా గిడుగువారి పీఠికలో నున్నట్లు అప్పుడు ఇదియు ముందరి పద్యమున్ను 'ఒకే రకములు' వ్యంజనాక్షరమైత్రిని తెల్పునవే యగుటచేత ఒకటి

యనవసరమే యగుటయే కాక ఇట్టి పదములలో వ్యంజనాక్షర యతి శ్రావ్యమే యగుటచేత సహజ సిద్ధమే యయి ఇక విధానముచేతఁ జెల్ల తగ్గది స్వర ప్రధాన యతియే కావున దానికే ముఖ్యముగా మహా కవి ప్రయోగము చూపవలసిన యవసర మగుటచేతను అట్టి ప్రధాన మైన స్వరప్రధాన యతి ప్రయోగ మప్పకవి చూపని వాఁడే యగును గావున మూలపాఠమే గ్రాహ్యమని తాత్పర్యము గ్రహించునది. అర్థము మాత్రము రెండు పాఠములలోను కుదురును. మఱియుం గొందఱు వేదండ తండము అని తకారాది తండ శబ్ద పాఠమున్న దందురు గాని శ, ర లో వేదండ తండము అని తకారాదిగా గ్రంథములయందుఁ గనఁ బడుచున్నది. దాని కాకరము (ఆకారము — ప్రమాణము) ఏమియుఁ గానరాదు అని వ్రాయుటయే కాక 'తండము' అను పద మొకటి వేఱుగా నెత్తి వ్రాయక పోవుటను సంస్కృత గ్రంథములలోను ప్రామాణిక నిఘంటువులలోను కానరాకుండుట చేతను దేశ్య .పదమేని యనుటకు తెనుఁగులలో సంస్కృత సమాస ఘటిత మగుటచేతను అది సుప్రసిద్ధము కాదనియు మిక్కిలి గ్రాహ్యము కాదనియు కొందఱను చున్నారనియు నెఱుంగునది. 'తప్పు లెన్నువారు తండోప తండము లుర్వి జనుల' అనియుఁ గలదు. ఇందు 4 వ పా. న వేదండ—వేద — అండ అను విరుపులో స్ఫురించుచున్న అకారమునకు మైత్రి గలుగునది యతి స్థలమున ఘోరతర — అసి అను నప్పుడు స్ఫురించు అకారము కూర్పబడుటచేత ఇది వేదండ శబ్దములో స్వర ప్రధాన యతి (అచ్చు నకు) చెల్లుటకే యుదాహరణ మని యెఱుంగునది.

భీష్మ పర్వమునందు:—

ఉ॥ పాండు నృపాల నందనులు పావని మున్నుగ నేచి యప్డు భీ
ష్మ్ముండు గడంకమై నడుచు చోటికిఁ జక్కటి గాఁగఁ ద్రోచి యొం
డొండ గడంగి సేన తమ యుబ్బున కుబ్బఁగ నన్యసైన్య వే
దండ ముఖాంగముల్ తృణ వితానముగాఁ గొని నిర్వికారులై

(1, 234) 128

వివ:— ఇందు 4 వ పా. న మొదట వేదండ అనుదాని ద అనుదానికి యతి చోట తా అనునది గూర్పఁబడుటచే ఇది వేదండ శబ్దములో హల్లు చెల్లుటకు (వ్యంజనాక్షర యతియుఁ జెల్లుటకు) ఉదాహరణ మనియు నట్టి యతి ఎల్లరకును సమ్మతమే యనియు అఖండ యతి దుష్టత్వ మప్పకవికిని ఇట్టి పదములలో లేదనియు భావము గ్రహించునది. గిడుగువారి ప్రతిలో 'పావని ముందుగఁ దాఁక నట్లు' అని యున్నది.

సారంగ శబ్దమునకుఁ జంద్రికా పరిణయ మందు:—

ఉ॥ జంగమ రోహణాద్రి సదృశంబులు తత్పురిఁ గల్గు భద్ర సా
రంగ వరేణ్యముల్ పయికి హస్తము లించుక సాఁచి య వ్వియ
ద్గాంగ ఝరంబు పీల్చి మఱి తద్వమథు ప్రకరంబు దప్పి వా
యంగ నొసంగు రంగుగ నిజాఖ్య వహించిన చాతకాళికిన్ 129

వివ:— ఆ పట్టణములోని నడగొండల వంటి ఏనుఁగులు తొండములు పైకెత్తి ఆకాశ గంగలోని నీరు పీల్చి ఆనీటి తుంపురులచేత తమకు నామ సాదృశ్యముచే చుట్టము లగు (అవియు సారంగములే ఇవియు సారంగములే కావున) చాతకములకు దప్పి తీర్చు నని పద్య తాత్పర్యము. ఇందలి సారంగ శబ్దము ఏనుఁగు అని పశు వాచకము గావున శకంధ్వాలలోఁ జేరి పరరూపముచే సార — అంగ — సారంగ అయినది.

ఇట్టి ఈ పదములోని (2 వ పా. మొదట నున్న) రం అను దానిపై అకారమునకు (అనఁగా సార+అంగ అను పదచ్ఛేదములో నేర్పడు పదాద్యకారమునకు) మైత్రి గలది యతి స్థలమునందు హ అను నది గూర్పఁబడుటచే సారంగ శబ్దములో అచ్చునకు (స్వరప్రధాన యతి) చెల్లుట కుదాహరణ మని యెఱుంగునది.

ద్రోణ పర్వమునందు:—

ఉ॥ అంగద నాథు మ్రింగిన వృకావళి ద న్వొసఁ జుట్టుకొన్న స
ర్వాంగములుం జలింప బెగ డందుచు దిక్కులు చూచుచున్న సా
రంగి య పోలె నుండెఁ గురు రాజ భవ త్సుతు సేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభిత విక్రమ లీలఁ బొల్పుటన్
(1, 17) 130

వివ:— భీష్ముని గూల్చి పాండవులు మిక్కిలి పరాక్రమముతో ముట్టడింపఁగా, ఓ ధృతరాష్ట్రా, నీ కొడుకు సేన ఆకఁలిచే మగ లేడిని మ్రింగి వైచిన తోడేళ్లు తన్నాక్రమింప గడగడ వడంకుచు భయముతో దిక్కులు చూచు ఆఁడు లేడి వలె వడంకుచుండె నని భావము. (అంగద— ఆఁకలి, క్షుత్తు) ఇందు 3 వ పా. న సారంగి అనుదాని ర అను దానికి యతి స్థలమున రా అనునది కూర్పఁబడుటచేత ఇది సారంగ శబ్దమందు వ్యంజనాక్షర యతి ( అఖండయతి ) చెల్లుట కుదాహరణ మని యెఱుంగునది.

3 ప్రాది యతులు: ఉపసర్గలు

శ్లో॥ ప్ర పరా ప్రతి పర్యత్యధ్యభ్యవానూప సం స్వప,
ని వి ని ర్దు రుద ప్యాజిత్యుపసర్గా స్తు వింశతిః.

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆఙ్, ఇవి ఇరువది యును నుపసర్గలు. 131

వ. ప్రకారోపసర్గం బాది యగుటం జేసి ప్రాదులనంబడును.

తే॥ ఆంధ్రమునకుఁ జేరని పరాజపులు మూఁడు
గాక తక్కిన యుపసర్గకముల తలల
స్వరము లతికిన వాని కవ్వలను నిలుచు
నచ్చయిన హల్లయినఁ బ్రాది యతి యనంగ 132

తే॥ అబ్జ యోని రజో గుణ ప్రాప్తిఁ దనరుఁ
బద్మ నాభుఁడు సాత్త్విక ప్రాప్తిఁ దనరు
రజత గిరి మందిరుఁడు తమః ప్రాప్తిఁ దనరు
ననఁగ నిబ్భంగిఁ బ్రాదుల కమరు యతులు 133

వ. కడమ యుపసర్గములకు అన్నిటికిని ఇటు వలెనే రెండునుం జెల్లు నని తెలిసికొనునది. 134

వివ:— ఉపసర్గలు ఇక్కడ అన్నము వండె, బట్ట నేసె మున్నగు వానియందు వలె భావి సంజ్ఞా నిర్దేశముచే (ముందు కలుగఁబోవు సంజ్ఞతో తత్పూర్వమే నిర్దేశించుట, వాడుట భావి నిర్దేశ మనఁబడును) క్రియా యోగమునఁ గలుగు సంజ్ఞతో ఆ క్రియా యోగము లేనప్పుడును ఉపసర్గ లను పేరు వాడఁబడె నని యెఱుంగునది.

ఇట్టి యుపసర్గలు సంస్కృత వ్యాకరణాను సారముగా నిస్, దుస్ అను రెంటి తోడనుం గూడి ఇరువది రెండైనను ఆంధ్రమందు నిస్, దుస్ అనునవి నిర్, దుర్ అనువానివలన గతార్థములే (సిద్ధించునవే) యను నభిప్రాయముచేతఁ గావలయు నవి విడిచి ఉపసర్గ లిరువది యని అప్పకవి నిర్వచించె నని యెఱుంగునది.

మఱియు నాంధ్ర పదములలోఁ జెందని (తెనుగు భాషలో నుండని) పరా, ఆఙ్, అపి అను మూఁటిని విడిచి తక్కిన 17 ఉపసర్గలలో దేనికైనను అజాది (అచ్చు మొదట గల) పదము పరముగా చేరి ఏర్పడిన విశిష్ట పదమందు ఉపసర్గ మజంత మైనప్పుడు దాని కడ యచ్చున్ను పర పదములో మొదటి అచ్చున్ను (సవర్ణ దీర్ఘ గుణాదుల వలన) కూడి (సంధి నొంది) యేర్పడిన (ప్ర — ఆప్తి — ప్రాప్తి మున్నగు రీతిగా నేర్పడిన ప్రా అను దాని వంటి) విశిష్ట వర్ణమునకును (ప్రాణి వర్ణమునకును) ఆ ఉపసర్గ హలంతమైనచో (నిర్, దుర్, సమ్ మొదలైన వానివంటి దైనచో) దాని కడ హల్లున్ను (ప్రాల్లు) పర పదము మొదలి అచ్చున్ను కూడి (సహజముగా) యేర్పడిన (నిర్ — ఉపమ — నిరుపమ

దుర్ + అంత-దురంత, సమ్ — అన సమాస మున్నగువానిలోని రు, ర మా అను వానివంటి) విశిష్ట వర్ణమునకును (ప్రాణి వర్ణమునకును) ఇట్లు రెండువిధములుగా నేర్పడు ఏ ప్రాణి వర్ణమునకైనను వ్యంజ నాక్షర యతియు (అఖండయతియు) పద చ్ఛేదముచే (ప్ర — ఆప్తి అను నట్లు విఱుపుచే) కాన వచ్చు సహజముగా పర పదము మొదట నుండు అచ్చునకును (స్వర ప్రధాన యతియు ఉభయమున్ను చెల్లును.) ఇట్టి ఉపసర్గ సంబంధమున (పూర్వమందుండుటచే) నేర్పడిన విశిష్ట పదము లందు పైని చూపినట్టి ప్రాణి వర్ణమునకు మైత్రి గలవి యైనను పర పదములోని మొదటి యచ్చునకు మైత్రి గల వర్ణము లైనను ఉభయ ములో నేవి యైనను పాదాదిని గాని యతి నియత స్థలమునఁ గాని కూర్పఁజెల్లు ననియు, ఇట్టి పదములలో వ్యంజనాక్షర మైత్రియే శ్రావ్య తచే సహజ ప్రాప్త మనియు, స్వర ప్రధానయతి విధాన లభ్యమనియు నెఱుంగునది. 133 వ పద్య 1, 2, 3 పాదములలో క్రమముగా అనఁగా 1 వ పా. న యతి స్థలమందు ప్ర + ఆప్తి అను నప్పుడు కాన వచ్చు ఆ అను దానికి పాదాదిని అ అను నది చెల్లుటచే అది ప్రోపసర్గయతిలో అచ్చు చెల్లుటకును, 2 వ పా. న ప్ర + ఆప్తి-ప్రాప్తి అని కూడి నప్పటి ప్రా అనునది సంయుక్తము గావున పా, రా రెంటికిని వెనుక చెప్పబడి నట్లు చెల్లును గావున) పా అనుదానికి పాదాదిని ప అనునదియు 3 వ పా. న రా అను దానికి పాదాదిని ర అను నదియు చెల్లుటచేత నవి ప్రోపసర్గ యతిలో హల్లు చెల్లుటకును (వ్యంజనాక్షరయతికిని అనఁగా నఖండ యతికిని) ఉదాహరణములుగా అప్పకవి రచించెనని యెఱుంగునది.

మరియు మిక్కిలి పరికింపగా నిక్కడ అప్పకవి నిస్ మస్ అను నవియు పరా, ఆజ్, అపి అను నవియు నీ యుపసర్గ యతికిఁ బనికిరావని అయిదుపసర్గలున్ను తొలఁగించి 17 పదియేడింటికే చెల్లు నని చెప్పినను సంస్కృతమందువలెనే తెనుఁగునందును (తత్సమ పదముల ద్వారా) నిస్, దుస్ అను నుపసర్గలకును నిరయము, దురయము మున్నగు పదము

లలో ప్రయోజన ముండుటచే నవియు గ్రహింపఁబడవలసినవే యనియు అనఁగా నిర్, దుర్ అనువానివలన నిలయము, దులయము మున్నగు పదములు (లకారమధ్యములు) న్ను, నిస్, దుస్ అను వానివలన నిరయము, దురయము (రకార మధ్యములగు) మున్నగు నవియు సిద్ధించ వలయును గావున అట్టి నిరయము, దురయము మున్నగు వానిలో ఇట్టి ఉభయ యతి నిర్, దుర్ అనునవి గ్రహించినంత మాత్రమున సిద్ధించదు గావునను ఈపదములలో ఈ ఉభయయతి సిద్ధించుట యుక్తమే యగుటచేతను నిస్, దుస్ అనునవియు నిందు గ్రహింపఁ బడవలసినవే యనియు ఆజ్ అనునదియుఁ దక్కిన యుపసర్గల వంటిదే యైనను దానివలన సిద్ధించ వలసిన ఉభయ యతిలేదు (ఉండదు), అనఁగా కేవల మగు ఆజ్‌నకు అజాది పదము పరమై నప్పుడు హల్లుండదు గావునను మరొక ఉపసర్గతో గూడి అజాది పదముతో గలసినప్పు డుభయ యతులున్ను ఆ యుపసర్గ వల్లనే సిద్ధించుట చేతను, ఈ ఉపసర్గ యతులలో ఆజ్ చేర వలసిన యక్కర లేకపోవుట చేత ఆజ్ మాత్రము తొలఁగింపఁబడ వచ్చును గాని, పరాక్కు, (ప్రి — అక్ — ప్రాక్—అఞ్చు గతౌ అనునట్లు పరా — అక్-పరాక్, అఞ్చు గతౌ అనియు సిద్ధించుటచేతను, దానిని తత్సమము చేయఁగా పరాక్కు) అనియు, పరాహము (పరా గతః—అహః—పరాహము అని సిద్ధించుటచేత) అనియు, అట్లే పరాసువు పరాస్తము (పరా — అసు పరాసు, పరా — అస్త—పరాస్త, పరా — అఞ్చు — ముఖ—పరాఙ్ముఖ) మున్నగు పదములు విరివిగానే పరా అను నుపసర్గ సంబంధము చేతనే ఏర్పడి ఉభయ యతి చెల్లుటకు యుక్తమైనవియే గావునను పరా అనునది ఇందుండి తొలఁగించిన-చో ఇట్టి పెక్కు పదములకును ఈ ఉభయ యతి సిద్ధించదు (చూ. పీఠిక) కావునను మఱియు నట్లే పలాయనము అనునదియు నిట్టిదియే కావునను పరా — అయనమ్—పలాయనమ్ 'ఉపసర్గస్యాయతేః' — (అయ ధాతు రూపము పరముగా నున్నప్పుడు

ఉపసర్గలోని రకారమునకు లకారము వచ్చునను నర్థము గల) అను సూత్రముచేత పరా అను నుపసర్గవలననే సిద్ధించి ఉభయ యతి చెల్ల వలసిన దగుటచేత (ఈ పలాయన శబ్దము ప్రత్యేకించి నిత్య సమాస పద యతులలో అప్పకవి చెప్పినాడుకాని అదియు ఈ యుపసర్గ యతి లోని దగుటచేతనే స్పష్టత్వమున కట్లు చెప్పియుండు ననక తప్పదు.) మఱి యును భవాప్యయములు, అప్యయము, అపీతము మున్నగు వానివలన తత్సమాంధ్రములో అపి అను దానికిని ప్రవేశ ముండవచ్చును గావున అప్యయ అనునదియు, అపీతను అను నదియు, అపి+అయ, అపి+ఇత అనువానిమేళనమున నేర్పడి వానిలో అపి యను నుపసర్గ మున్నదనుటకు వేదాంతవ్యాస సూత్ర శంకర భాష్యములు ప్రమాణములై యున్నవి. ఎట్లన 'స్వాప్యయాత్' 1, 1, 9 సూ. యత్రైతత్ పురుష స్స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మా దేనం స్వపితీత్యాచక్షతే, స్వం హ్యపీతో భవతీత్యేషా శ్రుతిః స్వపితీత్యే తత్పురుషస్య లోకప్రసిద్ధం నామ నిర్వక్తి స్వ శబ్దేనే హాత్మోచ్యతే, యః ప్రకృతః సచ్ఛబ్దవాచ్యః తమపీతో భవతి, అపి గతో భవతీత్యర్థః అపి పూర్వస్య ఇతేః లయార్థత్వమ్ ప్రసిద్ధమ్ 'భవాప్యయావితి' ఉత్పత్తి 'ప్రళయయోః ప్రయోగ దర్శనాత్' అని పై సూత్రమునకు శంకర భాష్యము. ఇందు తక్కినదాని యర్థమంతయు నెల్లరకు సుబోధము కాదు గావున అది యటుండుగాక; అది యప్రస్తుత మని విడిచి 'అపి పూర్వస్య ఇతేః లయార్థత్వమ్ ప్రసిద్ధమ్' అను వాక్య మొక్కటి మాత్రము సుబోధము, ప్రకృతనిర్ణయమునకుఁ జాలినదియు నగుచున్నది. అనఁగా అపి అనునది పూర్వమందు గల ఇణ్ ధాతువునకు (అప్యయ, అపీత మున్నగు వానిలో) లయము అను నర్థము ప్రసిద్ధము అను నర్థము గల వాక్యము అప్యయ, అపీత మున్నగువానిలో అపి అను నుపసర్గ మున్నది యనుటకుఁ జాలిన ప్రమాణమై యున్నది గావునను అపి యను నదియు మొత్తము నిస్, దుస్, పరా, అపి, అను నాల్గుచున్న

ఈ యుపసర్గ యతులలోఁ జేరవలసియే యున్న వనియు ఒక్క ఆజ్ మాత్రిము (మరి యొక యుపసర్గచే సిద్ధించుటచేత) గ్రహించ నక్కర లేదనియు సారాంశ మెఱుఁగునది. అప్పకవి వీనిని త్రోసి వేయుటకు ఇట్టి పదము లెక్కువ సుప్రసిద్ధములై యుండ వను నిస్సార హేతువు కన్న మరొక్క ప్రబల హేతు వుండదనియు తోఁచుచున్నది. (చూ. పీఠిక.) ఇవి యుభయ యతి చెల్లు ఉపసర్గలతోఁ గూడినవే యనియు అట్లు చెల్లుట మహా కవి ప్రయోగా రూఢమే యని స్పష్టముగా తెల్పుటకు ఉపసర్గ అజాది పరపదముతో గూడినప్పుడిది చెల్లు ననుటకును నుప సర్గోభయ యతుల మహాకవి ప్రయోగములు పెక్కులు (విరివిగా) గ్రంథాంతమునఁ జూపఁబడిన వని యెఱుంగునది.

మఱియు ప్రాణము, ఉపేక్షా మున్నగు నవి వీని దాహరణకు ములు. అరయ నరయ, అధీన, నిరంతర, సమంచిత మున్నగు శబ్దములలో రమేశాది శబ్దములలో వలెనే పర పదాది స్వరము స్ఫుటముగా నగ పడును గాన అట్టి యెడ స్వర ప్రధాన యతియే సహజ మనవచ్చును. (ఇది మా యభిప్రాయము కాదు — ఇదియు మాకు నచ్చలేదు.) ప్రాణము మున్నగు చోట్ల ప్రాణియతియే సహజముగా నుండును. మహా కవుల ప్రయోగములందు మాత్రి మట్టి నియమము లేక అన్ని యెడలను ద్వివిధ మగు యతులును బ్రియుక్తములై యున్నవి. (ఇది మాకును సమ్మతమే. ఇవియు నిత్యసమాస పదములే అనఁగా వీనికి 'కుగతి ప్రాదయః' అను దానిచే సమాసము గనుకను అది నిత్యసమాసమే యగుట చేతను ఉభయ యతులును యుక్తములే కావుననే ఇదియు నిత్య సమాస యతిచే గతార్థమే యగు చున్నది.) ఆ కారణముచేత నప్పకవి అట్టి వ్యవస్థ లేకయే ఉభయ యతులలో దీనిని (ప్రాది యతిని) జేర్చెను. అపికి సమాసము లేనందున తెనుఁగు లోనికి రాఁజాలదు. పైని చూపిన వాని వలన నిది నిస్సారము. అపిధానము, పిధానము ఇవియేని తెనుఁగులోనికి రావా, వీనికి ఉభయ

యతి ప్రయోజనము మాత్రము లేదు; వెనుక చూపిన వానికదియు గలదు గదా, అపికి సమాసమే లేదు. తెనుఁగులోకి రానే రాదనుట యెట్లు) ఆజ్‌నకు సమాస మున్నను ఆజ్పూర్వక పదక సమాసములో ఆజ్‌తో సంబంధించిన స్థలమున సామాన్యముగా హల్లు నిలువనేరదు. బ్రహ్మ—ఆ + ఉతమ్— ఇట్టి చోట్ల హ్మ మున్నగు నవి ఒకప్పుడు యతి స్థానమున కెట్లో వచ్చిన (యతి స్థలమునకు వచ్చుట యేమి కష్టము అవలీలగా వచ్చును.) రావచ్చును గాని ప్రాణి యతి కవకాశ ముండదు, (ప్రాణియే యుండదా, ఉన్నచో అవకాశ మెందుకు లేదు, తమ మత ప్రకార ముండునే, బ్రహ్మ+ఆ+ఉతమ్—ఈ క్లేశమెందుకో ఈ పదమెట్లగును, పదములకు సంధి రాదా, ఎందుచేత ? ఈ వాక్య మవ్యక్తము గాను కుదురనిది గాను ఉన్నది. గావున నద్దానిని (ఆజ్‌ను) గూడ నీ యుపసర్గ యతి సందర్భమునుండి పృథక్కరించుచున్నాఁడు. (తీసి వేయు చున్నాఁడు.) ఇట్టి విమర్శకులు ఆజ్ ఉపసర్గయతికిఁ బనికి రాదను అప్పకవి యభిప్రాయ మెఱిఁగియు, వెనుక అనఁగా యుష్మదస్మచ్ఛబ్ద యతిలో యుష్మదాజ్ఞా, తదాది మున్నగుచోట్ల ఉపసర్గ యతిచేతనే సమర్థింపఁ బూనుట మిక్కిలి పూర్వోత్తర విరోధము గాదా! ఆజ్‌కు ఉపసర్గ యతి ప్రయోజనము లేని విధము పైని వివరింపఁబడినది. వీరు చెప్పినట్లు కుదురదు) పరాసువులు పరాస్థ (ఇదిపరాస్త యేమో) మున్నగు చోట్ల రా అనునది యతి యొద్ద నిలుచు నప్పుడుభయ యతుల కవకాశ ముండుటచే పరాఅనుదానిని తొలఁగించుట సమంజసము కాదు (ఇది మేమున్న చెప్పినదే.) వ్యస్త స్థితిలో యతి యజాది పదములతోఁ గలుపు నపుడా సందర్భమునకు ద్వివిధ యతులు చెల్లు నని యుదాహరింప రాదను శంక యొకటి తప్పకున్నది. (ఈ వాక్యమున్న అవ్యక్తము గాను, అసందర్భముగాను ఉన్నది.) బ్రహ్మోతము 2 స్థలములలో నుపసర్గ సంధి యతిని బట్టి స్వర యతియు సాధువగును. (వెనుక చెప్పినట్లే యిదియు విరుద్ధమే. ఇట్లొక గొప్ప నవీన విమర్శకుని విమ

ర్థము గాన వచ్చుచున్నది. ఈ విమర్శమునందలి యనుపపత్తులు కుండలీ కరణములో (బ్రాకెట్లలో) తెలిపియే యున్నాముగదా. ఉపసర్గ సంధి యతికి అను చోట ముందున్ను దీని సందర్భము వివరింపఁబడును.

## నిత్య సమాస విశ్రాంతులు 4

గీ॥ ఒక్క సమసమున శబ్ద యుగము గూడి
పదము లేర్పాటుగాఁ గానఁబడని ప్రాణ
సంధులకు నిత్య సమసన శ్రాంతులును స
ఖండ విశ్రమములు నన రెండుఁ జెల్లు 135

క॥ లోకంబునఁ గర్ణాట వ
సాకో ద్వీపాంతరీప నాస్తి పదార్థా
నేకా న్యోన్య జనార్దన
నాకాదులు నిత్య సమసనము లండ్రు బుధుల్ 136

వ. ఆది శబ్దముచేత మందార నారికేళ శబ్దాదులు మఱియు ననేకములు గలవు. 137

వివ:— నిత్య సమాసము 'అవిగ్రహో' ఉస్వపద విగ్రహో వా నిత్య సమాసః'— అవిగ్రహ మనఁగా లౌకిక విగ్రహము, ప్రయోగార్హమగు విగ్రహము లేనిది. విగ్రహము లౌకిక మనియును అలౌకిక మనియు రెండు విధములు. ప్రయోగార్హమగు రాజపురుషః అను నప్పుడు రాజ్ఞః, పురుషః మున్నగు వాని వంటిది. లౌకిక విగ్రహము రాజ పురుషః మున్నగు వానిలో రాజస్, జస్, పురుష స్ మున్నగు వాని వంటిది అలౌకిక విగ్రహము (ఇట్టి యలౌకిక విగ్రహము ప్రయోగార్హముగాదు. లౌకిక విగ్రహమే ప్రయోగార్హము.) అట్టి లౌకిక విగ్రహము లేనిదియు, శాస్త్ర ప్రక్రియకొఱకు, అలౌకిక విగ్రహము మాత్రి ముండు నదియు నగు సమాసమున్ను (ఉన్మత్త గంగమ్— ఇది యొక దేశమునకు పేరు. ఇట్టి పదములలో విశిష్ట పదముచేత నే అర్థము వచ్చును గాని ఉన్మత్త, గంగ అను అవయవ పదములచే — (దానిలో విడ దీసిన పద ములచేత) ప్రకృతార్థము, అభిలషితార్థము రాదు గావున ఇట్టి వానిలో

శాస్త్ర ప్రక్రియ కొఱకు అలౌకిక విగ్రహమే గాని లౌకిక విగ్రహ ముండదను వ్యాకరణ శాస్త్ర నియమముచేత పైని చూపినట్టి లౌకిక విగ్రహము లేనిదియు, అలౌకిక విగ్రహము మాత్ర ముండునదియు నగు పద కదంబమున్ను అస్వపద విగ్రహ సమాసమున్ను — అస్వ పద విగ్రహ మనఁగా సమస్యమాన యావత్పదాఘటితము అనఁగా సమాస పదములలో సమసించ వలసిన — ఏక పదత్వము నొంద వలసిన పదములలో యావత్పదములు — అన్ని పదములు విగ్రహములోనికి రాక (చేరక) అనఁగా విగ్రహములోఁ జూపఁబడక అందొక దానికి మాఱుగా దాని స్థానమున నా యర్థము గలిగిన (విడిగా విగ్రహ వాక్యములోనికి రాఁదగిన) మఱొక పదమును ఘటించుట అస్వపద విగ్రహము, అది యెట్లు— విష్ణు నిభః మున్నగు చోట విగ్రహము చూప వలసి నప్పుడు ఇందలి నిభ యనునది విడదు. ఎందుచేతంటే ఎక్కడను (సమాసములోనే గాని, విడిగా కవులెవ్వరు ప్రయోగింపరు. గావున అనఁగా నిభ అనునది — మిష — కపటము అను నర్థమున విడిగా ప్రయోగా లున్నాయి గాని, సదృశ మైన అను నర్థమున ఒక్క ప్రయోగమున్ను లేదు. అట్లనే ఉపసర్గలతో (ప్రాదులతో) గూడిన సమాసములందెల్ల ఉపసర్గలు విడనివే గావున వాని స్థాముున మరొకటి ఆయర్థము గలది విగ్రహములో చూపవలసినదే గాని. అవి చూపఁ దగి నవికావు, కావున నట్టి విగ్రహము లేని దైనను — అస్వ పద విగ్రహ మైనను నిత్య సమాసము దీని పైని విగ్రహ మనఁగా నెట్టిదో వివరింప నక్కర యగు చున్నది. 'వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః'-(వృత్తి లోని పదములను విడ దీసి వాక్యముతోఁ జూపుట) వృత్తి యనఁగా నేమిటి? 'పరార్థాభిధానం వృత్తిః' పరార్థమును చెప్పునది వృత్తి యన్నమాట పరార్థాభిధాన మనఁగా నేమిటి ? 'ప్రత్యయార్థాంత ర్భావేన పర పదాంత ర్భావేన వా యో విశిష్టో ఽర్థ స్స పరార్థః' (ప్రత్యయముయొక్క అర్థముతోఁగూడినది గాని లేక పర పదము

యొక్క అర్థముతోఁ గూడినది గాని యగు పూర్వ పదమే చెప్పునట్టి విశిష్టార్థము పరార్థ మనఁబడును.) స చ అభిధీయతే యేన తత్ పరార్థాభిధానమ్ — (అట్టి విశిష్టార్థము దేనిచేఁ జెప్పఁబడునో అనఁగా అట్టి విశిష్టార్థమును చెప్పు శక్తి గలది యేదో అది వృత్తి యనఁబడును.) అతఏవ తిఙంతమ్, వృత్తిర్న భవతి — (కనుకనే తిఙంత పదమునకు వృత్తి యను పేరుండదు. కృత్తద్ధితాంత సమాసైకశేష సనాద్యంతధాతువులకు అయిదింటికి మాత్రము వృత్తి యని పేరుండును.) తత్ర ఏకార్థీ భావా నభ్యుపగమాత్ — (అవయవార్థములు అన్నియు ఒకే యర్థమగుట, ఏకార్థీభావము, అట్టి ఏకార్థీ భావము తిఙంతమందు వైయాకరణు లంగీకరింపరు. (తక్కిన పై చోట్ల నంగీకరింతురు. కావుననే ఇట్టివృత్తియందే ఏకార్థీభావ సామర్థ్య ముండుననియు, దీనికి ఏకార్థీభావవృత్తి యనియు పేరు. తిఙంత మట్టిది కాదు.) అన్యథా మృదు పచతీత్యాదౌ ఫలే మృదుత్వా న్వయో న స్యాత్ స విశేష ణానాం వృత్తిర్న భవతి వృత్తస్య చ విశేషణ యోగో నే త్యభ్యు పగమాత్ — (అట్లు కానిచో అనఁగా తిఙంత మందును వృత్తి నంగీక రించినట్లైతే, మృదు పచతి — మృదువుగా వండుచున్నాఁడు మున్నగు చోట్ల ఇట్లు క్రియా విశేషణ మగు మృదు మొదలగు పదముతో తిఙంతము చేరి యున్నప్పుడు) గూడా, వృత్తి కవకాశము గలి విశేషణ మగు మృదు మున్నగు పదమునకు తిఙంతములో నేకదేశ మగు పచనము మున్నగు క్రియతో (అనఁగా తిఙతమందు కూడియున్న పచ్ మున్నగు ప్రకృతికి — ధాతువునకు, పచనము మున్నగు క్రియయు — వ్యాపారమున్ను దానిపై నుండు తిప్పునకు — (ఆఖ్యాతమునకు) తి మొదలగు ప్రత్యయమునకు, కర్తయు — ఆ క్రియను చేయువాఁడు — ఆపనినొనర్చువాఁడున్ను మరియు ఈ రెంటికి మధ్యనుండు (శప్, అకారాదులకు వర్తమానాది కాలములున్ను అర్థము గావున ఆ యా యర్థములందలి వచ్చుటచేత తిఙంతమం దెల్ల మొత్తము మూఁడేసి

అర్థము లుండును గావున నందేకదేశ మగు ప్రకృతి (ధాతువు) యొక్క అర్థమగు పచనము మున్నగు క్రియతో మృదు మొదలగు విశేషణ పదమునకు అన్వయము గలుగదు — సంబంధ ముండదు (ఎందుచేతంటే) విశేషణముతోఁ గూడిన దానికి— వ్యస్తముగా, విడిగా, నుండు విశేషణముతో నన్వయించు దానికి వృత్తి యుండదు. వృత్తి నొందిన దానికి వ్యస్తముగా, విడిగా, విశేషణ ముండ గూడదు. విడిగా విశేషణ మున్నప్పుడా విశిష్ట (వృత్తియై ఒక్కటియైన వృత్తివల్ల నొక్కటే యైన) పదముతోడనే అన్వయించు శక్తియే ఆవిశేషణమునకుండును గాని అందేక దేశముతో నన్వయింపఁ గూడదు. (ఇదియే ఏకదేశాన్వయ దోష మనంబడు నని యెఱుంగునది — (ఏకదేశాన్వయ దోష మనఁగా నిట్టిదియే గాని నొక్కంత గ్రాహ్యాగ్రాహ్య భేదమున్నది. అదిముందు తెలుపఁబడును.) అనియు వ్యాకరణ శాస్త్ర సిద్ధాంతము — అనుశాసనము గావున విడిగా నున్న మృదువు మొదలగు విశేషణము వండుట మొదలగు క్రియతో (పనితో) నన్వయింపక అనఁగా మృదువుగా వండుట మృదువైన వంట — (పచనము అను నర్థ మెంతమాత్రము రాక— చెప్పుటకు వీలు లేక అనగా మొత్తముమీఁద కావలసిన — (ఫలమగు) అన్నమందు మెత్తదనము స్ఫురింపక తోఁచక (విపరీతముగా— అక్కర లేని, వండువాని (కర్త) యొక్క -- వంటచేయు వానియొక్క మృదుత్వము -- మెత్తదనము స్ఫురించును— అన్నము మెత్తగా నున్నది యను కావలసిన యర్థమురాక వంటవాఁడు మెత్తగా నున్నాఁడు అను పనికిమాలిన యర్థము వచ్చును అని తేలింది.) ఇట్లుగాకపోయినప్పుడు — తిఙంతమందు వృత్తి నంగీకరింపని వైయాకరణ సిద్ధాంతమందు పైని చెప్పిన విపరీతార్థము రాక ఏక దేశ మగు పచనాది క్రియతో నన్వయము కలిగి, (కలుగుటకు బాధ లేక ) సరస మగు — అభిలషిత మగు — కావలసిన పచనాదికము మృదు వైనది మున్నగు అనఁగా మొత్తముమీఁద ఫలమగు అన్నము మున్నగునది మృదువుగా నున్నది

మొదలగు, కావలసిన తాత్పర్యార్థము కలుగును — సిద్ధించును అని భావము) ఇట్లు కొందఱు వైయాకరణుల మతమై యున్నదనియు, ఈ విషయమున 'సమర్థ సూత్రి కైయట మత మెట్లున్నదంటే', 'పరస్య శబ్దస్య యోऽర్థః, తస్యాభిధానమ్ శబ్దాంతరేణ వా యత్రసా వృత్తిరిత్యర్థః యథా — రాజ పురుష ఇత్యత్రి రాజశబ్దేన వాక్యావస్థాయామనుక్తః పురుషార్థః అభిధీయతే' — దేనియందు పర శబ్దముయొక్క అర్థము గూడ పూర్వ శబ్దముచేతనే చెప్పఁబడునో దానికి వృత్తి యని పేరు; అది యేవిధముగా నంటే రాజపురుషః అను చోట (రాజ్ఞః పురుషః అను వాక్యావస్థయందు — విడి విడిగా పదములున్నప్పుడు పూర్వపదము చెప్ప లేని — చెప్పుటకు వీలు లేని, పర పదము — (పురుష అను పదము) యొక్క అర్థమున్ను పూర్వ పదముచేతనే — రాజ అను పదముచేతనే చెప్పఁబడుచున్నదో అట్లు అని భావము; అనఁగా రాజ్ఞః పురుషః అను నట్లు వ్యస్తముగా — విడిగా — పదములున్నప్పుడు రాజ్ఞః (అనుదానికి) — రాజు యొక్క యనియు, పురుషః (అను దానికి — పురుషుఁడు అనియు స్వ స్వ పదార్థములు మాత్రిమే — తమ తమ శబ్దముల యర్థము మాత్రమే యుండు ననియు స్వ స్వ పదార్థమును జెప్పు శక్తి మాత్రమే యుండు ననియు పూర్వపద మగు రాజ్ఞః అను దానికే పర పదార్థమును గూడ — పురుష అను పదముయొక్క అర్థమును సైతము చెప్పు నట్టి శక్తి యుండదనియు, వెనుక చెప్పఁబడిన సమాస కృత్తద్ధితైకశేష సనాద్యంతధాతు రూప వృత్తులలో — రాజపురుషః మున్నగు చోట రాజ మున్నగు పూర్వ పదమే పర పదమగు పురుష అను దాని యర్థమును గూడఁ జెప్పుననియు — చెప్పు శక్తి గలదే యనియు అట్లైన చో పర పద ప్రయోగము — పురుష మున్నగు పదమును గూడ కలిపియే యుచ్చరించుట (వ్రాయుట) యెందుకు అనఁగా సమాసాదులలో పర పదములు (తదర్థములు) అనేకము లుండ వచ్చును గావున — అవి పరిగణింప నశక్యములు గావున 'సర్వే సర్వార్థ వాచకాః —

(అన్ని శబ్దములు నన్ని యర్థములను జెప్పునవి) అను సామాన్య ముగా — మొత్తముగా చెప్పు నట్టి వాక్య మెట్లు యోగులకు — అన్ని శబ్దములను, అన్ని యర్థములను తెలుసుకొనఁ జాలు యోగ శక్తి గల వారికి—మాత్రి ముపయోగించి, అట్టి శక్తి లేని అస్మదాదులకు ఆ శబ్దము లెన్నియో, అవి యెవ్వియో, వాని యర్థము లెన్నియో, అవి యెవ్వియో విశేషించి విడి విడిగా చెప్పి నప్పుడే గాని ఈ సామాన్య వాక్యము వలన బోధ కాదు గావున ఇది యుపయోగపడదో, అట్లే ఈ వృత్తు లలోను పూర్వ పదమే కాని యాయా పర పదమున్ను కూర్పఁబడక పోతే యోగులకే గాని అస్మదాదులకు — మనకు— ఉపయోగించదు— విశేషార్థ బోధ కాదు గావున అట్టి అస్మదాదుల బోధకొఱకు మాత్రిము ఆ యా వృత్తులలో పర పదమున్ను గూర్పఁబడు ననియు వైయాకరణ సిద్ధాంత మని పై కైయట వాక్యతాత్పర్య మెఱుంగునది.

ఇట్టి నిత్య సమాస పదములలోను మఱియు సమాస పదములు కాక పోయినను అట్టి నిత్య సమాస పదములు వలెనే యుండు కొన్ని విశిష్ట పదములలోను ఇందు రెండు పదములు కలసి యున్నవని తెలియ బడక ఏక పదమువలెనే భాసించుటచేత అట్టి పదములలో నుత్తర పదము—రెండవపదము—పర పదము అజాదియై—అచ్చు మొదట నున్నది యై పూర్వపదములోని అంత్యవర్ణము (అది యొకచోట ప్రాణి వర్ణము కావచ్చును, అచ్చులేని పొల్లు హల్లున్ను మరొకచోట కావచ్చును) కూడఁగా అనఁగా పూర్వపదాంత్య వర్ణము పరపదము మొదటి యచ్చు లో సంధి వశమునఁ గాని—సూత్రి విధానముచేతఁ గాని సహజముగా గాని — స్వభావ సిద్ధమగుటచేతఁగాని) కూడి ఏకపదముగా భాసించు నప్పుడు నిత్యసమాస విశ్రాంతు లను నామముతో ఉభయమునకు —అచ్చునకును, ప్రాణివర్ణమునకును రెంటిలో దేనికైన యతి మైత్రి చెల్లుబడి యగును. అఖండ యతియును సర్వప్రధాన యతియు రెండును చెల్లును, అనగా యతి స్థలమందుగాని పాదాదిని గాని పర పాదాది

యగు అచ్చునకు మైత్రి గల వర్ణములైనను పూర్వ పదాంత్యమగు ప్రాణి వర్ణమున్ను పర పదము మొదటి యచ్చున్ను లేక పూర్వ పదాంత్యమగు పొల్లు హల్లున్ను, పరపదముయొక్క మొదటి అచ్చున్ను గూడి యేర్పడిన విశిష్ట వర్ణమునకు—ప్రాణి వర్ణమునకు మైత్రిగల వర్ణములైనను కూర్చవచ్చునని భావము; అనఁగా పైని చెప్పఁబడిన అవిగ్రహములు, అస్వపద విగ్రహములు నగు విశిష్ట పదములకు సమాసములు విధించు సూత్రములు విభాషాధికారములో చేరినవియైనను, పైని చెప్పినట్లు ఆపదములు విడుటకు — విడి విడిగా నుండుటకు వీలులేకపోవుటచేత, నవి యెల్ల నిత్య సమాసములే యనియు పై విధముగా వాని యందు స్వరప్రధాన యతియు నఖండ యతియు (వ్యంజనాక్షర యతులున్ను, రెండున్ను చెల్లుననియు, ఇట్టి వీనికి నిత్యసమాస యతులని యన్వర్థక నామ మనియు అప్పకవి చూపిన పదములలో కొన్ని అనగా నాస్తి, అన్యోన్య అను నవి మాత్రము సమాసపదములు కాక పోయినను నిత్య సమాస పదముల వంటివి యను నభిప్రాయముచేత (లాక్షణికముగా) గాని లేక ఛత్రిన్యాయముచేత గాని ఒక సంఘములోని పెక్కుమందికి ఛత్రము లుండి (గొడుగులుండి కొందరకు లేక పోయినప్పటికిన్ని ఆ సంఘములోని వారికందరకును ఛత్రిణో యాంతి — గొడుగులు గలవారు వెళ్ళుచున్నారు అను నట్లు ఆపేరు -- ఛత్రిణః అను పదము లోకములో చెల్లుచుండుటచేత అందరకును లేక అన్నిటికిని ఆ లక్షణము లేక పోయినను మొత్తమున కా లక్షణము చెల్లుట ఛత్రి న్యాయ మనఁబడుచున్నది. అప్పకవి మొత్తమన్ని పదములనున్నూ (నిత్య సమసములండ్రు అని 136 వ పద్యములో) నిత్యసమాస పదములనియే చెప్పినాఁడనియును తాత్పర్యము గ్రహించవలసి యున్నది. ఈ136 వ పద్యములోని పదములలో మొదటిది యగు కర్ణాట శబ్దము దేశ విశేషమునకు సంజ్ఞ యగుటచే నిందలి పదములు పైని చెప్పినట్లు విడవుగావున నిది నిత్యసమాస పదమే గావున నీ యుభయ యతి చెల్లుట కర్హమైనదే, అట్లే రెండవది

వనౌక శ్శబ్దమున్ను అగుచున్నది. (వానరమునకు సంజ్ఞ గావున) ఆలోచింపఁగా నిక్కడ వనం, ఓకః — నివాసస్థానమ్ యస్య సః అని లౌకిక విగ్రహము చెప్పినను, వానరము అను నర్థము వచ్చుచునే యుండగా నిదియేల నిత్య సమాసపదమగును అనుశంక వచ్చుచున్నను ఇట్టి లౌకికి విగ్రహమువలన వనములో నివసించు మునులు కిరాతులు తక్కిన మృగములన్నియు నట్లే వానరమున్ను చెప్పబడును గానిఒక్క వానరము మాత్రమే చెప్పఁబడక పోవుటచే, సందలి వనౌక శబ్దము కేవల యౌగికము కాదనియు యోగరూఢి పదమనియు అప్పుడు నిత్యసమాస పదమే కావచ్చు ననియు సమాధానము గ్రహించ వలసి యున్న దని యెఱుంగునది.

ద్వీప అంతరీప ద్వి ర్గతాః ఆపః యస్మిన్ సః ద్వీపః — రెండు విధములుగా పొందిన అనఁగా ఈప్రక్కనుండీ ఆ ప్రక్కనుండీ చుట్టుకొనిన ఉదకములు దేనియందు ఉండునో — ఏ ప్రదేశమునకు చుట్టువారి ఉదకముండునో ఆ మధ్యదేశము ద్వీప మనఁబడును. అంత ర్గతాః ఆపః యస్మిన్ సః అంతరీపః—ఇదియు నీటి నడిమి దిబ్బ అను ద్వీపము అను దాని యర్థమునకే సంజ్ఞ — పేరు; ఇవియు ఇట్టి విగ్రహముచే నితరములున్ను చెప్పబడుటచేత రూఢము లనియు వాస్తవమున నిట్టి లౌకిక విగ్రహము లేనివియై నిత్య సమాసపదములే యని యెఱుంగునది. ద్వి — అప్, అంతర్ — అప్ అని యుండఁగా ద్వ్యంతరుపసర్గేభ్యో ప ఈత్ — ద్వి, అంతర్ అనువానికంటెను, ఉపసర్గలకంటెను పరముగా నుండు అప్ అను దాని మొదటి వర్ణమునకు (అకారమునకు) ఈ అను నది వచ్చును అను నర్థముగల అను సూత్రముచేత అప్ అను దాని అకారమునకు ఈకారమున్ను సవర్ణ దీర్ఘమున్ను 'ఋకే పూరా అప్ ధూః పథా మానక్షే' అనుదానిచే సమాసాంతముగా అకార మున్ను వచ్చి ద్వీప అనియు, అట్టి ఈకారమున్ను సమాసాంతముగా అకారమున్ను మాత్రము వచ్చి అంతరీప అనియు నేర్పడు చున్న వని ప్రక్రియయు

యయు నెఱుంగునది. వీనికిని ఈ ఉభయ యతి చెల్లవచ్చుననియు నెఱుంగునది.

పదార్థ—దీనికిని పదస్య అర్థః పదార్థః అని లౌకిక విగ్రహమైనచో పదముయొక్క అర్థము — అభిధేయము అను నర్థమే కాని కేవల వస్తుమాత్రము —ద్రవ్యము అను నర్థమే రాదనియు, ఇక్కడి పదార్థ శబ్దము కేవల వస్తుమాత్రమును చెప్పునదియే యనియు పై విధముగా నిదియు నిత్య సమాసోభయయతులు చెల్ల వలసినదియే యనియు నెఱుంగునది.

అనేక—న — ఏక — (ఒక వస్తువు కానివి, ఒకటికన్న నెక్కువ యగునవి అను నర్థముతో) అనేక అని ఏర్పడినది. ఇది అస్వపద విగ్రహమే గావున నిత్య సమాసపదమే (అనఁగా నఞ్ లోని చివరది—ఇత్సంజ్ఞకము గావున అది లోపించి న అనుదాని పొల్లు — న్ అనునది 'నలోపో నఞః' అను సూత్రముచేత లోపించి, అ — ఏక అని అయి, పిమ్మట 'తస్మాన్నుడచి' అను సూత్రమున ఉత్తరపదములోని ఏకారమునకు పూర్వమున నుడాగమము—న్ అనునది—రాగా అనేక అని యేర్పడెను. నఞ్ లోని అకారములోపించి అ అని యగుట సమాసవృత్తిలోనే గావున అది విగ్రహములో చూపించుటకు వీలు లేక దాని యర్థము గల న అనునది — అస్వపదము—చూపింప వలసి వచ్చుటచేత నిదియు అస్వపద విగ్రహమే గావున నిత్యసమాస పదమే యనియు, నఞ్ సమాస పదము లెల్ల నిట్టివే యనియు, నుభయయతులు దీనికి వలె నన్నిటికిని చెల్లుననియు నెఱుంగునది. మఱియు దీనివలన నైకః, నైకధా మున్నగు నఞర్థక నశబ్ద ఘటిత పదములు, నిత్య సమాస పదములు కావేమో యని సందియము వచ్చు ననియు, వాని సమాస విధాయక శాస్త్ర మగు సహసుపా అను నదియును విభాషాధికార బహిర్భూతమే యనియు, అందుచేత నఞర్థక నశబ్ద మున్ను (తిఙంతముతో మాత్ర మన్వయించు నట్లు ప్రయుక్తమైనను) సుబంతములతో నన్వయించు నట్లు విగ్రహములో చూపింప వీలు లేనిదియే యనియు అందు

చేత న శబ్ద ఘటితములున్ను, నఞ్ ఘటితములున్ను, ఉభయములున్ను వాస్తవమున లౌకిక విగ్రహములు లేనివే యయి, అవిగ్రహములే కావున నిత్య సమాస పదములై ఉభయ యతులు చెల్లవలసినవే యనియు తోఁచుచున్నది.

జనార్దన, నాక అనునవియు, వనౌక శ్శబ్దము మున్నగు నవి వలెనే నిత్య సమాస పదములే యగుట యెఱుంగునది. జనార్దయతీతి జనార్దనః — జనుల నర్దించువాఁడు అను నర్థ మాత్రముచే ప్రకృతార్థమే రాక విశిష్ట పదముచేతనే ప్రకృతార్థము — విష్ణువు అను నర్థము వచ్చుటచే వెనుకటి రీతిగా అవిగ్రహమే యయి నిత్య సమాస పద మైనది యనియు, నాక న విద్యతే అకం అస్మి న్నితి నాక— దుఃఖము దీనియం దుండదు గనుక నాక మయ్యెను. న — అక అను నప్పుడు, అనేక అను నప్పుడు వలెనే నఞ్ లోని ఞ్, న్ అను నవి పోయి, అ + అక అని మాత్రము (నభ్రాణ్నపాన్నవేదా నాసత్యానముచి నకుల నపుంసక నక్షత్ర నక్రనాకేషు — ఈ పదములలోని న్ లోపించదు అనునర్థము గల సూత్ర నిషేధముచేత) కాక — అ + అక అను రూప మేర్పడక న + క అని యే యుండి సవర్ణ దీర్ఘముచేత నాక అని యగు చున్న దనియు, పైని చెప్పినట్లు ఈ నఞ్ సమాసమున్ను వాస్తవమున అవిగ్రహమే యనియు నెఱుంగునది.

ఇఁక మిగిలిన నాస్తి, అన్యోన్య అను రెండును సమాస పదములు కావు; ఎందువల్ల నంటే నాస్తి న అను నవ్యయమున్ను, అస ధాతువు యొక్క లట్ ప్రథమపురుషైకవచనాంత మగు అస్తి అను నదియును గూడి—చేరి—నాస్తి అని యేర్పడెను. ఇది సమాసము కాదనుట స్పష్టమే 'అస్తి, అను తిఙ్ఞంత ప్రతి రూప కావ్యయమున్ననూ అది అస్తిక్షీరా గౌః మున్నగు వాని లోనిదే కాని, ఇది యట్టిది యనుట కవకాశము లేదు; అనఁగా నిచ్చట నది కుదురదు — ఆ అస్తి యను నది వృత్తిలో పూర్వ పదముగా కుదురును గాని ఉత్తరపదముగా కుదురదు అని

యెఱుంగనది. ఇఁక నన్యోన్య శబ్ద మెట్టిదన– వ్యా. వా. 'కర్మ వ్యతిహారే సర్వనామ్నో ద్వే వాచ్యే సమాసవచ్చ బహుళమ్' అను దానిచేత అన్య అను దానికి ద్విత్వము – ద్వి ర్భావము వచ్చి సమాస వద్భావ మున్ను రావలసి యుండఁగా 'బహుళ గ్రహణాత్ అన్య పర శబ్దయో ర్న సమాసవత్' – పై దానిలో బహుళ అని యుండుట వలన అన్య, పర, అను వానికి సమాస వద్భావము రాదు అను ప్రమాణ వాక్యము చేత సమాస వద్భావమున్నూ లేక 'అసమాసవద్భావే పూర్వ పదస్య సుపః సు ర్వక్తవ్యః' – సమాస వద్భావము రానప్పుడు పూర్వ పదము సుప్పులకు – సు మొదలుకొని సప్తమీ బహువచన ప్రత్యయము వరకున్నూ గల ప్రత్యయము లన్నిటికిని (సప్తమీ బహువచనము నకున్నూ మాఱుగా వాని స్థానమున (సు) స్ అనునదియే (ప్రథమైక వచన ప్రత్యయమే) వచ్చు నని చెప్పవలయును అను నర్థముగల దాని చేత పూర్వ పదము సంబంధివి యగు అన్ని విభక్తుల ప్రత్యయము లకున్నూ స్ అను నదియే వచ్చి అన్య + స్–అన్యస్ అని అయి స్–అను దానికి రేఫయు, రకారమున్ను ర్ అను నదియు, పిమ్మట నా ర్ ఉకారమై అది పూర్వవర్ణముతోఁ గలసి ఓ అయి–అనఁగా అన్యో అని యయి, తరువాత పరముగా నున్న అన్యస్ అను దాని అకారమునకున్ను అన్యో అనుదాని ఓకారమునకును రెండికిని మాఱుగా ఓ అనునది యొక్క–ఓ వచ్చి అన్యోన్యస్ అని యయి, దాని సకారము, ర్ గాను, ర్ విసర్గముగాను అయి, అన్యోన్యః అనియు, అట్లే అన్యోన్యా మొదలగు అన్ని వచనములలోను, అన్ని విభక్తులలోను పూర్వపదము మాత్రము అన్యో అనియే అయి, పర పదము ఆ యా ప్రత్యయముల నొంది మాఱుచు, అన్యోన్యౌ, అన్యోన్యే, అన్యోనమ్, అన్యో న్యాన్ అన్యోన్యేన, అన్యోన్యాభ్యామ్, అన్యోన్యైః మున్నగు విధ ముగా పూర్వ పదము ఒకే విధముగా నుండు రూపము లేర్పడు ననియు, ఈ ద్విత్వాదులు కర్మవ్యతిహారమున (కర్మవ్యతిహారమనఁగా – క్రియల

యొక్క, పనులయొక్క మార్పు అనఁగా వీనికి వాఁడున్ను వానికి వీఁడున్ను ఒకరి కొకరు పనులు చేసుకొనుటకు) విధింపఁబడినవి కావున కర్మవ్యతిహారము కుదురునట్టి అన్ని విభక్త్యంతములలోనున్ను పైని చూపినట్టి రూపములవంటివే (పూర్వ పదము మాఱక పరపదమునందలివి యధానుగుణముగా మాఱుచుండు ననియు ఈ ఉభయ యతులను పొంద వలసిన పూర్వపదములోని న్యో అనునది మాఱదనియు, ఈవిధముగా నీ యన్యోన్య శబ్దము ద్విత్వమువల్ల నేర్పడ్డ దనియు, సమాస పదము కాకుండుట యట్లుండ సమాసవద్భావమేని వచ్చు పదమేని కాదనియు, పూర్వోక్త విధముగా దీనియందున్ను ఈ నిత్య సమాసోభయ యతులు చెల్లు ననియు నెఱుంగునది.

136 పద్య వివ:— దానిలో నాకాదులు అని ఆది శబ్దమువలన మందార, నాళికేర మున్నగు నవి, ఇంకను ఇట్టివి గలవు. అవి యెల్ల ప్రయోగానుసారము గ్రహింప వచ్చునని భావము.

మందార—దీనికి పారిజాత వృక్షము (పుష్పమున్ను) అర్థము— 'పారిభద్రే నింబతరుః మందారః పారిజాతకః' — అమరము. మందాని — సూక్ష్మాణి, అరాణి, యస్య సః (అరాణి — కంటకాని) —అనఁగా సూక్ష్మము లగు ముండ్లు గలది, మందార మనఁగా జిల్లేడు చెట్టున్ను— 'మందార శ్చార్కపర్ణే — మందాన్ — క్షుద్రి వ్యాధీన్ (ఔషధత్వేన) ఇయము ర్తీతి మందారః'—ఔషధ మగుటచేత క్షుద్రి వ్యాధులను పోఁగొట్టునది అని యమరముచేత చెప్పవచ్చును; ఏ యర్థమైనను జెప్పుకొన వచ్చును. పై విగ్రహము వలన అన్యములును చెప్పఁబడుటచే వెనుకటి ప్రకార మిదియు అవిగ్రహ నిత్య సమాస పదమే. మంద — అర—మందార అని కావున ఈ ఉభయ యతులు చెల్లు నని యెఱుంగునది.

నాళికేర — కొబ్బరి చెట్టు 'నాళ్యా కం — ఉదకమ్ ఈరయతీతి నాళికేరః', ఈర—క్షేపే అని ధాతుపాఠము రంధ్రములచేత నుదకమును

బీల్చునది లేక నాళీకాని — పుష్పఫలాని, ఈరయతీతి వా నాళి కేరః — కాడలతోఁ గూడిన పుష్ప ఫలాదులను బ్రేరేపించునది— చిమ్మునది—అనఁగా ఇచ్చునది అని గాని చెప్పవచ్చును. నాళిక — ఈర— నాళికేర—పై విధముగా నన్నియు దీనికిని జెల్లు నని యెఱుంగునది; అ... తక్కినవానికి వలెనే ఇందలి కే అను విశిష్ట వర్ణమునకును ఈ అను స్వరమునకును ఉభయ యతులున్ను చెల్లు ననుట.

కర్ణాట శబ్దమునకు రామాయణమునందు :—

శా॥ లాటీ చందన చర్చ [1]చోళ వనితా లావణ్య సామగ్రి క
ర్ణాటీ గీత కళా సరస్వతి కళిం గాంతః పురీ మల్లికా
వాటీ మంజరి గౌళ వామనయనా వక్షోజ హారాళి యై
పాటింపం దగు నీదు కీర్తి రథినీ పాలాగ్రిణీ సాహిణీ 138

(కిష్కి—౦. 826)

శ్రీనాథుని వీధి నాటకమందు:—

మ॥ కుసుమం బద్దిన చీర కొంగు వోలయన్ గ్రొవ్వారు పాలిండ్లపైఁ
దిరి సరంబుల్ పొలుపార వేణి యవటూ దేశంబుపై రాయఁగా
బస నెవ్వాఁడో యొకండు రాత్రి రతులన్ బల్గాసి గావించిన
న్వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటిరే 139

138 పద్య వివ:- ఇది 2వ పాదమున మొదట నున్న కర్ణ — అట అని విడు నప్పటి అ అను దానికి మైత్రి గల కళింగ — అంతః పుర అను నప్పుడేర్పడు అ అనునది యతి స్థానమునఁ గూర్పబడుటచే కర్ణాట శబ్దమున అచ్చునకు (స్వర ప్రధానయతి) చెల్లుట కుదాహరణ మగు చున్నది.

139 పద్య వివ:- 4 వ పాదమున యతిస్థల మందలి కర్ణాట అను నప్పటి (ర్ణా) ణా అను దానికి మైత్రి గలది పాదాదిని (న్వ) న అను నది కూర్పఁబడుటచే ఇది కర్ణాట శబ్దమున అఖండ యతి (వ్యంజనాక్షర

1 చోళమహిళా—(పా.)

యతి మైత్రి)) చెల్లుట కుదాహరణ మగుచున్నది. ఇట్లుభయ యతులు చెల్లిన వని భావము.

వ. వనౌక శ్శబ్దమునకు వనే కాననే, ఓకః స్థాన మస్యేతి వనౌకాః. 140

అథర్వణాచార్యుల విరాట పర్వమునందు:—

కం॥ శ్రీకంఠుఁ డెదురు నపుడు వ
నౌకో ధ్వజ మిందు) మకుట మర్జున తురగా
నీకము దివ్య శతాంగము
నా కవ్వడి కబ్బి యున్న నతఁడే మగునో　　　　141

వ. దానియంద.

క॥ ఆ కర్ణు దురాలాపము
లాకర్ణింపఁగ నశక్య మై ద్రోణునితో
నాక నదీ సుతుఁ డనిమె వ
నౌకో ధ్వజ మెఱుఁగ వచ్చు నరుఁ జూపి తగన్　　　　142

వివ:— ని. ఓక స్సద్మాశ్రియ శ్చౌకః అని యమరము. ఓక శ్శబ్దము ఇంటికిని. స్థానము (తావు) నకును చకారమువలన వేగమునకును పేరు. ఓకస్ అని సకారాంత నపుంసకమే కాక ఓక అని అకారాంత పుంలింగమున్నూ గల దని యర్థము.

వనము స్థానముగా (లేక గృహముగా) గలది గనుక వనౌక మనంబడెను. వానరమునకు (కోఁతికి) ఇచ్చుటి వనౌక శ్శబ్దము సంజ్ఞ — పేరు, అనఁగా యోగరూఢము గావున వాస్తవమున అవిగ్రహము— ని. కపి ప్లవంగ ప్లవగ శాఖామృగ వలీముఖాః మర్కటో వానరః కీశో వనౌకాః అని యమరము దీనికిం బ్రమాణము. 141 వ పద్య 2 వ. పాద మున మొదట వనౌకో, వన — ఓకో— (వృద్ధి చేత వన్ ఔకో. ఇట్లు వృద్ధి వలన ఏర్పడిన ఔ అనుదానికి (వృద్ధి యతిమైత్రి అనుపేర) మైత్రి గలది యతి స్థానమందు—మకుటము — అర్జున అను పదచ్ఛేదమునఁ

గాన వచ్చు అ అనునది గూర్చబడుటచే ఇది వనౌక శ్శబ్దములో స్వర ప్రధాన యతిలో నంతర్భూత మగు వృద్ధియతిలో ఔకారమునకుఁ జెల్లుట కుదాహరణ మనియు, ఇట్టే స్వరప్రధానయతిలోని వృద్ధియతిలో ఓకారమునకు (వన ఓక అను నప్పటి ఓకారమున కనుట) ను జెల్లు ననియు అట్టి దాని కుదాహరణ మూహించుకో వచ్చు ననియు, 142 వ పద్యమున 4 వ పాదమున మొదట (వన+ఓకో—వనౌకో అనునప్పటి) నౌ అనుదానికి మైత్రి గలది యతి స్థానమున న అనునది గూర్చఁబడుటచే నిది వనౌక శ్శబ్దమున అఖండయతి (ప్రాణియతి) చెల్లుట కుదాహరణ మనియు నెఱుంగునది. ఇందలి ‘వనౌకో ధ్వజ మెఱుఁగ వచ్చు నరు’ ని అనునది ‘ముఖము కాన వచ్చు ముదిత’ అను దాని వంటి దని యెఱుంగునది.

ద్వీప శబ్దమునకుఁ గావ్యాలంకార చూడామణియందు:—

ఉ॥ ద్వీపులఁ ద్రుంచి విశ్వ జగతీ పతి యు త్తమ శ క్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయున్ బ్రసన్నుఁ డై
గోపతి ధేను వవ్విభునకుం దన వైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్య గుణ బుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్
(7, 65) 143

నైషధమునందు:—

సీ. పా. వితత నవ ద్వయ ద్వీప నానా జయ శ్రీ
వధూటీ సమాశ్లిష్ట భుజుఁడు (1, 44) 144

వ. అంతరీప ప్రతీప శబ్దములకును నిటు వలెనే. 145

143 పద్య వివ:— 1 వ పాదమున మొదట (ద్వీపులఁ—ద్వీపః అస్యాస్తీతి ద్వీపి ద్వీపము — దీవి నివాసముగాఁ గలది, ద్వీపమున నుండు నది కావున ద్వీపి యనఁబడెను. ద్వీపులు — వ్యాఘ్రములు—పెద్దపులులు. ని. ‘శార్దూల ద్వీపినౌ వ్యాఘ్రే’ అని యమరము. ఇట్టి ద్వీపి శబ్దము ద్వీప శబ్దముతోఁ గూడినది. ఇందు ద్వీప అనునది యున్న దనుట అట్టి

(వెనుక చూపఁబడిన ప్రక్రియా ప్రకారము ద్వి—ఈప — ద్వీప అని యేర్పడిన) ద్వీప అను దానిలోని (ద్వీ) దీ అను దానికి (వర్గ యతి చొప్పున) మైత్రి గలది తీ అను నది యతి స్థలమున నుండుటచే నిది ద్వీప శబ్దములోని అఖండ యతిలో (వ్యంజనాక్షర యతిలో) సంయుక్త యతి స్వాభావమునఁ జెల్ల వలసిన సంయుక్తములో నొకటగు (మొదటి దగు) దీ అను దానికిఁ జెల్లుటకును, 144 వ పద్య పాదమున యతిస్థానమున (ద్వీ) వీ అను దానికి పాదాదిని వి అనునది ఉండుటచే అది సంయుక్తములో రెండవ దగు వీ అను దానికిఁ జెల్లుటకును, 143 లోనే 2 వ పాదమున మొదట వెనుకచెప్పినట్లు (ద్వి — ఈ ప అను నప్పు డేర్పడు చున్న) ఈ అను దానికి (స్వరయతిలోని ఇత్వ మైత్రి యగుటచే) మైత్రి గలది, యతి స్థలమున (గోవులకున్ — ఇమ్ము అను చో నేర్పడు) ఇ అనునది కూర్పఁబడుటచే నిది అచ్చు చెల్లుటకున్ను (స్వరయతిలో ఇకార యతి మైత్రి చెల్లుటకున్ను) ఉదాహరణము లని యెఱుంగునది. మఱియు నిచ్చటి ద్వీపి శబ్దములో 'శతే పంచాశ న్న్యాయమున (నూరు వస్తువు లున్నప్పుడు ఏబది వస్తువు లున్నట్లే యగును గావున) ద్వీప శబ్దమున్న దనఁబడెను. 145—అంతరీప, ప్రతీప వెనుకఁ జూపబడిన రీతి నేర్పడిన వీనిలోను మొదటి దానిలో రీ, ఈ లకును రెండవ దానిలో తీ, ఈ లకును (అనగా అంతర్ + ఈప-అంతరీప అనియు, ప్రతి + ఈప —ప్రతీప అను రూపములయందలి వానికి) ఉభయ యతులు చెల్లు ననియు వాని కుదాహరణము లూహించుకో నగు ననియుం దాత్పర్యము. ఈ విశ్వపతి యను రాజు (కృతి నాయకుఁడు) వ్యాఘ్రముల నెల్ల (వేఁటచే) రూపుమాపి (భరత ఖండమునందెల్ల) జంబూ ద్వీపమందు గల గోవుల కెల్ల నిరపాయ స్వేచ్ఛా నివాస మేర్పఱచి కాపాడుటచే మహానందముచే ప్రసన్నురాలై (అనుగ్రహము కలదై) వాని (గోవుల) జనని (మాత — తల్లి) యగు కామధేనువు తన దాన వైభవ మెల్ల (మహా దానములు సేయునై పుణ్య శక్తియు, అందుకు దగిన నిరుపమాన

ధన సంపదయు) ఈ విశ్వ పతి కిచ్చి యుండును. అట్లు కానిచో లోకములో నెవ్వరికిని గలుగని ఇట్టి మహాదాన సంపద లెట్లాతనికి గలుగు నని భావము (అనగా కామ ధేనువు వోలె మహాదాన గుణ సంపన్ను డనుట.)

నాస్తి శబ్దమునకు శృంగారషష్ఠమునందు:—

సీ॥ గీ॥ తల్లియును దండ్రి దైవంబుఁ దలఁప గురుఁడ
కాఁడె యిఁకేమి చేసినఁ గనలఁ దగునె
నాస్తి కాధమ యోరి యన్యాయ వృత్తి
"నాస్తి తత్త్వమ్ గురోః పర" మ్మనఁగ వినవె 146

విష్ణుచిత్తీయమునందు:—

శా॥ ఆ నిష్ఠానిధి గేహ సీమ నడురే యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్ర శయాను పుణ్య కథలున్ దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము "నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదన సౌష్ఠవం చ, కృపయా భోక్తవ్య [1]మన్ పల్కులున్"
(1, 84) 147

146 పద్య వివ:— ఇందు 4 వ పా. న ఆది నున్న (నా — అస్తి — నాస్తి అని వెనుక చెప్పఁబడి నట్లేర్పడ్డ) నాస్తి అనుదాని, అస్తి అనుదాని అ అను దానికి యతి స్థలమున (పరమ్ + అనఁగ అన నేర్పడు) అ అను నది యుండుటచే నిది అచ్చు చెల్లుటకున్ను, 147 వ పద్యములో 3 వ పాదమందు మొదట ధా అనునది యతి స్థలమునందలి (నా + అస్తి —నాస్తి అనుదాని) నా అను దానికి మైత్రికిఁ గూర్పఁబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను (బిందు పూర్వయతి మైత్రి యగుటచే) ఉదాహరణము లనియు, 146 లో 3 వ పాదమందు మొదట నున్న నాస్తిక అను దాని కిని ఉభయ యతులు చెల్లనగును గాని ఇక్కడ దాని అచ్చునకును,

1 మన్ బల్కులున్ (పా)

హల్లునకును రెంటికిని చెల్లు నట్లు యతి స్థలమున న్యా అని యుండుటచే అచ్చునకు చెల్లుచున్నదో హల్లుకు చెల్లుచున్నదో నిర్ణయింపదు గావున నది ఇక్కడ ఉదాహరణము గాదనియు, సూ. 'అస్తి నాస్తి దిష్టమ్ మతిః' అను దానిచే అస్తి, నాస్తి అను వానికి ఠక్ అను ప్రత్యయము చేరి పరలోకము (దైవము) కలదు అను బుద్ధి గలవాఁడు అను నర్థమున ఆస్తిక అనియు పరలోకము (దైవము, దిష్టము) లేదు అను బుద్ధి గల వాఁడు అను నర్థమున నాస్తిక అనియు నేర్పడును. అట్టి యీ నాస్తిక పదము నిత్య సమాస వృత్తి పదము కాక పోయినను తద్ధిత వృత్తియు అవిగ్రహమున్ను అయి ఏక పదత్వము గలది వలె తోఁచుటలో వాని కన్నను నెక్కువదే గావున నుభయ యతులు చెల్లుట యుక్తమే యనియు, అందు ఏకపదత్వ భావముచే హల్లు చెల్లుట సహజమే (శ్రావ్యమే) యనియు, అచ్చు చెల్లుట కొక్కింత ఉదాహర ణాపేక్ష యున్న దనియు, ఈ యుదాహరణము మాత్రమందు కుపయోగ పడదనియు నెఱుంగునది.

పదార్థ శబ్దమునకు సాంబ విలాసమునందు:—

తే॥ హాలికి నెదురేఁగి సకల పదార్థములు ను
పాయనము వెట్టి నీ ముద్దు పట్టితోడ
జాంబవంతుని దౌహిత్రు శౌరి పుత్రు
సాంబు నొప్పించి బ్రతికించు సకల జనుల 148

భాస్కర శతకమునందు:—

ఉ॥ దక్షత లేని యింటికిఁ బదార్థము వేఱొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయన మై చనుఁ గల్ల గాదు ప్ర
త్యక్షము వాగులన్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
య క్షయ మైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా 149

148 లో యతి స్థలమందలి (పద + అర్థ — పదార్థ అని యేర్ప డిన) పదార్థ అనుదాని అ అను దానికి (అచ్చునకు) పాదాదిని హ అనునది మైత్రికిఁ గూర్పఁబడుటంజేసి, ఇది అచ్చు చెల్లుటకున్ను, 149లో

మొదటి పాదము యతి స్థలమున పదార్థ అను దాని దా అను హల్లు నకు పాదాదిని ద అను నది మైత్రికిఁ గూర్పఁబడుటచేత నది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లని యెఱుంగునది. ఇందు (149 లో గిడుగువారి ప్రతిలో మాత్రము వాగులున్, వఱద లన్నియు, అని యున్నది గాని అప్పుడు అర్థ సందర్భము చక్కగా కుదురుపడి నట్లు తోఁచదు. ఏ ప్రతిలోను (మాకు లభించిన వానిలో వాగు అనుచోట అర్థ బిందువు లేదు గాని శ. రలో కాన వచ్చుచున్నది. ఆ చర్చ అన్యత్ర ఒనర్పఁబడు నని యెఱుంగునది. వాగులన్ — సెలయేళ్ళనుండి (ఇక్కడ ఉండి యనునది లోపించినది) వఱదలు — ప్రవాహములు, వెల్లువలు అని యర్థము.

అనేక శబ్దమునకు విష్ణుచిత్తీయమునందు:—

కం॥ తునియలు తొమ్మిది యఁట పదు
నెనమండ్రఁట మోచు వా రనేకప కిటి కూ
ర్మ నగాహు లేటి లావరు
లని తావక బాహు వొకటి యవని భరించెన్ (1, 35) 150

కాళహస్తిమాహాత్మ్యమునందు:—

ఉ॥ తాను గుమార జంగమ సుధాకర మౌళియుఁ గూడి మాడి యిం
పైన రతి ప్రసంగముల నర్ధ నిమీలిత నేత్ర పద్మముల్
[1]మానని చుంబనంబు లర [2]మాటలు సొక్కులు వీడి వీడి పో
నీని కవుంగిలింతలు ననేక విలాసములుం జెలంగఁగాన్ (1, 42) 151

కర్ణ పర్వము నందు:—

ఉ॥ మ్రొగ్గెడు వాహనంబులును మోములు వాడఁగ వాహనంబుల
న్డిగ్గి తొలంగు సైనికు లనేకులు గట్టపుఁ బాటు చొప్పడన్
దగ్గు సిడంబులున్ గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటి మై
మ్రగ్గెడు వారు నై కురుధరావరు సైన్యము రూపుమాయఁగాన్
(2, 355) 152

---

1 మానిత (పా) 2 మాటల సొమ్మలు (పా)

ఆముక్తమాల్యదయందు:—

చ॥ మలిచి ప్రయోజ కోశముల మాఱ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపు టెజ్జడాల్ బొమిడికంబులతో నపరంజి యోడుబి
ళ్ళల నలవై జయంతముఁ జలంబున గెల్వఁగ దంశితంబులై
నిలిచిన భంగి మాడువు లనేకము లుల్లసిలుం బురంబునన్

(1, 52) 153

వ. అనాది అనంత, అనంగ, అనూరు శబ్దములు మున్నయిన నఞ్ సమాసముల కన్నిటికిని ఇటువలెనే రెండునుం జెప్ప వచ్చును. 154

150 పద్య వివ:— 2 వ. పాదమందు యతి స్థలమందున్న (అనేకప—న — ఏకప అను నప్పుడు ఏర్పడుచున్న) ఏ అనుదానికి పాదాదిని (పది — ఎనమండుగ్) అని కానవచ్చుచున్న) ఎ అను నదియు, 151 లో 4 వ పాదమందు యతి స్థలి నున్న (అనేక—న — ఏక అన నేర్పడు) ఏ అను దానికే పాదాదిని (పోనీని—పోన్ — ఈని అని కాన వచ్చుచున్న) ఈ అనునదియు మైత్రి చెల్లునట్లు కూర్చఁబడుటచే నీ మహాకవి ప్రయోగములు రెండున్ను అనేక శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 152లో 2 వ పాదమందు యతివద్ద (న — ఏకులు—అనేకులు అను నప్పటి) నే అను దానికి పాదాదిని (న్డి) ని అను నదిన్ని, 153 లో 4 వ పాదమున యతివద్ద (న — ఏక — అనేక అని యేర్పడ్డ) నే అను దానికే పాదాదిని ని అని కూర్పఁబడుటచే నివి రెండున్ను అనేక శబ్దమున హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లగుచున్నవి. 151 లో మానని చుంబనం బలరు మాటలు అనియు సరస మైన పాఠ మగుచున్నది. మానిత చుంబనంబు, మాటల సొమ్ములు అనిపాఠాంతరాలున్ను, (అసలు) మానని చుంబనంబలర మాటలు అనియు గిడుగువారి ప్రతిలోను మరొకచో మానిని చుంబనంబు అనియుం గలవుగాని, అవి యంత సరళతయు, సరసతయు గలవిగా మాకుం దోఁచలేదు. మానని చుంబనంబు లరమాటలు, మానని చుంబనంబలరు మాటలు అనుపాఠములు మేము చూచిన

ప్రతుల నెందు నున్నవి గావుగాని కవిరచిత మిందొకటి యయి యుండు నని మాకుదోఁచి గ్రహింపఁ బడ్డవి. 152 లో గిడుగువారి ప్రతిలో 'మోములు దెళ్ళఁగ జారు వాజులున్, మగ్గు సిడంబులుం గులము మాటికి నేటి యెదిర్చి' అని మూలమందును, 1 మొగ్గు...మూఁటికి (ప) 2 యదిర్చి అని క్రిందను గలవు-అవి యేవియు మాకు సరిపడినవి కావు; అచ్చు పొరపాటు పడిన, 'సైనికులు నేలకుఁ' అనఁగా ల ఉండ వలసిన చోట (పడ వలసిన చోట) లు అనియు కులు అనుటకు లకు అనియు అచ్చులో పడఁగా అది కొండంత చేసిన వారు పూర్వపుం బ్రతులలోఁ జక్కని పాఠము లొప్పి యుండ ఏ తాటాకు ప్రతిలోనో వారిపాఠ ముండిన నేమి సరళ సరసార్థము కుదురని పాఠము మూల ములో గ్రహించుట ఎట్టి విమర్శ పాటవమో చెప్పవలసి యున్నది. మఱియు తగ్గు సిడంబులున్ అను ప్రాచీన సమీచీన పాఠములో తగ్గు అనఁగా నేమో—తోఁచక (కుదురక) పోయె నేమో, శ—రలో తగ్గు అనుచోట అర్థమున్ను అచ్చటి ఉదాహరణమున్ను చూచునది. మఱియు మగ్గు అనుపదము నర్థమున్ను దాని యుదాహరణము శ — రలోనే చూచునది.

మఱియు 153 లో ప్రాచీన ప్రతులలో గెల్వఁగ దంశితంబులై గెల్వఁగన్ — జయించుటకొఱకు, దంశితంబులై — కవచము ధరించినవై (యుద్ధ సన్నాహము గలవై) దంశము అ. పుం. 3 కవచము శ—ర అనియే యుండఁగా గెల్వఁ దదంశితంబులై అని యున్నది. దీనిని బట్టి వారు వలెనే ఆక్షేపింప వలెనన్నచో గిడుగువారికి పద్యమునకుఁ దాత్ప ర్యము తెలియనే లేదనియు, దంశిత అనుదాని కర్థమే యెఱుఁగక పోయి రనియు, తక్కిన సంస్కృత నిఘంటువులయు మహాకవి ప్రయోగములయు మాటయేల శ—ర లోని అర్థమైన తెలుసుకొన లేక పోయిరనియు ననఁ దలఁచు వారికి మిక్కిలి యవకాశము గలుగుచున్నది గాని నేను మాత్ర మట్టి సాహసము నొందక అది అచ్చులో గ అనుటకు మాఱుగా ద

అని పడిన దనియే మెంచి సమర్థించు కొంటి నని మనవి సేయు చుంటిని. మఱియు ఇట్టి వర్ణనలు మహాకవుల గ్రంథములలో, తెనుఁగులోను బెక్కు లుండు ననుటకు ఒండు రెండు మాత్రము చూపు చుంటిని:

సీ॥ దట్టంపు మల్లెలఁ దల బొమిడిక వెట్టి సొంపారు పువ్వుల జోడు దొడిగి-
వీరభద్రవిజయము (2వ ఆ.) (బొమిడికము —రూ. బొమిడిక)

సీ॥ తిమరాసురుని గెల్వసమయ శౌరిధరించుచికిలి కెంపులబొమిడికమనంగ-
భాను. 3 వ ఆ. (శ—ర లో)

తామర మొగ్గల వలె (మలిచి) చెక్కి తయారు చేయఁబడిన పద్మరాగ మణి కలశములు కిరీటముల వలెను, ఆచ్ఛాదనముగా పైని బఱచిన బంగారపు (ఓడుబిల్లలు) పెంకులు కవచము లట్లును ఉండుట చేత నాపురిలోని (మాడువులు) మేడలు సౌందర్యమున నెక్కువ దానని విఱ్ఱవీగు దేవేంద్రుని వైజయంతము నందములో గెల్చుటకు డాడిసేయఁ గిరీట కవచాదుల ధరించి సిద్ధముగా నున్నవో యను నట్లున్న వని యీ పద్యతాత్పర్య మెఱుంగునది. 'దంశితో వ్యూఢకంకటః'— (కవచమును ధరించిన వాఁడు దంశితుఁ డనఁబడును) అని యమరము. కొన్నిట మలఁచి అనికలదు. అదియును సమంజసమే యని యెఱుంగునది.

154 వివ:-వీనిలోని పదములున్ను మరియు నఞ్ సమాన పదము లన్నియు వెనుక చెప్పిన ప్రక్రియ చొప్పున నేర్పడి అవిగ్రహ నిత్య సమాసములే గావున వీనికిని నిట్టి వాని కన్నిటికిని అచ్చునకును హల్లు నకును యతులు చెల్లును, ఉదాహరణము లూహించుకొన నగు నని భావము.

అన్యోన్య శబ్దమునకుఁ గావ్యాలంకార చూడామణియందు:—

ఉ॥ ధన్యుఁడు విశ్వ భూవిభుఁడు ధారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్య హితత్వ సంపదల నొందిరి దంపతు లింపునింప న
న్యోన్య సుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పు పిండు న
న్యోన్య సుపుష్టి తుష్టి కుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్

(7, 68) 155

వివ:— (నోమిరి ( — అన్యోన్యాను కూల్యముకొఱకు) పత్ర దానాదు లొనర్చిరి అని యర్థము గ్రహించునది, తక్కినది సుగమము. పైని చూపిన (వెనుక చూపిన) ప్రక్రియ ప్రకార మేర్పడ్డ అన్యోన్య శబ్దములోని అచ్చునకును (అ అను దానికిని) హల్లు నకును (న్యో అను దాని నో, యో లకును) అనఁగా ఒక అచ్చునకును రెండు హల్లులకును మొత్తము మూటికిని చెల్లుటకు కావ్యాలంకారచూడామణి [illegible] ముదాహరించినాఁడు. ఇందు 2 వ పాదమందు మొదట [illegible] ( [illegible] ) యో అనుదానికి యతివద్ద (సంపదలన్ — ఒందిరి) అన్నప్పు డేర్పడు ఒం అనునదియు (సరస యతి మైత్రిగా), 3 వ పాదమందు నట్లే (న్యో) నో అను దానికి నో అనియు, 4 వ పాదమునం దట్లే (అన్యో — అన్య అన్నప్పు డేర్పడు) అ అను దానికి, (కుశల — ఆదుల అన్నప్పు డేర్పడు) ఆ అను నదియు (అప్పకవి చెప్పిన చొప్పున లుప్త విసర్గ స్వరయతి మైత్రిగా) కూర్పఁబడుటచే నిది మూడింటికి నుదాహరణ మయ్యె నని యెఱుంగునది.

జనార్దన శబ్దమునకు:—

వ. జనా నర్దయతి సుఖయతీతి జనార్దనః. అర్ద గతౌ యాచనే చ.
'విష్వక్సేనో జనార్దనః' ఇత్యమరః

సాంబవిలాసమునందు:—

చ॥ శరధి సుతా కళత్ర నవ సారస నేత్ర బలాంతకాది ని
ర్జర నుత నామ పాతక విరామ విహంగమ యాన చారు క
ర్బుర పరిధాన పాండవ విరోధివిభంజన నిర్మలాత్మకా
య రుచి జితాభ్ర ఖంజన జనార్దన కైటభ దైత్య మర్దనా 156

ఆరణ్య పర్వమునందు:—

చం॥ నగి నగి యేనియున్ విను జనార్దన యెన్నఁడు బొంకు వల్క మ
త్యగణిత విక్రమోరు బల ధైర్య సమగ్రుల[1] మెల్ల భంగిఁ గా
ల గతి దొలంగఁ ద్రోవఁగఁ దలంబగునే యవ్వు గాక నీకు మె
చ్చుగ నిదె ప్రాణ మిచ్చెదము స్రుక్కము చావున కాత్మ నేనియున్
(4, 397)

---

1 అట్లుగాక (పా)

వివ:— జనార్దన—అప్పకవి ధాతుపాఠములో నున్నట్లే 'అర్ద గతౌ యాచనే చ' అని వ్రాసియు, అర్దయతి — సుఖయతీతి అని అర్థము వ్రాయుట పరికింప ధాతువుల కనేకార్థములుండు ననియు [అనేకార్థా హి ధావః] అందు మిక్కిలి ప్రసిద్ధము లగు అర్థములు మాత్రము ధాతు పాఠములో చెప్పఁబడు చుండు ననియు ప్రయోగాను సార మితరార్థములును చెప్ప వచ్చు ననియు, వ్యాకరణ సిద్ధాంత మగుటచేత ఈ యర్థ మిక్కడ తన మతాను సరణమునకుఁ బ్రదర్శించి యుండు ననియు గురుబాలప్రబోధికలో మాత్రము—సముద్ర మధ్యవర్తినః జననామ్నా ఉసురాన్ అర్దితవాన్— [సముద్రపు నడుమ డాగి యున్న జన నామము గల దుష్ట దనుజుల నర్దించిన (రూపుమాపిన) వాఁడు గనుక] జనార్దన అనియు, ప్రళయకాలే జనాన్ సర్వానపి అర్దయతి వా — [ప్రళయ కాలమున నెల్ల జనులను సంహరించు వాఁడు, లయము నొందించు వాఁడు గనుక కాని) జనార్దనుఁడు, 'అర్ద పీడనే' అని కలదు. ఇట్లు క్రొత్త వ్యుత్పత్తి వ్రాయుట చేతను, గోపాల దేవునికి కృతి యిచ్చుట చేతను కృత్యాదిని శంఖ చక్ర గదాది వర్ణనలతోఁ గూడిన మంగళ పద్యముల రచనచేతను అప్పకవికి సిద్ధించిన వైష్ణవ మతా నుసారిత్వము నిది మఱింత బలపఱచు చున్నదని కొందఱు విమర్శింతురు.

156 పద్య వివ:— ఇందు 4 వ పాదమున యతి వద్ద నున్న జనార్దన అనుదాని—జన — అర్దన అను నప్పుడేర్పడు—అ అను దానికి పాదాదిని య అనునది యుండుటచేత నిది అచ్చు చెల్లుటకున్ను, 157 లో యతి వద్ద నున్న జనార్దన అను దాని నా అను దానికి పాదాదిని న అనునది యుండుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవి.

157—ఇందు 3 వ పాదమున 'కా ల గతి....తలం బగునే' తరం బగునే అనియే నన్నయ ర ల లకు యతి వాడి యుండఁగా అది ఇష్టము లేని సంస్కర్తలు తలంబు అనియు, దళంబు అనియు మార్చి యుందు రనియు, ఇట్టివే తలమే బ్రహ్మకు మున్నగు నవియు ననియు కొంద

అందురు. అది యుక్తే యని ముందు నిర్ణయింపఁబడును. ఈ యర్థమున తలము అను పద మొక్క యతి ప్రాసల లోనికి మరి యొక పదము లోని ల అను నది వచ్చి నప్పుడు మాత్రె మగపడుటయు ఇతరత్ర ఈయర్థమున తరము అనియే యుండుటయు ఈయర్థమున నెల్లరును తరమే అనియే యనుట గ్రంథ లోక ప్రసిద్ధి యగుటయు పై యూహాకు కారణము లనియు నింకను ప్రబల హేతువులు తెల్పబడు ననియు నెఱుంగునది.

వ. నాక శబ్దమునకు 'న విద్యతే అకం దుఃఖమ్ అత్రేతి నాకః'.

ని. 'స్వ రవ్యయం స్వర్గ నాక త్రిదివ త్రిదశాలయాః' ఇత్యమరః.

ఇవి యన్నియు సమానార్థకములు, స్వర్గ అను పదమునకు పర్యాయ పదములు.

గౌరరాజు చాటుధారః—

ఉ॥ ప్రకట దర్పులై సకలరాయని లక్కనృపాలు నాజిలోఁ
దాఁకు విరోధి సైన్యము ముదం బొదవన్ వరియింప వచ్చుచో
నాకస మెల్లఁ గ్రమ్ముకొను నంచిత దివ్య విమాన సంచర
న్నాక విలాసినీచరణ హంసక భూరి ఝణంఝణ ధ్వనుల్ 158

విరాట పర్వమునందు:—

క॥ మును వెఱతు నేయ మీరలు
నను నేసినఁ గాని యనుఁడు నాకేశ సుతున్
ధను రాచార్యుఁడు డెబ్బది
సు నిశిత బాణముల నేసెఁ జూపఱు వొగడన్ (5, 124) 159

కావ్యాలంకారచూడామణియందు:—

క॥ నీ కరవాలము ప్రాతై
నాకంబున కేఁగి రాజనారాయణ యా
భూకాంతు లెట్టిచనువో
నాక విటోత్తములఁ దూల నడఁతురు కడిమిన్ (7, 66) 160.

158 పద్య వివ:— 4 వ పాదమున మొదట నున్న సంచరత్ — నాక — సంచరన్నాక అను దాని నాక అనుచోట న — అక అను నప్పు డేర్పడు అ అను దానికి యతి స్థలమున హం అను నదియు, 160 వ పద్యలో 4 వ పాదము మొదటి (న + అక) అను నప్పటి అ అను దానికే యతి చోట తూలన్ — అడఁతురు అను నప్పుడేర్పడు అ అనునదియు కూర్పఁ బడుటచే నివి నాక అను దానిలో అచ్చునకును, 159 వ పద్యమున 2 వ పాదమున యతి వద్ద నున్న నాకేశ అనుదాని నా అను దానికి పాదాదిని న అనునది కూర్పఁబడుటచే నిది నాక శబ్దములో హల్లు చెల్లుటకున్ను ఉదాహరణములైన వని యెఱుంగునది.

158 లో ఆజిలోఁ దాఁకు అనుచోట దా అను దాని వెనుక బిందువు (అరసున్న) గిడుగువారి ప్రతిలోను మేము చూచిన తక్కిన వానిలోను న్ను కానరాదు (లేదు), అది యుండ వలెనని యే తోఁచును. 160 లో గిడుగువారి ప్రతిలోను తక్కిన మా చూచిన వానిలోను కేఁగి రాజి నారాయణ అని జి అను ఇత్వవిశిష్ట మే కలదు. అప్పా డర్థ మెట్లు కుదురునో పరికింపఁ బ్రాజ్ఞులు ప్రార్థితులు. ప్రాచీన ప్రతులలో ఏగి అనుచోట అరసున్న లేకుంటఁ జూచి తమ మతము చొప్పున అరసున్నతో సవరించి విమర్శకుల కిది యేల గోచరించ లేదో యెఱుఁగ వలెను. (రాజిన్, పంతి త—పంతిగా అని యెట్లో ముడివెట్ట సాహసించిరా అది కేవల సాహసమే యని యెఱుంగునది.)

వ. నఞ్ సమాస శబ్దము లెన్ని యున్నను నన్నిటికి నిటువలెనే యని తెలుసు కొనునది.

వివ:- ఇటు వలెనే—నాక శబ్దమున కెట్లు భయయతులు చెల్లినవో అట్లే అన్నిటికి చెల్లవచ్చు ననియు ఉదాహరణము లూహించుకోవాలి అని తాత్పర్యము. పరికింప నిచ్చట అన్నియు అని ఎన్నో యున్నట్లున్నను దాని తాత్పర్యము క్రింద తెలియజేయు నట్లు తోఁచు చున్నది —నఁగా నాక శబ్దము వంటిది. నఞ్ సమాసము కలిగి నకార పొల్లునకు లో

పము న్ను పర పదములోని మొదటి అచ్చునకు వెనుక నుడాగమము 'న్' రానిదియు నగునది. ఇక నొకటిమాత్రమే కలదు, అది నాసత్య యనునది యనియు, దీనికిం బ్రమాణము: సూ. నభ్రాణ్ణపాన్న వేదా నాసత్యా నముచి నకుల నఖ నపుంసక నక్షత్ర నక్ర నాకేషు ప్రకృత్యా — నభ్రాట్, నపాత్, (తనూనపాత్) నవేద, నాసత్య, నముచి, నకుల నఖ, నపుంసక, నక్షత్ర, నక్ర, నాక అను నీపదము లెల్ల నఙ్ తో గూడి యేర్పడినవై నను వీని పొల్ల నకారము లోపింప దని సూత్రార్థము వీనికే నఙ్ నకారము లోపింపని రూపములుండును. (మరియు నొక్కటి నగ, అగ అని యున్నను అది ప్రకృతమున సంబంధించదు.) వీనిలో నాక శబ్ద ము వెనుక చెప్పినది, నాసత్య తక్క, తక్కినవి, అజాది పర పదములు కావు కనుక ఉభయ యతి చెల్ల వలసినవి కానే కావు. ఇక నాసత్య శబ్ద మెట్లేర్పడ్డ దంటే-సత్సు సాధూ సత్యౌ తత్ర సాధు రితి యత్ప్రత్య యః-(సత్ — య-సత్య, న — సత్యౌ — అసత్యౌ — సాధువులుకాని వారు) న — అసత్యౌ (నాసత్యౌ)— పై సూత్రములో నాసత్యా అను బహువచన మవివక్షితము గావున న — అసత్య అను నప్పుడు న్ లో పింపక సవర్ణదీర్ఘముచే నాసత్యౌ అని యేర్పడెను. (ముక్కలి సత్యులు అనగా సాధువులు గావున అశ్వినీ దేవతలు నాసత్యు లనఁబడిరి.) ఇందు న — అసత్య అనునప్పు డేర్పడు అచ్చు (అకారము) నకును న — అ సత్య — నాసత్య అనునప్పుడేర్పడు నా అను హల్లునకు (ప్రాణికిని) ఉభ య యతులు చెల్లుననియు, ఇట్టిది మఱొకటి లేనే లేదనియు, నఙ్ నకారమునకు లోపమున్ను పరాచ్చునకు నుడాగమ మున్ను వచ్చి అనేక, అనూరు మున్నగు వానివలె నేర్పడు నవి యనంత ములును, వానికెల నుభయ యతులు చెల్లుట వెనుకనే చెప్పఁబడిన దనియు, ఇక్కడి నాక శబ్దము నఙ్ సమాస పదమే యైనను నకారలోపము లేక భిన్న రూప ముతో నుండుటచేత నిట్లు భిన్నముగా చెప్పఁబడినదనియు, ఇట్టిది యిక నొక నాసత్య యనునది మాత్రమే యనియును సారాంశ మెఱుంగునది.

విశ్వామిత్రి శబ్దమునకు రంగనాథుని రామాయణమునందు:—

ద్వి. ఎక్కడా గురుఁడని యెఱుఁగని నీకు
నక్కటా గురుఁడు విశ్వామిత్రుఁ డయ్యె 161

రామాయణమునందు:—

మ॥ హర కోదండ విఖండనుండు జనక క్ష్మాధీశు జామాత భా
స్కర వంశాగ్రణి జానకీ ప్రియుఁడు విశ్వామిత్రి యాగాహితా
సుర సంహారి విరాధ కాలుఁడు ఖరాసు ధ్వంసి మారీచ సం
హారుఁ డన్య ప్రమదా పరాఙ్ముఖుఁ డయోధ్యా నాయకుం డాదటన్
(సుం.— 263) 162

161 పద్య వివ:— విశ్వామిత్రి — ఇది అజాద్యుత్తర పదము కాకున్నను మహా కవి ప్రయోగము లుండుటచేత (గావలయు) దీనిని నిత్యసమసన పదోభయయతులలోఁ జెప్పినాఁడు. ఇందు 2 వ పాదమున యతి వద్ద విశ్వ — అమిత్ర అని అజాది పద మేర్పడ కున్నను విశ్వ అనుదాని కడపటి అ అను దానికి దీర్ఘము రాగా ఏర్పడిన ఆ అను దానికి మైత్రి గల అ అనునది పాదాదిని గూర్పఁ బడుటచేత నిది విశ్వామిత్రి శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 162 లో 2 వ పాదమున యతి వద్ద విశ్వామిత్రి అనుదాని (శ్వా) శా అను దానికి మైత్రి గల (స్క) స అ నుది కూర్పఁబడుటచేత నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణములని అప్పకవి యభిప్రాయ మగుచున్నది.

పరికింప ఋషి వాచక విశ్వామిత్రి శబ్దము, విశ్వ — మిత్రి అని యుండఁగా, సూ. 'మిత్రేచర్షౌ' విశ్వ అను దానికి మిత్రి అనునది పరమగు నప్పుడు పూర్వ పదములోని చివరనుండు అకారమునకు విశిష్ట పద మొక ఋషిని చెప్పు నప్పుడు దీర్ఘము (ఆ) వచ్చును, అకారము ఆకారమగును అను నర్థము గలది యగు — అను దానిచే విశ్వ అనుదాని అకార మాకారమై విశ్వామిత్రి అని యేర్పడుటచేతను, పర పదము మొదట విరుగునట్టి అచ్చు లేక పోవుటచేతను, ఇట్లే దీర్ఘము మాత్రము

వచ్చినవియు సహజముగా అచ్చు విడదీయుటకు వీలులేనివియు నగు కుమారాయిత, భద్రాయిత అనువానిలో అచ్చు లేదనియు, అది యెఱుంగక కొందఱు అవి నిత్య సమాస పదము లని భ్రమపడి నారనియు నిందించు అప్పకవి అట్టిదే యగు విశ్వామిత్ర శబ్దమునకు నిత్య సమాసోభయయతులు చెల్లునట్లు నిరూపించుటచేత మిక్కిలి స్వవచన వ్యాఘాత దోషము రాకతీరదనియు పై రంగనాథ రామాయణ ప్రయోగము సాధింప వలసినచో మఱి యొక విధముగా (ప్రత్యేకించి పంచమీ విభక్తి యతి మున్నగు విధముగా) సాధించుకో వలెనే గాని ఇట్లు చెప్పుట మాత్రము సమంజసము కాదనియు తోఁచుచున్నది. మరియు మిక్కిలి పరికింప ఈ రంగనాథ రామాయణములో నింకను — 1, 'అడరి చింతింప విశ్వామిత్రుఁ డంత'-బాల.21.2, 'అవధారు దేవ విశ్వామిత్రుమేని'(పై)-3, 'ఆరూఢ పదుఁడు విశ్వామిత్రుమహితు'-బాల.63. -ప్రయోగము లిట్టివి కానవచ్చు చున్నవనియు, అందుచేత నిత్య సత్య వ్రతుఁడగు హరిశ్చంద్రుని ఊరక పీడించి కౌశికుఁడు విశ్వమునకు అమిత్రుఁడై విశ్వామిత్రుఁ డయ్యె (విశ్వామిత్ర అని పిలువఁ బడినాఁడు) అని లోక ప్రతీతి యుండె ననియు (ఎట్లయినను) మహర్షి యగు కౌశికుని నామమున కిట్లు వ్యుత్పత్తి చెప్పుట సమంజసము కాదను నూహతో మహర్షి యగు పాణిని అట్లు నిర్వచించి యుండు వనియు (అనగా విశ్వమిత్ర — విశ్వమునకు మిత్రుడు) అను నర్థము గలదానికే దీర్ఘము విధించి నాఁడనియు, ఇట్టి నిర్వచనము లోక ప్రతీతికి విరుద్ధ మగుటచే అది పాటింప నక్కర లేదను నూహతో గాబోలును రంగనాథ కవి స్వతంత్రించి విశ్వ — అమిత్ర అని యే పదచ్ఛేదము చేసుకొని అట్లు స్వరప్రధాన యతులు గూర్చినాఁడని యూహింపవలసి యున్నదనియు కొంద ఱందురు గాని ఈమూడు ప్రయోగములం బట్టియు విశ్వామిత్ర శబ్దోభయ యతుల కొకింత బలము గలుగుచున్నది గాని, విశ్వావసు, విశ్వారాట్ మున్నగు పదములలో వెనుకటి రీతిగా విరుద్ధ ప్రతీతి

నూహించుటకు వీలులేని పదములలో సైతము దీర్ఘోచ్చారణమున్న సూ. 'విశ్వస్య వసు రాటోః' — విశ్వ శబ్దమునకు, వసు, రాట్ అనునవి పరమగుచో దాని చివర వర్ణమునకు దీర్ఘము వచ్చును అను మున్నగు వానిచే పాణిని సాధించుటయు హేతువులై వెనుక చెప్పిన ప్రీతితి యూహించుటయు, అట్టి ప్రీతితి యొఱఁగియు పాణిని (మహర్షి) అసత్యమున కొడి గట్టి పై రీతిగా నిర్వచించినాఁడనుట పొసఁగి యుండ లేదనియు ఎట్లయినను మఱియొక మహాకవి ప్రయోగము కాన వచ్చు వరకు విశ్వామిత్రి శబ్ద స్వరప్రధాన యతికి బలము చాలదనియు, అయి నను రంగనాథ కవి (పై) ప్రయోగములు పైని చెప్పినట్లు వేఱు విధముగా సాధించుకో వలసినవే యనియును తోఁచుచున్నది.

రంగనాథుఁడు ఎక్కడా అనుచోట వ్యవహారములో ఎప్పుడూ రావు, ఎవరూ లేరు మున్నగు వానిలో వాడబడు నట్లు అప్యర్థక నువర్ణమునకు లోపమున్ను పూర్వ స్వరమునకు దీర్ఘమున్ను కలుగు నట్లు ప్రయోగించినాఁడు. కొందఱు ఎక్కడన్ అని ఉన్నను ఛందో భంగము లేదందురు, కాని అట్లు సవరించుట కధికారము చాల దని తోఁచును.

ఆపోశన శబ్దమునకు చమత్కార రామాయణమునందు:—

కం॥ ఓ శశి ముఖి లోపాము
ద్రేశుఁడు కలశ భవుడుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడు మును పా
పోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్ 163

శృంగారషష్ఠమునందు:—

సీ॥ గీ॥ త త్తరమున నాపోశన మె త్తఁబోయి
భూసురుం డెత్తు ను త్తరాపోశనంబు 164

163 పద్య వివ:— ఇందు 4 వ పాదము మొదట నున్న 'ఆపోశన— ఆపో — అశన అను నప్పుడేర్పడు అకారమునకు యతి వద్ద (సాగర — అంబువు అనగా నేర్పడు) అ అనునది కూర్పఁబడుటచేత నిది ఆపోశన

శబ్దములో అచ్చు చెల్లుటకున్ను, 164 లో 2 వ పాదమున యతి యుద్ద నున్న (ఆపోశన అనుదాని) పో అను దానికి పాదాదిని భూ అనునది కూర్పఁబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణములై నవి.

అపామ్ సమూహః ఆపమ్ ఆపస్య అశనమ్ అస్మిన్నితి ఆపోశనమ్ — అప్పుల — (ఉదకముల) సమూహము, ఆపము, దాని అశనము— భక్షణము (త్రాగుట, లోనికి పుచ్చుకొనుట) ఈ ఆపోశన క్రియ యందుండుటచేత నిది ఆపోశన మనఁ బడును. ఆప — అశనమ్ అని యుండఁగా పృషోదరాదిగణమునఁ జేరుటచేత ఆప అనుదాని చివరనున్న అకారమునకు ఓకారమున్ను 'ఏఙః పదాంతాదతి' అను సూత్రముచే ఓ, అ అను వానికి రెంటికిన్ని పూర్వ రూపమున్ను అనఁగా రెంటికిన్ని బదులుగా ఓ కార మొక్కటియే రాఁగా ఆపోశనమ్ అని యేర్పడును. అట్టి ఈ శబ్దమున్ను వెనుక చెప్పినట్లు నిత్య సమాస పదమున్ను అచ్చునకును హల్లునకును ఉభయ **యతులు** చెల్ల వలసినదే యనియు నెఱుంగునది. అనఁగా ఆపోశన అను విశిష్ట పదములోని పో అను దానికిన్ని, ఆపో — అశన అను నప్పు డేర్పడు అశన అను దాని మొదటి అకారమునకును విడి విడిగా దేనికైనను చెల్లు నని భావమెఱుంగునది.

స్వాంత శబ్దమునకు శృంగారనైషధమందు:—

గీ॥ అధిక రోష కషాయిత స్వాంతుఁ డైన
నరపతికి విన్నవింపకు నా యవస్థ
పైత్య దోషోదయంబునఁ బరుస నైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదు కాదె (2, 82) 165

విరాట పర్వమునందు:—

ఉ॥ స్వాంతము బాహు గర్వ ఘన సంతమసాంధము గాఁగ శంక యా
వంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి నాగమంటపా
భ్యంతర సీమఁ జొచ్చి దరియం జని యారసి సెజ్జఁ గాంచి య
త్యంత ముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁపఁగాన్
(2, 331) 166

165 పద్య వివ:— ఇందు 1 వ పాదమునందు యతి యొద్ద స్వాంత — స్వ — అంత అను సవర్ణ దీర్ఘ డేర్పడు అకారమునకు మైత్రి గలది పాదాదిని అ అనునది కూర్పఁబడుటచే స్వాంత శబ్దమున నిది అచ్చు చెల్లుటకున్ను, 166 లో 1 వ పాదము మొదట స్వాంత అను దాని (స్వా, సా అను దానికి యతి యొద్ద సం అనునది కూర్పఁబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవి.

మిక్కిలి పరికింప స్వాంత శబ్దమునకు గురుబాలప్రబోధికలో వ్యుత్పత్తి 'స్వనతీతి స్వాంతమ్ స్వన శబ్దే' తద్వియోగ భావే వాగ్వ్యాపారాభావాత్ అత్ర ఉపచారః — (మన స్సంబంధము లేనప్పుడు వాగ్వ్యాపారము అనఁగా పలుకుట (కలుగదు) సంభవించదు గనుక ఇక్కడ మనస్సే పలుకునది యని చెప్పుట ఔపచారికము) అని కలదు. సాదృశ్యాభేదాది, సంబంధముచేత ఒకదానిని మరొక దానినిగా చెప్పుట ఒకదాని ధర్మము మరొక దానియందారోపించుట ఉపచారము, అట్టి ఉపచారము వలన వచ్చినది ఔపచారికము. ప్రకృతము వాగ్వ్యాపారమునకు కారణము గావున మనస్సే (హేతు హేతుమత్తుల కభేదము గావున అట్టి అభేదోపచారముచేత) పలుకుట యను వ్యాపారము (ధర్మము) గలది యనియు అందుచేత స్వనించునది (పలుకునది) గావున స్వాంతమయ్యె ననియుఁ జెప్పఁబడినది. కాని ప్రకృతమున నీ వ్యుత్పత్తి గ్రహించి నట్టయితే ఇది అజాది పర పదమేర్పడు నది కాదు కావున దీనికి నిత్యసమాసోభయ యతి చెల్లక పైని చూపిన శ్రీనాధుని ప్రయోగములోని అచ్చునకు చెల్ల వలసిన (స్వరప్రధానయతి చెల్లవలసిన) 165 వ పద్య ప్రథమ పాద యతి నిరాధారమై, ఇట్టివే ఇతర మహాకవుల ప్రయోగములున్ను పెక్కులు నిరాధారములై దుష్టములు కావలసి వచ్చుననియు, ఇట్టిది నిత్యసమాస యతులు చెల్లునదిగా చెప్పుటయు ఇక్కడ నుదాహరించుటయు పొసఁగ దనియు అందుచేత క్రింది విధముగా నుత్పత్తు లూహింపఁబడినవి. సు (సుష్ఠు) ఆ అనంతి అనేనేతి స్వాంతమ్ అన ప్రాణనే —

దీనిచే బాగుగా నెల్లరు బ్రతుకుదురు (మనస్సు లేకుండ బ్రతుకుట యసంభవమే కదా) కావున స్వాన్త మయ్యెను (సు + ఆ—స్వా, స్వా — అన్త — స్వాన్త) లేక సు (సుష్ఠు) ఆ అన్యతే — బధ్యతే విషయై రితి స్వాన్తమ్ అతి అది — బంధనే, విషయములచే నెల్లెడఁ గట్టి వేయంబడు నది ఆకృష్టమగునది కనుక స్వాంతము (మనస్సు విషయములచే నాకృష్ట మగును గదా) లేక స్వేన అనంతి సర్వే ఇతి స్వాన్తమ్ — ఎల్లరు తన చేత (మనస్సుచేత) బ్రతుకుదురు — సర్వప్రవృత్తులు గలవారగుదురు కనుక స్వాంతము, (స్వ — అన్తమ్— స్వాన్తమ్) లేక స్వస్మిన్ అన్యతే బుద్ధి రితి స్వాన్తమ్ — బుద్ధి (మనస్సునందు) తనయందు బంధింపఁ బడుటచే స్వాంతము — స్వ+అన్త — స్వాన్త, అతి అది బంధనే లేక స్వస్మిన్ స్వస్మాద్వా అన్యతే సర్వేంద్రియ వ్యాపార ఇతి స్వాన్తమ్ — సర్వేంద్రియ వ్యాపారమున్ను — అన్ని యింద్రియముల ప్రవృత్తు లున్ను తనయందు (లేక) తనవలన కూర్పఁబడుచున్నది—అనఁగా సర్వేం ద్రియ వ్యాపారమునకు నాధారమైనది కనుక (మనస్సు)—స్వాంత మనఁ బడుచున్నది. మొత్తము మీఁద సు, ఆ అను నుపసర్గ ద్వయ ముతో గూడి ఏర్పడిన స్వా అనుదానికి గాని, స్వ అనుదానికి గాని అన ప్రాణనే అతి బంధనే అనువానిలో నొకదాని సమావేశమున (కూర్పువలన) ఔణాదిక ప్రత్యయ (త లేక అ అనువానిలో నొక దానిచే) కల్పనచే స్వాంత శబ్దము నిష్పన్నమయి నిత్యసమాస పదమై పైని చెప్పినట్లు భయ యతుల చెల్లునదియై పైని చెప్పిన విప్రతిపత్తిని (నిరాధారత్వ మును) జెందనీక సర్వసామంజస్యము గలిగించును. అనఁగా ఈచెప్పిన వ్యుత్పత్తులలో నేది గ్రహించినను ఏదోషమున్ను సోకక సర్వాను కూల్యము కలుగు ననియు, అందుచేత నిట్లు గ్రహించ వలసినట్లు మాకుఁ దోచుచున్న దనియు అనఁగా ఇట్లు చెప్పినప్పుడు సు అను ఉపసర్గ సంబంధమున నేర్పడుచో ఉపసర్గోభయ యతులున్ను స్వ అను పదము సంబంధమున నేర్పడుచో నిత్యసమాస పదోభయ యతులున్ను ఈ స్వాంత శబ్దమునకు సిద్ధించు ననియు నెఱుంగునది.

మరియు 166 విరాట పర్వ పద్యములో మేము చూచిన ప్రతు లన్నిటిలోను దరియం జని అని దరియుధాతు రూపమే కానవచ్చుది గాని శబ్ద రత్నాకరములో మేము చూచిన ప్రతులలో దరియ అను ధాతువే లేక (ఎత్తి వ్రాయఁబడక, తటియు – సమీపించు అనియు తటి – సమీపము అని యెత్తి వ్రాయఁబడి భారతాదులనుండి ఉదాహ రణములు వ్రాయఁబడి యున్నవి. ఆ వ్రాసిన ఉదాహరణములతో టకార ప్రాస లుండుటచేతను ర అ లకు దాను ప్రాస మైత్రి లంగీక రింపని వాఁడగుటచేతను ఆమహాకవి ప్రయోగములు తన మతమున కడ్డు దగులునను నూహచేతను కావలయు శబ్దరత్నాకరకర్త అట్లు దరియు ధాతువు నెత్తక దాని స్థానమున తటియు అని ఎత్తి వ్రాసి నాఁడనియు అయినను సమీపించు అను నర్థమందున్న సమీపము అను నర్థమం దున్న దరియు, దరి అని యే వ్యవహారములోను గ్రంథములలోను న్న సు ప్రసిద్ధములనియు, తటియు, తటి అనువాని కట్టి సుప్రసిద్ధి ఈ చెప్పిన యర్థములయందు లేనే లేదనియు మాకు తోఁచు చున్నదనియు నెఱుంగునది.

ఏకాంతశబ్దమునకు పారిజాతాప హరణమునందు:—

ఉ॥ అంతట నొక్కనాఁడు ధవళాంబుజ నేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంత గృహంబులోన శశికాంత శిలామయ వేది మీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయత నేత్రలు గొల్వ జూడ న
త్యంత వినోద కేళి మెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగాన్
(1,43,) 167

ఆదిపర్వమునందు:—

సీ॥ గీ॥ కామ సుఖ సంగములకు నేకాంత గృహముఁ
బోలి పొలిచియు ధర్మార్థములకు నిదియ
యాస్పదంబన వర్గ త్రయానురమ్యు
లైన జనుల నెంతయు నొప్పు నప్పురంబు (8,74,) 168

167 పద్య వివః-ఇందు 3 వ పాదము మొదట (ఏక — అంత అను నప్పుడేర్పడు అ అను దానికి యతి వద్ద 'మృగ — ఆయత అను నప్పు డేర్పడు) ఆ అనునది కూర్పఁబడుటచేత ఇది ఏకాంత శబ్దమున అన్ను చెల్లుటకున్ను, 168 లో వ పాదమున యతి వద్దనున్న ఏకాంత అను నప్పటి కా అను దానికి పాదాదిని కా అను నది కూర్పబడుటచేత నిది హల్లు చెల్లుటకున్ను నుదాహరణము లై నవి.

168 పద్యములో ఒక్క దానిలో తప్ప మేము చూచిన ప్రాచీనపు ప్రతులన్నిటను పొలిచి పొలిచియు అని యున్నది. అట్టి పాఠమున మా కర్థ సాంగత్యము కుదురలేదు. శతఘంటము వేంకటరంగ శాస్త్రిలుగారి పీఠికతో నున్న భారత ప్రతిలో 'కామ సంభోగ సుఖ సదేకాంత గృహముఁ బోలి పొలిచియు.....వర్గ త్రియాను బంధులగు జనుల కెంత యును నొప్పు నప్పురంబు' అనియు గలదు. ఎంతపరిశీలించి గాలించివై చిన నేమి గిడుగువారి ప్రతికిన్ని పొలిచి పొలిచియు అను పాఠావస్థయే పట్టినది, మరియుఅన్ని అప్పకవీయ ప్రతులలోను (మా చూచిన వానిలో) వర్గత్రియాను రమ్యులైన జనులకెంతయు నొప్పు అనియే కలదు ఆ పాఠ మున నెట్లో కుదురును గాని చక్కగా కుదురక స్వతంత్రించి జనుల నెంత యు అనికొద్ది మార్పుచేయఁబడ్డది. (కవివిరచితపాఠ మిట్లగునను నూ హతో) మఱియు నొక్కప్రతిలో మాత్రము 'లైన జనులకు నెంతయు నొప్పునప్పురంబు' అని ప్రమాదమున పడియున్నది. అదిచూచి తరువాతి ముద్రిణ పరిష్కర్త గణ భంగము మాత్రము తెలిసి కొనువాఁడయి అర్థ సాంగత్య మంత పరిశీలించకయో ఎట్లని కుదురునేమో యను నూహతోడనో మరియొందుచేత నైన నేమి జనుల కెంతయు అని ఛందో భంగము లేకుండు నట్లు మాత్రము సవరించి యుండును అనియు, గతానుగతికన్యాయమున ఆపాఠమే గిడుగువారి ప్రతికిన్ని వచ్చినదనియు తోఁచుచున్నది. ఇక్కడ ఏకః (ఏక ఏవ అంతే — సమీపే అస్మిన్— దీనియందు ఒక్కఁడు మాత్రము (తనకన్న నితరుండు దగ్గర నుండును.

ఆలోచనాదులలో చేరఁదగిన వారు మాత్రి ముందురనుట లేక ఏకః — ముఖ్యః, అంతః — నిశ్చయః, అస్మిన్ — ప్రధాన విషయ నిశ్చయ మిందుండును—అనఁగా ప్రధాన విషయమున కనువైనది యనుట అని గాని వ్యుత్పత్తి గ్రహించ వచ్చు నని యెఱుంగునది.

మఱియు ఏకాంత శబ్దములో అచ్చు చెల్లుటకు 'ఏకాంతమునందు నున్న జవరాండ్రి నెపంబిడి పల్కరించు లాగింతియ కాక' అను మను చరిత్రి పద్యము మున్నగునది యుదాహరించుట మిక్కిలి యుక్త మనియు తనమతమున మృగాయత నేత్రి అనుచోట స్వర ప్రధాన యతియే కాని అఖండ యతి చెల్లదు గావున పారిజాతాపహరణ పద్య ముదాహరించినాఁడనియు నెఱుంగునది.

వ. సిద్ధాంత రాద్ధాంత లతాంత ప్రాంత నిశాంతాది శబ్దముల కన్నింటికిని ఇటు వలెనే రెండును నడచును.

వివ:—పై పదములన్నియును ఉభయ యతులు చెల్లునవియే, రెండు పదములు గూడి ఏక పదమువలె భాసించినవియే గావున వీనిలో నున్న అచ్చునకున్ను హల్లునకున్ను ఉభయ యతులు కూర్చవచ్చు నని భావము.

సిద్ధాంద సిద్ధః అంతః — నిశ్చయః అస్మిన్నితి సిద్ధాంతః — దీని యందు పూర్వపక్ష సమాధాన నిశ్చయ ముండును కనుక నిది సిద్ధాంత మయ్యెను. సిద్ధ — అంత—సిద్ధాంత అని యయ్యెను. సిద్ధస్య అంతః సిద్ధాంత అను విగ్రహమైనచో అప్పుడు ఏక పదమువలె భాసించదు, నిత్య సమాస పదమున్ను కాదు కనుక అట్టి వ్యుత్పత్తి ఇక్కడ గ్రహించ కూడదు. దాని కప్పకవి మతమున అచ్చునకే కాని హల్లునకు (అఖండ యతి) చెల్లదనుట కావున పై వ్యుత్పత్తియే ఇక్కడ గ్రహించుకొనునది.

రాద్ధాంత—రాద్ధ — అంత—రాద్ధాంత రాద్ధః అంతః అస్మిన్— రాద్ధాంతః — దీనియందు పూర్వపక్ష నిశ్చయము సిద్ధించును కనుక రాద్ధాంతము, రాధ సాధ సంసిద్ధౌ, రాధ్ — త—రాద్ధ-రాధ్ ధాతువునకు

(క్త) త ప్రత్యయము చేరి రాద్ధ అయ్యెను. రాద్ధ+అంత — రాద్ధాంత కొంచెము అక్షర భేదమే కాని తక్కిన అన్నిటను సిద్ధాంత శబ్దము వంటిదే, దీనికిని రాద్ధస్య — అంతః అని వ్యుత్పత్తి ఇక్కడ గ్రహించ గూడదు అని యెఱుంగునది.

లతాయ లతాయామ్ అస్యతే — బధ్యత ఇతి అతి — బంధనే లతామ్ అమతి—గచ్ఛతీతి వా అమ — గతౌ లతాంతః — లతయందు (చివర) బంధింప బడునది — కూర్పబడునది (లేక) లతను (లతాగ్ర) మును పొందునది — లతాగ్రమున నుండునది కనుక లతాంతము — పుష్పము (పల్లవమున్ను కావచ్చును.) ఇట్టి యర్థము కల ఈ పదము అన్నిటను పై వాని వంటిదే, లతాయాః — అంతః — లతయొక్క అగ్రము (చివర) అను వ్యుత్పత్త్యర్థము లిక్కడ చెల్లవు. ప్ర-త—ప్ర (ప్రకృష్టః) అంతః (సమీపః) ప్రాంతః — మిక్కిలి సమీపము. ఇది అవిగ్రహము (లేక) అస్వపదవిగ్రహము అగు ఉపసర్గ సమాసపదము గావున, ఉభయ యతులు చెల్లవలసినదే. పరికింప నిది ఉపసర్గ యతు లలో చెప్పఁ జెల్లినదే గాని ఉపసర్గ సమాసపదము లెల్ల నిత్య సమాస పదములే కనుకను ఉపసర్గ యతులను ప్రత్యేకించుట స్పష్ట ప్రతిపత్తి కే కనుకను అప్పకవి వీనిలో చెప్పె ననియు గ్రహించవలసి యున్నది.

నిశాంత — దీనికి గురుబాల ప్రబోధికలో నితరామ్, శామ్యతి, దుఃఖమ్, అత్రేతి నిశాంత శము ఉపశమే — దీనియందు దుఃఖము మిక్కిలి శమించును గనుక నిశాంతము అని చెప్పబడినది. ఇట్టి వ్యుత్పత్తి యైనచో దీనియందు అజాద్యుత్తరపదము (నిశా — అంత అని విరుగుట) లేదు కావున నీ యుభయ యతులు (అచ్చునకు చెల్లుట కూడ) ఉండుటకు (చెల్లుటకు) వీలుపడదు గనుక నిశాయామ్ (అవశ్యమ్ — తప్పక) అమ్యతే గమ్యతే సర్వై రితి నిశాంతః అమ గతౌ — రాత్రి యందు తప్పక అందఱచే పొందబడునది, (రాత్రి) అందఱు నిల్లు చేరు దురు గదా! గనుక, నిశాంతము—గృహము అని గ్రహించవలసిన్ని యు

స్నది. ఇప్పుడు నిశా — అంత-నిశాంత అయి అచ్చునకును హల్లునకును చెల్లునది యగును. నిశాయాః అంతః నిశాంతః—(రాత్రియొక్క— అగ్రము — చివర) అను వ్యుత్పత్త్యర్థములున్న ఇక్కడ చెల్లవు అనియు నెఱుంగునది. మరియు నిశాయామ్, అమంతి ఏన మవశ్యమితి, నిశాంతః అమగతౌ, (రాత్రి తప్పక దీని నెల్లరు పొందుదురు గనుక నిశాంతము) (లేక) నిశాయామ్, అస్యంతే, బధ్యంతే, అవశ్య మత్రేతి, నిశాంతః అది బంధనే— రాత్రియందెల్లరు తప్పక దీనియందు బంధింపబడుదురు, గూర్పఁ బడుదురు కనుక నిశాంతము — గృహము అనిగాని గ్రహించ వచ్చును. పైని చెప్పిన నిశాంతాది అనుచోట ఆది శబ్దముచేత శుద్ధాంత మున్నగునవి ప్రయోగాను సారముగా (నిత్య సమాసార్థ ములు ఇంకను కొన్ని గ్రహించుకోవచ్చును. శుద్ధాంత శుద్ధః అంతః — స్వభావః యస్యసః శుద్ధాంతః; పరిశుద్ధ స్వభావము — స్థితి గలది— ఎల్లెడఁ బరిశుద్ధముగా నుండునదిగనుక శుద్ధాంతము (లేక) శుద్ధ శ్చాసా వంతశ్చ శుద్ధాంతః — పరిశుద్ధమైనదిన్ని, రమ్యమైనదిన్ని గనుక శుద్ధాంతము — అంతఃపురము (లేక అంతః పురజనము, అనిగాని వ్యుత్పత్త్యర్థములు—శుద్ధ — అంత — శుద్ధాంత—ఇప్పుడిది నిత్య సమాస పదమై అచ్చునకును హల్లుకును చెల్లునది యగుననియు హల్లుచెల్లుట ఏకపదత్వ భావముచే సహజమే (రమ్యమే) యనియు అచ్చు చెల్లుటకు 'శుద్ధాంత గృహంబు వెల్వడి విహార రతిం జనుదెంచె' అను చంద్రికాపరిణయ పాద ముదాహరణ మగు ననియు, శుద్ధస్య అంతః శుద్ధాంతః — పరిశు ద్ధమైన దానియొక్క— అంతము — చివర — కొన మొదలగురీతి వ్యుత్ప త్త్యర్థము లిక్కడ చెల్లుబాటు కావనియు నెఱుంగునది.

వ. నారాయణ శబ్దమునకు — నారాః ఆపః అయనమ్, స్థానమ్ అస్య నారాయణః ని. 'విష్ణు ర్నారాయణః కృష్ణః' ఇత్యమరః.

ఆదిపర్వమునందు:—

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణు నట్లు దానును ధరామర వంశ విభూష ణుండు నా
రాయణ భట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ దన కిష్టుఁడున్[1] సహా
ధ్యాయుఁడు నైనవాఁడ భిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగాన్
(1,25) 170

వివ:— నారములనఁగా—ఉదకములు, అవి స్థానముగాఁ గలవాఁడు గనుక నారాయణుఁడయ్యెను. విష్ణు దేవుఁడు ఈ వ్యుత్పత్తి చెల్లకున్నను సంజ్ఞా వాచకముగా—నారాయణుఁడను పేరు పెట్టుటచే మనుజులకును చెల్లును. నారాయణ భట్టు (భట్టు -పూజ్యుఁడు) అనునది యిట్టిదే.

170 పద్య వివ:-ఇందు 2వ పాదమున మొదట నారాయణ, నార + అయన అనుచో నేర్పడు అ అను దానికి (పాదాది నున్న అకారమునకు) యతి వద్ద ధరా — అమర అను సవర్ణ దీర్ఘ సంధి నేర్పడు అకారము కూర్చబడుట చేత నారాయణ శబ్దమున అచ్చు చెల్లుటకున్న, 3 వ పాదము మొదటి నారాయణ అను నప్పటి రా అను దానికి యతి యొద్ద రం అనునది కూర్పఁబడుటచేత నిది హల్లు చెల్లుటకున్న ఉదాహరణము లనియు, ఇదియు వెనుక చెప్పినట్లు నిత్య సమాస పదము కావున ఇట్లుభయ యతులు చెల్లిన వనియు నెఱుంగునది.

వాతాయన శబ్దమునకుఁ జారుధేష్ణ చరిత్రమునందు:—

గీ॥ అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొను సు
రాగ సుమములు హర్మ్య వాతాయనముల
చెంత గాలూఁది తత్పుర స్త్రీల కొసఁగి
వేఁడి కొనిపోవుదురు కప్రి వీడియములు 171

విరాట పర్వమునందు:—

సీ॥ పా. తరుణులుఁ బతులు వాతాయనమ్ముల నల్ల
మలయు వేఁబోకల మలయ పవను (2,238) 172

1 దీకృతి కిష్టుడున్ - గిడుగువారి పాఠము

ఇందు ‘అల్లం బోలయు వేంబోకటి మలయ పవను’ అని ఒకప్రతిలో కలదు. గిడుగువారి ప్రతిలో మాత్రము ‘అల్ల మలయ వేంబోకల మలయ పవను’ అని కలదు. యమక సిద్ధికి వారుచేసిన సంస్కారమే అని తోంచును గాని అన్వయ సరసత యుండదు కనుక లేఖకాది ప్రమాద పతిత మనుకొందుము — పాఠాంతరమున్నూ లేదు.

171 పద్య వివ:— 2 వ పాదమున యతి వద్ద వాత — అయన అన నేర్పడు అ అను దానికి పాదాదిని సుర — అగ అన నేర్పడు అ అనుది కూర్పబడుటచేత నిది వాతాయన శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 172 లో మొదటి భాగమున యతివద్ద వాతాయన అను నప్పటి తా అను దానికి పాదాదిని త అను నది కూర్పంబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణములు. వాతస్య అయనమ్ — మార్గః (వాత — అయన) వాతాయనమ్ — (వాయువు లోనికి వచ్చు దారి యగునది కనుక వాతాయనము—వాతః అయతే అస్మాదితి వాతాయనమ్) కిటికీ — గవాక్షము — ఈ యర్థమున వెనుకటి వలెనే ఇది నిత్య సమాస పదమై ఉభయ యతులు చెల్లినవి.

ఉపాయన శబ్దమునకు సుదక్షిణాపరిణయమందు:—

చ॥ వలంబడి యున్న జక్కవ కవం[1]బురుణించు సన్న పైంటలో
పల బిగి గుబ్బ దోయి కను పండువు సేయంగ మోడ్పుం జేతు లొ
దలను ఘటించి మ్రొక్కిడి కదంపడి మెల్లన డాయం బోయి తొ
య్యాలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్ 173

అష్టమహిషీకల్యాణమునందు:—

ద్వి. ఇంతుల మేల్బంతి యిడిన సేవంతి
బంతి చేదోయి నుపాయన మిచ్చి 174

173 పద్య వివ:— 4 వ పాదమున యతి వద్ద ఉపాయన—ఉప — అయన అని యేర్పడు దాని అ అను దానికి పాదాదిని (య్యా) య

1 బురుణింపుచు (పా)

అనునది కూర్పంబడుటచే నిది ఉపాయన శబ్దమున అచ్చు చెల్లుబడున్న, 174 లో 2 వ పాదము యతి వద్ద ఉపాయన అను నప్పటి పా అను దానికి పాదాదిని బం అనునది కూర్పంబడుటచేత నిది హల్లు చెల్లుట కున్న ఉదాహరణము లైనవి. ఉప (—రాజ్ఞ స్సమీపమ్) అయంతే అనేనేతి ఉపాయనమ్ — దీని (చేత) తో రాజు నొద్దకుఁ బోవుదురు కావున —ఉప — అయన—ఉపాయన మయ్యెను; రాజాది దర్శనాదులకుఁ దగినది అని వ్యుత్పత్తియు, కానుక అను నర్థమును గావున ఇది ఉపసర్గ నిత్య సమాస పదోభయ యతియై యిట్లు చెల్లిన దని యెఱుంగునది.

రసాయన శబ్దమునకు ననంతుని ఛందమునందు:—

ఆ॥ నాస్తి యనక మహి ననంత సంపదలు నా
రాయణుం డొసంగు రమ్య మగు ర
సాయనంబు బుధుల కతఁడన నిత్యస
మాస యతులు [1] రెంటి నంటి యుండు (1, 21) 175

జైమిని భారతమునందు:—

సీ॥ గీ॥ మట్టి మాతృంబె పిల్లల మట్టి పేరు
పేరువలెఁ గాదు శారదా పీఠకంబు
వారిలోపలఁ బిసవీరు వాక్య సరణి
సరసులకు నెల్లఁ గర్ణ రసాయనంబు (1, 22) 176

175 పద్య వివ:— 3 వ పాదమున మొదట (రస — అయన) అను నప్పుడేర్పడు చున్న అ అను దానికి యతి వద్ద (బుధులకున్ అతఁడు అను నప్పుడేర్పడు) అ అనునది కూర్పంబడుటచేత నిది రసాయన శబ్దములో అచ్చు చెల్లుటకున్న, 176 లో 4 వ పాదమున యతి వద్ద రసాయన అను నప్పటి సా అను దానికి పాదాదిని స అనునది కూర్పఁ బడుటచే నిది హల్లు చెల్లుటకున్న ఉదాహరణము లయ్యెను.

1 రెంటనంటి (పా)

మఱియు నిందు సమ్ — ఆస—సమాస, సమ్—సంగతిమ్ అస్య తీతి సమాసః—సమ్ — అస్యతి—సమ్ — ఆ స్తే—సమాసః అను వ్యుత్ప త్తులవలన నేర్పడిన (సమ్ + ఆస) సమాస శబ్దోపసర్గ యతులలో అచ్చు చెల్లు నట్లున్ను ఉండుటచే సమాస శబ్దములో అచ్చు చెల్లుట కున్ను 4 వ పాద ముదాహరణ మగు ననియు, హల్లు చెల్లుట సహజమే —ఏక పదత్వ భావముచే శ్రావ్యమే యనియు గ్రహింప వచ్చు నని యెఱుంగునది. 'రసస్య అయనమ్—రస — అయనమ్'—రసాయనమ్— (మాధుర్యమునకు స్థాన మైనది. మిక్కిలి మధుర మైనది. రసః అయతే పనమ్ అని గాని) జరా—వ్యాధులను బోఁగొట్టి మిక్కిలి సుఖ సంపద లిచ్చు ఔషధ విశేషము. ఇది యీ యర్థమున నిట్లు నిత్య సమాస పదమై ఉభయ యతులకుఁ జెల్లిన దని యెఱుంగునది.

రామాయణ శబ్దమునకు రాఘవ పాండవీయమునందు:—

ఉ॥ ఏమెడ నర్థ గౌరవ సమృద్ధియు శబ్ద విశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరఁగ నంధ్ర వచ స్థితి భారతంబు రా
మాయణమున్ రచించిన మహాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిని దిక్కన నెఱ్ఱన భాస్కరాఖ్యునిన్
(1, 4) 177

జైమిని భారతమునందు:—

తే॥ మాని జల్పిత మైన రామాయణంబు
స్వర లయ గ్రామ మూర్ఛనా సరణు లెఱిఁగి
గాన శక్తులు[1] మెఱసి సాక్షాత్కరింపఁ
బాడి రాలాపములఁ దిగ్విస్తృతములు ముట్ట (6, 96) 178

వివ:— రామాయణ—రామస్య అయనమ్ — స్థానమ్, రామ — అయనమ్—రామాయనమ్. సూ — పూర్వపదా త్సంజ్ఞాయా మగాత్

1 శక్తులమెఱసి - గిడుగువారిప్రతి

రామాయణమ్ — రామునకు (రామ చరిత్రమునకు) స్థాన మైనది. — రామ చరిత్రము వర్ణ్యముగా కలిగినది; అనఁగా ప్రధానముగా రామ చరిత్రమును బోధించునది కనుక రామ — అయన—రామాయన అని అయి (రామః అయతే ఏతత్ అనిగాని) 'పూర్వపదాత్సంజ్ఞాయాం' అను (విశిష్ట పదమొక దానికి సంజ్ఞ (పేరు) అయినప్పుడు నిమిత్తములగు ర ష లు పూర్వపదములో నుండఁగా పర పదములోని నకారమునకు ణకారము వచ్చును) సూత్రముచేత ణకారము కలిగి రామాయణ అని యయ్యెను; ఇది ఒక గ్రంథమునకుఁ బేరు. ఇట్టి యీ పదము వెనుకటి పదముల వంటిదే గనుక దీనియందు నుభయ యతులు చెల్లును.

177 వ పద్యమున 3 వ పాదము మొదటనున్న (రామ — అయన అను నప్పటి) అ అను దానికి యతి యొద్ద (మహా — ఆత్ములు అను నప్పు డేర్పడు) ఆ అను నది కూర్పఁబడుటచేత నిది రామాయణ శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 178 వ పద్యమున 1 వ పాదమున యతి వద్ద నున్న (రామాయణ అను నప్పటి) మా అను దానికి పాదాదిని మా అను నది కూర్పఁ బడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవి.

వ. పరాయణ, పలాయన, బాదరాయణ, సాంఖ్యాయన, శాకటాయన, కాత్యాయన, బోధాయన, దక్షిణోత్తరాయణాది శబ్దములకును ఇటువలెనే రెండును గలవు. 179

వివ:— పరాయణ—పరమ్ (ఆసక్తేః) అయనమ్ పరాయణమ్ (—ఆసక్తికి మిక్కిలి స్థానమైన వాఁడు (లేక) స్థాన మైనది. పర — అయన — పరా (పరాకాష్ఠామ్) అయతే—వెనుకటి వలెనే ణత్వము. పరాయణుఁడు, పరాయణము అని యయ్యెను. ఇది వెనుకటి విధముగానే ఉభయ యతులు చెల్లునది. దీని కర్థములు తత్పరుఁడు, అభీష్టుఁడు ఆశ్రయుఁడు అని యెఱుంగునది. ని. 'త్రిషు స్యాత్తత్పరేఽభీష్టే ప్యాశ్రయే పి పరాయణమ్' అని రభసుఁడు. పలాయన—పరా — అయన

—పలాయన: సూ. ఉపసర్గస్యాయతేః అను దానిచే ఉపసర్గయగు పరా అను దాని రకారమునకు లకారము వచ్చి పలాయన అని యగుచున్నది కావున నిది ప్రాదియతికిఁ జేరునదియై ఉభయమునకుఁ (అచ్చు కున్ను హల్లుకున్ను) జెల్లునదియే. దీని గురించి విశేషము ప్రాదియతులలోఁ జూచునది. బాదరాయణ — బదరమ్ అయనమ్ యస్యసః బదరాయణః (వెనుక చెప్పినట్లే ణత్వము) బదరాయణ ఏవ బాదరాయణః—(బదరికా వనము నివాసముగాఁ గలవాఁడు — బదరాయణుఁడు, బదరాయణుఁడే, బాదరాయణుఁడు — వ్యాస మహర్షి) ఇదియు వెనుకటి వానినంటిదే; ఉభయ యతులు చెల్లునదియే. దీనికి బదరస్యాపత్యమ్ బాదరాయణః నడాదిత్వాత్ ఫక్ — బదరుని అపత్యము (కొడుకు) అను నర్థమున బదర శబ్దము నడాది గణములోనిది కనుక ఫక్ ప్రత్యయమున్ను దానికి ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనాం నుండి సూత్రమున ఆయనాదేశము రాఁగా మరియు ఆది వృద్ధి రాఁగా బాదరాయణ అని యగును గాని అప్పుడిది పద ద్వయ మేళన పదము గాదు గనుకను బాదర —ఆయణ అని ఆకారమున్నను అది ప్రత్యయ సంబంది గావున (ఉభయములో) అచ్చునకు చెల్లనిది యగు నని తోఁచు చున్నది. అట్లు కాక ప్రత్యయ సంబంధి అచ్చు నకును స్వరప్రధాన యతి చెల్లునను-చో అట్టిదే యగు దాశరధి (దశ రథ — ఇ—దాశరధి) మున్నగు వాని ఇకారాదులకును స్వర ప్రధాన యతి చెల్లక పోవుటకు హేతు వుండదు. ఎట్లయినను అప్పకవి పదములు మాత్రము చూపెను గాని వ్యుత్పత్తులు లక్ష్యములు చూపలేదు కనుక ఇట్టి ప్రయోగములు (వీని కుభయ యతులు తెల్పునట్టివి) మహాకవుల గ్రంథముల నెందును మృగ్యములగుటచేతను అప్పకవి తన యూహా చొప్పున సూత్రము వ్రాయుటచేతను దీనికిని తరువాతి పదములకును అనఁగా బాదరాయణ (రెండవ వ్యుత్పత్తిది) సాంఖ్యాయన, శాకటాయన కాత్యాయన వాత్స్యాయన అనువానికి (ఒక్క మహాకవి ప్రయోగమేని యొక్కొక్క దానికిఁ గానవచ్చు నంత వరకున్ను) అప్పకవి ఉభయ

యతులు చెల్లుననుట సప్రమాణముగాక యవిశ్వాస్య మగుచున్నది. ఈ పదములు ఫల్ ప్రత్యయ సంబంధమున ఆయన్నాదేశము మున్నగు వానిచే నేర్పడ్డ వనియు పద ద్వయ మేళన లేని వనియు ఉభయ యతులు చెల్లుట కయుక్తములనియు నెఱుంగునది. మొదటి వ్యుత్పత్తి గ్రహించినప్పుడు బాదరాయణ శబ్దమున్ను అట్లే బోధస్య అయనమ్ (లేక) బోధం అయతే ఇతి (బోధ + అయన) బోధాయన అని గ్రహించు నప్పుడు బోధాయన శబ్దమున్ను ఈ ఉభయ యతులు చెల్లునవి యగును గాని అచ్చు చెల్లుటకు ప్రయోగము కల్పించు కొన వలసి యుండు ననియు నెఱుంగునది. దక్షిణోత్తరాయణ దక్షిణాయన ఉత్తరాయణ దక్షిణాం (దిశమ్) అయతే (సూర్యః) అత్రేతి దక్షిణాయనమ్, ఉత్తరామ్ (దిశమ్) అయతే (సూర్యః) అత్రేతి ఉత్తరాయణమ్, (లేక) దక్షిణస్యామ్ అయనమ్, ఉత్తరస్యామ్ అయనమ్ (సూర్యస్య) అత్రేతి, దక్షిణా—అయన—దక్షిణాయన, ఉత్తరా—అయన—ఉత్తరాయణ — దీనియందు సూర్యుఁడు దక్షిణదిక్కును (అట్లే ఉత్తరదిక్కును) పొందును లేక సూర్యునకు దీనియందు దక్షిణ దిక్కునందు సంచారమున్ను (ఉత్తర దిక్కునందు సంచారమున్ను) ఉండును గావున దక్షిణా—అయన, ఉత్తరా—అయన, దక్షిణాయన ఉత్తరాయణ అని యగుచున్నవి. వెనుక చెప్పినట్లుభయ యతులు ఈ యర్థములయందు చెల్లునవియే యగుచున్న వని యెఱుంగునది.

మార్తాండ శబ్దమునకు శృంగారషష్ఠమునందు:—

సీ॥ గీ॥ వలవదు భయంబు వారెంత వారలైన
నట్టి వారలు మన కగ్గమైన వారు
వారు నిరయంబునకుఁ గాఁపు వచ్చువార
లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండ సుతుఁడు 180

ద్రోణ పర్వమునందు:—

మ॥ ధరణీ చక్రము దిర్రిరం దిరిగె మార్తాండుండు కుంఠీభ వ
త్కిరణుం డయ్యె దిశా వితానము వడంకె న్మిన్ను దిర్చె న్మహీ
ధర సంతానము గ్రిక్కనం గదలె నుద్రాభ్రాంతంబులై యంబుధుల్
పొరలెన్ గట్టుల మీఁద బెట్టు పిడుగుల్ మ్రోసెన్ మహోదగ్రతన్
(5, 377. 181

వివ:— మార్తాండ—మృతమ్, అండమ్ (—బ్రహ్మాండమ్) జీవయతీతి మార్తాండః — నశించిన బ్రహ్మాండమును బ్రదికించువాఁడు (మార్త + అండ) మార్తాండుఁడు — సూర్యుఁడు. ఇది వెనుక చెప్పినట్లే ఉభయ యతులు చెల్లునది యగుచున్నది. మరియు మృత + అండ—మృతండ శకంధ్వాదులలో (ఆకృతి గణమగుటచే చేరి పరరూపముచే మృతండ యయినది.) మృతండస్యాపత్యమ్ మార్తాండః (—సూర్యుఁడు.) ఇప్పుడు దీనికి శకంధ్వాది పరరూపోభయయతులు చెల్లును. ఇట్లుభయమున్ను కలవు అని యెఱుంగునది.

180 పద్య వివ:— ఇందు 4 వ పాదమున యతి యొద్ద (మార్త + అండ అను నప్పటి) అ అను దానికి పాదాదిని (వారలు అనుచు అని యేర్పడు) అ అనునది కూర్పఁబడుటచే నిది మార్తాండ శబ్దమున అచ్చు చెల్లుటకును, 181 లో 1 వ పాదమున యతి యొద్ద మార్తాండ అను నప్పటి ర్తా తా అను దానికి పాదాదిని ధ అనునది కూర్పంబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవి. ఈ రెండు చోట్లను మార్తాండ అను కొన్నను పైని చెప్పినట్లుభయ యతులు చెల్లు ననియు నెఱుంగునది. 181 వ పద్య మందు పెక్కులు పాఠభేదములున్నవి గాని యవి యంత పరిగణనీయములై మాకుఁ దోఁచక తెల్పఁబడ వయ్యె, కాని గిడుగువారి ప్రతిలో మిన్నదర్చె నని యున్నది; మేము శబ్దరత్నాకర పాఠము గ్రహించితి మని యెఱుంగునది.

వ. బ్రహ్మాండాది శబ్దములకును నిటువలెనే అచ్చును హల్లును చెప్పదగును.
వివ:— బ్రహ్మాండ — బ్రహ్మణః అండమ్ బ్రహ్మాండమ్ — జగదుత్పత్తి స్థాన మగు బంగారు గుడ్డు (బ్రహ్మ — అండ — బ్రహ్మాండ) దీనికిం బ్రమాణము: శ్లో॥ 'అప ఏవ ససర్జాదా తాసు బీజ మపాసృజత్ తదండ మభవ ద్ధైమమ్ తస్మిన్నే (తస్మాదే) తచ్చరాచరమ్'
— మొదట సృష్టి కర్త ఉదకములు సృజించెను; ఆయుదకములందు బీజమును విడిచినాఁడు — వైచినాఁడు — అది యొక (పెద్ద) బంగారు గుడ్డయినది; అందీ (అందువలన నీ) చరా చర జగత్తెల్ల నావిర్భవించినది. ఇట్టి యీ శబ్దమున్ను ఏకపదము వలె నుండునదియై పద ద్వయ మేళనవల్ల నేర్పడునది గావున వెనుక చెప్పినట్లే అన్ని విధముల చేతను అచ్చునకు హల్లునకును ఉభయ యతులు చెల్లు నదియే యనియు ఇట్టి వింకను ఉండవచ్చుననియు అవి యూహించుకో వచ్చుననియు తాత్పర్య మెఱుంగునది.

ఉపసర్గ సంధికిఁ జంద్రికాపరిణయమునందు:—

ఉ॥ అంతట రుక్మ బాహు వసుధాధిప నందన యొక్కనాఁడు శు
ద్ధాంత గృహంబు వెల్వడి విహార రతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వ గుంజ దళి శింజిత రంజిత కుంజ మంజుల
ప్రాంత గళ త్ఫలాసవ రతాంగజ ఘోటికిఁ బుష్ప వాటికిన్ 183

కవిజనాశ్రయమునందు:—

ఉ॥ మానుగ విశ్రమాక్షర సమంచితమై స్వర మూఁదినం దదీ
యా నుగుణా క్షరంబ కొని యైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
భాను సహస్ర భాసి వృషభాధిపుఁ డన్నటు లర్థ యుక్తమై
పూనినచో నఖండవడి పొల్పగు నాది కవి ప్రణీతమై (సం, 66) 184

వివ:— ఉపసర్గసంధికి — ఇక్కడ మేధా సంపన్నులగు విమర్శకుల కొక్కింత సూక్ష్మ దృష్టి నుపయోగించుట యవసరమగుచున్నదని ప్రార్థించుచున్నాఁడను.

ఈ ఉపసర్గ సంధి యనఁగా వెనుక అప్పకవి చెప్పిన ప్రాది యతులకుఁ జేరిన ఉపసర్గ నిత్యసమాస పదములోనుండు ఉపసర్గ సంధి (కూడిక) యగునా లేక మరొక విధమైనదా అని మొదట సందేహము వచ్చుచున్నది. అప్పకవి ప్రాది యతికంటె భిన్నముగా మరియొకటి (ఉపసర్గ సంధి యను పేరుతో) చెప్పక పోవుటచేతను దీనికి చూపిన లక్ష్యములలో 'ప్రాంత.......రతాంగజ' అనుచోట ప్ర—అంత—ప్రాంత అను దాని అకారమునకు యతి వద్ద రత—అంగజ అని అకారము కూర్పఁబడుటచే అచ్చు చెల్లుటకును, 2 వ పద్యమున యతి వద్ద సమ్ + అంచిత—సమంచిత అన్నప్పటి మ అను దానికి పాదాదిని మా అనునది కూర్పఁబడుటచే హల్లునకును ఇట్లు పసర్గోభయ యతి లక్ష్యములుండుటచేతను 'సింహావలోకన న్యాయమున' (వెనుక చెప్పిన విషయము హఠాత్తుగా మరి యొక ప్రసక్తిలో చెప్పుటకు ఈ న్యాయము చెల్లుచున్నది.) ప్రాది యతికే ఉపసర్గ సంధి యతి యను నామాంతరముతో లక్ష్యములు చూపియున్నాఁడని కొందఱను నట్లు తోఁచుటకవకాశమున్నది గాని మిక్కిలి పరికింప ఇక్కడ ఉపసర్గ సంధికి అని క్రొత్త పేరు అప్పకవి ఉపయోగించుటయు వసుధా—అధిప—వసుధాధిప అనియు, వృషభ—అధిప—వృషభాధిప అనియు రెండు పద్యములలోను ఉపసర్గతో కూడుటవల్ల నేర్పడిన ఉత్తర పదము మొకటి ఉపసర్గకు (అధిప అనుదాని అధి అనుదానికి) పూర్వపదముతో సంధి ఉపసర్గతోకూడి ఏర్పడిన దానితో పూర్వ పదము (మరల) సమసించి విశిష్ట మేకపద మగుటయే ఇక్కడ సంధి ఇట్టి అధిప అను నుపసర్గ సమాస పదముతో పూర్వపదమునకు (మరల) సమాసమున నేర్పడిన భిన్నభిన్న విశిష్టపదములలో అచ్చునకు హల్లునకు చెల్లు నట్లు (ఉభయ యతి లక్ష్యములను నట్లు) ఉదాహరణము లుండుటచేతను అప్పకవి ఉభయ యతులు చూపునపు డెక్కడనైనను అచ్చునకును హల్లునకును ఒకే పదములోని భిన్న లక్ష్యములు చూపుటచేతను (అట్లు చూపుటయే

యుక్త మగుట చేతను) ప్రకృతమున ఇవి ప్రాద్యుపసర్గోభయ యతులకే యుదాహరణములుగా చూపినాఁడ నుకొనిన యెడల ఒకటి (ప్ర — అంత — ప్రాంత అనునది) ప్ర అను నుపసర్గ యతికిని మఱి యొకటి (సమ్ — అంచిత—సమంచిత అనునది) సమ్ అను నుపసర్గ యతికిని (మొదటిది అచ్చునకును రెండవది హల్లునకును) భిన్నములగు నుపసర్గ లకు లక్ష్యములు చూపిన వాఁడై పోయె నన వలసి వచ్చుటచేతను వెనుకటి ప్రాది యతుల చేతనే ఇవియు గతార్థములే కావున నా యభి ప్రాయముతో నిక్కడ చూపుటకు — ప్రయోజనమున్ను హేతువున్ను ఉండదు కావునను ఇట్టి ఉపసర్గ యతులలో నుభయమునకును చెల్లుటలో ఎవ్వరి మతములోను వైషమ్యము (విప్రతిపత్తి) లేకపోవుటచేతను అట్లు చూపినాఁడనుట పొసఁగ కున్నది. ఇఁక ఉపసర్గ సంధి యతి యని ప్రత్యేకముగా (లక్షణోక్తి పురస్సరముగా) చెప్పక పోయినను కేవలా ఖండయతిని తా నంగీకరించిన వాఁడు కాక పోవుటయే కాక నిరసించిన వాఁడును కవిజనాశ్రయకర్త (భీమకవి) ఎఱిఁగి యెఱిఁగి యేల అఖండ యతిని చెప్పును అని కవిజనాశ్రయకర్త సామాన్యాఖండయతిగా నెక్కడను చెప్పనే లేదని నిర్వచించిన వాఁడగుటచేతను ఆతడు చూపిన అఖండ యతి లక్ష్యము తన మత ప్రకారము మాఱు విధముగా (సామాన్యాఖండయతి కాకుండు నట్లు) వ్యాఖ్యానము చేసి చెప్పుట కనువగునట్లు అనఁగా తాను చెప్పినట్లు భీమకవి చూపినది సామాన్యా ఖండయతి లక్ష్యము కాదనియు (వృషభ — అధిప) వృషభాధిప యను నది ఒక ఉపసర్గోభయ యతి లక్ష్య మగుటచేతనే అఖండయతి లక్ష్య మైనట్లుచెప్పెను కాని ఇది సామాన్యాఖండయతిగా చూపుటయు అట్టి అఖండయతి యంగీకరించుటయున్ను భీమకవి యభిప్రాయము కాదనియు అందుచేత సామాన్యాఖండయతిని భీమకవి చెప్పనే లేదనియు తన యభిప్రాయమును దృఢపఱుచుటకు ఉపసర్గ సమసించిన పదముతో పూర్వపదము కూడినప్పుడున్ను అది ఉపసర్గయతిలో నంతర్భూతమగు

ఉపసర్గ సంధి యతి కావచ్చు నని యభిప్రాయముతోనే భీమకవి అట్లు చెప్పి అట్లే లక్ష్యము చూపినాఁడనియు అదిసామాన్యాఖండయతి మాత్రము కాదనియు తెల్పు నభిప్రాయముతో అప్పకవి ఉపసర్గ సంధికి అని చెప్పి, అధి —ప — అధిప అని యొక్క ఉపసర్గ సంధి లక్ష్యములే చూపినాఁడనియు, అధిప అను ఉపసర్గసంధి నొందిన దానిలో అచ్చు చెల్లుటకొకటియు అనఁగా మొదటి దానిలో వసుధా — అధిప—వసుధాధిప అను చోట అచ్చునకును రెండవ దానిలో అధిప అను నుపసర్గ సంధి నొందిన దానిలోనే హల్లునకు వృషభ — అధిప — వృషభాధిప అనుచోటను చెల్లుచున్నట్లు చూపినాఁడనియే గ్రహించుకో వలసి నట్లే తోఁచుచున్నది; కాని అప్పకవి ప్రాది యతిలో తాను చేసిన నిర్వచనము చొప్పున (ఉపసర్గ పూర్వ పదముగా నున్నప్పుడే చెల్లు నట్లున్ను ఉత్తరపదములో పూర్వ పదముగా ఉపసర్గ మున్నంత మాత్రమున విశిష్ట పద మంతయు ఉపసర్గ సమాస పదమున్ను ఏక పదత్వ భానము కలదియు కాకపోవుటచే అట్టి వృషభాధిప మున్నగు పదములలో చెల్ల నట్లున్ను చేసిన నిర్వచనముచే) నీ ఉపసర్గ సంధి యతి యను క్రొత్త యతి ప్రాద్యుపసర్గోభయ యతులలో నంతర్భావముగా నూహించుట పూర్వోత్తర విరుద్ధమున్ను ఏక పదత్వ భానము లేక పోవుటచే అట్లు గ్రహించుట మిక్కిలి యయుక్తమున్ను అగుటచేతను ఎల్లైన నట్లొప్పు కొన్నచో ఇట్టి ఉపసర్గ సంధి యతికి ఇక్కడ చెప్పినవే గాక మరి కొన్నియు విరళముగా (మిక్కిలి స్వల్పముగా) లక్ష్యములు అనఁగా ఇట్టి ఉపసర్గ సంధి ఉభయ యతులలో హల్లు చెల్లుటకు అతి విరళము గానే మహాకవుల లక్ష్యము లుండు ననియు అచ్చు చెల్లుటకు పెక్కుండు ననియు ఇట్లు రెంటికిని చెల్లవలసిన విశిష్ట పదములు అనఁగా ఉపసర్గ నిత్యసమాసము నొందిన పదములో మొదటి దగు ఉపసర్గకు పూర్వ మందొక పదము కూడి యేర్పడిన విశిష్టోపసర్గ సంధి పదములు లెక్కకు మిక్కిలి మొత్తము భాషలో నే మూఁడువంతులో ఉండుననియు

అందుచేత నీయుపసర్గ సంధి యతి నప్పకవి యంగీకరించు వాఁడైనచో మాటకు మాత్రము సామాన్యాఖండయతి నంగీకరించ నట్లు చెప్పిన వాఁడై వాస్తవమున సామాన్యాఖండయతి (విరళముగా) నంగీరించిన పూర్వలాక్షణికులకన్నను (బహుళముగా) మిక్కిలి యెక్కువగా సామాంన్యాఖండయతిని (భంగ్యంతరముగా) నంగీకరించిన వాఁడే యగుట తప్పదనియు, ఇట్టి యీ అప్పకవి సంభ్రమమున కంతకును మూలకారణ మగు భీమకవి లక్షణ పద్యమును విచారింప విశ్రమాక్షరములో స్వర మూఁది నప్పుడు అనఁగా పరపదము మొదట నచ్చుండి అది సంధి వశమున పూర్వ పదాంత్యాక్షరముతో గూడి ఏక వర్ణ మైనప్పుడు వాస్తవమున అజాది పదము పరపదముగా (విరుగుటచే పద చ్ఛేద ముండుటచే స్వర ప్రధాన యతిగా అచ్చునకు చెల్లుట శ్రావ్యమే గావున నిఁక హల్లునకును చెల్లు నట్లాది కవుల ప్రయోగము లుండుటచే హల్లున కైనను (ప్రాణి వర్ణమంతకును సైతము) చెల్లు ననియే మాత్ర మున్నది గాని లక్ష్య స్థలమున నుపసర్గ సంధి ఆనుషంగికముగా నున్నంత మాత్రమున లక్షణమును బట్టి అందుపసర్గ సంధి సంబంధ మెంత మాత్రమున్ను లేనే లేదనియు అట్టి సంబంధ మున్నదని చెప్పుటకును అట్టి యతిగానే (ఆ యభిప్రాయముతోడనే) ఈ యతి నిక్కడ భీమకవి చెప్పి అట్లే ఇచ్చటి లక్ష్యము నుపసర్గ సంధి యను నొక క్రొత్త యతికి లక్ష్యముగా మాత్రము చెప్పినాఁడని యొక క్రొత్త నిర్ణయము చేయుట కున్ను హేతు వొక్కింతయును లేక కేవల ప్రౌఢవాదమే యగు ననియు ఎట్లైన నేమి ఇట్లంగీకరించినప్పు డప్పకవి భీమకవి మతమునకు భంగము తెచ్చిన వాఁడగుటయే కాక స్వమతమునకు సైతము భంగము తెచ్చు కొన్న వాఁడే యగు ననియు ప్రాది యతికే పైని చెప్పినట్లు మరల లక్ష్యములు చూపినాఁడు. (మహాకవులవి ఇదివరకు ప్రాదియతికి చూపలేదు. స్వకల్పితములు చూపినాఁడు; ఇప్పుడు మరల మహాకవులవి చూపినాడు.) ప్రాది యతినే ఉపసర్గ సంధి అని నామాంతరముతో

చెప్పినాఁడు అని గ్రహించు కొన్నప్పుడు అప్పకవి తన మతమునకు భంగము తెచ్చుకొనిన వాఁడు మాత్రము కాకుండుననియు ఉపసర్గ సంధి యతి భిన్నముగా నంగీకరించి నప్పుడు ఆజ్ఞను బహిష్కరించుటయు దీనిచేతనే సిద్ధించు పదములకొఱకు యుష్మ దస్మ చ్ఛబ్ద యతి ప్రత్యేక ముగా చెప్పుటయు మున్నగునవి పొసఁగి యుండవలయు. ఎట్లైనను నిచ్చట నిట్టి వికల్ప విప్రతి పత్తులు కలుగు చున్నవని ధ్రువముగా తోఁచుచున్నది. (మేము సామాన్యాఖండయతియు నంగీకరింతుము గనుక మాకెట్లైననూ బాధలేదు.)

వ. ద్వార శబ్దంబునకు, ద్వే అరే పార్శ్వే యస్య తత్ ద్వారమ్. 'పృషోదరాదీని యథోపదిష్ట' మితి సూత్రేణ ద్వి శబ్దాంత్యస్య అకారాదేశః.

వివ:— రెండు పార్శ్వములు (ప్రక్కలు) గలది గనుక ద్వి — అర అని యుండ పృషోదరాది గణములో చేరి ద్వి అను దాని ఇకార మకారముగా మాఱి పిమ్మట సవర్ణ దీర్ఘముచే ద్వ — అర—ద్వార అని యయినది. ఇప్పు డిది అజాద్యు త్తర పదము విఱుగునది గావున అచ్చునకును హల్లునకును చెల్లునది యగుచున్నది యని భావము. ఇక్కడ గురుబాలప్రబోధికలో 'వార్యతే నూతన పురుషః అత్రేతి ద్వారమ్' 'వృఞ్ వరణే' — (నూతన పురుషులు లోని కేగకుండ నిక్కడ వారింపఁబడుదురు కనుక ద్వారము అనఁబడును.) అని వ్యుత్పత్తి యున్నది గాని అప్పుడు అజాద్యుత్తరపదము లేదు గనుక ఉభయయతికి చెల్లనిదై (అచ్చునకుఁ జెల్లనిదై) ప్రకృతమునకుఁ బనికి రాదని అప్పకవి యీ వ్యుత్పత్తి క్రొత్తగా యూహించి వ్రాసినాఁడనియు, వార అనుదానికి మొదట దకారము చేరుటకు పృషోదరాది గణములో చేర్చుటయను గౌరవము పై వ్యుత్పత్తిలోను తప్పదు గనుక అప్పకవి నిర్వచనమే ఇక్కడ సప్రయోజనమై యుక్తమగు చున్నదనియు నెఱుంగునది. మఱియు గిడుగువారి ప్రతిలో మాత్రము పై మూలములో 'ద్విశబ్దాంతస్య ఇకారలోపః అకారాదేశః' అనియున్నది గాని ఇకారలోపః అనునది ప్రమాద పతిత మని తోఁచును.

ఉ॥ వారక వారకామినుల వర్తుల చారు కుచో పగూహముల్
గోరక కోరకోల్లసిత కుంజములం జిగురాకు పానుపుల్
చేరక చేర కేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వార విహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరో 185

హల్లులకు నిర్వచనోత్తర రామాయణమునందు:—

ఉ॥ వారలు వారి భూరి పరివారముతోన విమానమెక్కి రాఁ
గా రఘు నందనుం డరిగి కాంచన తోరణ చిత్రమై నవ
ద్వార నికాయమైన నిజ పట్టణ ముత్సుక వృత్తిఁ జొచ్చె నిం
డారు ముదంబున న్భరతు నాకృతి బాలిశ వృత్తిఁ గ్రోలఁగాన్
(1, 84) 186

185 పద్య వివ:— 4 వ పాదము మొదల (ద్వ—అర అను నప్పుడేర్పడు) అకారమునకు యతి వద్ద 'సిరులన్—అందక అనుదాని) అకారము కూర్పఁబడుటచే నిది అచ్చు చెల్లుటకును, 186లో 3 వ పాదము మొదల (ద్వా) వా అను దానికి యతి వద్ద వ అనునది కూర్పఁబడుటచే నిదిహల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవి.

185 లో ఒక ప్రతిలో చారు కేరళ అని యున్నది. అదియు యుక్తముగానే తోఁచినది. పరిష్కృత పాఠములో చేర అనునది దేశ విశేష వాచకమై యొకింత పదాలంకారమున కొప్పియున్నది. చారు అను పాఠములో ద్రాగర్థ స్ఫూర్తి యున్నది గావున రెండును తుల్యములే యనుకొన్నాము. మరియు 186 లో మేము చూచిన అప్పకవీయ ప్రతులన్నిటను 'కాంచన తోరణ చిత్రమైన తద్వార నికాయమైన' అని యున్నది. (గిడుగువారి ప్రతిలోను అట్లే యున్నది) ఈ పాఠములో ఎట్లో ఇంకొక ద కారము పెట్టి ముడిపెట్ట వచ్చును గాని అర్థ సమన్వయ సరళత చక్కగా మాకు కుదరక ముద్రిత నిర్వచనోత్తర రామాయణ

ప్రతి నుండి మేమీ పాఠము గ్రహించినాము. మరియు నిందు దానిలో 'భరతుఁడాదృతిఁ జేసి సలీలఁ గాగ్రలఁగాన్' అని యున్నది. ఒక్క ప్రాచీన ప్రతిలో మాత్రము 'కాంచన తోరణ చిత్రితోన్నత ద్వార.... బాలిశ వృత్తిఁ గ్రాలఁగాన్' అని యున్నది. బాలిశవృత్తి అనుదానిలో మాకు సారస్య మెక్కువగా తోఁచి అట్లు గ్రహించితిమి అనియు నెఱుంగునది.

క్యజ్ ప్రత్యయాంతములు

వ. కుమార వదాచరితా శక్తిః కుమారాయిత శక్తిః కుమారాయితయా శక్త్యా శాలత. ఇతి కుమారాయిత శక్తి శాలీ కుమార సమాన పరాక్రమ ద్యోతవా నిత్యర్థః.

వివ:— కుమారస్వామి యొక్క శక్తివలె నాచరించిన శక్తిచేత (పరాక్రమ శక్తిచేత) ప్రకాశించువాఁడు అని తాత్పర్యము గ్రహించునది. కుమార శక్తి యను చోట—శక్తి — ఆయుధ విశేషము, పరాక్రమాది శక్తి అనియు నర్థద్వయాభేద మెఱుంగునది. కుమారాయిత శక్త్యాశాలత ఇతి అనుటకు మాఱుగా కుమారాయితయా శక్త్యా అని విడదీసి స్పష్ట ప్రతిపత్తికిఁ గావలయు చెప్పినాఁడని యెఱుంగునది. మఱియు నిచ్చట కుమార వదాచరితః కుమారాయితః శక్త్యా శాలత ఇతి శక్తి శాలీ కుమారాయితః శక్తి శాలీ కుమారాయిత శక్తి శాలీ అనియును గ్రహింప వచ్చునని తోఁచుచున్నది.

ఆది పర్వమునందు:—

ఉ॥ ఆయము గర్వము న్విడిచి యన్య పతు ల్పని సేయ నిట్లు గాం
గేయ భుజాశ్రయంబున నికృత్త విరోధి సమాజుఁడై కుమా
రాయిత శక్తిశాలి ధృత రాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయత కీర్తితోఁ దనకు హస్తి పురంబది రాజధానిగాన్
(5, 6) 187

వ. భద్ర వదాచరితా మూర్తిః యస్య తత్ భద్రాయిత మూర్తి శోభన
 మూర్తి మదితి యావత్, అయ మపి క్యజ్ ప్రత్యయాంతః — భద్రములు కలది వలె (లేక భద్రమువలె నాచరించు మూర్తి కలది. ఎల్లరకును శుభ ప్రద మగు నాకారము కలది. ఇదియును క్యజ్ ప్రత్యయాంతమై యేర్పడినదే అనఁగా పైని చెప్పిన అర్థమున (క్యజ్) య వచ్చి భద్ర య అని అయి తరువాత భద్ర అనుదాని అంత్యాకారము నకు దీర్ఘము (అకృత్సార్వధాతుకయో ర్దీర్ఘః అను దానిచే) వచ్చి క్త ప్రత్యయము మున్నగునవి రాఁగా భద్రాయిత అని యయ్యెను; ఈ పద మచ్చునకు చెల్లనిది యని భావము.

విరాటపర్వమునందు:—

ఉ॥ శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
 ద్రాయిత మూర్తియై హరిహరం బగు రూపము దాల్చి "విష్ణు రూ
 పాయ నమశ్శివాయ" యని పల్కెడు భక్త జనంబు వైదిక
 ధ్యాయితకిచ్చమెచ్చు పరతత్వముఁ గొల్చెదనిష్ట సిద్ధికిన్ (1, 1)188

వ. ఈ రెండు పద్యములందును నన్నయ తిక్కనగార్లు కుమారభద్ర శబ్దములు క్యజ్ ప్రత్యయాంతములు చేసి సంయుక్త విశేషము ములు గాను బ్రయోగించిరి. అది గనక కొందఱా రెండు శబ్దముల మీఁదను అకారము లున్నవి నిత్య సమాస విశ్రాంతు లని భ్రమిం తురు. శబ్ద సూత్రము వలన వానికే దీర్ఘములు వచ్చినవి గాని అందు లోపల నత్తులు లేవు.

వివ:— 187, 188 పద్యము లందున్న కుమారాయిత భద్రాయిత అను నవి పైని చెప్పిన ప్రక్రియప్రకారము క్యజ్ ప్రత్యయాంతములై ఏర్పడినవి. నన్నయ తిక్కన లను ఆది కవులచే యతుల లోనికి వచ్చు నట్లో పద్యములలోఁ గూర్పఁబడినవి. వానియందు ఉత్తర పద మజాదిగా విరుగునది లేదు (ఉత్తర పదమే లేదు) కావున నవి నిత్యసమాస పదములున్న నిత్య సమాసోభయ యతులకు ఁజెల్లునవి

యున్న కావు. వారందు నిత్యసమాస యతులకుఁ జెల్లు పదద్వయము (అజాద్యుత్తరపదము) ఉన్నదనియు పద చ్ఛేదములో అచ్చు వినబడు చున్నది గనుక అచ్చునకును విశిష్ట మేకపద భావము కలది గనుక విశిష్ట హల్లునకును మొదటి దానిలో రా అనుదానికిని రెండవ పద్యమున (ద్రా) రా అను దానికిని రెంటికిని చెల్ల వచ్చునని యభిప్రాయముతో పైని చూపిన హల్లులకు (విశిష్ట వర్ణములకు) ఉభయ యతులలోనివిగా కూర్చనే లేదు. ఇక మొదటిదానిలో ప్రాణి వ్యంజనాక్షర యతిలో (అప్పకవి మతమున నంతర్భూతమగు) ఏకతర యతిగా రా, రం అను వానికిన్ని రెండవ పద్యమున (వ్యంజనాక్షరయతిలో నంతర్భూతమగు) సంయుక్త యతిగాను అనఁగా సంయుక్త వర్ణములలో నేవర్ణమునకు (ప్రాణికి) మైత్రి గలదైనను చెల్లును గావున అట్టి (ద్రా) ద్రా రా లలో నొకటి యగు రా అను దానికి పైవిధముగానే వ్యంజనాక్షరయతి భేదమగు ఏకతరయతిగాను రకారమున్న కూర్చినారు కాని ఉభయ యతుల పదములను నూహతో వారు ప్రయోగించ లేదు. ఆపదము లలో పూర్వపదాంత్యమున సహజముగా (ఉత్పత్తిలోనే) హల్లుతో (పొల్లుతో) నంటియున్న అకారమున్నంత మాత్రమున నది ఉత్తర పదము మొదటిదిగా వినబడునది కాదు; అందుచేత ఆపదములలో అచ్చు నకు చెల్లదు. రెండకారములకూడికలో సవర్ణ దీర్ఘము రాలేదు, ఒక్క దాని దీర్ఘమే—ఇది యంతయు నెఱుఁగని వారగుటచే గొందఱా రెండు పదములలోను పర పదము మొదటివిగా వినబడు అకారము లున్న వనియు నిత్య సమాసోభయయతుల కవి చెల్లునవియే యనియు పై వానిలో నన్నయ తిక్కనలు ఉభయ యతులలో హల్లునకు చెల్లు నట్లు మాత్రమిక్కడ ప్రయోగించినా వీనిలోనూ అచ్చునకున్నూ గూర్చ వచ్చుననియు భ్రమపడుదురు గాని అట్లచ్చునకు చెల్లుబడి కావని తాత్పర్యము. వీనిలో 2 వ పద్యములో కొన్నిట 'నిష్ఠఁ బొల్చు' అని యున్నది; అదియుఁ గుదురును. మఱియు రెండు మూఁడు గద్యములలో

'మూర్తి' అని విసర్గతోడను, అదిగాన అని కొన్నిటను గనుక అని ఉకారముతోను (తక్కిన ప్రతులలో నున్న నేమి) గిడుగువారి ప్రతుల లోను మా చూచిన వానిలోఁ గాన వచ్చుచున్నవి. వాని యర్థము వారికి తెలియు నేమో గాని మాకు మాత్రము సరళార్థ సామంజస్యములు బోధ పడలేదు. అందుచేత నెన్నిట నున్న నేమి అది అచ్చు ప్రమాద ములే యనుకొన్నాము. మఱియు ప్రాచీన ప్రతులలో భ్రమింతురు అనియే (మా చూచిన వానిలో) నుండఁగా వీరిప్రతులలో మాత్రము భ్రమయుదురు అనియున్నది, అదియు బ్రమయు అనుటకు భ్రమయు అని అచ్చులో పడ్డ దన వచ్చును గాని అదివారి వ్యావహారిక వాద రీతిచే సమర్థితమేమో యని తోఁచినది; అయినను మార్చుటకు హేతువు తోఁచలేదు. మూర్తి అనియు, గనక (గానక) అనియు అప్పకవి కల్పిత ములు అగును అను మా యూహచే గృహీతము లనియు నెఱుంగునది దీనికి విరుద్ధముగా విశ్వామిత్ర శబ్దములో చెప్పుట యుక్తముగా లేదనియు దానికి ప్రయోగము లున్నందున అచ్చునకును చెల్లుననియు వీనికి ప్రయోగములు లేక పోవుటచే వీనిలో నచ్చునకు చెల్ల వనియే చెప్పుట యుక్తము.

## 5. దే శ్య ని త్య స మా స వి శ్రాం తు లు

తే॥ శబ్దశాసన ముఖ కవీశ్వర కృత ప్ర
బంధముల లక్ష్యములఁ గనుపట్టు కతన
దేశ్య నిత్య సమాస సంధికిఁ బొసంగు
వడి స్వరంబైన వ్యంజన వర్ణ మైన    190

క॥ రూపఱఁ బెంపఱఁ బెల్లఱ
నేపఱచుట గ్రిక్కిఱియుట నిలఁ గ్రచ్చఱయుం
జూపఱ యుక్కఱ మొదలుగ బ్రాపతి
యివి దేశ్య నిత్య సమసన పదముల్    191

వ. కొందఱు వీని పేరే దేశ్యాఖండములును అందురు.    192

190 పద్య వివ:— నన్నయ భట్టు మున్నగు మహాకవుల ప్రయోగములలోఁ గాన వచ్చు చుండుటచే దేశ్య పదముల కూడికలో నేర్పడు నట్టియు అజాద్యుత్తర పదముగా రెండు పదములు కూడి యుండియు ఏకపదము వలెనే భాసించు నవియు విడి విడిగా నున్నచో కలిసి యుండు నపుడిచ్చు అర్థము నీయనివియు శబ్ద పల్లవ పదములనఁ బడు నవియు అందుచేతనే కావలయు 'నిత్య సమాస పద తుల్యములై' దేశ్య నిత్య సమాస సంధి పదములనఁబడు ముందు చెప్పఁ చున్న వానికి అచ్చైనను హల్లైనను (రెండును) ఉభయ యతులుగా చెల్లును. వీనికి దేశ్య నిత్య సమాస యతు లనియు దేశ్యాఖండ యతు లనియుఁ బేరనియుఁ దాత్పర్యము.

191 పద్య వివ:— ఇందు దేశ్య నిత్యసమాస పదములు కొన్ని చెప్పఁబడ్డవి— ఇందుఁ జెప్పఁ బడిన రూపములు క్రమముగా రూపు — అఱు—రూపఱు, పెంపు — అఱు—పెంపఱు, పెల్లు — అఱు—పెల్లఱు (ఏపు — అఱు—ఏపఱు) ఏపు — అఱుచు—ఏపఱుచు, క్రిక్కు — ఇఱియు —(ఇఱియు — ఇఱియు) క్రిక్కిఱియు, క్రచ్చు — అఱు—క్రచ్చఱు చూపు + అఱు—చూపఱు, ఉక్కు — అఱు—ఉక్కఱు అను మొదటి రూపములకు (శబ్ద పల్లవధాతు ప్రకృతులకు) ఉప లక్షణము లనియు ఈ ప్రకృతులవల్ల నేర్పడు విశేష రూపములన్నిటికిని గ్రహణామే యనియు పెక్కులు అట్టి రూపము లుండునని కావలయు అప్పకవి ప్రకృతులతో చెప్పక అట్లు చెప్పె ననియు, (క్రమముగా) వీనికి రూపు చెడు, పెంపుచెడు, అతిశయము (ఉత్కర్ష) చెడు, (ఏపుచెడు) ఏపుచెడఁ గొట్టు, ఎడము లేకుండ కూడియుండు, నిష్కల్మషమగు (శీఘ్ర గతి కలదగు) చూపుచెడు, బలము (సారము) చెడు అని విశిష్టముగానే అర్థములు గ్రహించ వలెననియు (ఆ యా చోట్ల ప్రత్యయాద్యర్థములు మారు ననియు) క్రచ్చఱు అనునది ప్రయోగములందు క్రచ్చఱన్ అని క్రియా విశేషణముగానే యున్నదనియు ఆ ప్రయోగములలో

నకారలోపము వచ్చినది. (క్రిచ్చఱ అనునది మాత్రము) ఇక్కడ అప్పకవి పద్యములో (పుమః ఖయ్యంపరే అను మొదలగు సంస్కృత వ్యాకరణ సూత్రములందువలె) ననుకరించె నేమో యనియు, కొన్ని ప్రతులలో పెల్లఱ నేపఱచుట అను-చోట పెల్లఱ యేపఱచుట అని గిడుగువారిప్రతిలోనూ ఉన్నది. అప్పుడున్ను పైరీతి సమర్థనమే యగు ననియు ఇట్టివి మఱియుం గొన్ని ప్రయోగాను సారముగా గ్రహించుకో వచ్చుననియుం తాత్పర్య మెఱుంగునది. మఱియు అఱు ధాతువునకు నశించుట అర్థము, ఈ, ఏపఱు, రూపఱు, పెంపఱు మున్నగునవి శబ్ద పల్లవ ధాతువులు వీనికి పైని చెప్పినట్లు ఏపునశించు, రూపునశించు, పెంపు నశించు మున్నగు రీతిని వ్యుత్పత్త్యర్థములు — 'రావణుఁడు రూపఱెను' మున్నగు -చోట్ల రావణుఁడు రూపు నశించెను అనురీతి తత్పర్యాయపద ప్రయోగమందును రావణుఁడు రూపును (లేక రూపు) అఱెను అనునట్లు తద్విగ్రహ వాక్య ప్రయోగమందును అన్వయ యోగ్యత యుండదు. రావణుఁడు రూపఱెను మున్నగు రీతి నున్నప్పుడే అన్వయ యోగ్యత కలుగును. ఇట్టిట్టి శబ్దములకు పర్యాయ పద ప్రయోగములోను విగ్రహ ప్రయోగములోను అర్థము చక్కగా కుదురక విశిష్ట పద ప్రయోగ మందే అర్థము చక్కగా కుదురును గనుక ఇట్టి యీ ఆచ్ఛికముల జంట లకు నిత్య సమాస సాదృశ్యము సిద్ధించె ననియు, అందుచేతనే ఈపదములు దేశ్య నిత్యసమాస యతులకు లక్ష్యము లగుచున్నవనియు, ఇట్టి వీని యనపాయనత్వమే (విడి విడిగా నుండకయు, అను పూర్విని విడువకయు అన్వయ యోగ్యత నొందుటయే) వీని శబ్దపల్లవత యనియు ఇట్టి -చోట శ్రావ్యత ప్రాణి యతి యందే యున్నను శబ్దోత్పత్తి పర్యా లోచనచే స్వర ప్రధాన యతియును సిద్ధించు చున్నదనియు అందుచే నిది యిట్లుభయ యతులలోఁ జేరె ననియు నెఱుంగునది.

అనంతుని ఛందమునందు:— (పేజీ 81)

గీ॥ అజ ననంగను బోవుట కర్థమైన
సంధి నిత్య సమాసోక్తి జరుగు రెంట
నసుర వీరులనెల్ల నుక్కఱ వధించె
భాను కులుఁడు రావణుని నేపటిచె ననఁగ 193

వివ:— పై దానికిఁ బ్రమాణముగా ననంతుని పద్య ముదాహరింపఁబడుచున్నది.

193 పద్య వివ:— అజన్ అనుదానికి బ్రకృతి యగు అజు ధాతువునకు (పోవుట) నశించుట అను నర్థము గలిగి అట్టి దాని కొక పూర్వపదము కూడి సంధిచే నేర్పడిన (వెనుక చెప్పినట్లు నిత్య సమాస పదమువలె నుండు) విశిష్ట పదమునకు (అచ్చికముల జంటకు) దేశ్య నిత్య సమాస యతులను పేరుతో అచ్చునకును హల్లునకును చెల్లుబడి యగు ననియు, వాని కీపద్యమందలి 3, 4 పాదములు (క్రమముగా) నుదాహరణము లనియు పద్య తాత్పర్యము. ఇందు 3 వ పాదమున యతి వద్ద నున్న (ఉక్కు — ఆజన్ అను నప్పు డేర్పడు) అ అను దానికి పాదాదిని అ (రెంటన్ — అసుర అను నప్పు డేర్పడునది) అను నది కూర్పఁబడుటచే నిది అచ్చు చెల్లుటకున్ను, 4 వ పాదమున యతి వద్ద నున్న ఏపు — అటిచె—ఏపటిచె అనునప్పటి ప అను దానికి పాదాదిని భా అనునది (వర్గయతిగా జెల్లునది) కూర్పఁబడుటచేత నిది హల్లు (ప్రాణి) చెల్లుటకున్ను, (అజు ధాతువున నేర్పడిన విశిష్ట పదములలో) నుదాహరణము లైన వని యెఱుంగునది. ఈ పద్యములో ఒక్క అజు ధాతువునే గ్రహించుటయు అట్టివే లక్ష్యములుగాఁ గూర్చుటయు ఉపలక్షణము లనియు అప్పకవి చెప్పినవియు మఱియు నితరములు సైత మిట్టి పదములు ఇట్టి లక్ష్యములున్ను వెనుక చెప్పినట్లు చెల్లుననియు ఈ యనంతుని ఛందము నందలి ఈ పద్యములో పాఠభేద మున్నదనియు (మా చూచిన ముద్రిత ప్రతిలో) అది యంత సమన్వయముగా మాకు తోఁచక ప్రాచీన ముద్రితాప్పకవీ ప్రతి

నుండి యీ పాఠము గ్రహింపఁబడ్డ దనియు, అఱ యసంగను అనియే గిడుగువారి ప్రతిలో కలదనియు అది ఉక్కఱ అను చోట నట్లుండుటచే కలిగిన భ్రాంతి యనక వెనుక మేము చెప్పినట్లే సమర్థింపఁ జూతుము కాని ప్రాచీన ప్రతులలో సాపుగానే యుండ నీ వక్ర మార్గ మేల యని యెవ్వరైన నడుగక మానరనక తీరదు అనియు నెఱుంగునది.

ఆరణ్య పర్వమునందు:—

క॥ ఎఱకలు గల కుల శైలము
తెఱఁగు మెఱయ రయము నెఱయ దివికి నెగసి బ
ట్టఱము జలధరము క్రియ ను
క్కఱి తద్వన మెల్ల నద్రిప నార్చుచుఁ గడిమిన్ (6, 345) 194

యుద్ధ కాండమునందు:—

చం॥ ఎఱిఁగి యెఱింగి మున్న తఁడె యగ్గొనరించిన దానికై కదా
చెఱఁగొని వచ్చితిం బిదప సీత వృథా కథ లింక నేల పెం
పఱ బ్రతు కింత తీయనె ఖరాదుల చావున కేమి చింత నీ
మఱఁదలి బన్న మేపగిది మానిని నీఁగుదు సంధిఁ జేసినన్
(784) 195

వశిష్ఠ రామాయణమునందు:—

ఉత్సాహ॥ మఱియుఁ బెక్కు యోనులందు మహిత చిత్ర గతులఁ బెం
పఱ జనించి దుఃఖ భాజి యై చరించి వెండియున్
వఱలు విప్ర వరుని యింట వాసుదేవుఁ డనఁగఁ దా
నెఱుక గలిగి పుట్టె వేల్పు టేటి తీర భూములన్ 196

విరాట పర్వమునందు:—

చ॥ చిఱు నగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యముఁ జేసి నేన లు
క్కఱి రభసంబుమై నడరఁ గవ్వడి ద్రోణి యు నీడఁబోక యు
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడిఁ దార్కొని మండుచుండెఁ జి
చ్చఱ పిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున నంబర వీథి నుగ్రమై
(5, 143) 197

లక్షణ సార సంగ్రహమునందు:—

సీ॥ అచ్చు హల్లును దేశీయ మనియెడి వడి
యెన్న నొక్కొక్క చోటఁ గ్రిక్కిఱిసెఁ గృతుల
సరస లక్షణ కవులు గ్రచ్చుఱ నొనర్ప
భంజితాసుర సముదాయ యాంజనేయ 198

నిర్వచ నోత్తర రామాయణమునందు:—

చ॥ ఎఱుఁగవు గాక భోగముల కెల్లను నెచ్చెలి జవ్వనంబ యి
త్తఱి నుడివోవ కుండ నుచితంబుగ జక్కవ దోయి వోని క్రి
క్కిఱిసిన చిన్ని చన్నుఁగవ యింపెసలారఁగ నాదు వక్ష మ
న్వఱలు సరో వరంబున నవారణ కేళి యొనర్పు కోమలీ
(5, 14) 199

ఆరణ్య పర్వమునందు:—

చ॥ ఎఱిఁగితి నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చుఱ భవదీయ రక్షణము నంది వెలుంగుచు నుండు నట్టి ని
న్నుఱువుగ నేను వేఁడుకొన నుత్తుఁడఁ గాక మొఱంగి నన్ను న
క్కఱపడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జిత దైత్య చెప్పుమా
(7, 367) 200

ఉద్యోగ పర్వమునందు:—

చ॥ తఱి యగు నంతకున్ రిపు నుదగ్రత సైచుట నీతి నీవు నా
కఱపిన యట్లు సేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం గలదేనియు నింత యేలఁ గ్ర
చ్చుఱ ముని వర్గ వాహనుఁడ వై చను దెమ్మను మంతఁ దీఱెడున్
(1, 176) 201

వ. పై విషయమునకు మఱియు మహా కవి ప్రయోగములు చూపు చున్నాడు.

194 పద్య వివ:— 4 వ పాదమున మొదటనున్న (ఉక్కఱ—

ఉక్కు — అఱ అను నప్పు డేర్పడు అఱ అను దాని మొదటి) అ అను దానికి యతి వద్ద (అదుౕవన్ — ఆర్చుచు అని యేర్పడు) ఆ అను నది కూర్పఁబడుటచే నిది ఉక్కఱు శబ్దములో అచ్చు చెల్లు టకున్ను, 195 లో మూఁడవ పాదము మొదట నున్న (పెంపు + అఱ అను నప్పుడేర్పడు) అ అను దానికి యతి వద్ద (ఖర — ఆదుల అను నప్పు డేర్పడు) ఆ అనునది కూర్పఁబడుటచే నిది పెంపఱు శబ్దమున అచ్చే చెల్లుటకున్ను, 196 లో 2 వ పాదము మొదట పెంపు — అఱ అను నప్పటి అకారమునకే యతి వద్ద (యై) ఐ అనునది కూర్చఁబడుటచేత నిదియు పెంపఱు శబ్దములో అచ్చు చెల్లుటకే నున్ను, 197 లో 2 వ పాదము మొదట ఉక్కఱ అను నప్పటి క అను దానికి యతి వద్ద క అనునది కూర్చఁబడుటచేత ఇది ఉక్కఱు శబ్దమున హల్లు (ప్రాణి) చెల్లుటకున్ను, 198 లో 2 వ పాదము యతి వద్ద (క్రిక్కు — ఇఱిసె అను నప్పు డేర్పడు) ఇ అను దానికి పాదాదిని (యె) ఎ అనునది కూర్చఁబడుటచేత నిది క్రిక్కిఱియు శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 198 లోనే 3 వ పాదము యతి వద్ద (క్రిచ్చఱ అను నప్పటి) చ అను దానికి పాదాదిని స అనునది కూర్చఁ బడుటచే నిది క్రిచ్చఱు శబ్దమున హల్లు చెల్లుటకున్ను, 199 లో 3 వ పాదము మొదట (క్రిక్కు — ఇఱిసిన అను నప్పటి) ఇ అనుదానికి యతి వద్ద (యిం) ఇ అనునది కూర్పఁబడుటచే నిదియు క్రిక్కిఱియు శబ్దమున అచ్చు చెల్లుటకే నున్ను, 200 లో 2 వ పాదము మొదట (క్రిచ్చు — అఱ అను నప్పటి) అ అనుదానికే యతి వద్ద (రక్షణమున్ + అంది అను నప్పటి) అ అనునది కూర్పఁబడుటచే నిది క్రిచ్చఱు శబ్దమున అచ్చు చెల్లుటకున్ను, 201 లో 4 వ పాదము మొదట — క్రిచ్చు + అఱ అను నప్పటి అ అను దానికే యతి వద్ద (వాహనుఁడవు + ఐ అను నప్పటి) ఐ అనునది కూర్పఁ బడుటచే నిదియు క్రిచ్చఱు శబ్దమున అచ్చు చెల్లుటకే నున్ను ఉదాహరణము లని యెఱుంగునది. మఱియు 194 లో మా చూచిన

గిడుగువారిప్రతి మున్నగు వానిలో 'ఎఱకలు గల కుల శైలము తెలుఁగున మైరయము మెఱయు' అనియు, 'తెలుఁగు మెఱయ నంత సతఁడు' అనియు, 'ఉక్కుఱఁ దద్వనమెల్ల' అనియు గలవు. మేము శబ్దరత్నాకరము నుండి పై పాఠము గ్రహించినాము. 195 లో మేము చూచిన గిడుగు వారి ప్రతిలో నున్న మఱికొన్నిటకు యీఁగుదు, నీగుదు అని నిర్బంధు వులుగా నున్నవి. ఈ యర్థమున శబ్దరత్నాకరమున బిందువుతోనే ఉన్నవి. 197 లో గిడుగువారి ప్రతిలో మాత్రము 'ద్రౌణియు నీడు వోక' అని యున్నది. అదియంత ప్రమాణముగా (ప్రశస్తముగా) మాకుఁ దోఁచినది కాదు. అప్పకవీయ ప్రాచీన ప్రతులలోను శ. ర. లోను మేము చూచిన భారత ప్రతులలోను ద్రౌణియు నీడఁబోక — వెనుకదీయక — అనియే యుండుటచేతను, అదియే ప్రశస్తమని తోఁచుట చేతను మేమట్లు గ్రహించితిమి. గిడుగువారి ప్రతిలో మాత్ర మట్లుండుటకు హేతువు ఏతాటాకు ప్రతులనో నట్లుండ వచ్చునని అనుకొన్నాము గాని పాఠాంతర మైనను వారు చూపకుంట పొసఁగ కున్నది. 198 లో (ఈ పద్యము మా చూచిన ప్రాచీనాప్పకవీయ ప్రతులలో లేదు. 'లక్షణసారసంగ్రహము నందు' అని శీర్షికతో 'ఎఱుఁగవు గాక' (అను ముందరి) పద్య మున్నది. అది అచ్చు యొక్కయో అన్యులయొక్కయో ప్రమాద మనుకొని పై పాఠము గిడుగువారి ప్రతినుండి గ్రహించినాము; కాని అందు క్రిక్కిరియె, క్రిచ్చర యె తోడను, లఘు రేఫలతోడను గలవు. వానికాకరము దొరకకయు అవి గిడుగువారి ప్రతిలోనే గల 191 వ పద్యమునకును 199 వ పద్యమునకును, 201 కిన్ని విరుద్ధమగుటచేతను, ఱెసె, ఱ అనియు సంస్కరించు కొంటిమి. 199 లో అన్నిటను మా చూచినవానిలో 'నెచ్చెలి జవ్వనంబు నిత్తఱె', 'నాదు చిత్తమన్ వఱలు' అనియుఁ గలవు. ఉత్తరరామాయణ ముద్రిత ప్రతినుండి పై పాఠము గ్రహించితిమి. 200 లో గిడుగువారి ప్రతి మున్నగు కొన్నిట 'భవదీయ రక్షణమునంద',

'సిన్నబువుగ' అనియుఁ గలవు. మా పాఠము శ. ర. నుండి గ్రహింపఁ బడ్డది. మఱియుం బై వానిలో ఏక పదత్వ భానముచేతను, (శబ్ద పల్లవ ధాతు రూపము లగుటచేతను) హల్లు చెల్లుట సహజమే (శ్రావ్యమే) యనియు స్వర ప్రధానయతి శబ్దస్వరూప పర్యాలోచన విహీత మనియు నెఱుంగునది.

ఉ॥ నన్నయ ముఖ్య సత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడపెట్టఁ దక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజమంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే 202

వ. అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగముగుంట
తిమ్మన వ్రాసిన అప్రశస్తంబు లగు లక్ష్యంబులకు నాశ్చ
ర్యంబు నొంది బహు పుస్తకంబులు నిరీక్షించి వాని నెల్లను
బ్రక్షిప్తంబులుగా నెఱింగిన వాఁడనై లక్షణవంతంబు లగు
పురాతన కవి ప్రోక్తంబులు వివరించెద. 203

202, 203 పద్య వివ:— నన్నయ భట్టారకుఁడు మున్నగు మహాకవుల గ్రంథములలో కొన్ని లేఖకుల ప్రమాదముచేతను, గొన్ని పాఠకుల (చదివెడివారి) బుద్ధి మాంద్యము (తెలివి లేమి) చేతను, తప్పు పాఠములు వచ్చి యుండ (పడియుండ) నవి చూచి సూక్ష్మ దృష్టి (మిక్కిలి పర్యాలోచన) లేని పండితులు (సంస్కర్తలు) సంకోచించక (వెనుదీయక) తమ యిచ్చ వచ్చినట్లు (అఖండ యతులు మున్నగు దోషము లేర్పడు నట్లు) దిద్దివైచి రనియు అట్టి యప పాఠములు నిక్కములే యనియు (మహా కవి విరచితములే యనియు) నెంచి కొందఱు లాక్షణికులు (సామాన్యులు బాగుగా విమర్శించి పర్యాలోచించని వారు) అఖండయతి మున్నగునవి (దోష భాజనములు) నన్నయాది మహాకవులచేతనే అంగీకరింపఁబడిన వని తెలుపుచుఁ దమ గ్రంథములలో వ్రాసి రనియు వానిలో సులక్షణసారమునందు లింగముగుంట తిమ్మన

వ్రాసిన అపశ్రస్తము లగు (లక్షణ విరుద్ధములై దుష్టము లగు) మహాకవి లక్ష్యములు చూచి (ఇట్టి లక్షణ విరుద్ధములు మహాకవులు ప్రయోగింతురా యని యాశ్చర్యపడి పరిశుద్ధములగు ప్రాచీనములు పెక్కుప్రతులు పరికించి చూచి పై పాఠము లెల్ల దుష్టములును ప్రక్షిప్తములును (తెలియని ఇతరులవలన పై విధముగా నేర్పడ్డవియే కాని మహాకవి విరచితములు కావు) అని యెఱింగినవాఁడనై లక్షణ యుక్తములును (నిర్దుష్టములును) ప్రాచీన మహాకవి విరచితములునగు (సాధు) పాఠములు వివరింతును అని భావము.

ఆది పర్వమునందు:—

క॥ నా వచనమున నపత్యము
గావించును నీకు గొంతి కడు నెయ్యమునన్
నీ వగచిన యీ యర్థము
నూావె మనంబునఁ దలంతు సుందరి యెపుడున్ (5, 135) 204

ఉద్యోగ పర్వమునందు:—

క॥ తమ తండ్రి భంగి నీకును
సముచితముగ భక్తిఁ జేసి సజ్జన నుత మా
ర్గమునను జరియింపంగా
నమల మతిని గన్న కొడుకు లట్లరయఁ జనున్ (2, 74) 205

ఆనుశాసనిక పర్వమునందు:—

క॥ అతిథి నినుఁ గోరె నేనియు
నతిఁ గింకిరిపడక యోల మానపడక నీ
వతనికిఁ బ్రియంబు సలుపుము
సతికిం బతి పనుపు సేయఁ జను నెల్లవియున్ (1, 68) 206

రామాయణమునందు :—

ఉ॥ అన్నవు తండ్రి యట్ల విను మంత్రియ కాదటమీఁద రాజ వే
మన్నఁ గొఱంత లేదు మణి హారము లాదిగఁ బెక్కు కానుక
లున్నను గ సీత నిచ్చి జన లోక పతిం గని మమ్ముఁ బ్రోవుమీ
సన్నపు కార్యముల్ వలదు సంధియ మేల టుగాక తక్కినన్
(యు. 142) 207

మఱియు దానియందే:—

ఉ॥ ఓ కపివీరులార సు గుణో దధి నీ రఘు రాము సర్వ లో
కైక శరణ్యునిం గొలువ నిప్పుడు వచ్చితి నొండు గాదు నా
రాక మహాపరాధి యగు రావణు తమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు లర్క కులాగ్రణితోడఁ జెప్పరే
(యు. 165) 208

దేవకీనందన శతకమునందు:—

మ॥ చతు రంభోధి పరీత భూవలయ రాజన్యాళి కోటీర రం
జిత మాణిక్య విరాజి తచ్చరణ రాజీవుండు ధర్మాత్మజుం
డతి కార్పణ్యముతోడ మత్స్యపతిఁ దా నాసింపఁడే నీదు శా
శ్వత కారుణ్యము గల్గు నంతకును కృష్ణా దేవకీ నందనా 209

ఆరణ్యపర్వమునందు:—

చ॥ ఉరమున రెండు గన్నులు పృథూ దర దేశమునందు నోరు ప్ర
స్ఫురిత భుజ ద్వయంబును సముజ్జ్వల దున్నత భావముం గరం
బరుదుగ నుగ్ర మైన వికృతాకృతితోడ న శేష సత్వ సం
హారుఁ డగుచున్న వాని దివిజారిఁ గబంధునిఁ గాంచి రచ్చటన్
(6, 357) 210

ఉద్యోగపర్వమునందు:—

చ॥ అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచిన మాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి మీరు మా

క్రొనరిన సైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు [1] నొప్పు నభిషేకముఁ గైకొనుఁ డుత్సవంబునన్
(4, 140)　211

వ. దీని మూడవ పాదంబునందు "పదునొకొంటికి" నని యున్న చోట సంధి గూర్చి స్వర ప్రధాన వడి గాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్య నిత్య సమాస యతి యనుకొందురు.　212

వివః— పై పద్యములలో తన మతమున సాధు పాఠములు మాత్రము చూపినాఁడు కాని తా ననుకొనిన యపపాఠములు చూపలేదు కనుక జిజ్ఞాసువులకు ఆ యప పాఠము లని యప్పకవి యనుకొన్నవి ఏవి, అవి యెట్టివి అని సందియము కలుగక మాన దని సాంప్రదాయికముగా నెఱుంగఁబడిన పాఠములు చూపఁబడుచున్నవి:—

204— 'సూవె మనంబునఁ దలంచు చుండెద నెపుడున్'—ఇందు తలంచుచున్ — ఉండెద — అని యేర్పడుచుండఁగా మొదట అఖండ యతి (చుం అనుదానికి) సూ అన్నది యున్నది. అది యిష్టము లేక అఖండ యతి లేని పై పాఠము అప్పకవి చూపినాఁడు.

205— 'మా, ర్గమునను జరియింపఁగ నను, ల నుతీ నీ కన్న కొడుకు లట్లరయఁ జనున్'—కొడుకులు — అట్లు — కొడుకులట్లు—ఇక్కడ అ విఱుగుచుండ ల అను హల్లు నఖండ యతి ఇష్టము కాక అప్పకవి అఖండయతి లేని పై పాఠము చూపినాఁడు.

206— 'మతిఁ గింకిరిపడక యోల మాన గొనక' (ఓలము — ఆన గొనక) ఇదియు నఖండ యతియే — ఓలమానపడక — మఱుఁగుపడక (అని శ. ర. లో) మతిఁ గింకిరిపడక అనియే శ. ర. పా. చూ. 'ఓల మానపడు' — దీనినిఁ బట్టి ఈతనికి (శ. ర. కర్తకు) అఖండ యతిగాని దేశ్య నిత్య సమాస యతి గాని యిక్కడ ఇష్టమే యని యెఱుంగునది. (ఈతఁడును అప్పకవి మతమున పై వారివంటివాడు కాక తీరదు.)

1 నొప్పు (పా)

207– 'ఏ, మన్నఁ గొంత లేదు మణి మండన'–ఏమి – అన్న ఏమన్న–మం వెనుక వలెనే మెఱుంగునది.

208– 'లో, కైక శరణ్యునిం గొలువఁగా నిట వచ్చితి'– లోక + ఏక – ఇదియు నఖండ యతియే.

209– 'చతు రంభోధి పరీత భూవలయ రాజానేక కోటీర'– (రాజ+అనేక) – అఖండ యతియే.

210–'అశేష సత్వ ఘు,స్మరుఁడగుచున్నవాని దివిజారిఁ గబంధుని'– (దివిజారి–దివిజ+అరి)–ఇదియు నట్టిదే కాని ఈ పాఠమే అప్పకవి పాఠము కన్న శబ్దార్థ సౌకుమార్యములు కలదై భారత కవిత్వమున నుండవలసినంత సౌందర్య గాంభీర్య పాండిత్యములు కలదై సహజమగు పాఠ మేమో యని మాకుఁ దోచినది. మరియు నిందు మేము చూచిన భారత ప్రతిలో:

చ॥ 'ఉరమునయందుఁ గన్నులు బృహూదర దేశమునందునోరుఁబ
స్ఫురిత భుజ ద్వయంబు గల భూమి ధరోన్నతభావ ముంగరం
బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేష సత్త్వ ఘు
స్మరుఁ డగుచున్నవానిఁ బటు సత్త్వుఁగ బంధునిఁ గాంచిరచ్చటన్'

ఈపాఠము నందును అఖండ యతి లేదు. అప్పకవీయములోని మూల పాఠములో నున్న 'ప్ర స్ఫురిత......సముజ్జ్వల' అనునదియే అప్పకవి పాఠమైనచో భారత ప్రయోగము గావున మువర్ణ యతి కిదియే ఉదాహరణ మిచ్చి యుండుననియు అందువలన 'ప్ర స్ఫురిత........ భూమిధరోన్నత' అనుదాని వంటిదే అప్పకవి పాఠమై యుండుననియు ఇట్టి పాఠము ప్రాచీనమై యుండుట చేతనే భారతమున మువిభక్తి యతియే కాని మువర్ణయతి లేదనియొక ప్రసిద్ధి కలిగినదనియుఁ దోఁచుచున్నది.

211 - 212 – పదునొకొంటికి– ఇప్పటి యప్పకవీయ ప్రతు లన్నిటను గానవచ్చు ఈపాఠమే అప్పకవి పాఠమైనచో నిది మిక్కిలి యసందర్భముగా మాకుఁ దోఁచు చున్నది. పదునొకొంటికి – పదునొక + ఒంటికి అని యుండఁగా పదునొకొంటికి అని సంధిచేసి

స్వరప్రధాన యతిగా సోమయాజులు ప్రయోగించి యుండఁగా అది తెలియని మూర్ఖులు ఇక్కడ (సమర్థింప నవసరము, అట్లు ఉచితము కాని భిన్నపదముల సంధి మాత్రమున్నచోట) దేశ్య నిత్య సమాస యతి యగుటచేత చెల్లిన స్వరయతి కాని అఖండ యతికాదు అని యందురనియు అన్నాఁడుగదా—అప్పుడు విపరీతముగా అనఁగా నిది ఏకపదమే (ఒకొంటికి అనియే) కాని (ఒక + ఒంటికి—ఒకొంటికి అని) పదద్వయ మేళనచే నేర్పడి ఏకపదము వలె భాసించునది కాదు కనుక దేశ్య నిత్య సమాసత్వ యతులిందు చెల్లవు అనికదా పై వచనమునకు భావము. ఇట్లిప్పుడు దేశ్య నిత్య సమాసత్వము వల్ల నేర్పడు స్వర యతియు నొప్పనివాఁడు పైని ఇది భిన్నపద సంధియనియు కేవల భిన్నపదములలోను ఏకపదత్వభానము లేని సమాస పదములలోను తన మతమున చెల్లవలసిన స్వరప్రధాన యతిగా సోమయాజులు కూర్చి నారని చెప్ప నెట్లు సాహసించును, అదిపొసఁగు టెట్లు? ఇఁక పది — ఒక — ఒంటి – పదియొకొంటి (లేక పదునొకొంటి) అని భిన్నభిన్న పదత్రయ మున్నదని సమర్థింపఁ జూచువారి కర్థమే పొసఁగదుకదా— మొత్తముమీఁద ఒకొంటికి అనియే పాఠమనియు ఇఁదు పదద్వయ మున్నదనియు, ఎవ్వరికిని చెల్లునదియు, ఎట్లేని స్వర ప్రధానయతి యెవ్వరికిని సమర్థింపఁ దగినదియు అని చెప్పుటకు కుదురదనియు, ఒకొంటికి అనియే పదమైనచో నిఁక నఖండయతియే కాకతీరదనియు మాకు తోఁచుచున్నది కనుక అప్పకవి వ్రాసిన పాఠము (పద్యములో) పదికి నొంటికి (లేక) పదియునొంటికి ననియు వచనములో పదికి నొంటికి (పదికిన్ + ఒంటికి—పదికినొంటికి - లేక - పది (యున్) + ఒంటికి—పదియు నొంటికి) అని సంధిచేసి అనియే అయియుండు ననియు ఇట్టి పాఠము నెఱుఁగని మూర్ఖులు అట్లు ఒకొంటికి అనియు దేశ్య నిత్య సమాస స్వరయతి యనియు భ్రమ పడుదురనియు అప్పకవి చెప్పె నేమోయని మేమనుకొని సమర్థించుకొన్నాము. భారత కవిత్వమున కుండవలసిన

యందము మాత్రి మిప్పుడు గోచరించకున్నది కాని అప్పకవిని దేశ్య నిత్య సమాస యతిగా సమర్థించువారికన్నను పరమమూర్ఖుని జేయుటకు మాకు హృదయము (లేఖినియు) ఒప్పినది కాదని మనవి జేయుచు దీని ఔచిత్య నిర్ణయభారము విజ్ఞులపై ( విశేషజ్ఞులపై ) బెట్టుచుంటిని. మఱియు నిత్య సమాస యతిలో నంతర్భూతమైన స్వరప్రధాన యతికేని అవకాశము (అవసరమున్న) లేని చోటను (భద్రాయిత, కుమారాయిత మున్నగు చోట్లను) ప్రాణియతిని అఖండ యతి యగునేమో యని భ్రమ పడి కొందఱపమార్గముచే సమర్థింప జూతురనియు దేశ్య నిత్య సమాస యతియని సమర్థింప నవసరము లేనిదియు దేశ్య నిత్య సమాస యతిలోని అఖండ యతికేని అవకాశము లేనిదియు నగుచోట నున్న స్వరప్రధాన యతిని తెలియక (సరియైన పాఠమెఱుంగక) అపమార్గముచే సమర్థింపఁ గొందఱు చూతురనియు తెలుపుటకీ ప్రసంగము నిత్య సమాస యత్యంతమున నుపక్రమించి యవాంతరముగా నఖండ యతి దోషో ద్ఘాటన మొనర్చి సాధుపాఠ ప్రదర్శనము తన మత ప్రకారముగాఁ జేసి దానిని నివారించి దేశ్య నిత్యసమాస యత్యంతమున తత్ప్రసంగోప సంహా ర మిట్లు చేసినాఁడనియు, ఇక్కడ మూలమున నున్న పాఠమును గురించి నవీన విమర్శకుల భిన్న భిన్నాక్షేప సమర్థనములు పెక్కులున్న వనియు, అవి యెల్ల గ్రంథ విస్తర భీతిచే ఇక్కడ విడనాడి నామనియు, మఱియు నిట్లప్పకవి సాధు పాఠములని యెన్ని యెట్లు వ్రాసినను ఇప్పటికిని ఆతనికి తోడ్పడు వారై యెన్ని అఖండయతి పాఠములు దిద్దుచు వచ్చినను దిద్దుటకు వీలులేకయో కనుమొఁగిరో కావలయు అఖండయతిని సాధించు ననియు, పెక్కులిప్పటికిని (లఘ్వలఘురేఫమైత్రులు సాధించునని వలెనే) పెక్కులు విమర్శకులకు గోచరించుచునే యున్నవి కాని మాని నవి కావనియు అందుచేతనే ఈలఘ్వలఘు రేఫ మైత్ర్యఖండయతు లిప్పటి వారి కంగీకరించక తీరదనియే మాయభిప్రాయము మాత్రము మనవి చేయుచుంటిననియు నెఱుంగునది.

గిడుగువారి ప్రతిలోను ఇక్కడ మూలములో చూపఁబడి నట్లే యున్నది; అది వారికి సరిపడ్డదికాబోలు.

## 6 నిత్యయతులు

క॥ ఏని యను నాంధ్రశబ్దము
తో నతికిన పూర్వపదము తుదివ్రాయికిన
చ్చైనను వ్యంజనవర్ణం
బైన రచింపుదురు నిత్యయతు లనుచుఁ గవుల్ 213

శేషధర్మములందు:—

క॥ మెట్టఁడు నారకమార్గం
బెట్టి మహాక్రూరకర్ముఁ డేనియుఁ దుద ని
ట్ట ట్టనక నెమ్మనంబున
నెట్టన హరితలఁపు గలిగెనేని మహాత్మా 214

213 పద్య వివ:— అప్యాద్యర్థకము ఏని అను నచ్చతెనుఁగు పదము పరపదముగా నుండి దాని పూర్వమున (వెనుక) ఒక పదమేదియైనను చేరి (క్రూరకర్ముఁడు + ఏని—క్రూరకర్ముఁడేని అను మొదలగు రీతి) సంధి మాత్రమున నేర్పడు (తుదివ్రాయికి — అంత్యవర్ణమునకు) పూర్వ పదములోని చివర వర్ణముగాఁ గానవచ్చు (డే అనుదాని వంటి) విశిష్టవర్ణము యతులలోనికి వచ్చినప్పు డావిశిష్టవర్ణములో నున్న ఏని యనుదాని మొదటి ఏ అను దానికి సరిపడు వర్ణములైనను, విశిష్ట వర్ణమునకు సరిపడు నవియైనను యతులకు నిత్యయతులను పేరుతోఁ జెల్లుబడి యగుననియు (అట్లు మహాకవులు ప్రయోగించియే యున్నారనియు) ఇతరపదముతో నెప్పుడును (నిత్యముగా) సమసించ నిదియును ప్రత్యయమువలె పరముగానే యుండునదియు ఏవిధముగాను—సమాస పదమగుటచేతగాని నామధాతు ధాతుపల్లవాదు లగుటచేతఁగాని—ఏక పదములోని దనుటకు వీలులేనిదియు అట్లు ఏకపదములోని దని తోఁచుట సైతము లేనిదియు నగునట్టి ఏని యనుపదము యొక్క సంబంధమున

చెల్లుచున్నది గావునఁ (గావలయు) దీనికి నిత్య (పదోభయ) యతి యను నామము చెల్లినదనియు, ఇట్టి ఏని శబ్దము పృథక్ ప్రయోగ యోగ్యము కానిదగుటచే ప్రత్యయము వంటిదే యని తలంచి (అఖండ శ్రుతి లేకున్నను) మహాకవు లఖండ యతి యగునట్లు ప్రయోగించుట చేతను (గావలయు) నిట్టి యతి యావిర్భవించి యుండుననియు (స్వర ప్రధాన యతియే—శ్రావ్యము) సహజము ననియు నెఱుంగునది.

214 — రెండవ పాదమున యతి చోటనున్న (కూర్రకర్ముఁడు— ఏని అనియేర్పడు) ఏ అను దానికి పాదాదిని (మార్గంబు—ఎట్టి అన నగు) ఎ అనునది కూర్పఁబడుటచే నిది ఏని సంబంధ నిత్యోభయ యతితో అచ్చు చెల్లుటకున్ను, 4 వ పాదము యతిచోట (కలిగెన్— ఏని—కలిగెనేని యనునప్పటి) నే అను దానికి (ప్రాణికి) పాదాదిని నె అను నది కూర్పఁబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లగు చున్నవని యెఱుంగునది.

## 7 రాగమ సంధి పదములు

గీ॥ ఆ లనుపదంబు మొదలను రాగమంబు
వచ్చుసంధిని నుభయంబు వడికిఁజెల్లు
నతివ జవరాలు బాలింతరాలు ముద్ద
రాలు ధర్మాత్మురా లన రాక్షసారి 215

మనుచరిత్రమునందు:—

ఉ॥ ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ నొప్పు నీ
కింత భయంబు లే కడుగ నెల్లిద మైతిమె మాట లేటికిన్
(2, 41) 216

చారుదేష్ణ చరిత్రమునందు:—

క॥ ఈలలన వేలుపుంజవ
రాలో యచ్చరయొ కిన్నర వధూమణియో
వ్యాళాంగనయో కాకీ
భూలోకస్త్రీల కిట్టి పొంకము గలదే 217

215 పద్య వివ:—ఆలు అను నచ్చ తెనుఁగుపదము (స్త్రీసామాన్య వాచకమగు ఆలు అనుపదము) నకు రాగమము వచ్చుటకు యోగ్యము లగు సంస్కృతాంధ్రాన్యతర పదములు పూర్వమునఁ జేరినప్పుడు కర్మధారయమున నేర్పడు జవరాలు — జవ్వని — ఆలు — ఇక్కడ ఆలు అను దానికి రకారాగమమున్ను జవ్వని అనుదానికి జవ అను ఆదేశము కలిగి (మరొకవర్ణము మిత్రుఁడువలె పూర్వమున గాని పరమునఁ గాని వచ్చి చేరుట ఆగమము, ఆవర్ణమును ద్రోసిపుచ్చి శత్రువువలె దాని-చోట మరొకవర్ణము వచ్చిచేరుట ఆదేశము, అనఁగా వర్ణాధిక్య మాగమము ఒకదానికి మాఱుగా మరొకటి వచ్చుట ఆదేశము ననుట) జవరాలు అనియయ్యెను. (బాలింత — ఆలు, రాగమముచే) బాలింతరాలు, ముద్ద (ముగ్ధభవము) — ఆలు—రాగమముచే ముద్దరాలు, (ధర్మాత్మ — ఆలు రాగమము వెనుక నుండు అకారమున కుకారము కలిగి) ధర్మాత్మురాలు, (గుణవంత — ఆలు, వెనుకవలెనే రాగమోత్వములచే గుణవంతురాలు మున్నగు పదములలోనుండు రాగమముచే నేర్పడిన రా అనుదానికిఁ గాని ఆలు పదములోని ఆ అనుదానికిఁగాని (అచ్చునకుఁగాని ప్రాణికిఁ గాని) రెంటికిని మైత్రిగల వర్ణములెల్ల (రాగమసంధిలోనే చెల్లునవి గావున) రాగమసంధి వళులను పేరుతో ఉభయ యతులుగా చెల్లుబడి యగుననియు, ఆలుశబ్ద మీయర్థమున విడిగా (ఒకదానితో చేరకుండా) ఉండకపోవుటయు, విగ్రహములో రాగమము రాకుండుటయు శివిష్టే ష్టార్థము సిద్ధింపకపోవుట, జవ — రాలు (లేక) జవర (జవరా) + ఆలు అనిగాని మున్నగురీతి విడకుండుటయు హేతువులై నిత్యసమాసపద

ములే (వాస్తవమున లౌకిక విగ్రహములేనివే) గావున వీనికి యతి చెల్లినదనియు, ఇందేక పదత్వ భానముచే నఖండయతి శ్రావ్యమే (సహజమే) యనియు, శబ్దస్వరూప పర్యాలోచనచేత స్వర ప్రధాన యతియు సిద్ధించెననియు, ఇట్లే యతి ప్రత్యేకత స్పష్టప్రతిపత్తికే కావలయుననియు, ఇంతయెఱుఁగని వారలకు మాత్ర మవసరమనియు, విశేష ప్రయోజనము గానరాకున్నదనియు మాయభిప్రాయ మెఱుంగునది యనియు కొందఱు నవీన విమర్శకులు స్త్రీ సామాన్యవాచియగు ఆలు శబ్దమునకు పృథక్ప్రయోగము విరళమగుటచే బాలింతరాలు మున్నగు వానిలోని రాలు అనుదాని నొక స్త్రీప్రత్యయముగా భావించి అఖండ శ్రుతి లేకున్నను కొందఱఖండ యతి నంగీకరించి ఉందురనియు స్వరప్రధాన యతి సహజమేయనియు అందురనియు గ్రహించునది.

ఈ పద్యములో 2 వ పాదమున యతివద్దనున్న (బాలింత + ఆలు అనునప్పటి) ఆ అనుదానికి పాదాదిని అ అనునది కూర్పబడుటచే నిది (రాగమసంధి వళిలో) అచ్చుచెల్లుటకున్ను, 4వ పాదము మొదట (ముద్ద — ఆలు—ముద్దరాలు అనునప్పటి) రా అనుదానికి యతిచోట రా అని కూర్పబడుటచే నిది హల్లు చెల్లుటకున్ను అప్పకవి కల్పించి చూపి తరువాత మహాకవి ప్రయోగములు చూపుచున్నాఁడు.

216 — 2 వ పాదము యతివద్ద (జవ — ఆలు అనునప్పటి) ఆ అనుదానికి పాదాదిని (ఏక — అంత అనునప్పుడేర్పడు) అ అనునది కూర్పఁబడుటచేత నిది అచ్చుచెల్లుటకున్ను, 217 లో 2 వ పాదము మొదట నున్న జవరాలు అనునప్పటి రా అనుదానికి యతివద్ద ర అని యుండుటచే హల్లు చెల్లుటకున్ను ఉదాహరణము లైనవని యెఱుంగునది.

## 8 విభాగ వళులు

క॥ తులసీభూషణ సంఖ్యకుఁ
దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేటపఱుచు ప
ట్టుల నేసి యనుపదమునకు
నలరు విభాగవడి యనఁగ నచ్చును హల్లున్ 218

వివ:—(ప్రాయికముగా సంఖ్యావాచకములును (సంఖ్యయను నది) పరిచ్ఛేద సాధన వాచకముల కుపలక్షణమై ఇతరములు (ఇంతలేసి అను మొదలగు వానిలో అగు తెనుఁగు పదములలో పరిమాణార్థమును (విభాగముగా — విడవిడిగ నింత పరిమితి కలదియను నర్థము దెలుపుచు ఈవిభాగమున్ను ప్రాయికమే) అనఁగా వారికి రెండు రూపాయలు ఇచ్చితిని అన్నప్పుడు వచ్చు వారికందఱకుఁగలిపి మొత్తము రెండు రూపాయ లిచ్చితినని మాత్రి మర్థమురాక వారికి రెండేసి రూపాయలిచ్చితి నన్నప్పుడు వారందఱిలోను విడివిడిగ నొక్కొక్కనికి రెండురెండు రూపాయలచొప్పున (విభాగముగా) నందఱకు నిచ్చితినని వచ్చునట్లు క్రియావస్తు పరిమాణార్థము (విభాగముగా) వచ్చుటకు ఏసి యను పదము పరముగా చేరుననియు అట్లు విభాగమును తేటపఱుచుచు చేరు (ఏసి యను) పద సంబంధమున చెల్లవలసిన దగుటచే (గావలయు) విభాగ వడియను పేరుతో—పూర్వపదాంత్యాచ్చున్ను ఏసి లోని ఏకారము కూడి యేర్పడు విశిష్ట ప్రాణి వర్ణమునకున్ను (హల్లునకున్ను) ఏసి అని పదచ్ఛేదమున నేర్పడు దాని ఏ అనుదానికిన్ని (అచ్చునకున్ను) రెంటిలో దేనికైనను సరిపడు వర్ణములెల్ల ఉభయ యతులుగా చెల్లు బడియగు ననియు, ఈ ఏసి అనునది ఏని అనునది వలెనే పదస్వరూపము లోను యతులు చెల్లుటలోను నుండుటచే దానికి వలెనే దీనికిని అన్నియు సరియై నిత్య యతులలోనే అంతర్భూతముగాఁ జేర్పవలసినదనియు పైని చెప్పినట్లు అర్థము నిచ్చుటలో మాత్రము భేదముండుటచేఁ గావలయు నీపేరుతో ప్రత్యేకించినాఁడనియు మాకుఁ దోచుచున్నది. మరియు నిట్టి

యర్థములో పదము చేరుటలోను—పూర్వపదములోను మూరేసి, మూరెఁడేసి, మూరంతేసి, మూరెఁడంతేసి, చేరేసి, చేరెఁడేసి, చేరెంతేసి, చేరెఁడంతేసి—మూరెఁడు మూరెఁడు, చేరెఁడు చేరెఁడు, పుట్టెఁడేసి, చేరెఁడు చేరెఁడేసి, పుట్టెడు పుట్టెఁడేసి—మఱియుం బెక్కురీతులుగా వైచిత్రి యున్నదనియు అది వ్యాకరణ విశేషమై అప్రస్తుతమని యెంచి సూచించి మాత్రము ఇక్కడ తెలుపఁబడినదనియు, ఈ ఏసి శబ్ద సంబంధముగల అన్నిటికిని ఇట్లు చెల్లవచ్చుననియు అప్పకవి చెప్పినట్లు సంఖ్యావాచక పూర్వపదములలో మాత్రము పైని చెప్పిన యర్థమున ఏసి యొక్కటి మాత్రమే చేరుచుండు ననియు సంఖ్యావాచకము కానిచోటను గంపెడేసి దోసెఁడేసి, ఇంతలేసిపనులు అనియు నుదాహరించుటచే ప్రాయకముగా సంఖ్యావాచకములు అని వివరింపఁబడ్డదనియు, ఎఁడు, ఏసి రెండును కూడియు మరియు వైచిత్రి గలదనియు సూచించి విడువఁ బడ్డదని వివరింపబడ్డదనియు నెఱుంగునది. మఱియు సంఖ్యా వాచకములలోను ఈవిభాగార్థమున రెండు రెండు, నాలుగు నాలుగు మున్నగు రూపముల తోడను ఉండునని యెఱుంగునది.

కాశీఖండమునందు:—

తే॥ అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి
ఋషులపాలిటివే యింతలేసి పనులు
కౌతుక కాఁబోతుఁ నాఁబోతు గ్రుమ్ములాడ
నడిమి యాఁబెయ్య దెస వచ్చె నాకుఁజూడ (2, 104) 219

కావ్యచింతామణియందు:—

ఆ॥ కృష్ణుఁ డిచ్చె నాలుగేసి చీరలుకూర్మి
నింతులకును నాలుగేసి మణులు
శివితోఁడ దోసెఁ డేసి మాడలు కడు
నిం పెసంగ గంపెఁడేసి సొమ్ము 220

219 పద్య వివ:— 2 వ పాదము యతి యొద్ద నున్న 'ఇంతలు — ఏసి అనునప్పటి' ఏ అనుదానికి పాదము మొదట ఋ అను నది యుండుటచేత నిది ఏసి అనుదాని అచ్చు చెల్లుటకున్ను, 220 లో 1 వ పాదమున యతి వద్దనున్న—నాలుగు — ఏసి—నాలుగేసి అనునప్పటి గే అనుదానికి పాదాదిని కృ అని యుండుటచే హల్లు చెల్లుటకున్ను లేక పాదాదివర్ణమగు కృ అనుదాని ఋకారమునకు నాలుగు + ఏసి అనునప్పటి ఏ అనుదానికి చెల్లుటచే నిది అచ్చు చెల్లుటకైనం గావచ్చు ననియు, 2 వ పాదములో 'నాలుగు + ఏసి అనుదాని) ఏ కారమునకే పాదాదిని ఇం అని యుండుటచే నిదియు అచ్చు చెల్లుటకే యనియు, 3 వ పాదము యతియొద్ద దోసెడేసి అనుదాని డే అనుదానికి పాదాదిని ఠీ అని యుండుటచే నిది హల్లు చెల్లుటకనిన్ని 4 వ పాదము యతి యొద్ద గంపెడు + ఏసి అనుదాని ఏ అనుదానికే పాదాదిని ఇం అని యుండుటచేనిదియును అచ్చు చెల్లుటకే యనియు నెఱుంగునది.

మరియు 219 పద్యములో యింతలేసి అను నక్కడి ఏసి అనునది విభాగార్థమునఁగాక స్వార్థముననే వచ్చినదని యనవచ్చుననియు, ఇట్లు విభాగ భిన్నార్థమునను సంఖ్యాపూర్వకము గాకుండఁగాను ఈ ఏసి ఉండునదియైనను ఉపలక్షణముగాను సామాన్యముగా విభాగార్థమున నుండుటం బట్టిన్ని ఇట్టిచోట్లను ఈయతి విభాగవళి యనియే వ్యవహ రింపఁ బడుననియు, అందుచేతనే అప్పకవి ఈ పద్యమున్ను అట్టి యభిప్రా యముతోడనే ఉదాహరించి యుండుననియు గ్రహించ వలసియున్నది. 220 పద్య వివ:— గిడుగువారి ప్రతిలోను దోసెడేసి, గంపెడేసి అని నిర్బిం దుక ములుగానే ఉన్నవి. అట్లుండుట మాకశాస్త్రీయమని తోఁచినది. తమ స్వంత రచనములో తమ మత ప్రకార మెట్లున్నంజెల్లుఁగాని అప్పకవి రచనాను వాదములో అతని లేఖన మతములకు భిన్నముగా నుండుట వ్యావహార వాదులకేని చెల్లదు గావున ప్రాచీన ప్రతులలోఁగొన్నిటఁ గానవచ్చుటచే వారిప్రతికిన్ని అనాలోచనముగా వచ్చినదా లేకమరొక హేతువు చెప్పుదురా తెలుసుకొనక తప్పదని యెఱుంగునది.

## 9 నా మా ఖ ం డ వి శ్రి మ ము లు

ఆ॥ అప్ప అయ్య అన్న అరు సవ్వ అమ్మకు—
ఆయి యనుపదంబు లతుకుసంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళు లనంగ నూఁదఁబడక యైన 221

వివ:— ఈ పద్యములోని అప్ప మొదలగునవియు వీని రూపాంతరములై (ఊఁదఁబడక—జడ్డలుగా నుండక) అప, అయ అనురీతిగా నుండుటయు పరపదములుగా నుండి విశిష్టపదములుగా కేవల సంజ్ఞా వాచకములై మిక్కిలి యేకపదములువలె భాసించునట్టి వానికి అచ్చున్ను హల్లున్ను ఏదియైనం జెల్లుచుండు ననియు, శబ్దస్వరూప పర్యాలోచనచే అచ్చునకున్ను జెల్లునదియైనను కేవల (సంజ్ఞా) నామ వాచకమై వాస్తవ ప్రయోగార్థ విగ్రహములేని అఖండ పద మగుదాని యతులగుటచేఁ గావలయు నామాఖండ వళియనియే నామములో వ్యవహరింపఁబడుననియు భావము గ్రహించునది. మరియు నిది నిత్య సమాసపద యత్యంతర్భూతమే యైనను వానికన్నను నిగూఢోభయ యతి యనియు మిక్కిలి విస్పష్ట నామవాచక పదసంబంధియు వ్యస్త ముగా నుండు అయ్య మొదలగువాని యర్థమెంతమాత్రమును విశిష్టములో నంతర్భూతముకాక స్ఫురించుటయు లేక కేవలాఖండ యతియే సహజముగా జెల్లతగ్గదియనియు, శబ్దస్వరూప పర్యాచన ప్రయోగములచే స్వరయతియు చెల్లునని తెల్పుటకుఁ గావలయు నీ ప్రత్యేక వ్యవహారము వచ్చినదనియు కొందఱు ప్రాచీన లాక్షణికు లుపలక్షణముగా దీనిని ప్రభునామాఖండవళి ప్రభునామాంతవళి యందు రనియు నెఱుంగునది. మరియు నీపద్యమున గొన్ని ప్రాచీనప్రతులలో నున్నను మిక్కిలి నిర్దుష్టముగా గాలించివ్రైచిన గిడుగువారి ప్రతిలోనికిని ఊఁదఁబడకనైన అని దుర్గ్రాంతముగానే వచ్చుటకుఁ గారణ మడుగక మేము విడిచినను విమర్శకులెవ్వరేని అట్లు రానేల విడువనేల అని యడుగక మానరని భీతి పొడముచున్నది.

అప్ప యనుటకు నందితిమ్మన చాటుధార:—

క॥ ఇప్పటి దాతల సరిగాఁ
జెప్పకురా భట్టకర్ణశిబిఖేచరులన్
జెప్పుము మూర్తిఘనుని వెం
కప్పకు దానమున నిర్భయంబున సభలన్ 222

హుళిక్కి భాస్కరుని చాటుధార:—

క॥ అప్పా లిడునతఁడు ఘనుఁడా
అప్పా డొసఁగి మరలఁ జెందు నాతఁడు రాజా
చెప్పఁగ వలె సాహిణిమా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్ 223

అన్న యనుటకు పొట్టూరి గోపన్న చాటుధార:—

క॥ అన్నలుఁడు రూపమున సిరి
యన్న కళాయుక్తి భరతునన్న కరుణచే
నన్న సముద్రపు పెదచి
న్నన్న కుమారుండు వెంగళామాత్యుఁ డిలన్ 224

తెనాలి రామలింగము:—

క॥ చిన్నన్న ద్విపద కెఱుఁగును
బన్నగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వమ్ము పద్యగద్యశ్రేణిన్ 225

తేలఁబలుకుటకు విక్రమార్క చరిత్రమునందు:—

చ॥ అనఘుఁడు సింగనార్యునకు నబ్బయ గోపయ మంత్రి చిక్కనా
రనయును గల్గి రాత్మజులు రాములు ముప్వురుఁ దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసంగుఁడు లింగనయుం గ్రమంబుగన్ 226

అయ్య యనుటకు:—

... ... ... ... ... ... ... ... ... ...

కాశీఖండములో:—

సీ॥ గీ॥ నైషధాది మహాప్రబంధములు పెక్కు
సెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ
యిపుడు సెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేర (1, 13) 227

ఊఁదఁబడక[1] యున్నందునకు అనంతుని ఛందమునందు:—

తే॥ ఒరుల నమ్మయ్య యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగు ప్రభునామాంత విరమణంబు
మహి నయోధ్యకు రాజు రామయ యనంగ
అతని పట్టంపుదేవి సీతమ యనంగ 228

రుక్మాంగద చరిత్రమునందు:—

ద్వి॥ శ్రీకరగుణసాంద్ర చిరయశోరుంద్ర
ఆకారచంద్ర రామయభాస్కరేంద్ర 229

అరుసు అనుటకు ఆంధ్రకవితాపితామహుఁడు:—

క॥ చేపట్టిన ధ్రువు లగుదురు
కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోడువఁ జాలని
యాపందలు సాల్వకోన మరుసున కెనయే 230

పలకలూరిగోపన:—

ఆ॥ గోలకొండమలక గోవుల భక్షించుఁ
గొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షించుచున్నాఁడు
మలక మేలొ బాచమరుసు మేలొ 231

అవ్వ అనుటకు:—

... ... ... ... ... ... ... ... ...

1 ఉన్నందులకు, అన్నందులకు (పా)

అమ్మయనుటకు ఈవని పెద్దిరాజు రామరాజు చాటుధార:—

క॥ ఇమ్మహిలో మహనీయగు
ణమ్ముల నీసాటి గలరె నానావిధ దే
శమ్ముల శ్రీరాముని సీ
తమ్మామాయమ్మ నిత్యహర్షము లిమ్మా 232

క॥ ఇమ్మా మదభీష్టమ్ములు
కొమ్మా మామ్రొక్కు లెల్ల గురుమతితో మా
యమ్మా రఘునందను సీ
తమ్మా సౌభాగ్యసిద్ధి దాయిని వమ్మా 233

అక్క యనుటకుఁ జాటుధార:—

క॥ ఇక్కలియుగశక్తులలో
లెక్కింపకు భట్టశంక లేక ధరిత్రిన్
మిక్కిలి మల్లేశునియం
బక్కకు సరివేల్పు కలదె యవనీస్థలిలోన్ 234

క॥ చొక్కపు శ్రీగిరినిలయుని
మక్కువ మదిలో నెఱింగి మనుజులఁ బ్రోవన్
దిక్కై నిలిచినమాయం
బక్కకు సరిగలదె సకల భాగ్యస్ఫురణన్ 235

ఆయి యనుటకు రాచపూడి వెంకటయ్య చాటుధార:—

క॥ వ్యాయామ జనితమాయో
పాయసమస్తాఘములు నివారణ మగు దు
ష్కాయంబు పూత మగు గం
గాయినిఁ బొడగన్నఁ దాన మాడిన మాత్రిన్ 236

వణుకూరిగుర్వారాజు శమంతకమణి చరిత్రమునందు:—

ఉ॥ కాయవచో మనస్థలన కల్పితదోషము లెల్లఁ బాయఁగా
నాయెదలోన నిత్యము సనాతన ధర్మముఁ బూని యర్మిలిన్

బాయక క్షోల్లు రామనరపాల నిరంతర సౌఖ్యదాయి సీ
తాయి సమస్త శోభన విధాయి మహాఫల సిద్ధిదాయిఁగన్ 237

అప్పయనుటకు—

వివ:— చాటుధార యనఁగా—గ్రంథస్థముకాక విడిగా—ప్రీతి గూర్చుటకు ఆనందముతో రచించు స్తుతిరూప కవితా పద్యముగా అవయ వార్థమువల్ల తోఁచునుగాని అదిరూఢమై లోపముచే చెప్పఁబడు తిట్టు మున్నగువాని దెల్పు విడి పద్యములకున్ను జెల్లునది యని యెఱుంగునది.

పై లక్షణ పద్యములో నెత్తిన అప్ప యను పదముచే పైని వివరించి నట్లేర్పడు విశిష్టపదములో చెల్లవలసిన నామాఖండ విశ్రాం తులలో అచ్చు చెల్లుటకు నంది తిమ్మన చాటుధార పద్య ముదాహరణ ముగా చూపుచున్నాఁడు. ఇట్లే ముందును తాత్పర్యార్థము గ్రహించునది. 222— ఇందు 4 వ పాదము మొదట నున్న (వెంక — అప్ప అను నప్పటి) అ అనుదానికి యతివద్ద యం అని యుండుటచే నిది అచ్చు చెల్లుటకున్ను, 223—ఇందు 4 వ పాదము మొదటనున్న (మార — అప్ప మారప్ప అని యేర్పడినదాని) ర అనుదానికి యతివద్ద రా అని యుండుటచే నిది హల్లు చెల్లుటకున్ను ఉదాహరణములైనవి.

(మొదటిపద్యములో ఖేచర — జీమూత వాహనుఁడను గంధ ర్వుఁడు; ఈ 223 లో గిడుగువారి ప్రతిలోఁగూడ 'చెప్పగవలె' అని నిర్బంధుకముగానున్నది.

అన్న యనుటకు—పైని చెప్పినట్లే తాత్పర్యము. 224—ఇందున్ను 4 వ పాదము మొదటనున్న (చిన్న — అన్న అను నప్పటి) అ అనుదానికి యతియొద్ద (వెంగళ — అమాత్యుఁడు అనునప్పటి) అ అనునది యుండు టచే నిది పై విధముగా నేర్పడు అన్న అను నుత్తర పదముతోఁగూడిన దానిలో అచ్చు చెల్లుటకున్ను; 225—ఇందున్ను పై విధముగానే సింగన్న అనుదాని గ అనుదానికి (గద్య) గ అని యుండుటచే నిది హల్లు చెల్లు

టకున్ను ఉదాహరణము లైనవి. తేలఁ బలుకుటకు పై లక్షణ పద్యము లో చెప్పినట్లు అన్న అనునది అన అనువిధముగా జడ్డ లేనిదియై ఉత్తర పదముగా చేరి యేర్పడిన (విశిష్ట) నామ పదమున హల్లు చెల్లుటకు ఉదాహరణము చూపఁబడు చున్నది యనుట.

226—ఇందు రెండవ పాదమునను నాల్గవ పాదమునను పైని చెప్పి నట్లే (క్రమముగా) నారన అను దాని ర అనుదానికి రా అనునదియు, కేసన అనుదాని స అను దానికి సం అనియు నుండుటచే నిది తేలఁ బల్కునప్పుడు హల్లు చెల్లుటకే ఉదాహరణ ద్వయముగా నయ్యెనని యు అచ్చు చెల్లుటకు నుదాహరణ మూహించుకో వచ్చుననియు గ్రహించునది.

అయ్య యనుటకు వెనుక వలెనే దీని తాత్పర్య మెఱుంగ వచ్చును.

227— ఇందు 4 వ పాదము యతివద్ద (వీరభద్ర — అయ్య అను నప్పటి) అ అనుదానికి పాదాదిని అం అనునది యుండుటచే నిది అయ్య అను నుత్తర పద నామాఖండ యతులలో అచ్చు చెల్లుట కుదాహ రణ మైనది; హల్లున కిట్లె మెఱుంగునది. ఇందు గిడుగువారి ప్రతిలో 'అపుడు సెప్ప ... యీ ప్రబంధ' అని కలదు. అది అచ్చు పొరపాటని యేని అనక తీరదు.

ఊఁదఁబడక యున్నందుకు—

అయ్య, అమ్మ అనుదానిలో జడ్డ లేకుండ అయ అని, అమ అని తేలఁబల్కినప్పుడు పై విధముగా చెల్లుట కుదాహరణములని భావము.

228— ఇందు 3, 4 పాదముల యతుల చోట (క్రమముగా) రామయ, సీతమ—సీత — అమ— అనునప్పటి మ, అ అను హల్లునకును, అచ్చునకును, పాదాదుల మ, అ అనునవి యుండుట చేత నివి అయ అమ అను నుత్తర ఖండములతో కూడిన వానిలో చెల్లవలసిన హల్లున కును అచ్చునకును క్రమముగా నుదాహరణములై నవి. మరియు అప్పకవి లక్షణ పద్య నిర్ణయమునకును ఈ పద్యము ప్రమాణమైనది.

(అనంతుఁడు దీనిని ప్రభు నామాంత విరమణమని ఉప లక్షణ గాఁ జెప్పినాఁడు.)

229— చిర యశో రుంద్ర (స్థిర మగు కీర్తి చే సాంద్రమైన వాఁడ- సాంద్ర స్థిర కీర్తి గలవాడా) ఇందు 2 వ పాదము యతియొద్ద (రామయ —రామ + అయ అను నప్పటి) అయ శబ్దము మొదటి అ అను దానికి పాదాదిని ఆ అని యుండుటచే పై విధముగా అయ అనుదాని అచ్చు చెల్లుటకు కుదాహరణమైనది. ఇట్లే అమ యను దాని హల్లునకును ఊహించుకొనునది.

అరుసు అనుటకు పై విధముగానే తాత్పర్యము.

230— ఇందు 4 వ పాదము యతి వద్ద (కోనమ + అరుసు, అన నేర్పడు) అ అను దానికి పాదాదిని ఆ అని యుండుటచే పై విధము గా అరుసు అనుదానితో నేర్పడిన సంజ్ఞాపదములో అచ్చు చెల్లుట కుదాహరణమైనది. 231—ఇందు పై విధముగానే అరుసు శబ్దాంత సంజ్ఞా వాచకపదములో మ అను దానికి మ అనునది యుండుటచే నిది హల్లు చెల్లుట కుదాహరణ మైనది.

అమ్మ యను దానితోఁడి సంజ్ఞావాచకములో అచ్చునకును హల్లునకును ఉదాహరణములు చూపఁ బడుచున్నవి.

232- 233— వీనిలో (వరుసగా 4 వ పాదముల మొదల (సీత+ అమ్మ— సీతమ్మా అను నప్పటి) అ, త అను వానికి యతులవద్ద హా, దా అని యుండుటచే ఈ రెండుపాదములు అమ్మయను దానితో గూడిన దాని అచ్చునకును హల్లునకును ఉదాహరణలైనవి.

అక్క యనుటకు— 234-235— వీనిలోను (క్రమముగా) 4వ పాదాదుల యందలి అక్క యను దానితోఁ గూడిన సంజ్ఞా వాచకము లోని (అంబ — అక్క—అంబక్క అను నప్పటి) అ, బ అనువానికి (క్రమముగా) యతుల వద్ద (య) అ అనియు, భా అనియు నుండుటచే నివి రెండును క్రమముగా అక్క యను దానితో నున్న సంజ్ఞలో అచ్చున్ను హల్లున్ను

చెల్లుట కుదాహరణములైనవి. ఆయి యనుటకు వెనుక వలెనే ఆయి శబ్దోత్తర పద సంజ్ఞలోని అచ్చునకును హల్లునకును ఉదాహరణములనుట.

236-237— వీనిలో 4 వ పాదముల మొదటి (గంగ + అయి— శీతాయి అనునప్పటి) ఆ తా అనువానికి యతులవద్ద ఆ, థా అనునవి యుండుటచేత నివి ఆయి శబ్దాంత్య సంజ్ఞలో అచ్చున్ను హల్లున్ను చెల్లుటకు (వరుసగా) నుదాహరణములైనవి. ఈ 237 లో మేము చూచిన ప్రతులన్నిటకు 'మహాఫల' అనియే యున్నను గిడుగువారి ప్రతిలో మహాత్ఫల అని ఉండి క్రింది (రిమార్కు) సాధుత్వాసాధుత్వ నిర్ణయములో 'మహాఫలసిద్ధి' అని యుండవలెను, లేకున్న 'మహాతాం ఫలసిద్ధిః' అని షష్ఠీసమాసము చేసికొనియైనఁ దృప్తిఁజెందనగును' అని కూడా ఉన్నది. మాపాఠ ప్రకారము ఈ ప్రతి యారోపించిన దోష సమాధానముల కవకాశము లేదు గాని మరియొకరీతి దోషసమాధాన ములు అన్నిప్రతులను మాకు గోచరించినవి. మహతీ వాచకమగు సీతాయి అనుదాని విశేషణములెల్ల స్త్రీలింగరూపములుగా 'సీతమ్మా సౌభాగ్యసిద్ధి దాయినివమ్మా' అను నట్లుండవలసి యుండఁగా 'సరంతర సౌఖ్యదాయి, సమస్త శోభన విధాయి మహాఫలసిద్ధిదాయి' అని విపరీతముగా నుండవచ్చునా, 'దృష్టభక్తి, దృఢభక్తి (లేక) సుభ్రూ, తతఃకృతీ' అనువాని సుభ్రు మొదలగు వానియందువలె, 'సామాన్యే నపుంసకమ్' అను వ్యాకరణ మహాభాష్యాను శాసనము-న్వోప్పున నుండవచ్చును (ఈ యనుశాసన తాత్పర్యబోధకు జెప్పవలసిన విషయ మెక్కువగా నున్నది గాని అది యిక్కడ విడువఁబడినది) అని ఈ దోష సమాధానములు గిడుగువారి ప్రతిలోనుండకుండుటకు హేతు వున్నదికాబోలు.

10 పంచమీవిభక్తి విరామము

ఆ॥ అత్సమంబుఁ జేయుతఁటని బంచమి కన్న
నంటె నను విభక్తు లదుకుసంధి

మెలఁగుఁ గృతులఁ బంచమీవిభక్తి విరామ
మనఁగ నచ్చునకును హల్లునకును

వివ:— (శాస్త్రప్రకారము సంస్కృత ప్రాకృత పదములకు తెనుఁగు విభక్తి ప్రత్యయములు మున్నగునవి చేయుట తత్సమము జేయుట) తెనుఁగులోనికి వచ్చుట కర్హమగునట్లు సంస్కృత పదమును తత్సమ రూపముగా మార్చునప్పుడు పంచమీవిభక్తి ప్రత్యయముల లోని అన్నన్, అంటెన్ అనురీతి ప్రత్యయములు (ప్రకృతితో) మేళగించు (సంధించు) నప్పుడేర్పడు అన్న, అంటె అనువాని మొదటి అకారమున కేని మేళగించిన పిమ్మటఁ గానవచ్చు అంటె, అన్న అనువాని మొదటి అకారముతోఁగూడి యేర్పడు విశిష్ట ప్రాణివర్ణమున కేని (క అనుదాని కేని) మైత్రిఁ గల వర్ణములెల్ల పంచమీ విభక్తి విరామ మను అన్వర్థక నామముతోఁ జెల్లుబడియగును.

ఇట విమర్శనీయము మిక్కిలి గానవచ్చుచున్నది. కొందఱు నవీనులు నన్నయభట్టారకుఁడు మున్నగు లాక్షణికులు తెనుగు పంచమీ విభక్తి ప్రత్యయములు కంటెన్, కన్నన్ అనియే చెప్పియుండఁగా నిక్కడ నప్పకవి అంటెన్, అన్నన్ అను నాకారములుగా జెప్పుటయు అట్లైనను 'హైహాయి కన్నన్' మున్నగు కకారయుక్త రూపములే యుదాహరించుటయు చాలాప్రమాదమని చెప్పుచున్నారు. పైపైకిది యిట్లేయని తోఁచునుగాని మిక్కిలి పరికించినచో నిట శాస్త్రీయమగు సమర్థనమే మాకుఁ దోఁచుచున్నది. చింతామణి మున్నగువానిలో విస్పష్టముగా నల్పజ్ఞులకు సైతము తెలియునట్లు విధింపఁబడిన కన్నన్, కంటెన్ అనునవి అన్నన్, అంటెన్ అను నాకారముగానే విధింపఁబడి నట్లనుకొను నంతటి అజ్ఞుఁడైనాఁ డప్పకవి యని మాకుఁ దోఁచుటలేదు. ఇఁక అప్పకవి మహాకవి ప్రయోగములే క్లిష్టమార్గ మవలంబించి యైనను సమర్థింపక తప్పదను నభిప్రాయము కలవాఁడనియు చమత్కార రామాయణ ప్రయోగము సాధించుటకు కేవలము కన్నన్ అను

రూపమే అఖండముగానే ప్రత్యయమని గ్రహించినప్పుడా అవకాశము కలుగదని యెంచి విశిష్టరూప నిష్పత్తి ప్రదర్శనమునకు ప్రక్రియ ఎట్లు కల్పించుకొన్నను (అవి అసత్యములేయై) విశిష్టమే సత్యమైనది కావునను (అవాంతరములు కల్పితములే కావునను) పైనిచెప్పిన ప్రయోజనాపేక్షతో ప్రకృతమున ప్రత్యయ కల్పనము అంబెన్, అన్నన్ అను విధముగాఁ జేసినను (కంబెన్, కన్నన్ అనురీతి కల్పనయందు సైతము న్యాగమాద్యవాంతరములు విధించుకొనునట్లే కకారాగమమున్ను కల్పించి విశిష్టరూపములు (రాముని కంబెన్, రాముని కన్నన్) సిద్ధింపఁ జేయుటలో ప్రతిబంధములేదు గనుక అట్లేర్పఱిచినచో (ప్రత్యయములలోని అచ్చులకెల్ల స్వరప్రధానయతి చెల్లకున్నను) వనమందు, వనమునందు, రెండేసి మున్నగునవి పదంబులందు సైతము కొన్నిటఁ జెల్లుచుండుటచే మహాకవి ప్రయోగానుసారముగా నిచ్చటను స్వర ప్రధానయతియుం జెల్లి మహాకవి ప్రయోగసాధుత్వము సిద్ధించునని (అట్లే) అంబెన్, అన్నన్ అనియే ప్రత్యయ కల్పనముజేసి యిట్లేర్పడిన పదములలో అచ్చునకును హల్లునకును ప్రత్యేకోభయయతిని జెప్పి నట్లూహించుకోవచ్చును. మఱియు పంచమీవిభక్తి ప్రత్యయములు కంబెన్, కన్నన్ అనునట్లేయైనను వానిలోని (పొల్లు) కకారము విడిచి సూత్రకల్పమగు పై పద్యములో అంబెన్, అన్నన్ అని చెప్పినాఁడనియు, అట్లు చెప్పుట మహాకవి ప్రయోగాను సారముగా కంబెన్, కన్నన్ అను వానిలోని కకారమునకు వికల్పముగా న విద్య మాన వద్భావము (ఉన్నను లేనట్లయగుట అవిద్య మాన వద్భావమనఁబడును) వచ్చునని తెల్పుటకనియు అప్పుడుభయ యతులు పై విధముగా సిద్ధించుననియు, ఇట్టి యవిద్య మానవద్భావము సూత్రనిర్దేశము చేతనే (సూత్రమున నిపతించుట చేతనే) కొన్నియెడల సంస్కృతవ్యాకరణ మందును గల దనియు, అట్లే అప్పకవియును అవలంబించినాఁడనియు నిది యపూర్వము విరుద్ధము దుష్టము కాదనియు గ్రహించవచ్చును.

మఱియు నిట్టే కై (కయి) అను చతుర్థీవిభక్తి విషయ మందును జెప్పవలసి యున్నదనియు దీని స్వరప్రధానయతికి ప్రయోగ ములు పెక్కులున్నవి కాని అందు కొన్నియిటఁ జూపఁబడుచున్నవి.

ఉ 'నీ, కై యిదె యస్మదద్భుత కళాతిశయంబు'– హరివం.177 పేజీ

క॥ 'ఏమిటికి, కై వచ్చెదరో మహాద్భుతాకారధరుల్'- ,, 20 పేజీ

క॥ 'నాకుఁబరిచర్యసేయుట, కై కొండొక ప్రాయమున

నిజాత్మజనిమ్మి'- ,, 142 పేజీ

క॥ 'ఆతని, కై వేదంబులు విధించె నఖిలక్రియలన్'- ,, 81 పేజీ

గీ॥ నాకునభిమ, తాధ్వరంబులు మత్ప్రీతికై యొనర్చు'- ,, 181 పేజీ

'ఆత్మ...........వృత్తికై'– భార. అర. 6 వ ఆ. 186

అట్లు (కై అనుదానికిని చెప్పవలసియున్నను) చతుర్థ్యర్థము (అగు ధాతుక్త్వార్థకరూపమగు) అయి అనుదానికి షష్ఠ్యంత పూర్వ పదముయొక్క సమావేశముచేత(రామునకున్ + అయి లేక రామునికిన్ + అయి-రామునకయి, రామునికయి, రామునకై రామునికై అనువిధముగా) సిద్ధించుటచేతను ఈ చతుర్థ్యర్థమునందే రామునికినై, నాకునయి, వానికినై వానికినయి మున్నగు షష్ఠ్యంతములై స్పష్టముగాఁ గానవచ్చు రూపములు పెక్కులుండుటచేతను పైని మేము చూపినవియు, మరియు నట్టివన్నియు పైని చెప్పినట్లు అయి అను నవ్యయపద సందర్భముచే సిద్ధించినవై స్వరప్రధానయతి కర్హములగుటచేతను చంద్రికాపరిణయము మున్నగు వానిలోని'కలయమరంద దంభమునకై', 'గ్రంధసాకల్యంబుం బొసరింతొ లేదాయని నీకై కొంకు' మున్నగునవి కై యను చతుర్థీవిభక్తి ప్రత్యయ భావన కలవై ప్రాణియతికి (కై, కయి అనువాని కై క అను వానియతికి) అర్హము లగుటచేతను, ఇట్లుభయ యతులు సిద్ధించుట చేతను పైవిధముగా క్లిష్టప్రక్రియాకల్పన మనవసరమై కై అను చతుర్థ్యంతమందిట్టి ప్రత్యేకయత్యావిర్భావము కలుగలేదు.

మరియు రాముడతఁడు, దైత్యారి, జనార్దన, నారాయణ, నాస్తి అన్యోన్య, రెండేసి, రెండవ, వనమునందు, విశ్వామిత్ర, హైహయుకన్న మున్నగు పదములందలి యతివైఖరి బరిశీలింప స్వరప్రధానయతి బహుళముగా—వ్యస్తములు గాగాని సమస్తములుగాగాని రెండుపదముల కూడికలో (సంధిలో) అజాద్యుత్తరపదమేర్పడు (రాముఁడతఁడు, దైత్యారి, జనార్దన మున్నగు) వానియందున్ను క్వాచిత్కముగా (స్వల్పముగా) పదద్వయము లేకున్నను పదచ్ఛేదము కాకున్నను ప్రత్యయాదిచ్ఛేదముచే అజాదియగు ఆ పదము (వనమునందు, రెండేసి, రెండవ మున్నగు వానియందువలె) ఏర్పడునప్పుడున్ను (వనమునందు, రెండేసి వాని స్వరప్రధానయతికి లక్ష్యములు సుస్పష్టములు నుక్తములును, రెండవ అను దాని స్వరయతికి 'నితం బావృతి యరసి రెండవ చెఱంగు' మున్నగునవి లక్ష్యములు) మిక్కిలి క్వాచిత్కముగా (స్వల్పతరముగా) అజాద్యుత్తర పదచ్ఛేదమునకుఁగాని అజాద్యుత్తర ప్రత్యయ (అపద) చ్ఛేదమునకుగాని వీలులేని కొన్ని (విశ్వామిత్ర, హైయుకన్న మున్నగు) సహజముగా హల్లుతో శ్లిష్టమై (ప్రాణిమై) యున్నచోట్లను (అనగా ఆ ప్రాణివర్ణము పైనున్న అచ్చునకున్ను) ప్రయోగానుసారముగా చెల్లుబడి కావలసియున్నట్లు తోఁచుచున్నది.

పై పద్యములో గిడుగువారి ప్రతిలో మాత్రము 'పంచమికన్న నంబెనను విభక్తులడుకు సంధి' అనికలదు. ఈపాఠ మందర్థ సౌకర్యము లేకుండుటయు వారిపీఠికకే విరుద్ధమగుటయు కారణములై ఇతరములగు నూహలకుఁబోక మామనస్సు అచ్చు ప్రమాదము మీఁదికిఁ బోయినదనియు నెఱుంగునది.

మఱియును గొందఱు నవీన విమర్శకులు కన్నన్, కంబెన్ అనునవి ప్రత్యయములే యైనను వానికిన్ — అన్నన్, వానికిన్ — అంబెన్ అనువాని సంధివలన వానికంబెన్, వానికన్నన్ అను విధముగాఁ బుట్టినవని శబ్దతత్వవేత్తలందురు గావున నచ్చట శబ్దస్వరూప పర్యాలోచన

చేత స్వరప్రధానయతి యర్హ్యమగుననియు, అట్టి సంధి గూఢమగుట చేత నది యఖండముగానే స్ఫురించుచుండుటచేత వాని వ్యంజనాక్షర యతి శ్రావ్యమనియు, కయి అను చతుర్థీవిభక్తి గూడ నిట్టిదే యైనను దాని సంధి యింతకన్నను బ్రసిద్ధమగుటచేతను, వానికై మున్నగు వానికి బదులుగా వానినినై మున్నగు రూపము లుండుట చేతను అది యఖండ శబ్దమను తలంపు లోకమునకుఁ గలుగలేదనియు, అందుచేతనే కై అను చోట తఱచుగా స్వరప్రధానయతియే ప్రయోగములలో నగపడు చున్నదనియు, పైనిచూపినట్లు క్వాచిత్కముగానున్నను అవి కానరాక అప్పకవి కై యనుచోట నఖండయతి నంగీకరించలేదనియుఁ దోఁచు చున్నదనియు; అప్పకవి లక్షణములోఁ జెప్పిన కంటెన్ అనుదానికి స్వర ప్రధానయతినిఁ జూపియుండలేదనియు, ఈ పంచమీ విభక్తి యతిలో ప్రధానముగాఁ జూపవలసినది స్వరప్రధానయతియే యనియు, అందును కంటె అనుదానిలో నుత్తర భాగమగు అంటె అను పదము సుశబ్దమనుట కష్టమనియు, అంటె—అంటిని — ఎ అనురీతి నెట్లో సాధింప వచ్చుననియు, ఇట్టియెడ ప్రయోగము లభించువఱకు స్వరప్రధానయతి చెల్లునాయని సందేహింపవలసి యున్నదనియు విమర్శించుచున్నారు. అదియట్టిదేయనఁ జెల్లినను అందు, అంటె అనుదానిని, అంటిని — ఎ అనురీతి సాధింపఁ జూచుటకంటె అంటివి అనుదాని రూపాంతరమగు అంటి — ఎ అనురీతి సాధింపఁజూచుట యుక్తమనియు, మొత్తమే సాధింపులోను ద్రుతాంత మగుట కవకాశములేక మిక్కిలి క్లేశసాధ్యమనియు మాకుఁదోఁచుచున్నది.

చమత్కార రామాయణమునందు:—

క॥ నిన్నుఁ జెఱ గొన్న హైహయు
కన్నన్ దోర్వీర్య మెక్కు డగుభార్గవు లీ
ల న్నిర్జించిన రాముని
కన్నను శూరుండు ముజ్జగంబునఁ గలఁడే 239

ఆదిపర్వమునందు:—

చ॥ వితతమఖ ప్రయోగవిధివిత్తము లుత్తమదీయుతుల్ జగ
న్నుతసుమహాతపోధను లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్ కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్
(6, 227) 240

239 పద్య వివ:— రెండు నాలుగు పాదములలో (క్రమముగా) హైహయుల్, అన్నన్ అనఁగా నేర్పడుచున్న అ అనుదానికి (ఎక్కుడు + అగు అన్నప్పుడేర్పడు) అ అనునది యుండుటచేత అన్నన్ అను పంచమీవిభక్తి యతులలో నిది అచ్చు చెల్లుటకున్ను (రాముని కన్నన్ అన్నప్పుడేర్పడుచున్న కన్నన్ అనుదాని) క అను దానికి యతివద్ద గం అనియుండుటచే నిది హల్లుచెల్లుటకున్ను—

240 — 4వ పాదములో యతివద్ద (యాజకోత్తములకంటె అన్నప్పటి) క అనుదానికి పాదాదిని (క్ర) క అనునది కూర్పఁబడుటచే నిది కంటె అను దాని హల్లుచెల్లుటకున్ను ఉదాహరణము లయ్యెననియు అంటె అనుదాని స్వరప్రధానయతికి అప్పకవి లక్ష్యము చూపకుండుటచే అది మిక్కిలి క్వాచిత్కమై నట్లూహింపవలసియున్నట్లు తోఁచుచున్న దనియు నెఱుఁగునది.

ఈ పంచమీ విభక్తియతిలో హల్లుచెల్లుట అందఱికిష్టము; మిక్కిలి సప్రమాణము నై యున్నది. స్వరప్రధానయతి యుక్తముగా తోఁచదు. అనేక ప్రాచీనపాఠములను తన మతప్రకారము అఖండయతి మున్నగునవి లేకుండా మార్చి వ్రాసిన అప్పకవి ఈయొక్క అప్రసిద్ధ చమత్కార రామాయణ ప్రయోగ మొక్కటి మాత్రము మార్చలేక పోవుట ఆశ్చర్యమనియు, 'హైహయు, కన్నన్ మిక్కుటపుశక్తిగల భార్గవు' అని మార్చుటయుక్త మనియు కావున నది మాకంత విశ్వాసార్హము కాదనియు, ఒకవేళ అది యొప్పుకొన్నను కంటె అను

దానికి స్వరయతి చూపకయే దానికిని ఈకల్పితకల్పనతో నీయతి చెప్పుట ప్రౌఢవాదమే యనియు, మొత్తముమీఁద నీ పంచమీవిభక్త్యుభయతి (అనగా దాని స్వరప్రధానయతి) సారములేక త్రోసివేయవలసినదే యనియు కొందఱ మతమైయున్నది.

11 కాకుస్వరవళులు

క॥ పలుకులతలఁ గలవ్రాలకు
వల నగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్
వళులుగఁ జెప్పినఁ గావ్యం
బుల నది కాకుస్వరంబుఁ బ్లుతవళియు నగున్ 241

ఆ॥ ఏకమాత్రహ్రస్వ మినుమడించిన దీర్ఘ
మయ్యె మూఁడుమాత్రలైనఁ బ్లుతము
భీతి శోక తర్కగీతదూరాహ్వాన
సంశయార్థములను జరుగుఁ బ్లుతము 242

241 – 242 వివ:– అ, ఇ, ఉ, మున్నగు విధమైనవర్ణ ముచ్చరించు నప్పటికాలము ఒకమాత్ర పరిమితిగలది, దానికి హ్రస్వ వర్ణమనిపేరు; అనఁగా హ్రస్వవర్ణోచ్చారణ కాలము నొకమాత్రాకాల మందురనుట, దీర్ఘవర్ణోచ్చారణమునకు రెండుమాత్రలు పట్టును; అనఁగా రెండుమాత్రలు కలుగ నుచ్చరించినచో నది దీర్ఘవర్ణమనఁ బడును. మూఁడుమాత్రల కాలముగలుగునట్లు (అంతకన్న నెక్కువకాలముగా నైనను) ఉచ్చరించినచో నది ప్లుతమగును. ప్లుత మగునట్లుచ్చరించుటకు మూఁడుమాత్రల కాలముపట్టును. ఇట్టి హ్రస్వ దీర్ఘములు పదములలో సహజముగాను కొన్నియెడల శాస్త్రవిధానమువల్లను సిద్ధించుచుండును గాని – ప్లుతముమాత్రము శాస్త్రవిధానము వల్లనే (వికల్పముగా) సిద్ధించుచుండును. అట్టి విధానము తెనుఁగులో నెట్టిదనఁగా – భయ మును తెలియఁజేయునప్పుడును శోకమును (దుఃఖమును), తర్కమును (ఊహ – ఆలోచించుట) గీతము (సంగీతము – గానము సేయుట)

దూరాహ్వానము (దూరమందున్న వానిని పిలుచుట — ఎదుటలేనివానిని ఎదుటికిఁ దెప్పించుకొనుట) సంశయము (ఇట్లా లేక అట్లా అనునట్లు నిర్ణయము లేకపోవుట — సందేహము) మున్నగు (ప్రార్థన మరియుం గొన్నిప్రయోగములం గానఁబడునవి) అర్థముల యందు ఇచ్ఛాను సారముగా ప్లుతమువచ్చును. పైనిజెప్పిన యర్థములు తెలియఁజేయు నప్పుడు వీలునుబట్టి పదము చివరనుండు అచ్చుపైని ప్లుతము నిలుప వచ్చును (గానములో నైనను దీర్ఘప్లుతములుండును) అవి లయాను సారములు; అట్టి హ్రస్వము నైనను దీర్ఘము నైనను ప్లుతముగా నుచ్చ రింపవచ్చును. ఇట్టిప్లుతము (తెనుఁగుప్లుతము) వాక్యములలో నెక్కడి పదములకైనను (మొదటి పదము చివరగాని నడిమి చివర పదముల చివరగాని ఉండువర్ణములందెల్ల) నుండవచ్చును. అట్లే ఛందోబద్ధము లందును ఉండవచ్చును. మఱియు ఛందోబద్ధములందే విశేష ప్రయో జనము కలిగియుండును. సంస్కృత ప్లుతము లోకములో సాధారణముగా దూరాహ్వానమునందు— (బహుళముగా) నుండుననియు, తెనుఁగులో నుండు ఇతరార్థప్లుతముండదనియు అదియును కేవల వాక్యములలో (గద్యకవిత్వములో) చివర టి సంజ్ఞగలవర్ణమున నుండ వచ్చుననియు ఛందోబద్ధములలో నేదియుం గానరాదు (మృగ్యము) అనియు నెఱుంగునది. అట్టి మాటల చివరనుండు వర్ణములకు (అనఁగా తెనుఁ గులో సహజముగా పదము చివర నుండునదియు లేక ఆవర్ణముతో ఏకాజ్ప్రమగు అ, ఇ, ఉ, ఎ, ఒ అనువానిలో నొకటిగాని కూడి యేర్పడునదియు నగు వర్ణమునకు — అట్టి అచ్చుపైని) ఇచ్ఛాను సారముగా ప్లుతము కూర్చునప్పుడు ఆచివర వర్ణము పై నుండు అచ్చు నకున్ను ఆచివరవర్ణమును విడఁదీయు నప్పుడేర్పడు చివర అచ్చునకున్ను మైత్రిగల వర్ణములుగాని అట్టి అచ్చు పూర్వహల్లుతోఁగూడ నెట్టిప్రాణి వర్ణమేర్పడునో అట్టి విశిష్ట (ప్రాణి) వర్ణమునకుఁ గాని మైత్రిగల వర్ణములెల్లఁ 'ఉభయ యతులుగాఁ' జెల్లుచుండుననియు నట్టి ఉభయ

యతులకు కాకు స్వరవళులనియు (పైని జెప్పిన ప్రకారము కాకుస్వరము లకు ప్లుతము విధింపఁబడుటచేత నా ప్లుత ... కాకు స్వరము ప్లుత స్వరము నందురు గావున) ప్లుతవళులనియు నన్వర్థక నామమనియుఁ దాత్పర్య మెఱుంగునది.

242 — 'భీతి' అనుచోట గిడుగువారి ప్రతిలో 'భీత' అని కలదు. అది ముద్రాపణ ప్రమాదమగును. క్రింద భీతి ప్లుతము అనియే యున్నది.

భీతి ప్లుతమునకు భాస్కరుని రామాయణమునందు:—

ఉ॥ ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జుం
డో జనులార యడ్డపడరో సురలార సురారి కంచు నం
భోజదళాక్షి శైల వన భూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనో యేమి సేయుదున్
(యు. 41,) 243

మనుచరిత్రమునందు:—

ఉ॥ ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోఁట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ దోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁ గదవే తెరు వేది శుభంబు నీకగున్ 244

శోకప్లుతమునకు రామాయణమునందు:—

శా॥ అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై పల్కితిన్
నన్నా పాపము వచ్చి ముట్టుకొనియె న్నాపాలి దైవంబ వై
యున్నీచుం బరిమార్ప [1] వేగ పఱతేవే నన్ను రక్షింపు మీ
యన్నం గ్రక్కునఁ జేరవే యరుగవే యత్యుగ్ర శీఘ్రంబునన్
(అర. 2, 111) 245

---

1 ఇందు వేగఁబఱతేవే (పా) అది యన్యత్ర చర్చించి నిర్ణయింపఁ బడును. చూ. శ. ర. వేగ.

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు :—

శా॥ ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేటరారో మద
క్రూరాభీలమృగావళిం దునుమరో ఘోరాటవుల్ లేవో నా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారిన్ఖ్రించి నావేమిరా
(2, 147) 246

శాంతిపర్వమునందు:—

మ॥ అను మానింపక తోఁడఁబుట్టులనె కాదా తున్మి తూటాడె నెం
దును గ్రొన్నెత్తురు లేఱులై పఱవ నింద్రుం డుగ్రతన్ దైత్యులన్
మును లవ్వీరు భజింపరో క్రతువు లామోదంబుతో నమ్మహా
త్మునిఁ జేయింపరొ యూర్ధ్వలోక మది కాదో నాక మూహింపుమా
(1, 287) 247

రంగనాథ రామాయణమునందు:—

ద్వి॥ అట్టి నామీఁద నీవా /యలిగెదవు
పట్టి చెట్టలువాపి పాఱవైచెదను 248

ఆను శాసనికపర్వమునందు:—

ఉ॥ ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురావళికిఁ బూజ యొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా ననలుఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదు పుత్రిఁ గృప యేర్పడ దానముగాఁగ నావుడున్
(1, 53) 249

దూరాహ్వాన ప్లుతము:—

గీ॥ ఆది తేయార్చితాంఘ్రిపద్మా యనంగ
ద్వారకా పురీమధ్యసద్మా యనంగ
అసురకులవైరివీరులారా యనంగ
రసికచిత్తాబ్జవాసులారా యనంగ 250

కళాపూర్ణోదయమునందు:—

మ॥ అకటా యే మని దూరుదాన నిను నాథా వేగు జామయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త ర మ్మనుట గానీ యొంటి యేమోకదా
నికటక్షోణికిఁ జేర ర మ్మనుట గానీ కొంత నెయ్యంపు చూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయుఁ గానీ లే దొకింతేనియొక్కా (4, 212) 251

సంశయప్లుతము:—

గీ॥ హరి యనంగ నాతఁడా నిన్నుఁ గను న
డంచెఁ గృష్ణుఁ డీతఁడా యశోద
కెంత భాగ్య మబ్బెనే బోటి నాబోటి
నెలఁత కట్లు కలుగునే తలంప 252

రామాభ్యుదయము నందు:—

సుగంధి॥ అంగనాలలామఁ గానవా లతాకుడుంగమా
తంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా లవంగమాతులుంగమాధవీనట
ద్భృంగమా వనీరమా శరీరమా సమీరమా (5, 239) 253

విజయసేనమునందు:—

ఉ॥ వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచిత స్థితికి న్ననుఁ బాపఁ జూచినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నే మనువా రెఱింగిరే
నుల్లమ యిట్లునీకుఁ దగునో తగదో పరికించి చూడుమా 254

రామాయణమునందు:—

క॥ జనకజకు సుమిత్రానం
దనులకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనముల నుండఁగ రఘుపతి
యను జన్ములఁ జూచి సేమమా జనపతికిన్ (అర. 258) 255

243 పద్య వివః- ఇందు 2 వ పాదము యతివద్ద (అడ్డుపడరు+ఓ అనఁగా నేర్పడు ఓ అనుదానికి (ప్లుతస్వరమునకు) మైత్రిగలదిపాదాదిని భార్య జుండు+ఓ అనఁగానవచ్చు) ఓ అనునది కూర్పఁబడుటచే నిదిప్లుతో భయ యతులలో అచ్చు చెల్లుటకున్ను, 244—ఇందు 4వ పాదయతివద్ద (చెప్పఁగదవు — ఏ అనగావచ్చు) ఏ అనుదానికి పాదాదిని (ఇంకన్ — ఎ వ్విధి అనఁగాననగు) ఎం అనునది కూర్పఁబడుటచే నిదియు అచ్చు చెల్లు టకేయని యెఱుంగునది. (ఈ రెండు పద్యములలోను సరియైన భీతిప్లుత మని మాకుఁ దోచినదికాదు. ఇట్టి నాకిట్టిబాధ దైవికమై వచ్చినది నన్ను రక్షింపుడు—నాకు దారిజూపుము అని ప్రార్థనార్థమునకే ఝఁడితి స్ఫూర్తియై ప్రార్థన ప్లుత మగుచున్నది, లేక భీతిప్రార్థనప్లుతమేని యగు ననుకొన్నాము. 245—ఇందు 3వ పాదము యతిచోట (పఱతేవు — ఏ అనసేర్పడు) ఏ అనుదానికి పాదాదిని (యి) ఇ అనునది యుండుటచే నిదియు అచ్చునకే యని యెఱుంగునది. ఇక్కడను మొత్తమువిూద శోకమనవచ్చునుగాని సానుశయ ప్రార్థనము లేక సానుశయాను నయము మిక్కిలి స్ఫురించి ఇట్టి ప్లుతమగునని మాకుఁదోచెను. మఱియు నిందు వేగపఱతేవే, నన్ను రక్షింప విూయన్నం గ్రక్కున జీరవే అని యనుకొన్నప్పు డెంతయు సరళముగానుండి కవినిబద్ధ మట్టిదే యగునని మాకు దోచినదికాని అట్లు సవరింపలేక పోతిమి. మఱియు నిట వేగపఱ తేవే అనుచోట వేగఁబఱతేవే అని ద్రుతకార్యము గిడుగువారి ప్రతి నిం గానఁబడుచున్నది; అది శ. ర. కు విరుద్ధము చూ. వేగ. శ. ర. అది చర్చనీయాంశమై అన్యత్ర నిర్ణయింపఁబడెను.

246—ఇందు 1 వ పాదము యతియొద్ద (లేరు — ఓ అనునప్పటి) ఓ అనుదానికి పాదాదిని ఓ అని యుండుటచే నిదియును అచ్చు చెల్లుటకే అయినది. ఇందును సరియైన తర్కము మాకు తెలియక సవికల్పకోద్ధము మాకు పొడకట్టుచున్నది. 247—ఇందు 4 వ పాదము యతిచోట (కాదు — ఓ అన్నప్పటి ఓకారమునకు చెల్లక కాదో అను

నప్పటి) దో అను విశిష్ట (ప్రాణి) వర్ణమునకే చెల్లునట్లు పాదాదిని (త్మ్మ) తు అనునది యుండుటచేత నిది (విశిష్టప్రాణి) హల్లునకు చెల్లుట కగుచున్నది. ఇందు 1 వ పాదము యతివద్ద (కాదు — ఆ అనునప్పటి) ఆ అనుదానికిం జెల్ల పాదాదిని అ అని యుండుటచే అచ్చునకున్ను ఉదాహరణమైనది. 248—ఇందు 1 వ పాదము యతివద్ద (నీవు — ఆ అనునప్పటి) ఆ అనుదానికి పాదాదిని అ అని యుండుట చేత ఇదియు అచ్చు చెల్లుటకే అయినది. (చెట్టలువాపి — చేతులూడఁ గొట్టి — భుజములునఱికి) ఇదియు మాకు క్రోధప్లుత మగుచున్నది. 249—ఇందు 4 వ పాదము మొదట ఈవు — ఏ అనునప్పటి ఏ అను దానికి యతివద్ద (యే) ఏ అని యుండుటచేత నిదియు అచ్చునకే అయినది (ఇక్కడను ప్రార్థనప్లుతమగు ననుకొంటిమి.) 250—ఇందు 1, 3 పాదముల యతులవద్ద (క్రమముగా) ద్మా అనుదానిపైని రా అను దానిపైని సహజముగా నంటియున్న అ అనుదానికే. లేక ఆ అను దీర్ఘమునకే ప్లుతము నిలిచి అట్టి ప్లుతస్వరమునకే (అచ్చునకే) మైత్రి చెల్లునట్లు పాదాదుల ఆ, అ అనునవి ఉండుటచేత నివి అచ్చు చెల్లుట కగును. 2, 4 పాదముల యతులచోట (ద్మా) దా, రా అను ప్లుతవిశిష్ట ప్రాణివర్ణములకే పాదాదుల (క్రమముగా (ద్వా) దా, ర అను ప్రాణులే యుండుటచే నివి సహజముగా నున్న అచ్చుపై నిలిచిన ప్లుతవర్ణమున హల్లుచెల్లుట కగుచున్నవనియు, ఇవి కలుగ అప్పకవి ఈపద్యము రచించినాఁడనియు నెఱుంగునది. ఇదియును సరియైన దూరాహ్వానప్లుతమనుకొనము; స్తుతి సంబోధన ప్లుతమని తోఁచినది. గీ॥ 'రమ్మ రమ్మోయి నీవు వేగమ్మ యిట్టు, లరుగుచున్నది గోపకృష్ణా యనంగ, ఎచటనుంటివి వేగ రమ్మిటకు, నీదు జనని పిల్చుచు నుండె కృష్ణా యనంగ' అను నట్లున్న గ్రహించుకొనుట సరిపడును అని తోఁచినది. 251— ఇందు 1 వ పాదము యతివద్ద నాథా అనుదాని పూర్వవిధమగు ఆ అనుదానికి పాదాదిని అ అనునిది యుండుటచే నిది

పై రీతిగా అచ్చుచెల్లుటకున్ను, 2, 3, 4 పాదముల యతులవద్ద (క్రమముగా) నీ అనువానికే (ప్రాణులకే) పాదాదుల (క్రమముగా)ంది, ని, ని అను ప్రాణులే యుండుటచేత నివియెల్ల పై విధముగా హల్లుచెల్లుటకున్ను ఉదాహరణములైనవి. ఇందు బొత్తిగా మాకు దూరాహ్వాన ప్లుతముకాక 1 వ పాదమున జాలిని తెల్పు అనునయ ప్లుతముగాను తక్కిన చోట్ల వికల్పతర్క ప్లుతముగాను అగుచున్నది. పై వానిలో స్వరము విఱుగకున్నను విధానముచే (ప్రయోగములచే) అచ్చునకును చెల్లినది; హల్లునకు శ్రావ్యమే (సహజమే) అనియు నెఱుంగునది. 252—ఇందు 1, 3 పాదముల యతులచోట (క్రమమున) ఆతడు+ఆ అనఁ గాననగునదియు, అబ్బెను — ఏ అనఁ గాననగునదియు నగు ఆ, ఏ అనువానికి పాదాదుల (క్రమమున) హ (యశోదకున్ — ఎంత అనునప్పటి) ఎం అనునవి యుండుటచే నివి అచ్చునకున్ను, 2, 4 పాదముల యతులవద్ద డా, నే అను విశిష్టవర్ణములకే పాదాదులయందు డ, నె అనునవి యుండుటచే నివి హల్లు చెల్లుటకున్ను అగుచున్నవి. ఇదియును సరియైన సంశయప్లుతముకాక స్మృతి తర్క (లేక సందేహ నిర్ణయ) ప్లుతములో రెండవచోట సంతోషాశ్చర్యప్లుతములో 3 వ చోట మెప్పువింతలను, తెల్పునది యనియు, 4 వ చోట మనోరథ (లేక జాత్సుక్య) తర్క (కామ ప్రవేదన) ప్లుతములో అనియు అగుచున్నవి. 253 — ఇందు 1 వ పాదము యతివద్ద (కానవు — ఆ అనునప్పటి) ఆ అనుదానికి పాదాదిని అ అనునది ఉండుటచే నిదియు అచ్చుచెల్లుటకగుచున్నది. ఇక్కడను ప్రార్థనపూర్వ ప్రశ్న ప్లుతమగుచున్నది కాని మాకు సరియగు సంశయప్లుతము కాకున్నది. 254—ఇందు 4వ పాదము యతిచోట (తగును — ఓ అననేర్పడు) ఓ అనుదానికే పాదాదిని (ఎఱింగిరేన్ + ఉల్లమ అననేర్పడు) ఉ అనునది యుండుటచేత నిదియు అచ్చునకే యగుచున్నది. 255-ఇందు 4వపాదము యతులవద్ద(సేమము+ ఆ అనునప్పటి) ఆ అనునదియు, (య) అ అనియు యుండుటచేనిదియును

అచ్చునకే అయినది. ఇందును క్షేమప్రశ్న (కుశలప్రశ్న) మనియు పైదానిలో వికల్పతర్క ప్లుతమగుననియు మాకుఁదోఁచును.) మొత్త మీా అప్పకవి ప్లుతనిర్ణయమునకు మేమేకీభవింప నేరకుంటిమి—విజ్ఞులరయఁ బ్రార్థితులు — ఇట్లనుట ఈ విషయముయొక్క గొప్పపరిగణనీయమని మాయభిప్రాయమున్ను కాదుగాని తోఁచినది తెల్పుకొనుట మాత్ర మగునని గ్రహించునది.

మఱియు అ, ఇ, ఉ, ఎ, ఒ అనువానిలో కూడిక (మేళనము) కలిగినప్పుడు పైనిచెప్పిన ప్లుత విధానము (అప్పకవి యభిప్రాయము చొప్పునను) వికల్పమగుటచేత ప్లుతము నిలువ నప్పుడును మహాకవి ప్రయోగాను సారముగా ఏకాక్షర యతి యని యొక యతి వేఱుగా (ప్రాచీన సంప్రదాయ పరంపర ననుసరించియు) సామాన్యాఖండయతి నంగీకరించని వారికిని నంగీకరించక తప్పదు గావున నప్పుడు దూరాహ్వాన ప్లుతయతికాక తక్కిన ప్లుతయతులు గతార్థములే కావున (నిర్గళితార్థాను వాదములై) విశేష ప్రయోజనము లేనివే యనవచ్చును. సామాన్యా ఖండయతి నంగీకరించువారికి విశ్వామిత్ర శబ్దయతి పంచమీా విభక్తి యతి దూరాహ్వాన ప్లుతయతి తప్ప తక్కిన ఉభయ యతులెల్ల నట్టివే యనియుం దోఁచుచున్నది.

ఇక్కడ ప్లుత మనఁగా దీర్ఘము మీాఁది ప్లుతమని భావమనియు, అట్లుగానిచో రామ మున్నగుచోట్ల ప్లుతమునకు సహితమీా యతి చెల్ల వలసి వచ్చుననియు, అట్లుచెల్లుట అప్రశస్తమనియు (అప్రశస్త మెందు చేతనో — అకటా......నాథా, అను కళాపూర్ణోదయ ప్రయోగ మెట్టిదో నాథా అనునది రామా అను నట్టిది కాదా, ఇందేకదా అప్పకవి ఇదిచూపినాఁడు. మఱియుం బెక్కులు మహాకవుల విట్టివి కలవు కావున

నిది విరుద్ధము. గ్రంథకర్త కాకు స్వరయతుల నభిన్నముగాఁ జెప్పుట సరికాదనియు, కాకు స్వరములకుఁగూడ నుభయయతి ప్రయోగము సుప్రసిద్ధమై యున్నదనియు (సంప్రదాయ సుప్రసిద్ధి యున్నను ప్లుతము నిలువని కాకు స్వరములకు ప్రయోగ సుప్రసిద్ధి గానరాదు; అవి స్వల్పములో, స్వల్ప తరములో యన్నమాట ప్లుతము నిలుచుటయు కలిపి చెప్పుటయు అప్పకవి మతమున విరుద్ధమేల చూ — లక్షణ పద్య వివరణము) అట్టి స్వరములకుఁ బ్లుతత్వము సంపాదించుట దుర్ఘటము (దుర్ఘటము కాదని మావివరణము తెలుపును.) మఱియు గ్రంథకర్త చూపిన యుదాహరణముల రీతిని బట్టి చూచినను అట్టి హ్రస్వముల నుభయ యతి చెల్లదనియే యీతఁడు తలంచినట్లు తోఁచుచున్నది. (తామైన అట్టివి చూపిరా, అవిస్వల్పతరములని చెప్పక విడిచెనేమో) ఇంతేగాక గ్రంథకర్త యుదాహరించిన దూరాహ్వాన స్వరమునకుఁ దప్పఁ దక్కిన భీతిశోకాది స్థలములందలి స్వరములఁ బ్లుతత్వమెట్లు సిద్ధించుచున్నదో తెలియకున్నది (అప్పకవి చెప్పిన లక్షణ పద్యము తామున్ను (ఆతని నిట్లె మఱియొకచో నాక్షేపించియున్నవారనుట) సరిగా నర్థముచేసుకొనక ఇది సంస్కృత ప్లుతమే యని పడిన భ్రాంతియే యిట్లు తెలియకుండఁ జేసివైచినది అనియు కాఁగా దూరాహ్వానము నందలి స్వరము లకుఁ బ్లుతయతి యనియు, నాస్వరము దీర్ఘమై యుండవలెననియు (ఈయనుశాసనము చెల్లదని పైనే నాథా అను దానిచే ఖండింపఁబడ్డది) తక్కిన భీత్యాది స్వరము హ్రస్వదీర్ఘ సామాన్యమై యుండవచ్చుననియు, మఱియు ప్లుతయతిలో నచ్చు విఱుగదు గావున నచ్చట అచ్చునకు చెల్లుట విశేషమనియు, కాకు స్వరములలో సంశయాదులలో స్వరము స్పష్టముగా విఱుగును గావున (భీత్యాదుల విఱుగదా, తమమతమున నీ సంగ్రహమేల నచటి హల్లుతో యతి వింతయనియు, దీని నఖండయతి యనుటయే మంచి దనియు చెప్పఁగదవే, పరతేవే, లేదో, కాదా మున్నగుచోట్ల ఏకారాదులు

ప్రత్యేక విహితములనియు (అప్పకవి మతమున నట్లు కాదనవచ్చును, హ్రస్వములుమాత్ర మట్టివనుట), ఇట్టిచోట్ల అచ్చునకు యతిచెల్లుట వింతకాదనియు, హల్లుల కుదాహరణములు చూపవలెను (చూపియే యున్నాడు కాని పరికించవలయును) అనియుఁ గొందఱు నవీన విమర్శకులు తెల్పియున్నారు. ఈమతమునెల్ల నించుమించుగా నంతను మావివరణము ఖండించియే యున్నది. (255 లో గిడుగువారి ప్రతిలో 'దర్భాసనమున' అనియు 'అనుజన్మునిజూచి' అనియుఁగలవు. గీటుక్రింద రాజునకున్ అని పా. కలదు.)

12 ప్లు త యు గ వి శ్రా మ ము లు

క॥ తా మేవర్ణము లైనను
వ్యోమమండలమునను బ్రాణ మైత్రి గలిగినన్
దామోదర ప్లుత యుగ వి
శ్రామము లనఁగాఁ బ్లుతాక్షర ద్వయ మమరున్ 256

వజ్రపంజర శతకమునందు:—

ఉ॥ శ్రీ గజగామినీమణిని సీతనుగా నిరపాయిఁగాఁ దిలో
కీ గృహమేధిఁగా గరుడ కేతనుఁగా భవ రోగ వైద్యుఁగా
నా గురువాన నిన్న మది నమ్మితి వేఱొక వేల్పుఁ గొల్వ నీ
వే గతి కావవే రఘుపతీ శరణాగత వజ్ర పంజరా 257

256 పద్య వివ:— ప్లుతము నిలిచిన (ప్లుతముతోఁ గూడిన విశిష్ట (ప్రాణి) వర్ణములు పాదాదిని యతినియత స్థలమందును (రెండు చోట్లను ప్లుత వర్ణమైనప్పుడు) ఉన్నప్పుడు వాని (పొల్లు) హల్లులు మైత్రిలేని వైనను పైనున్న అచ్చులకు మైత్రి కుదిరినచో యతికిఁ జెల్లును. రెండు చోట్లను ప్లుతములుండి చెల్లుటచే నిది ప్లుత యుగ విశ్రామ మనఁబడినది. ఒకచోట ప్లుతమున్నప్పుడే ఉభయయతి చెల్లఁగా రెండు చోట్లను ప్లుతము లున్నప్పుడు వేఱుగా జెప్పనేల (హల్లుల మైత్రి కుదర నప్పుడున్న) హల్లులకుఁ జెల్లునేసి అది అట్లు

చెప్పనగును కనుక అట్లుచెప్పెను అని తోఁచును గాని పరికింపగా అప్పుడున్ను ప్లుతాచ్చులకు చెల్లెననగ వచ్చును కనుక ఇది ప్లుత యతికన్న భిన్న మెంతమాత్రము కానిదై నిష్ప్రయోజన మగుచున్నది. ఇది స్పష్ట ప్రతిపత్తికిన్ని ఎక్కువ సాయపడక మఱియు మూఁడు నాలుగు చోట్ల యతులవద్ద ప్లుతాక్షరము లుండవచ్చును గాన ప్లుతాక్షర త్రియము, ప్లుతాక్షర చతుష్టయము మున్నగు రీతి నెందుకు చెప్పలేదు అని శంకకు మాత్ర ముపయోగించు చున్నదనియు, దానికి సమాధాన ముండదనియు తోఁచుచున్నది. 257—ఇందు 4 వ పాదమున రెండు చోట్లను (నీవు — ఏ, నీవే, తీ—అనియు ప్లుతాక్షరములై హల్లులు మైత్రి లేని వైనను చెల్లినవి గావున లక్షణ సమన్వయము, ఇట్టి చోట్లను హల్లులకు మైత్రి కుదరనప్పుడు హల్లులకున్ను (ప్రాణులకున్ను) చెల్లుట సిద్ధమేయనియు అప్పుడు హల్లునకు జెల్లెనో అచ్చునకుఁ జెల్లెనో చెప్పుటకే వీలు లేదనియు, ఇది యిట్లు చెప్పుట పునరుక్తి గానే యున్నదనియు నెఱుంగునది. మఱియు దీని నిట్లుభయ యతులలో చెప్పుటచేత హల్లునకును (హల్లుల మైత్రిలేనప్పుడున్ను) మైత్రి చెల్లు నట్లు తోఁచి ఇదియు నొక యఖండ యతియై మైత్రి కుదురని హల్లు లకున్ను (విపరీతముగా) అఖండయతి ఉండుటను లుపునది యగును. నిజముగా నిట్టిచోట్లను హల్లులకున్ను చెల్లు శక్తి (మైత్రి) సహజముగా నుండవలెను; అప్పుడే హల్లులకున్ను చెల్లుట యుక్తమగును. అప్పుడఖండ భానముచే హల్లులకున్ను జెల్లు చుండును. అచ్చులు విఱుగుట (లేక) ప్లుతస్వర ముండుట (వినఁబడుట) హేతువులై అచ్చులకును చెల్లు చుండును కనుక నిట్లు మైత్రిలేని హల్లులకు చెల్లు నట్లు చెప్పుట విపరీతము. ఇక్కడ అచ్చులకే చెల్లుచున్నదనుట సమంజసము నిర్బాధము — పై లక్ష్యములో రఘుపతీ యనుచోట తి+ఈ అని విరుగదుగదా, హల్లులకున్ను చెల్లునట్లు చెప్పనియెడల ఇక్కడ చెల్లుట యెట్లు అనినచో అచ్చు విఱుగకున్నను దానిపై నిలిచిన ప్లుతమే

దానిని (అచ్చునకు చెల్లుటను సమర్థించును గదా రెండు చోట్లను అచ్చు విఱుగని ప్లుతమున్నను అట్లేకదా, ఇఁక హల్లులకును చెల్లునట్లు విపరీతోభయయతి యేల చెప్పవలెను. ఇంతియె కాక దీనివలన ప్లుతము లేనప్పుడున్ను ఏకాజూ్ప్రప పద మేళనలో నుభయయతిలోను సామాన్యాఖండయతిలోను ఇట్టి హల్లుల మైత్రిలేని అఖండ యతియు నేల చెల్లగూడదు అను నవకాశము కలిగి యతినియమమే భ్రం మగునేమో యని భీతియు మాకు పొడముచున్నది.

ఈ పండ్రెండును నుభయవళి భేదంబులు.

అప్పకవి సామాన్యాఖండయతి కిష్టము లేనివాఁడటగుచేత అది యంగీకరించిన వారి కక్కఱ లేని ఉభయయతులు (విశ్వామిత్ర శబ్ద యతి, పంచమీ విభక్తి యతి, ప్లుతయతులలో అచ్చు విఱుగని వాని ప్లుతయతి అను మూఁడున్ను కాక తక్కిన తొమ్మిది యతులు) అధిక ముగా అంగీకరించవలసిన వాఁడయ్యెను.

ఇక్కడ మిక్కిలి పరికింపఁగా ఆంధ్రమునందలి యతుల ప్రవృత్తి గమనించి చూడ అఖండయతి నంగీకరించ నప్పుడున్ను ఉపదేశ కాల మందు ఎట్లు పుట్టినను చివర కేర్పడిన నిష్కృష్ట వర్ణమునకే యతులు మహాకవుల గ్రంథములలో కన్పట్టు చుండెను; (అదియెట్లనఁగా) రం ఓ వాచ్ మున్నగు వాని యందుపదేశకాలమున ఓ, చ్ అను మున్నగు రూప ములతో నున్నను (వాని కేయతియు ప్రాసయు చెల్లక) అవి తుదకు రాగ (వాక్య, వాక్) వాక అను మొదలగు రీతి మాఱినప్పటి గ, క మున్నగు వానికే అవి చెల్లుచున్నవి. అట్లే హరి — అనుభవః—హర్యను భవః, గంగా + ఉదకమ్—గంగోదకమ్ అను మొదలగు వానిలోను సమాసోపదేశ కాలమందలి (రి) ఇ, (గా) ఆ అనునట్టి వానికి చెల్లక సంధివలన చివరకు సిద్ధించిన వాని (ర్య) అ (గో, ఓ అనునట్టి వానికే యతులు చెల్లుచున్నవి గదా, అందుచేత పై విధముగానే (అఖండయతి ఒప్పిన వారికిన్ని) అప్పుడు ప్రత్యక్షముగా కానవచ్చు (రాముడతడు,

గంగోదకము మున్నగు వాని) డ, గో మున్నగు వానికి (చివరకు సిద్ధించి కానవచ్చు వానికే) యతులు చెల్లుట ఉచితము, శాస్త్రీయము యుక్తి యుక్తము నగుచున్నది కావున అఖండయతియే ఎల్లెడ శాస్త్రీయము ఉచితము యుక్తియుక్తము నై మిక్కిలి గ్రాహ్య మగుచున్నది. ఇఁక ఖండయతి 'స్వరప్రధానయతి' యన్ననో (అప్పుడు దృశ్యములగు వానిది కాక) పద చ్ఛేదమున నేర్పడు వానిదై (గంగా+ ఓఘ—గంగౌఘ మున్నగు చోట్ల ఖండింపగా నేర్పడు ఆ, ఓ అను రెంటికిని చెల్లునదియు, కొన్ని చోట్ల (రమా+ఈశ—రమేశ అను నట్టి విధముగా నున్న చోట్ల) ఒక్కదానికే (ఈకే) చెల్లునదియు, మనస్ — ఈషా మున్నగు చోట్ల పూర్వ పదాంత్య వర్ణమునకు చెల్లక ఈ అనునట్టి దానికే చెల్లునదియు, మఱియు పా+అక, నై + అక మున్నగుచోట్ల దేనికిన్ని చెల్లక యుండునదియుగా (పావక, నాయక అనునట్టి వాని యఖండయతియే చెల్లునదియనుట) వివిధ భేదములు గలదై యుక్తి న్యాయములు లేనిదై కేవల ప్రయోగైక శరణ్యమై (దాని ననుస రించిన శాస్త్ర విధాన మాత్రమున) చెల్లునదియై యుండుటచేత నఖండయతియే సిద్ధము, ఖండయతియే సాధ్యము నని స్పష్టముగా తేలు చున్నది; కావుననే మహాకవుల గ్రంధములలో నెల్లెడలఁ బ్రయుక్తము లైనవి; దానంజేసియే ప్రాచీన లాక్షణికులును 'కొందఱు' చెల్లు నట్లే చెప్పిరి; లక్ష్యములున్ను చూపిరి (అంగీకరించిరి). అయినప్పటికిన్ని 'లోకోభిన్నరుచిః' కనుక అప్పకవి అంగీకరించని వాఁడై (అచ్చుపడుట వ్రాయుట మున్నగు వానివల్లను ఇట్టివారే మార్చుటవల్లను పోయినవి పోఁగా మిగిలి కానవచ్చు వానిని ప్రక్షిప్తములుగా త్రోసి వైచి అక్కడికిన్ని వలనుగాని వానికి ఇట్లుభయయతులు కల్పించి యంగీకరించ వలసిన వాఁడై యతులసంఖ్యావృద్ధికి కారకుడై పెద్ద గొడవ పెంచి నాఁడు అనక తీరకున్నది.

ఇంకం బ్రాస యతు లెట్టివనిన:—

పాస యతులు

గీ॥ గీతముల సీసములను సంగీతములను
విరతి విడనాడి యొక్కొక్క చరణమునను
రెంటికిని బ్రాస వర్ణంబు నంటఁబలుకఁ
బ్రాసవిశ్రాంతు లండ్రు కబ్బముల వాని 258

ఆ॥ దేవకీ కుమార గోవర్ధనోద్ధార
తోయజాక్ష పాండవేయ పక్ష
ఘన వినీల గాత్ర ముని జన స్తుతి పాత్ర
యదు కులాబ్ధి సోమ కదన భీమ 259

వ:— ప్రాసయతి స్వరూపోదాహరణములు చెప్పఁబడుచున్నవి.

258 — ఆటవెలఁది, గీతము, సీసములలోను సంగీతము తరంగములు కీర్తనలు కృతులు మున్నగు పదకవిత్వములో నెల్లెడలను గోను యతి (కొన్ని పాదములలో గాని అన్ని పాదములను లేక ఒక పాదములోగాని) విడిచి (యతి కూర్పక దానికి బదులుగా ప్రాస వర్ణమే రెండు చోట్లను (మొదటను—విశ్రమించవలసిన చోటను) ప్రాస వెల్లునట్లు కూర్చినచో అనఁగా పాదముయొక్క లేక పాదభాగముల యొక్క రెండవ వర్ణమున్ను యతి యుండవలసిన చోట నుండు రెండవ వర్ణమున్ను ప్రాసమైత్రి కుదురునట్లు గూర్చినచో నది ప్రాస యతి యను నామముతోఁ జెల్లును. ఇఁక వేఱుగా యతి మైత్రి పైని తెల్పిన పద్యములలో నక్కరలేదు; రెండును ఉన్నచో అలంకార మగును. తక్కిన కందము, ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము శార్దూలము మున్నగువానిలో నిట్లు చెల్లదు. వానిలో నాల్గు పాదముల లోను సరిగా ప్రాస చెల్లవలయును; యతియు నుండవలయును. నాలుగు పాదములలోను ప్రాసములుండుటయు, యతులవద్ద యతు లున్ను ఉండవలయును గాని ఆయతులకుఁ బదులుగ వీనిలో (గీతాదు

లలోవలె) ప్రాసయతులు (మధ్యవళ్లు) కూర్చఁగూడదు. ద్విపదలోను అట్లు కూర్చరాదు గాని కొందఱు మధ్యవళ్లు గూర్చినారు. (యతులకు బదులుగాఁ గాక అధికముగా నుండవచ్చును.) ఈ ప్రాసయతి అన్ని పాదములలోను ఉండ నక్కరలేదు. ఇచ్ఛానుసారము ప్రాసయతులును యతులు మిశ్రితము (కొన్ని పాదములలో యతులు కొన్నిట ప్రాసయతులు) గాఁ గాని అన్నియు యతులైనను అన్నియు ప్రాసయతులైనను గీతాదులలో చెల్లును. ఈప్రాసయతుల ప్రాసమైత్రి ఏపాదమున కాపాదమునకు ఏభాగమునకాభాగమునకు విడిగా సరిపోయినం జాలును; కందాదులలో వలె నొక్కే ప్రాస మైత్రి యక్కరలేదు.

259—1, 2, 3, 4 పాదము లన్నిటను యతులు కూర్పక దేవ... గోవ, తోయ.......వేయ (ఇవి రెండును దీర్ఘాక్షర పూర్వక ప్రాస యతులు) ఘన..........ముని, యదు.... ...కద (ఇవి రెండును హ్రస్వ (లఘు) వర్ణ పూర్వకములు) అని ప్రాసయతులే కూర్పఁబడి చెల్లినవి ఇందు నాల్గు పాదములను ప్రాసయతులే ఉన్నను అదియే నియము కాదని పైని తెల్పఁబడినది.

అగ్రాహ్య విరామంబులు

ఆ॥ వికట కవులు కొన్ని వింతలు గల్పించి
కవిజనాశ్రయమునఁ గలిపివారు
వానిఁ గైకొనంగ వల దప్రయుక్తంబు
లేల సెప్ప భీముఁ డెఱిఁగి యెఱిఁగి 260

వి. అవి యెవ్వి యనిన. 261

క॥ వెలయఁ గకారాదులు భూ
తలమున నైదైదు వళులు దామగు ననుచున్
లలనా మదనుఁడు రేచన
నలినభవ నిభుండు గుణవతంసుఁడు చెప్పెన్ 262

వ. ఈ పద్యములోఁ జెప్పిన యయిదు వర్గముల యందును మొదలి వర్ణములు నాల్గింటికిని వర్గవళ్లు గనుకఁ జెల్లుబడి యగును. అవి యన్నియు దాపలఁ బూర్ణబిందువు లేకుండిన ననునాసికములకుం జెల్లవు. ఆబిందువు లున్నట్లాయెనా బిందు యతులు గనుక నవియుఁ జెల్లును. ఈ భేదము చెప్పనందుచేత నీపద్య మగ్రాహ్యము. 263

వివ:— అగ్రాహ్య వళులు గ్రహించుటకు వలనుపడని యతులు తెల్పుచున్నాడు.

260— కుకవులు కొందఱు తమ యిష్టానుసారముగా ఎందును ప్రయోగముల నుండనివియు, పరిశుద్ధ లాక్షణికుల కాశ్చర్యము కలిగించు నవియు, అందుచేత గ్రాహ్యము కానివియు నగు దుష్ట యతులు తమంత దామ కల్పించి అవి ప్రమాణములుగా నెల్లరకుం దోఁచునను కోర్కెతో నవి చెల్లునట్లు కవిజనాశ్రయములోఁ జొనిపినారు (ఛందోబద్ధముఁ జేసి అందిమిడించినారు. ఏ మహాకవులును ప్రయోగించని అట్టి దోషయుక్తములు చెల్లునట్లు, అన్నియు మిక్కిలి యెఱిగిన వేములవాడ భీమకవి యెట్లు చెప్పును; అట్లు చెప్పుట యసంభవము గనుక అవి (అందు దోషయుక్తములు) గ్రహింపఁ గూడదు.
261— అవి యెట్టివో తెల్పఁబడుచున్నవి.

262—అయిదు వర్గు లందును ఏవర్గులోనివి ఆవర్గులోని వానికి అయిదేసిన్ని యతులకుఁ జెల్లును. క ఖ గ ఘ ఙ అను నైదున్ను పరస్పరము (ఒకదానికొకటి) యతులకుఁ బనికివచ్చును. ఇట్లే తక్కిన వర్గులలోనుం జెల్లు నని గ్రహించునది. ఈ విషయమునకు 2,4 పాదములుదాహరణములుగా నున్నవి. 2 వ పా. లో త 'దా' తాలకును, 4వ పాదములో న, త లకును చెల్లు నట్లుండుటచే నుదాహరణము లయినట్లున్నవి.

263— పై పద్య విషయమున గ్రాహ్యాగ్రాహ్యములు (యుక్తాయుక్తములు) నిర్ణయింపఁబడినవి. ఇందుఁ జెప్పఁబడిన ప్రతివర్గమునందును మొదటివియగు నాల్గేసిన్ని పరస్పరము వర్గయతులగును గావున (వెనుక చెప్పినట్లు) యతులకుఁ జెల్లుబడి యగును. ఆనాలుగేసి వర్ణములకు వెనుక (పూర్వ భాగమున) పూర్ణబిందువులుండినప్పుడు (వెనుక చెప్పినట్లు) బిందు యతులగును గావున నట్లు చెల్లును. బిందువులు లేనప్పుడు ఆనాల్గేసిన్ని తమకు దాము చెల్లును గాని పంచమాక్షరములకుఁ (అనునాసిక వర్ణములగు ఙ, ఞ, ణ, న, మ అనువానికిఁ) జెల్లవు.

(చెల్లకుండుటకు హేతువున్ను వెనుక చెప్పఁబడ్డది. చూ. బిందు యతి వివరణము)

ఇట్లు చెప్పక పై పద్యములో పూర్ణబిందువులు లేకయును పంచమాక్షరములకును జెల్లునట్లు చెప్పఁబడుటచే అది గ్రహింపఁజెల్లునదికాదు.

262— 2 వ పాదమున యతులు చెల్లును. 4 వ పాదమందలి యతులు చెల్లవు అనియు నెఱుంగునది.

పరికింపఁగా నిప్పటి కవిజనాశ్రియ ప్రతులలో పై పద్యము (262 వ పద్యము) లేనేలేదు. అంతియఁకాక (మీఁదు మిక్కిలి) సర్వలాక్షణిక సమ్మతమైన వర్గబిందు యతులున్నవి లక్ష్య లక్షణ పద్యములుస్పష్టముగా నున్నవి; కావున నప్పకవికి దొరకిన ప్రతిలో నట్లుండిన నుండుఁగాక; మన పూర్వపక్ష సిద్ధాంతములతోఁ బనిలేదని మాకుఁదోఁచును.

ఆగ్రాహ్య సంబంధవళులు

క॥ దడలకు భేదము లెంచక
వడియును బ్రాసంబు నిలుప వచ్చును గృతులం,
దిది యెట్లన్నను శ్రీహరి
దోడిబడి దానవులఁ జంప ధులి యాయె ననన్ 264

వ. ఈ చెప్పిన దడలకు పదాది నున్న చతుర్థ వర్గ సరళము ఆదేశమై వచ్చు నప్పుడు ఆదేశయతిగాఁ జెప్పవచ్చును.

అదియుఁ గాక ఆ రెంటికిని దాపలించి నెఱ నున్న లున్నప్పు డనుస్వార సంబంధ యతులు గనుక అటువలెను జెప్ప వచ్చును. అవి గలుగఁ జెప్పలేదు గనుక నిదియు సమ్మతము గాదు. 265

వివ:— అగ్రాహ్య సంబంధ వళులు వక్ష్యమాణ రీతిగా ఆదేశ సంబంధమేని అనుస్వార సంబంధమేని కలుగు నప్పుడు చెల్ల వలసిన వానికి అట్టి సంబంధము లేకయే చెల్లునట్లు చెప్పుటచే గ్రాహ్యములు (సాధువులు కానివి గ్రాహ్యసంబంధ వళులు కానివి) చెప్పఁ బడుచున్నవి తెలుపఁబడుచున్నవి.

264—భిన్న వర్గులలోనివని పరిగణింప కుండా ద డ అనువానికిఁ బరస్పరము ప్రాసలున్ను యతులున్ను చెల్లుబడి యగును. వానికుదాహరణములు ఈ పద్యమున్ను 4 వ పాదమున్ను—అనఁగా 4 పాదములు ద డల ప్రాసమైత్రికిన్ని (అనఁగా 3వ పా. లో ద తక్కిన చోట డ ఉండుట చేత 4 వ పాదము ద డల యతి మైత్రికిన్ని ఉదాహరణము లగునట్లున్నవి. 1 2, 3, 4 పా. ల ద డ, వడి, ది ది, దొడి అని ప్రాసలున్ను, 4 వ పా. లో దొ..........డు అని యతులున్ను కూర్పబడ్డవి.

265— డాయు మున్నగురీతి పదములకు దాయు మున్నగురీతి డాకు దా అదియుపలక్షణమై దగ్గఱు, డగ్గరు, తద్ — డాంబిక— తడ్డాంబిక మున్నగుచో దాకు డా ఆదేశమై వచ్చు నప్పటి దకారము ఆదేశయతిగా డకారమునకును డకార మట్టి దకారమునకును స్థానాదేశ సంబంధముచేఁ) జెల్లవచ్చును. మఱియును ద డ లు రెండును పూర్వభాగమున పూర్ణ బిందువు గలవియై యున్నచో నప్పుడు ఆపూర్ణానుస్వార సంబంధముచే) అనుస్వారసంబంధ యతులై చెల్లును. అట్టి సంబంధ మేదియు లేకుండఁగనే చెల్లు నట్లుండుటచే నీపద్యమున్ను గ్రాహ్యము కాదు (దుష్టమే) అని తాత్పర్యము.

ఈ పద్యమున్ను (264 వది) ఇప్పటి కవిజనాశ్రియ ప్రతులలో లేనే లేదు గాని ఆదేశయతి గుని పేరుగా నొకయతి చెప్పకయే ఆదేశయతిగాఁ జెప్పవచ్చుననుట పొసఁగి యుండకుండుటయే గాక ఈ అప్పకవి వచనమే దానికి జ్ఞాపకమగును అనుటకున్ను, ఆతఁడువిధించిన అంత్యోష్మ వికల్ప యతులు (దీనిచేఁనున్ను) వ్యర్థములు గావున నట్టి కల్పన మునకును ప్రతిబంధకము లగుటయు మయాటి నిత్యంబటంచు అని విధించిన ఆదేశ నిత్య పద యతి నిషేధమునకు, స్వవచన వ్యాఘాత దోషము వాటిల్లుటయు కలుగుచున్నవి. ఇక్కడను ఆదేశము వికల్పము కనుకనే అనవచ్చును. అయినను (ప్రత్యేక విధానము లేకపోయినను) తత్స్థానాపన్న స్తద్ధర్మం లభతే అను లోకన్యాయమున సిద్ధించిన స్థాని వద్భావముచేత అదివరకున్న వర్ణమునకు (నిత్యాదేశ స్థలములలోను) యతిచెలుట న్యాయము యుక్తము నై అట్లంగీకరింపని యెడల చ॥ 'మది మది.........బలవంతులు' అను ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ ప్రయోగ మసాధువు కాకుండదు (ఇక్కడ మతుప్ మకారమునకు వచ్చిన దగుటచే వకారమునకు మకారము చెల్లునట్లుండుటచే) దీని సాధుత్వమున కైనను నిత్యాదేశ యతియు నంగీకరింపక తీరదని మాకుఁ దోఁచుచున్నది. (చూ. పీఠిక) మరియు నిట్టి స్థాన్యాదేశ సంబంధమును బట్టి ప్రయోగానుసారముగా నంతటను జెల్లవచ్చు ననియే మాయభిప్రాయము.

అగ్రాహ్య వర్ణ చతుష్టయ వళులు

క॥ య ర ల వ లను నీ నాల్గును
వరుసం దమలోన వళ్లు రయమునఁ జెల్లున్
ధర శషసహ వర్ణంబులు
సరవి నొకటి కొకటి చెల్లు హరిని భ రేచా 266

వ. ఈ మొదలను జెప్పిన యరలవలకు నాల్గింటికిని చెల్లుబడి గాదు. శషసహల లోపలను తొలుతటివి మూఁడును

ఊష్మ విశ్రాంతులు గనుక చెల్లును. వానికి హకారము చెల్లదు. ఇవి తెలియక చెప్పిన కతంబున ఇదియు అయుక్తమే ఆయెను. 267

వివ:— అగ్రాహ్య వర్ణ చతుష్టయ వళులు పరస్పరము యతులకుఁ బనికిరాని నాల్గు వర్ణముల యతులు (గ్రాహ్యవర్ణ చతుష్టయ వళులు కానివి) తెలుపఁబడుచున్నవి.

266—యరలవ అను నాల్గును ఒకఁడొకనికొకటి యతుల మైత్రికిఁ బనికి వచ్చును (చెల్లును.) ఈ విషయమునకు ఈ రెండవ పాదముదాహరణ మగును. అట్లే శషసహ అను వర్ణములు నాల్గును ఒకటికొకటి యతులకుఁ జెల్లును. ఈ విషయమునకు ఈ నాల్గవ పాదముదాహరణ మగును అనిభావము.

267—పై విషయముల యుక్తాయుక్తములు తెల్పఁబడుచున్నవి. ఈ పై పద్యములో చెప్పిన యరలవలలో ఎట్టివానికిని పరస్పర యతులు చెల్లవు. ఇఁక శ, ష, స, హ అనువానిలో శషస అనువానికి మాత్రము వెనుక చెప్పినట్లు ఊష్మవిశ్రాంతులై చెల్లును. హకారమునకవి యెట్లును చెల్లునవి కావు, ఇట్లు తెలియని వారు చెప్పినట్లుండుటచే నీ పద్యములోని విషయములున్ను మహాకవి ప్రయుక్తములు కానివే యైన కారణమున ఎంతమాత్రమున్ను చెల్లునవి కావు, అయుక్తములే. 266— 2 వ పాదమున వ..........ర అను వానికి, 4 వ పాదమున స హ అనువానికిని జెల్లునట్లున్నవి గావున పద్యలక్షణ సమన్వయమును. పైని చెప్పిన విధముగా నీ 2, 4 పాదముల యతులు దుష్టములే అని యప్పకవి యభిప్రాయ మెఱుఁగునది. మఱియు పై పద్యము గాని ఇట్టి యభిప్రాయముగలది గాని ఇప్పటి కవిజనాశ్రయ ప్రతులలో లేనే లేదని యెఱుంగునది.

అగ్రాహ్యభేద వర్గ యతులు:—

క॥ ధరఁ బ ఫ బ భ మాక్షరములు
పరువడి నీ యేను గూడ వాతోఁ జెల్లున్
సరి సంభావన వడియన
మరు దీమము లేమ కీర వాణి యనంగన్ 268

వ. పంచమ వర్గాక్షరము లైదింటి లోను వబల కభేదయతి గనుకను బకారమున్ను ప్రథమ ద్వితీయ చతుర్థ వర్ణములు వకారమున కభేద వర్గయతులు గనుకను అవియు నిలుచును. మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు నయుక్తమని తెలిసికొనునది.

గిడుగువారి ప్రతిలో: 'ఐదింటిలోనున్న వబల కభేదయతి గను కను ప్రథమ ద్వితీయ చతుర్థ' అను రీతిగాను, 'అబద్ధమని' అను రీతిని ఉన్నది. అది సరిగా మాకు పొసఁగి యుండలేదు. ఈ 268 పద్యమున్ను ఇప్పటి కవిజనాశ్రయ ప్రతులలో లేదు. 269

268 పద్య వివ:— ప ఫ బ భ మ అను నైదు వర్ణములకున్ను వకారముతో యతి మైత్రి జెల్లును, వకారమునకును బకారమునకును అభేదయతి చెల్లుటచేత వకారమునకు ప ఫ భ అనునవెట్టివో మ అను నదియు అట్టిదే యను సంభావనచేత ప ఫ భ లకు గల అభేద వర్గ సంబంధము (గౌరవము) మకారమునకును గలుగునని యూహింప నగుటచేత) అనఁగా సరియైన (న్యాయమైన) సంభావనచేత దానికి నన్వర్థక మగు సరి సంభావన యను పేరనియుఁ దాత్పర్య మని తోఁచును. దీనికి 2 వ పాదమున ప.........వా అనువానికిని, 4 వ పాదమున మ........వా అను వానికిని యతి మైత్రిచెల్లినట్లుంటచే 2, 4 పాదములే ఉదాహరణము లగు నట్లున్నది యని యెఱుంగునది.

269 పద్య వివః— ప ఫ బ భ మ అను నైదింటిలో బకారము నకు వకారముతో (వెనుక చెప్పఁబడినట్లు) అభేద యతి కనుకను ప ఫ భ అను మూఁడింటికిని (వెనుక చెప్పఁబడినట్లు) అభేద వర్గ యతి గనుకను (మొత్తము) వ ప ఫ బ భ అను వానికి యతి చెల్లవచ్చును గాని వమ అనువాని కెట్లును చెల్లదు (చెల్లునట్లున్న లక్షణమున్ను 268 పద్యములోనిదే 4 వ పాద యతిమైత్రియు చెల్లదు.) వమ ల కభేద వర్గ యతియు (ప్రత్యేక వర్గీయములైన బమ లకే బా బిందుపూర్వము కానప్పుడు చెల్లదు కావున దాని యభేదముచే చెల్లవలసిన వకారము బిందు పూర్వము కానప్పుడు) చెల్లుట విరుద్ధము (అసంభవము) అగుటచే నిది అగ్రాహ్యాభేద వర్గయతియై దుష్ట మగుచున్నది. ఇట్లు ఆలోచన లేని వారు చెప్పినట్లుండుటచేత నీ 268 వ పద్యమున్ను ప్రక్షిప్తమై దుష్టమునకు తప్పనిదయ్యె నని భావము.

తే॥ భరిత భువనార్ణవంబుతో వ్రేంత సరియె
రమ్య మణి రాజ రాజుతో లక్క సరియె
లలిత వీణా రవంబుతో ఢక్క సరియె
యనఁగఁ జెల్లు నభేదాఖ్య నమరు వళ్లు 270

(ఈ పద్యమున్ను ఇప్పటి కవిజనాశ్రయ ప్రతులలో లేదు)

వ. ఈ మూఁటిలోపలను భకార వకారముల కభేద వర్గ యతి గనుక ప్రయోగింప వచ్చును. లవర్ణ ఢవర్ణములకు నభేద వర్గ యతులును గావు గనుక ప్రయోగింప రాదు. రేఫమునకును లకారమునకును గ్రాహ్యంబు గాదు. వానికిని లక్షణ విలాసము వారు తెలియక *కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు. అవియును వివరించెద. 271

* (వా) ప్రతిలో 'సుపూర్వాను నిర్ణయము' అని ఈ తావున 'తలసీల' కలదు.
—గిడుగు వారి ప్రతిలో (గీటు క్రింద)

270 పద్య వివః— ఈపద్యములో 1, 2, 3 పాదములలో (వరుసగా) యతుల యొద్ద నున్నట్లు భ........(వ్రి) వ, ర.......ల, ల........ధ లకు యతులు కూర్పఁజెల్లును. అప్పుడవి అభేదవర్గములనఁ బడును అని తాత్పర్యము.

271— ఈ పై పద్యములో చెప్పిన మూఁడు విధములగు యతులలో మొదటిది (వ బ ల కేకాని వ భ ల కభేదము చెప్పఁబడక పోవుటచే) అభేద యతిగా చెల్లదు గాని కవిప్రయోగముల ననుసరించి (వెనుక చెప్పఁబడినట్లు) అభేదవర్గయతి అగును గనుక అట్లు ప్రయోగించ వచ్చును. మూఁడవది ల డ ల కే గాని ల ధ లకు నభేద విధానమున్ను లేదు. కవిప్రయోగములు లేకపోవుటచేత నభేదయతి విధానమున్ను లేదుకనుక ఆ పేరుతోఁ జెల్లక పోవుటయే కాక లకారాభేదము గల డకారమునకు (ధకారము) వర్గీయ మైనను కవి ప్రయోగములు లేక పోవుటచేత లకార ధకారముల కభేద వర్గయతి విధానమున్ను లేదు కనుక ల ధల కభేద వర్గయతులను నామముతోడను (ఎట్లున్ను) యతులు చెల్లవు (దుష్టములే యగును) ఇఁక రెండవది యగు రేఫ లకార యతియు—రేఫ లకారముల కభేద ప్రసిద్ధి యున్నను సరియైన మహాకవి ప్రయోగములు లేకపోవుటచేత వానికి అభేద యతి విధానము లేకపోవుటచేతను (ఉన్నను చెల్లఁగూడదు కావునను) లకార రేఫల యతియును చెప్పఁగూడదు, చెల్లనూగూడదు కనుక అది గ్రాహ్యము కాదు (దుష్టమే) అని అప్పకవి తన మత ప్రకార మీ పై పద్యము లోని యుక్తాయుక్తము లీ వచనములో నిర్ణయించి మఱియు లక్షణ విలాస గ్రంథకర్త (అట్లగపడు) మహాకవి ప్రయోగములలోని పద ముల యతుల యభిప్రాయములు సరిగా గ్రహింపక తెలియని వాఁడై మహాకవి ప్రయోగములలోనే ర లలకు యతులున్నట్లభిప్రాయముతో కొన్ని ప్రయోగములు చూపినాఁడనియు అతఁడు చూపినవియు వాని యభిప్రాయమున్ను విమర్శించి నిర్ణయించు చున్నాననియు చెప్పినాఁడని తాత్పర్యము గ్రహించునది.

శృంగారనైషధమునందు:—

క॥ కైలాటరాయ యభినవ
లీలామకరాంక చంద్రరేఖాంకుర చూ
డాలంకార పదాంబురు
హాలింగిత సుఖిత నిర్మలాంతః కరణా (1, 110) 272

రామాయణమునందు:—

క॥ దానవ సుందరు లత్తఱి
జానకి నందలము మీఁద సమ్మద మొదవం
గా నిలుప శారదాభ్రవి
లీనత నేపారు చంద్రరేఖయ పోలెన్ (యు. 2323) 273

వ. సంస్కృతమునందు రేఖా లేఖా శబ్దములు రెండును గలవు
గనుక ఈ రెండు పద్యములందును చెప్పిన రేఖా శబ్దము
మొదల *తృతీయాంతస్థ మని యెఱుంగునది. 274

హరిశ్చంద్రుని కథయందు:—

ద్వి॥ చీఁకటి విరియించు చిఱునవ్వు పసిఁడి
రేకులతో నెదిరించు చెక్కులును 275

వ. కొందఱు 'రేకులతో మురాళించు చెక్కులును' అని చదువు
దురు. అదివ్రాఁత తప్పుగాని కవిహృదయము గాదు. 276

వసుచరిత్రమునందు:—

శా॥ ఓ లంబాలక యోల యోల యన నో లో లంచు మేలంబునన్
లో లంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మి తూఁటాడి కెం
గేలం బూని తటాలున న్నెగసె నక్షీణాంబు నాథాంబుజా
తీ లోకంబు జయించి వారల యశశ్శ్రీఁ దెచ్చు చందమ్మునన్
(3, 162) 277

* ద్వితీయాంతస్థ - అని గిడుగువారి ప్రతిలో

వ. ఈ పద్యము రెండవ చరణము మొదలను 'లో లంబాలక గుర్వింకి యని కవిహృదయము ఇదిగానక కొందఱు "ఇందిం దిర శ్చంచరీకో రోలంబో బంభరోపిచ" అని నిఘంటువున ఉన్న దని రోలంబాలక అని చదువుదురు. ఇట్లని రామరాజ భూషణము తలంపుగాదు. 278

272—273 పద్య వివ:— వీనిలో క్రమముగా 2, 4 పాద ములలో లీ........రే, లీ........రే, అని రలలయతి యున్నట్లు కాన వచ్చుచున్నది గాని ఇవి రే అనునట్టివి గావు లే అనునట్టివి అని తన మత ప్రకారము నిర్ణయించి ఇది రలలయతి యని భ్రాంతి కాని అది సత్యము కాదని ఖండించు చున్నాఁడు.

274— సంస్కృత భాషలో రేఖా అని రకారాదియు లేఖా అని లకారాదియు నగు రూపద్వయ మీయర్థమందే యున్నది గనుక పై రెండు పద్యములలోనున్నది లేఖ అను లకారము మొదటనున్నది కాని రకారము మొదట నుండు రేఖ అనునట్టిది కాదు. అందుచేత ఇక్కడ రలలయతి లేదు (కవి ప్రయుక్తము కాదు.) ఎందుచేతనో రేఖ అని మాఱుగా అదియే కవిప్రయుక్తమనుకొని (ఇంతయు గ్రహించ లేక) లక్షణవిలాసకర్త ప్రమాదపడినాఁడని అప్పకవి తాత్పర్యము గ్రహించునది.

ఇక్కడ గిడుగువారి ప్రతిలో ద్వితీయాంతస్థ మనియేయున్నది; అట్లుండఁ గూడదు. ప్రాచీనప్రతుల గొన్నిట అట్టి పాఠము లేక పోలేదు గాని పొరపాటనునది లేకుండగ గోళించి వైచితి మనురీతి దెలుపు వారికిన్ని అట్టి పొరపాటేల రావలెననక మానరు. మానవ మాత్రులకు భ్రమప్రమాదములుండక మానవనుట.

275— ఇదియే సరియైన కవి రచిత పాఠము అని రే..........రి అనునది కవి సమ్మతమైన యతి అని సూచించి తెలియకపోవుటచే వచ్చిన పాఠమును చూపి ఖండించుచున్నాఁడు.

276— ఈ పద్యములో ఎవరి పొరపాటుచేతనో వచ్చిన తప్పు పాఠమును జూచి కొందఱజ్ఞులు 'రేకులతో మురాళించు' అని చదువుట; అందువల్ల వచ్చిన పాఠమే నిజముగా కవి కల్పితమని భ్రాంతిపడి నేఁజూపిన కవినిబద్ధపాఠ మెఱుంగక విపరీతముగా నిది అవి ర ల 'ళ' ల మైత్రియనుకొని యుదాహరించిరి. భ్రాంతిగా ప్రమాదము గాని గ్రాహ్యముకాదు.

277— ఇందున్న లో లంబాలక అనుచోట పదచ్ఛేదము దానియర్థము — నెఱుంగక లోలంబాలక అను పదమే యుండదు అనుకొని నిఘంటువున నున్న ('ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరశ్చ సః' అనియున్న) దానిని చూచి ఇది రోలంబ అనియు దీనికర్థము తుమ్మెద అని సరిపడుననియు భ్రాంతులై రోలాంబాలక అని చదువుటయు అట్టి పాఠమే భ్రాంతానువాదముగా వచ్చినది; అదియే రామరాజభూషణ విరచిత మనుకొని రో.......ల్లుల్ అను రీతిగా ర లల యతిని కవి కూర్చినాడని అజ్ఞులై ఉదాహరించినారు కాని అది కవిహృదయముకాదని స్వమత స్థాపనము చేసికొనుట కనుశాసించి నాడు (హృదయము కాదనుట — ఆతఁడైనను ఏప్రమాదముచేతనో అట్లు వ్రాసిననూ వ్రాయవచ్చును గాని అది యాతని మనస్పూర్తికము కాదనుటయా); అట్లైనచో ఇష్టములేని వన్నియు నట్టివే యని యెవ్వరైనను సమర్థించుకోవచ్చును గాన నీసిద్ధాంత మెట్లు చెల్లును. మఱియు నిక్కడ కవిహృదయమెట్లో యెఱుఁగక పోయిన నేమి గాని రోలంబాలక అనుకొన్నప్పటి పదార్థాలంకార గాంభీర్యసౌకుమార్యాదులు అప్పకవి యనుకొన్నప్పటి దానిలో కుంటువడి పోయినవని మాహృదయము ఖేదిల్లుచున్నది.

మఱియు నప్పకవి యిట్లు ర లల యతిని తన మతప్రకారము ఖండించినను—ర ల ల కభేదము సంస్కృతములోను పెక్కుచోట్ల చెప్పఁ బడుటచేతను దాని కంగీకరించి-మంజుల, సౌధ, రాజితా, మంజుః, అసౌ,

ధరాజితా, మంజుర, సౌధరాజతా అను నట్లు పెక్కుచోట్ల మహాకవులచే శ్లేషాదులలో వాడబడుటచేతను తెనుఁగునందును పెక్కండ్రు మహాకవులు బహుళముగానే ఈయభేదముచే డ లల యతులు (ప్రాసము లున్న) వాడి యుండుటచేతను అవి యిష్టములేని అప్పకవి వంటి సంస్కర్తలే ఎంత సంస్కరించి వైచినను ఇప్పటికిన్ని బహుళముగానే అవి నిలిచియుండుటచేతను (అవి కొన్ని గిడుగువారు పీఠికలో చూపి సులువుచేసినను ఇంకా కొన్ని చూపవలసినవున్నను గ్రంథ విస్తరభీతి మాన్పివైచినది.) అవియెల్ల తప్పులనుట యెట్లును చెల్లనిదగుటచేతను కొందఱు మాటలాడు నప్పుడు సైతము డ లలు కలిసిపోయి వాని యభేదమును స్థాపించుటచేతను, మఱియుం గొన్నితప్పని హేతువుల చేతను డ లల యభేద యతిప్రాసము లంగీకరింపకుండుటకు ఔచిత్యము బలము తగినంత మాకు కుదురలేదు. విశ్వామిత్ర శబ్ద పంచమీ విభక్తి మున్నగువాని యతుల వైఖరి గమనింప తక్కిన యుక్తి బలము లేమియు నక్కఱ లేకయే కవిప్రయోగమాత్రముననే అవి యంగీకరింప వచ్చునని స్పష్టపడుచున్నదిగదా; అప్పకవిమార్గ మవలంబించినచో తమ యిచ్చకొలఁది మహాకవి ప్రయోగములు దిద్దివైచుట మిక్కిలి సులువైన పనియే యగుటచేతను ఈ అప్పకవి యనుశాసమునకు బలము ఏవిధముగాను సరిపడలేదని ధ్రువముగా చెప్పవచ్చును. స్వమత స్థాపనాభిలాష మహాకవి ప్రయోగములను దిద్దివైచుటలో ఏ ఔచిత్య సౌందర్యాది భంగమును తోఁచనీయదని ధ్రువపఱుచుట కొక్కయుదాహరణము చెప్పవలసియున్నది. రుచిరార్థ సూక్తి నిధి యగు నన్నయ భట్టే ఆదిపర్వమున కం॥ 'సురుచిర సురూపగుణ సుం, దరి యూర్వశి యను లతాంగి తద్దర్శన గో, చర యగుడు నపుడు రేత, స్ఖలనం బమ్మునికి నయ్యెఁ గామాతురతన్' అని ప్రయోగించియుండ అది చూచి డ లలకు ప్రాసయు నంగీకరింపక తీరదని భీతిల్లి ప్రాచీన ప్రతులలో స్పష్టముగా నున్న పాఠమును తరువాతి ముద్రణములో మార్చి రేత, స్స్ఫురణమ్మ

మ్మునికి అని పాఠము కల్పించిరి. ఈయొక్క ప్రయోగమే ర లల యభేద మైత్రిని సహస్ర ముఖంబులఁ జాటుచున్నది. సంస్కర్తలెట్లు దిద్దిన నేమి దొంగతనము బయట పడక మానినది కాదు. ఎంత యెఱుఁగని వారికైనను ఇట్టిచోట్ల రేతస్ఖలనంబని స్ఫురించును గాని రేతస్కరణంబని స్ఫురింపదు. మోమోటము లేక చెప్పవలసినచో నిందర్థసాంగత్యమే లేదు. ఇక్కడ రేతస్సు చలించుట (జారుట) అనికదా; ఆయర్థము స్ఖల ధాతువు వల్ల సిద్ధించును గాని కరణ అనుటచే నెట్లువచ్చును; కృఞ్ ధాతువున కాయర్థ మెట్లు వచ్చును. (ధాతూనామనేకార్థత్వమ్ అని అగతిక విషయము.) కౄ విక్షేపే మున్నగు వానివల్ల కిరణ అగును గాని కరణ అవదు. రేతః — కరణ — రేతఃకరణ లేక రేతస్కరణ అగును గాని రేతస్కరణ ఎట్లగును. దానికొఱ కేకస్కాది గణ పాఠమో అప్రమాణముగా నంగీకరించాలి కావున సంస్కర్తలేమియు పరిశీలింపక బహు దోష భూయిష్ఠముగా సంస్కరించి ఆది కవికి లేనికళంకమును తెచ్చి పెట్టినారు; కనుక రేతస్ఖలనము అనియే పాఠము కవిరచితసాధు పాఠము స్కరణ అనునది దుష్టమే. మఱియు నిట్టి మరికొన్ని ప్రబల హేతువులచేత రలల యభేదమైత్రి (యతియు ప్రాసయును) అంగీక రించి తీరవలయునని మాయభిప్రాయము. ఇది సంస్కర్తల దూషణము కాదు, భూషణమూకాదు. వారి మతమట్టిదనియు మామత మిట్టి దనియు మాత్రమనియు యెఱుంగునది.

క॥ నణలను రెండక్కరముల
కును వడి ప్రాసంబుఁ బెట్టుకొన వచ్చుఁ గృతిన్
వినరఱల కిట్ల పెట్టం
జను లళల కభేద మరయ సర్వజ్ఞనిధీ 279

వివ:— నణ లకును, రఱ లకును, లళ లకును యతిప్రాసములు ఈజంటల కభేదము ప్రసిద్ధమగుటచేత) కృతులలో చెల్లును.

వ. ఈచెప్పిన మూఁటిలోపలను మొదలం జెప్పిన నణలకును సరస వడియు కడను జెప్పిన లళలకును అభేద యతియుఁ గనుకను నీరెండును గూర్పవచ్చును. నడుమను జెప్పిన రఱలకు "రయోస్తు నిత్యమ్ స్యాత్" అని శబ్దానుశాసన సూత్రముకలిమింజేసి యేకతర యతులగుటనుం గూర్పరాదు అటుగనుక ఈపద్యమును ప్రశస్తము గాదు. 280

వివ:— నణలకును లళలకును యతులును ప్రాసములును చెల్లును. రకారమునకును ఱకారకామునకును నిత్యముగా (నెప్పుడును) భేదమే గాని యభేదములేదు అని ప్రథమాచార్యుఁడు సూత్రముచేత విధించుటచేత వానికి యతిప్రాసములు చెల్లవు. మఱియు ఱ రలకు ఏకతర యతుల విధాన ముండుటచేత ఱాకుఱా, రాకురా యే గాని ఒండొంటికి (పరస్పరము) యతులు చెల్లుబడి కావు కాబట్టి ఇట్లు చెప్పక రఱలకున్ను యతిప్రాసములు కూర్పవచ్చునని యుండుటచేత నీ (279) పద్యమున్ను గ్రాహ్యము కాదు (అందలి రఱల యతిప్రాసలు చెల్లు నన్నది గ్రాహ్యముకాదనుట.) దీనిని గురించి చెప్పవలసిన విషయమెల్ల ఏకతర యతివద్ద మావివరణములో చూచునది. దాని సారాంశమేమన నన్నయ చింతామణియే రచించ లేదని యొకవాదమున్ను, 'రయోస్తు నిత్యమ్' అనునది ప్రక్షిప్త మని యొకవాదమున్ను తలఎత్తి రఱల మైత్రిని సిద్ధింపఁ జేయుచుండుటచేతను పై మతముల సత్యాసత్యము లెట్లున్నను నన్నయాదులు మొదట పైనిజెప్పిన నియమములు (రయోస్తుమున్నగునవి) అంగీకరించి నట్లున్నను రానురాను వానియందరుచిచేతనో అభేదమెఱుంగ వశముకాదనుట యంగీకరించుటచేతనో యెట్లైననేమి వారికిని వీని యభేదమిష్టమే యని సాధించునట్లు ఇప్పటికిని వారి ప్రయోగములే కొన్ని గోచరించుటచేతను, మఱియు నుచితములగు పెక్కు హేతువులచేతను (ఈఱరల మైత్రి) అప్పకవి కిష్టముకానంత

మాత్రమున అంగీకార్యముకాకపోదు.) ధ్రువముగా నిప్పటివారి కంగీకరింపక తప్పనిదియే యని మామతమనుట. (చూ. పీఠిక)

ఇవి నలువదియొక్కటియు యతిభేదంబులు.

వివ:— స్వరయతిభేదములు ఏడు (7), వ్యంజనాక్షర విరతులు ఇరువదియొకటి (21), ఉభయయతులు పండ్రెండు (12), ప్రాసయతి ఒకటి (1), మొత్తము నలుబదియొకటి (41) అనిభావము.

ఇఁకఁ బ్రాస స్వభావం బెట్టిదనిన.

సూ॥ ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాద పాదేషు,
కించ ప్రాస స్సర్వేషు చైక ఏవ స్యాత్ 22

తే॥ ప్రథమ పాద ద్వితీయాక్షరంబు ప్రాస
మయ్యెఁ బదపద్యముల నడుగడుగునందు
నదియు రెండవ వర్ణమై యమరు సీస
గీత దండక మంజరీ కృతులఁ దక్క 281

వివ:— (యతి పరిగణనమునకు పాదముయొక్క లేక వాని భాగములయొక్క మొదటి వర్ణము గ్రహించవలయును — ఇఁక; ప్రాస పరిగణనమునకు పాదము రెండవ వర్ణము గ్రహించుకోవలె ననియు —అనఁగా యతి యనఁగా పాదములోని 'లేక ఖండములలోని' మొదటి అచ్చునకు లేక ప్రాణి వర్ణమునకు 'ఒకానొకచో దానిలో విరుగు అచ్చునకైనను అన్నిపాదములలోను లేక భాగములను భిన్నభిన్నముగా నైనను) విధింపఁబడినరీతి మైత్రిగల వర్ణము ఛందశ్శాస్త్రప్రకారము నియమితమగుచోటఁ గూర్చుట ప్రాసమనఁగా పాదములలోని రెండవ వర్ణములన్నియు 'మొదటి పాదములోని మొదటి యచ్చునకును రెండవ యచ్చునకును మధ్యనుండు భాగమెల్ల ముందునిర్ణయింపఁబడు పూర్వ వర్ణము గలుగునట్లును) ఎట్లుండునో అట్లేయుండుట (ఈలక్షణమున ననుస్వార విసర్గ జిహ్వామూలీయోపధ్మానీయములు హల్లులగును' —ని

తాత్పర్యము గ్రహించునది. ఇట్టి ప్రాసములు సీసము, గీతము, ఆటవెలఁది, దండకములు, మంజరులును అనువాని యందు ఇచ్ఛానుసారమే గాని ఉండవలె నను నియమము లేదు. తక్కిన వానియందెల్ల నియమముగా నుండును (పదమనఁగా తరంగములు కృతులు మున్నగు గానకవిత్వము) అని అప్పకవి 281 పద్యభావము.

ప్రాసపూర్వాక్షర నిర్ణయము

క॥ గురు లఘువులలో నెయ్యది
మురహర తొలి చరణమునకు మొదల నిలుచు ని
ద్ధర నాపై నిడు ప్రాసా
క్షరములఁ బూర్వమున నదియ కదియింప నగున్ 282

ఆ॥ దాన పారిజాత వాసవావరజాత
ఘన ఘనాఘనాంగ దనుజ గర్వ
భంగ యనుచు నిట్లుప్రాసాదులను గూర్ప
వలయు నొక్కభంగి వ్రాలు కృతుల 283

ఆ॥ క్రింద జడ్డలును బిఱుంద బిందువులును
నూఁది ప్రాసములకు నుండెనేని
[1] హ్రస్వ మొకట నిడుద యక్కరంబొక్కట
వాని మొదల నిలుప వచ్చు నెందు 284

ఆ॥ పక్షిరాజ పత్ర, రాక్షస తృణ దాత్రి
దంతి భయ విరామ శాంతి ధామ
యింద్రనీల మూర్తి సాంద్ర పాండుర కీర్తి
యనఁగఁ బ్రాస మాత్ర కాదులొప్పు 285

ఆ॥ వేద వేద్య యసమ వృత్త పాదములను
బ్రాస నియమ రహిత పాదములను

1 'హ్రస్వ మొకటి.....యక్కరం బొక్కటి' అని గిడుగువారి ప్రతిలోను ఉన్నను కొంచెము సవరించుకొన్నాము.

వలసినట్లు మొదలి వ్రాలు సెప్పఁగ నొప్పు
నొక్క దాన గురువు నొకట లఘువు 286

ఇఁకఁ బ్రాసాక్షరముయొక్క పూర్వవర్ణ నియమము చెప్పఁబడుచున్నది.

282 పద్య వివ:— (పాదములో మొదటి యచ్చునకును రెండవ యచ్చునకును నడుమనుండునది ప్రాసమని వెనుకఁ జెప్పఁబడినట్లు) ప్రాస నియమముగల పద్యములలోని ప్రాసాక్షరమునకుఁ బూర్వవర్ణము మొదటి పాదములో గురువైనచోఁ దక్కిన అన్ని పాదముల ప్రాసాక్షర పూర్వ వర్ణములును గురువులే అయి యుండవలె ననియు, అట్లే లఘువైనచో లఘువులే యయి యుండవలె ననియు భిన్న భిన్నములుగా నుండరాదనియు, ప్రాస నియమము లేని వానిలో నిచ్ఛానుసారము ప్రాసలు గూర్చునప్పుడును ప్రాసయతులు గూర్చునప్పుడున్ను భిన్న భిన్నములుగా (ఏపాదమున కాపదమే యను నట్లు) ఈ గురు లఘు నియమముండు ననియుఁ దాత్పర్యము గ్రహించునది. మరియు నిదియే ప్రాస నియమము గల వాని పూర్వ లఘు నిర్ణయమునకుదాహరణమగును. గురుపూర్వమున కిట్లే యుదాహరణ మూహించుకొనునది ఎల్లెడ సుస్పష్టములే యనియు నెఱుంగునది.

283— ఇది ప్రాస నియమము లేని వానికి (1, 2 పాదములు మాత్రము) ఉదాహరణమగుచున్నదని తాత్పర్య మూహించునది.

284— ప్రాస వర్ణము సంయుక్త మైనప్పుడున్ను ప్రాసవర్ణము బిందు (అనఁగా పూర్ణబిందు విసర్గ జిహ్వామూ లీయోపధ్మానీయ) పూర్వకమైనప్పుడున్ను 'ఈ నియమమున్నదికాని' హ్రస్వదీర్ఘ నియమము మాత్రముండదు. ఒకచోట దీర్ఘము ఒకచోట హ్రస్వమున్నను సంయుక్తమునకు పూర్వమున నుండుటచేతను పూర్ణబింద్వాది పూర్వత్వము (విశిష్టత్వము) చేతను ('సానుస్వారో విసర్గాంతో....యుక్త పరశ్చయః ఇత్యాది ప్రమాణములచేత) గురుత్వమే సిద్ధించుటచేత పై

నియమమున కేకొంతయు నుండదు. ఇట్లు హ్రస్వదీర్ఘము లిష్టానుసార ముండవచ్చు నని భావము.

285 — ఇందలి 1, 2, 3 పాదములు మాత్రము ప్రాసనియమము లేనివాని పై విషయమున కుదాహరణములగును. ఇట్టే అట్టి నియమ మున్నవానికిన్ని ఎల్లెడ నుండునవి యే గనుక అవియెల్ల నుదాహర ణము లనుకొనునది యని తాత్పర్యము.

286 — ప్రాసనియమమున్నను అసమ వృత్త పాదములందును అనఁగా అన్ని పాదములు (నాల్గుపాదములున్ను) సమాన పాదములుగా (నియత సమాన గణవిశిష్టములుగా) నుండ వలయునను నియమము లేని వృత్త (వృత్త) ముల పాదములందును పాదములన్నియు సమాన ములుగాను కొన్ని సమానములుగాను ఉండు నియమ మున్నను ప్రాస నియమము లేని (నాల్గు పాదములలోను ఒకే విధమై యుండు నియమ ములేని) పద్యముల పాదములలోను ఈగురు లఘు నియమమున్న లేదు; ఛందోనుసారముగాఁ కూర్చుకొనవచ్చును. ప్రాసయతు లున్న ప్పుడు మాత్రము ఇట్టి నియమముకాక మొదటి ప్రాసవర్ణమునకు యతినియత స్థల ప్రాసవర్ణమునకును (అనఁగా ఒకే పాదములో యతికి బదులుగా ప్రాసలు కూర్చునప్పుడు) ఈ గురు లఘు నియమ మున్న దనియుఁ దాత్పర్య మెఱుంగునది.

స్వస్థానార్థ సమవృత్తోపజాతి వృత్తము

క్షమా కళత్రున్ వనజాత నేత్రున్
గామేపలీశున్ త్రిజగత్ప్రకాశున్
దమాల నీలున్ సముదార శీలున్
హేమాక్ష వైరిన్ భజియింతు శౌరిన్ 287

ఆ॥ వారి జాత గర్భ వామదేవ సహస్ర
నయన ముఖ్య పుణ్యనామ యనుచుఁ

ప్రాసనియతి లేని సీసాదిపదముల
మొదల రెండు నిట్లు గదియుచుండు 288

287— ఇది స్వస్థానార్థ సమోపజాతి వృత్తము ఈస్వస్థానార్థసమ మనఁగా నాలుగుపాదములను అక్షర సంఖ్య సమానమై బేసిపాదము లొకవృత్తమునకుఁ జెందినవియు సరిపాదములు మఱియొక వృత్తమునకు జెందినవియు అయి యుండునది యని యెఱుంగునది. కావున నిది స్వస్థానార్థ సమవృత్తంబులందు వ్యత్యస్తోపజాతి వృత్తము. దీనికి బేసిపాదము లుపేంద్రవజ్రచ్ఛాయను (జ, త, జ, గగములతోఁ గూడి) సరిపాదములు; ఇంద్రవజ్రచ్ఛాయను (త, త, జ, గగ ము లతో గూడి నడచునని యెఱుంగునది. మఱియు దీనికి నాల్గు పాదములలోను యతియుఁ బ్రాసయు నుండును. ఎన్మిదవ యక్షరము యతిస్థానమై ప్రతి పాదమునందు నుండును. ఇందు మొదటిపాదమునను మూఁడవ పాదమునను ప్రాసపూర్వాక్షరము లఘువున్ను రెండు నాల్గుపాదముల పూర్వాక్షరము గురువున్ను అయి భిన్నములుగా నున్నను పైని చెప్పఁ బడినవిధమునఁ జెల్లుబడియయ్యెనని యెఱుంగునది.

288 పద్యవివ:— ఇది ప్రాసనియమము లేక యతిమాత్రముండవలసినది కావున నిందు 3 పాదములు ఆదియందు గురువుకలవియు, 2, 4 పాదములు ఆదియందు లఘువు కలవియు నైనను పైనిచెప్పిన ప్రకారము చెల్లుబడి యయ్యెనని యెఱుంగునది. ఇదియు 1, 3 పాదము లొకవిధము గను 2, 4 పాదము లొకవిధముగను ఉండు విషమపద్య మనియు, ఇట్టి ప్రాసనియమము లేక నాల్గు పాదములు సమనియమిత గణములు కల (అక్షర సంఖ్యభిన్నము కావచ్చును.) సీసాదులలోను ఇట్లే ఒకచోట లఘుపూర్వత్వమున్ను మఱియొకచోట గురుపూర్వత్వమునుండవచ్చు ననియు వీనిలో నైతము ప్రాస యతి కూర్చునప్పుడు మాత్రము ఏకపాదమున అట్లు చెల్లదనియు నెఱుంగునది.

ప్రాసాక్షరమైత్రి

తే॥ ప్రాసములకెల్ల దుల్యాక్షరంబులైనఁ
జాలు స్వరభేదమైన దోషంబులేదు
చరణములకడఁ గూర్చు ప్రాసములకెల్ల
నన్నియు సమస్వరంబులై యమరవలయు 289

ఆ॥ సరసిజాత నేత్ర దురిత గుల్మ లవిత్ర
హరితనూజ మిత్ర గరుడ పత్ర
ధారుణీకళత్ర నీరదాసితగాత్ర
యనుచుఁ గూర్పవచ్చు నచ్చులెల్ల 290

ఇఁకఁ బ్రాసాక్షర మైత్రి నియమ ప్రకారము చెప్పఁడుచున్నది.

289 వివ:_ ప్రాసములకును (ప్రాసయతులకును) హల్వర్ణములు మాత్రము సమాకారములు కలవి కావలయును గాని వానిపైనుండు స్వరము (అచ్చు) సమాకారము కావలయునను నియమము లేదనియు భిన్నభిన్న స్వరములు కలవి యైనను చెల్లుబడి యగు ననియు, పాదముల చివరఁ గూర్పఁబడు ప్రాసములకు మాత్రము (అంత్యప్రాసమునకు మాత్రము) స్వరముకూడ పైనుండు అచ్చుకూడ సమాకారము కలది కావలయుననియు, ఈ అంత్యప్రాసము ఇచ్ఛానుసారము పద్య శోభకుఁ గూర్చునది యేకాని ఏపద్యములందును ఈయంత్యప్రాసము నియతముగా నుండవలయునను విధి లేదనియు, ప్రాసాక్షర మనఁగా మొదటి యచ్చునకును రెండవ యచ్చునకును మధ్యనుండు అక్షరము (లేక అక్షరసమూహము) అని లక్షణ మనియు, ఈలక్షణమున అనుస్వార విసర్గ జిహ్వామూలీయోపధ్మానీయములు సైతము హల్లులుగా గ్రహింప వలె ననియు అందుచేతనే ప్రాసము కూర్చున్నప్పుడు పూర్ణబిందు విసర్గాదులున్న అన్నియెడల సమానముగా నుండవలె ననియు అనగా ఒకచో మొదటి యచ్చునకు రెండయచ్చునకు మధ్యమున పూర్ణబిందు విసర్గాదులున్నచో అన్ని ప్రాసాక్షరముల యందును అట్లే పూర్ణ

బిందు విసర్గాదులు సైతముండవలెననియు ప్రయోగానుసారము క్వాచిత్కముగా పై వానిలోని కొన్నిటి వైకల్పికత్వము ముందుఁ జెప్పబడుచున్నదనియు నెఱుంగునది.

290 వివ:— ఇది ప్రాస నియమము లేనిదియు నిచ్ఛానుసారము ప్రాసయతి కూర్పవచ్చునదియుం గావునదీని 1,2,3 పాదములలో ప్రాసయతి కూర్చి పైని చెప్పిన విషయమున కుదాహరించి నాఁడనియు, ఇందు మొదటిపాదమున నున్న ప్రాసయతిలోని రకారప్రాసములో రకారముపై నొకచోట అకారస్వరమున్ను, రెండవచోట (దురి అనుచోట) రకారముపై ఇకారమున్ను ఉన్నను ప్రాసయతి చెల్లెననియు, ఇట్లే రెండ వపాదమున ప్రాసయతిలో నొకచోట రకారమికారంవిశిష్టము, రెండవచోట రకారముకార విశిష్టము నైనను ప్రాస చెల్లె ననియు, 3 వ పాదమున గురునియమమున్ను చూపినాడు. ఇట్లే ప్రాసనియమము గల ఉత్పలమాల మున్నగు పద్యములయందెల్ల నిట్లే ప్రాస విషయమున అజ్మైత్రి అవసరము లేనట్లు ఉదాహరణము లెఱుంగవలెననియు, మరియు నీపద్యములో నిచ్ఛానుసారము 1, 2, 3 పాదములలో అంత్యప్రాస మున్ను కూర్చి ఇందు అజ్మైత్రియు (పైఅచ్చున్ను సమానాకృతి కలదియై) ఉండవలెనని చూపినాడనియు, ఇట్లే ఎల్లెడ నెఱుంగవలెననియు భావము. ఇట్లే 3 వ పాదమున గురునియమమున్ను చూపినాఁడు.

క॥ దురితద్వీప హార్యత్నా
నరక మురాసుర విపక్ష నాళీకాత్నా
శరధిసుతాలయ వక్షా
కరినాయక రక్ష హారముఖ సురాధ్యక్షా 291

291 పద్య వివ:— ఇది ప్రాస నియమముగల కంద పద్యము. ఇందు 1, 2, 3, 4 పాదముల ప్రాసలలో ఒకచో (రి అని) ఇకారయుక్తముగాను, రెండవపాదమున (ర అని) అకారయుక్తముగాను, అట్లే మూడునాల్గుపాదముల ఒకచో అకారయుక్తమై మరియొకచో ఇకారి

యుక్తమై ఇట్లు రకారప్రాసము భిన్నభిన్న స్వరములు కలదియైనను పైనిచెప్పిన చొప్పున చెల్లుబడియయ్యె ననియు అట్లే అంత్యప్రాసమును ఇచ్ఛానుసారముగా కూర్చి అందలి స్వరసమాకారత్వము చూపినాఁడనియు నెఱుంగునది.

తే॥ వటుప్రియయు ద్విత్వమును గల వ్యంజనంబు
ప్రాసమై యుండు నెడఁ బెఱప్రాసములకు
వ్యంజనంబు సమాక్షరంబైనఁ జాలు
వానిపై నేస్వరంబైనఁ బూన వచ్చు 292

ఆ॥ సకియ పూర్వజన్మ సుకృతఫలంబునఁ
గాక తనువిభా నిరాకృతాభ్ర
నిక్కృపాపయోధి దక్కఁగఁ గొనుటకుఁ
దరమె భోజసుతకుఁదక్క నన్యఁగ 293

292 పద్య వివః— వటుప్రియయు — వటుప్రియుడియు (హల్లు మీఁది ఋకారమున్ను), ద్విత్వమును — సంయుక్తవర్ణమున్ను (ఇక్కడ ద్విత్వపదము సంయుక్తమునకుపలక్షణము), కలవ్యంజనంబు — కలిగిన హల్లు, ప్రాసమై యుండునెడ—ఒకచోట ప్రాసాక్షరముగానున్నచో, పెఱప్రాసములకు — తక్కిన చోట్లఁ గూర్పఁదగిన ప్రాసాక్షరములకు, వ్యంజనంబు — కేవల హల్లు (లేక కేవల హల్ సమూహము), సమాక్షరంబైనన్ — తుల్యాకారముగలది యైనచో, చాలున్ — ప్రాసకుఁదగియుండును, వాని పైన్ — తక్కిన ప్రాసాక్షరములమీఁద, ఏ స్వరంబైనన్ — ఏయాకారముగల అచ్చైనను, పూనవచ్చున్ — కూర్పవచ్చును.

తా॥ ప్రాసనియమముగల పద్యముల నాల్గుపాదములలో నేపాదమందైనను (అట్లే ప్రాసనియమము లేని పద్యములలో ఇచ్ఛావశమునఁ గూర్చు ప్రాసయతి సందర్భములో నొకచోటను) కూర్చు ప్రాసాక్షరముపై యాదృచ్ఛికముగా వటుప్రియుడి (ఋకారము) ఉన్నచో

(కూర్పఁబడినట్లైతే) మిగిలిన పాదములలోని ప్రాసాక్షరముల మీఁదను (ప్రాసయతిలో తక్కినచోట గూర్పవలసిన ప్రాసాక్షరము మీఁదను) వట్రువసుడి యే యుండవలెనను నియమము లేదనియు యథేష్టముగా నెక్కడనేయచ్చు కూర్పఁబడినను చెల్లుబడియగునుగాని దోషములేదనియు, అట్లే సంయుక్తాక్షరము మీఁద నొక్కచోట వట్రుసుడి యున్నప్పుడును తక్కినచోట్ల ఆసంయుక్తము మాత్రము అన్నిచోట్లను తుల్యాకృతి గలిగి యున్నచో సరిపడుననియు, అన్నిచోట్లను పైని వట్రువసుడియే ఉండ నక్కర లేదనియు, ఎట్టి యచ్చు ఎక్కడ నున్నను బాధ లేదనియుఁ దాత్పర్యము.

అప్పకవి వ్రాసిన ఈపద్యము వలన ఒకచో ప్రాసలో వట్రువసుడి యున్నప్పుడు అన్నిచోట్లను వట్రువసుడియే యుండ నక్కర లేదనియు, అట్లే ద్విత్వాక్షరము ప్రాసమై యున్నప్పుడున్ను వ్యంజనవర్ణము మాత్రమే తుల్యమై సర్వము (అచ్చు) ఎట్టిదైనను కావచ్చుననియు మాత్రము తాత్పర్యమగుచున్నది గాని లక్ష్యమునుబట్టి పై యభిప్రాయమే కేవలమొకవ్యంజనము మీఁదగాని రెండుమూడు (సంయుక్తములగు) వ్యంజనములమీఁద గాని వట్రువసుడి యున్నప్పుడన్నిచోట్లను వట్రువసుడియను అచ్చేయుండనక్కర లేదనుభావమే గ్రహించుట యుక్తమని తోఁచుచున్నది. మఱియు వట్రువసుడి యందు గల రకార ద్వయ సందర్భముచే తోఁచు హల్త్వముచే కొందఱట్లు భ్రాంతి పడుదురేమోయని యెంచి ఇట్టి సందర్భములో వట్రువసుడికి అచ్త్వమే గాని హల్త్వవివక్ష యుండదని తెల్పుటకే (సందేహనివృత్తికి) ఇట్లు ప్రత్యేకముగా వట్రువసుడిని గురించి చెప్పెను గాని మరియొక ప్రయోజన మపేక్షితము కాదనియు నెఱుంగునది; అప్పుడు మావివరణము ప్రకారము సరిపడును గాని యథాశ్రుతార్థముచే సంయుక్తవిషయమున మరియు నిష్ప్రయోజన మగును.

293 పద్య వివ:— ఇది అప్పకవి యుదాహరణమునకు స్వయముగా రచించిన పద్యము. ఇందు మొదటి పాదములో కూర్పఁబడిన ప్రాసయతిలో నొకచోట కకారముపై వటు్రివసుడియు (సుకృత అనుచోట) మఱియొకచోట (సకియ అనుచోట) కకారముపై ఇకారమున్ను కూర్పబడినను ప్రాసయతి సరిపడె ననియు, అందుచేత పైవిషయములో నొకదానికి ఉదాహరణమయ్యె ననియు, అట్లే రెండవ పాదమున్ను ఆవిషయమునకే ఉదాహరింపఁబడెననియు, ఈరెండు పాదములలోను మొదటి పాదములోని ప్రాసహ్రస్వపూర్వకముగాను, రెండవ పాదములో ప్రాస దీర్ఘపూర్వకముగాను కొద్దిభేదము కూర్పఁబడెను గాని అంత కన్న విశేషము లేదనియు, మూడవ పాదములో ద్విత్వ ప్రాసయతిలో నొకచోట ద్విత్వవర్ణముపై వటు్రివసుడియు (ఇక్కృపా అనుచోట) మఱియొకచోట (దక్కగ అనుచోట) అద్విత్వవర్ణముపై అకారమున్ను కూర్పబడినను ప్రాసయతి సరిపడి పైని చెప్పిన రెండవదాని కుదాహరణమయ్యె ననియు, ఇట్లే ప్రాసనియమము గల పద్యములలోని ప్రాసముల విషయమునను నెఱుంగు నదియనియు భావము.

శల్యపర్వమునందు:—

క॥ చావరు నొవ్వరు పాండవు
లేవురునని నీవు సెప్ప నిప్పలుకులుదుః
ఖావేశ కరములై చే
తోవృత్తిఁ [1]గలంపఁ జొచ్చె దుర్భర భంగిన్      (1—14) 294

కవికర్ణరసాయనమునందు:—

మ॥ అమరీ విభ్రమ రీతి లోలనయనా హాస్తాబ్జ [2]దోధూయమా
న మణీదండక చామరాగ్ర [3]పవమాన స్పందనాందోళన

గిడుగువారి ప్రతిలో: 1. కరంపఁజొచ్చె. 2. దోదూయమాన. 3. పవనాస్పందనా

క్రిమశోభాన్వపకుంతలపఙ్క్తికర ముత్కర్షార్హ మయ్యెన్ దదీ
య మృదుస్పర్శ సుఖోన్నతిం బరవశంబై తూఁగు చందంబునన్
(1—64) 295

294 పద్య వివ:— ఇది ప్రాస నియమముగల కంద పద్యము. ఇందు ప్రాసములలో నొకచోట (నాల్గవపాదమున వట్రువసుడియు, తక్కినపాదముల ప్రాసములలో విభిన్నములగు అచ్చులున్న కూర్పఁబడినను పైనిచెప్పఁబడిన విధముగా చెల్లుబడి యయ్యెనని యెఱుంగు నది.

295 పద్య వివ:— తా॥ అచ్చరలవంటి చక్కదనముగల చంచ లాక్షులు కరపద్మములచే రత్నఖచిత దండములుగల చామరములుగొని వీచుచుండ మెల్లని గాలిచే కదలుచున్న యారేని చికురములు ఆమందయానల చామర మందమారుత మృదుస్పర్శచే నగు సుఖ పారవశ్యమ్మునఁ దూఁగుచున్నవో యనునట్లు విరాజిల్లుచుండె నని భావము. ఇందు నాల్గవపాదమున ప్రాసములో వట్రువసుడియు (యమృదు అనుచోట) తక్కినచోట్ల ప్రాసములలో విభిన్నమగు అచ్చున్న (అమ, నమ, క్రిమ అనుచోట మకారముపై అకార మున్న) కూర్పఁబడినను ప్రాసములు చెల్లుబడి యయ్యె ననియు నెఱుంగునది.

క॥ విరమము స్వరప్రధానము
ధరఁబ్రాసము వ్యంజన ప్రధానము నగుటన్
స్వరసంధిఁ జెందునపుడును
బ్రిరుచిరముగ హల్లు దాన ప్రాసము లయ్యెన్ 296

క॥ ఆనలు వెట్టిన నిలువక
తానూరక యలిగి యాసుదంతిని జేరెన్
దానవ సంహారుఁడేక్రియ
చే నీకఁ జనుదెంచు నాకుఁ జెప్పవె యనఁగన్ 297

296 పద్య వివ:— యతి అచ్చుప్రధానముగాఁ గలది, ప్రాస హల్లు ప్రధానముగా గలది; అందుచేత సంధివశమున స్వరముతోఁ గూడినప్పుడును అట్టి హల్లు ప్రాసకు పనికివచ్చును—అనఁగా అచ్చునకు సహజముగా 'పదము పుట్టునప్పుడే' హల్లు సంబంధమున్నప్పుడు ఆహల్లునకు అచ్చునకును మైత్రి కుదిరినప్పుడే యతికి పనికివచ్చి అట్టి హల్లునకు మైత్రిలేక అచ్చునకు మాత్రము మైత్రి కలిగి నప్పుడు యతికిఁ బనికిరాకపోయినను అట్లు సహజముగా హల్లుయొక్క సంబంధము లేనప్పుడు అనఁగా సంధివశమున మరియొక పదములోని హల్లు (పొల్లు) సహజాచ్చుతోఁ గూడినది వచ్చి మరియొకపదములోని మొదటి యచ్చు తోగూడి యుండుటచే పైకిమాత్రము సంధిలో హల్లుతో గూడినట్లుండి వాస్తవమున 'పదచ్ఛేదముచే హల్లు సంబంధము లేనప్పుడు) ఉభయ యతిలోఁ దప్ప తక్కినచోట్ల హల్లు (అప్పకవి మతమున) మైత్రికి పనికి రాక అచ్చు మాత్రమే పనికివచ్చుటయు, మరియు ఏవిధముగాను హల్సం బంధములేని 'అనగా పద్యపాదముల మొదలనున్న) అచ్చు ఒక్కటియే యతికి పనికివచ్చుటయు హేతువులై యతి స్వరప్రధాన మగుచుండె ననియు ప్రాసములో తెనుగు ఎల్లెని హల్లు సంబంధము లేని అచ్చు లుండనే యుండక పోవుటయు, అచ్చుయొక్క మైత్రి యెంతమాత్రి మున్ను అవసరములేక హల్లు మాత్రము సదృశమైనదైనచో పనికి వచ్చుచుండుటయు హేతువై ప్రాసము హల్లే ప్రధానముగా గలది యయ్యెననియు, అందుచేత సహజముగా హల్లునకు అచ్చుయొక్క సంబంధములేక సంధివశమున మరియొకపదములోని (మొదటి) యచ్చు (పూర్వపదము చివరనుండు) హల్లుతోఁ గూడియుండ అట్టి హల్లు పైకి అచ్చుతోగూడి యున్నట్లగపడుచుండినను ఆయచ్చు సంధివశమున చేరిన మరియొక పదములోని దగుటచే ఈహల్లు సంబంధమైన దెంతమాత్ర మ్మును కాకపోయినను వాస్తవమున అచ్చుసంబంధము లేకపోయినను ఆహల్లు తనకు తానే 'అనఁగా తనతోపాటు సహజముగా పుట్టిన అచ్చులేకపోయినను' ప్రాసములకు పనికివచ్చునని భావము.

297 పద్య వివ:— ఇది అప్పకవి రచించిన ఉదాహరణ పద్యము. ఇందు రెండు నాల్గు పాదములలో సంధివశమున మరియొక పదములోని మొదటియచ్చు పూర్వపదములోనినకారముతో (తాన్ + ఊరక - తానూరక, ఏక్రియచేన్ — ఇఁక — ఏక్రియచేనిఁక అను-చోట్ల) కూడియున్నను అట్టి నకారము తక్కిన పాదములతో (1, 3 పాదములలో) సహజమైన అచ్చుతో గూడిన నకారముతోపాటు ప్రాసములకు జెల్లుబడియగుటచే పై విషయమున కుదాహరణమయ్యె ననియు, ఇట్లే తక్కిన హల్లుల విషయముననుఁ చెల్లుబడియగుననియు గ్రహించునది.

ప్రాసభేదంబులు

సీ॥ అర్థబిందు సమాహ్వయముఁ బూర్ణబిందు ఖం
డాఖండములు సంయుతాక్షరంబు
ధర సంయుతాసంయుతము రేఫయుత లఘు
ద్విత్వవికల్పముల్ వెస నుభయము
ననునాసిక ప్రాసమును బ్రాసమైత్రియుఁ
బ్రాసవైరంబు స్వవర్గజంబు
ఋప్రాసలఘుయకార ప్రాసములు నభే
దంబును సంధిగతంబు ననఁగ
తే॥ బదియు నేడు దెఱంగులఁ బరిఢవిల్లుఁ
బ్రాసములు పూర్వసుకవి ప్రబంధములను
గ్రమత లక్షణలక్ష్యయుక్తంబుగాఁగఁ
దేటపరచెద వాని నిశాటదమన 298

298 పద్య వివ:— అర్థబిందు సమప్రాసము, పూర్ణబిందు ప్రాసము, ఖండాఖండప్రాసము, సంయుతాక్షర ప్రాసము, సంయుతాసంయుతప్రాసము, రేఫయుతప్రాసము, లఘుద్విత్వప్రాసము, వికల్పప్రాసము, ఉభయప్రాసము, అనునాసిక ప్రాసము, ప్రాసమైత్రిప్రాసము, ప్రాసవైరప్రాసము, స్వవర్గజప్రాసము, ఋప్రాసము, లఘుయకార

ప్రాసము, అభేదప్రాసము, సంధిగతప్రాసము అను పేర్లతో పదునేడు విధములఁ ప్రాసములు మహాకవుల గ్రంథములలో విలసిల్లుచున్న వనియు వానికిం గ్రమముగా లక్షణలక్ష్యములు తెల్పఁబడుచున్న వనియు భావము.

సమప్రాసములు

తే॥ పూర్వమున నర్ధమైనను బూర్ణమైన
దిగువ జడ్డక్కరంబైనఁ దగిలి మొదలి
ప్రాసకుండినయెడ సమప్రాసమనఁగఁ
బిదప నన్నియు నట్లనఁ గదియవలయు 299

299 పద్య భా:—పద్యము మొదటి పాదము నందలి ప్రాసాక్షరమునకుఁ బూర్వభాగమున అర్ధబిందు వైనను లేక పూర్ణబిందువయినను నెలకొన్నను (లేక) ప్రాసాక్షరము క్రింద మరియొక వర్ణము గదిసి యున్నను ప్రాసాక్షరము సంయుక్తమై యున్నను తక్కిన పాదములప్రాసలకన్నిటికిని మొదటి ప్రాసమునకువలెనే అన్నియు అర్ధబిందువున్ను పూర్ణబిందువున్ను పూర్వమందును సంయుక్తత్వమున్ను మొదటిప్రాసము ననుసరించి యుండవలెననియు, అట్లున్నచో వానికి సమప్రాసములని పేరనియు భావము. ఇట్లిందు సమప్రాసములు మూఁడు విధములని చెప్పఁబోవుచు వెనుకటి ప్రాసవిభాగము నామములతో జేయుపద్యములో అర్ధబిందు సమప్రాసము పూర్ణబిందుప్రాసము అని సమప్రాస మొక్కటే అనునట్లు చెప్పుటయు, సమప్రాసములలో చేరఁదగిన పూర్ణబిందు సంయుతాక్షర ప్రాసములు మున్నగుకొన్ని (అసమప్రాసములలో జేరునట్లు) భిన్నముగా జెప్పుటయు హేతుశూన్యమై యుండుటచే పొసఁగియుండలేదనక తప్పకున్నది. ఒకవేళ, అప్పకవి యభిప్రాయములో జడ్డక్కర మనఁగా కేవల ద్విత్వవర్ణము (క్క, చ్చ, మ్మ ఇత్యాది రూపము గలది) అనియు, అట్టి ప్రాసమే సమప్రాసమనఁబడు వనియు గ్రహింపవలెనని యనుకొన్నచో అట్టి యుదాహరణమేని

చూపకుండుటయు పై విభాగములో అట్లని చెప్పకుండుటయు దానికి బ్రతిబంధకములగుచున్నవి. ఎట్లైనను ఇందుజడ్డక్కరమని మూడవ సమప్రాసభేదము చెప్పుటయు పై పద్యములో నీభేదము చెప్పకుండుటయు సంయుతాక్షరప్రాసమని వేఱొక ప్రాసము భిన్నముగా చెప్పుటయు హేతువులేనివై చింత్యములగుచున్న వని యెఱుంగునది.

మఱియు మొదటిపద్యములో అర్ధబిందు సమ అని సమపదము పద్యపూర్తికై చేర్చి సామాన్యముగానే ప్రాసవిభాగము సంఖ్యతోఁ జేసి పిమ్మట వానిలో ఇందు జడ్డ అనునది సంయుతాక్షర అను నభిప్రాయముతోడనే వానిలో సమప్రాస విభాగ మీపద్యముతోఁ జేసినా డనుకొన్నచో ఇట్టి సమప్రాసలు మఱియుఁగొన్ని ముందువానిలో నుండుటచే నదియుఁ బొసఁగకున్నది కాని—అయినను ముందుచెప్పు వానిలోనివి సమ అని చెప్పినవే కాక తక్కినవియు కొన్ని మఱియొక కారణముచే చెప్పెను గాని సమప్రాసలుకాక అసమప్రాసలు అను నభిప్రాయముతో కాదనుకొని అవియు ఇక్కడ ఉపలక్షణముగా సమప్రాసలే అయి నట్లు గ్రహించుకొని ఇక్కడజడ్డక్కర అని సమప్రాస గాఁజెప్పినను దానికిక్కడ ఉదాహరణము చూపక ముందు సంయుతాక్షరప్రాసలే ఉదాహరణము చూపుటచేత ఈజడ్డక్కరసమప్రాస అసంయుతాక్షరప్రాసముకన్న భిన్నముకాదు. అసంయుతాక్షరప్రాసమే ఈజడ్డక్కర సమప్రాసము ఆయుదాహరణమే దీని యుదాహరణము అసామాన్యముగా చెప్పిన వానిలోని సమప్రాసలు చెప్పుటకే ఇక్కడ జడ్డక్కరసమప్రాస మని పేరుమార్చినాఁడు అనియే గ్రహించుకోవలసి నట్లు తోఁచినది.

సమప్రాసము లందర్ధబిందుప్రాసము

ఆ॥ పేఁకఁ బఙ్క్తిముఖుని దాఁకి కోసలవల్ల
భుఁడు బలానురాంతకుఁడు సెలంగ
నవనిఁ గూల్చె ననుట నర్ధబిందుప్రాస
మిట్లు గూర్పవలయు నెల్లకడల 300

పూర్ణబిందుప్రాసము

క॥ పొందింపవలయు నెల్లెడ
బృందావనచారి పూర్ణబిందుప్రాసం
బిందీవరాక్షి భీష్మక
నందనఁ జేకొనియె నందనందనుఁ డనఁగన్ 301

300 పద్య వివ:— ఇందు 1, 2 పాదములఁ బ్రాసయతులు గూర్పఁబడినవి. అందు 1వ పాదమున మొదటి ప్రాసాక్షరమునకు (కకారమునకు) బూర్వమున దీర్ఘపూర్వకమగు నర్ధబిందువు గూర్పబడుటచేత దాని ననుసరించి రెండవప్రాసాక్షరమున్ను (కియనునదియు) దీర్ఘపూర్వకమగు నర్ధబిందువు పూర్వమునఁ గలదిగాఁ గూర్పఁబడుటచే నిది అర్ధబిందు సమప్రాసమయ్యెననియు, నిట్లే రెండవపాదమున మొదటి ప్రాసాక్షరమునకుఁ డు అనుదానికి బూర్వమున హ్రస్వపూర్వకమగు అర్ధబిందువు గూర్పఁబడుటచే దానిననుసరించి రెండవప్రాసాక్షరమగు (డు అనునదియు) హ్రస్వపూర్వకమగు నర్ధబిందువు పూర్వమునఁ గలదిగా గూర్పబడుటచే నిదియు అర్ధబిందుసమప్రాస మయ్యెననియు నెఱుంగునది. మఱియు నిందు మొదటిపాదమున దీర్ఘపూర్వకార్ధబిందుసమప్రాస మనియు రెండవపాదమున హ్రస్వపూర్వకార్ధబిందు సమప్రాసమనియు భేదమెఱుంగునది. ఇట్లే ప్రాసనియమముగల పద్యముల పాదములయందును లక్ష్యములు గ్రహించుకొనునది యనియు భావము.

301 పద్య వివ:— ఇందు మొదటిపాదమునఁ బ్రాసాక్షరమగు 'ది' యనునది పూర్ణబిందు పూర్వకమగుటచే దానిననుసరించి తక్కిన మూఁడుపాదముల ప్రాసాక్షరములును (దా, దీ, ద అనునవియు) పూర్ణబిందుపూర్వకములుగానే కూర్పఁబడుటచే నిది పూర్ణబిందు సమప్రాసమయ్యె ననియు ఇట్లే ప్రాసయతి పద్యప్రాసములలోను నెఱుంగునది యనియు నిందు పూర్ణబిందు సంబంధముచే దాని పూర్వవర్ణము హ్రస్వమైనను దీర్ఘమైనను గురువేయగును గావున నొకచో హ్రస్వ

పూర్వ పూర్ణ బిందువును మరియొకచో దీర్ఘపూర్వక పూర్ణ బిందువును గూర్పఁబడినను సమప్రాసము చెల్లుబడియగును గావున పూర్ణబిందు సమప్రాసములో హ్రస్వ పూర్వ పూర్ణబిందు సమప్రాస మనియు దీర్ఘ పూర్వ పూర్వబిందు సమప్రాస మనియు భేదద్వయము లేక ఒకే విధముగాఁ జెల్లుబడి యగుననియు ఇతర లక్ష్యములఁబట్టి భావము గ్రహించునది.

ఖండాఖండ ప్రాసములు:—

క॥ నిడుపులు నరసున్నలుఁ దమ
  కెడమను గల క చ ట త ప ల కి లఁ బ్రాసములై
  దొడరును నిర్బిందువు లొ
  క్కడ ఖండాఖండ సంజ్ఞ నినశశినయనా 302

ఆదిపర్వమునందు:—

క॥ వీఁకఁ బఱతెంచి నల్గడఁ
  దాఁకినఁ గడు నలిగి ఘోరతర శరహతి న
  మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ
  డాఁకతమున నేసె నుగ్రుఁడై రణభూమిన్ (8—203) 303

విరాటపర్వమునందు :—

క॥ నాకొఱఁతఁ దీర్చి వచ్చితి
  నీకొఱఁతయ యింక సూతునిం దెగఁజూడన్
  లోకము వంచింపఁగఁ దగు
  చీఁకటి రేయొదవె నేమి సేయుదొ చెపుమా (2—271) 304

ద్రోణపర్వమునందు:—

సీ॥ మూఁకలు విరియించి వీఁక నాచార్యాది
  యోధుల కెల్లను నొక్కెడసను (2—13) 305

రుక్మాంగద చరిత్రమునందు

ఉ॥ ఓకరుణాకలాప వికచోత్పలలోచన యిప్పుడియ్యెడన్
  గాకులు చంపకుండ ననుఁ గైకొని కాచిన నీ కృపాగుణం

బేకలిగన్ వసింపఁ దగునే తొలిపుట్టువునందు భర్తపైఁ
గాఁకలు సేసినట్టి ఘన కల్మషముల్ విన నీకు జెప్పెదన్
(4-99) 306

ఆదిపర్వమునందు:—

మ॥ తీఁగ యుయ్యాల నూఁగుఁ జల్లని తియ్యమామిడి మోకలం
డాఁగుఁ బువ్వులతేనె సోనలఁ దారుఁ గేతకిఁ జేరుఁ బు
న్నాగ పూగ మహాగ వీథుల నాట్యముల్ పచరించు నా
భోగ నాగలతా గృహంబుల భోగముల్ గనువేడుకన్ 307

రామాయణమునందు:—

ద్వి॥ మూఁగి చరించు నమ్మొకరి తుమ్మెదలు
బాగొప్పఁ గొప్పునఁ బరఁగిన దావి 308

వరాహపురాణమునందు

క॥ ఆ చింతామణి ముని తన
పేఁచ మడఁచు దాఁక నీక పృథు లోభముచే
దాఁచుకొనుఁ గాక నాచే
నీచే నీఁక మోసపోవునే నరనాథా 309

ఉద్యోగపర్వమునందు:—

క॥ మీటుగతి రథికులను నొక
నాఁటికి వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచు నంతకు
వేఁటాడెదఁ బ్రీతిబలంబు వీరుల నెల్లన్ (4—407) 310

ఆ॥ బోఁటి యొకతె పెండ్లి పాట పాడఁగఁ జొచ్చె
నాఁపరాని విరహ తాపమునను
బేరుఁ గూర్చితాను బెండ్లి కూఁతురు గాఁగ
గోత్రధరుఁడు పెండ్లి కొడుకు గాఁగ 311

ఆదిపర్వమునందు:—

క॥ ఆ పన్నగ ముఖ్యులఁ దన
వీఁపునఁ బెట్టుకొని పఱచి విపినములు మహా
ద్వీపములు గిరులు సకల ది
శాపాల పురములుఁ జూపెఁ జని వారలకున్ (2, 42) 312

302 పద్య వివ:— దీర్ఘ పూర్వకమగు నర్థబిందువు తమకుఁ బూర్వభాగమునఁ గలిగినచో నట్టి క, చ, ట, త, ప, అను వర్ణములు (క, చ, ట, త, ప లలో నేదియైనను) ఏదేని యొకపాదమునఁ గాని (లేక) అనేకపాదములఁ గాని ప్రాసవర్ణమై (లేక) ప్రాసవర్ణములై యున్నచో తక్కిన పాదములలో ప్రాసవర్ణము (క, చ, ట, త, ప లలో చేరిన ప్రాసాక్షరము) అర్థ బిందువు పూర్వమున లేనిదై దను (దీర్ఘ పూర్వకము మాత్రమైనచో చెల్లుబడి యగుననియు, అట్టి ప్రాసములకు ఖండాఖండ ప్రాసములని పేరనియు భావము. ఇట్లీ పద్యమున స్పష్టముగా నప్పకవి క, చ, ట, త, ప లకు మాత్రమే ఖండాఖండ ప్రాసముచెల్లునని చెప్పినను ఆతఁడే చూపిన ఆది పర్వమునందలి 'తేఁగ యుయ్యేల' అను పద్యమును బట్టియు మరియు 'ద్వి మూఁగి' అను దానిని మహాకవుల లక్ష్యములను బట్టియు ఇచ్చటి క, చ, ట, త, పలు, గ, జ, డ, ద, బ లకు నుపలక్షణ మని తెలియుచున్నది. ఇక్కడ నిదుపులు అన్నను హ్రస్వ పూర్వకములకును ఇట్లే చెల్లు నట్లు ప్రయోగములఁ గానవచ్చు చున్నది. (చూ. పీఠిక)

ఈవిషయమున ప్రామాణ్య దార్ఢ్యమునకు 10 పద్యములు ప్రాచీన మహాకవులవి యుదాహరించె ననియు నెఱుంగునది.

303 పద్య వివ:— ఇందు 1, 2, 4 పాదములందు ప్రాసాక్షరమగు కకారము దీర్ఘపూర్వార్థబిందు పూర్వకముగను, 3 వ పాదమునఁ (మూఁకలు అని) నిర్బిందుకముగాను ఉన్నను చెల్లుబడి యగుటంజేసి ఇది ఖండాఖండప్రాస మగుచుండెను.

304 పద్య వివ:-ఇందు 1, 2, 3 పాదములలో అర్ధబిందు రహితము గానునాల్గవ పాదమున (చీఁకటి అని) అర్ధబిందు యుతముగాను కూర్పఁబడి నను చెల్లుచున్నది. నవీనులు కొందఱు చీఁకటి అనుదానిలో అర్ధబిందు వక్కరలేదందురు; అప్పుడు సమప్రాసమే యగును కాని అప్పకవి మున్నగు ప్రాచీనుల మతమట్టిది కాదని యెఱుంగునది.

305 పద్య వివ:— ఇది సీస పాదము. ఇందు పూర్వార్ధమునప్రాస యతి కూర్పబడినది. అందొకచోట మూఁక అని నిర్బిందుకముగాను రెండవ ప్రాసలో వీఁక అని సబిందుకము గాను కూర్చఁబడినను ప్రాసయతి చెల్లెనని యెఱుంగునది. మూఁకశబ్దము సార్ధానుస్వారముగా శబ్దరత్నాకరములో వ్రాసి యీసీసపాదమే యుదాహరించినాఁడు; కాని అప్పకవి మతమున అట్లు కాదు అని గిడుగువారి ప్రతిలో (రిమార్కు) గలదు. అదియు సత్యమే యనియు నెఱుంగునది.

306 పద్య వివ:— ఇందు 1, 2, 3 పాదములలో నిర్బిందుకము గాను, 4 వ పాదమున సబిందుకముగను గూర్పఁబడినను ప్రాసములు చెల్లుబడి యగుచున్నవి.

307 పద్య వివ:—ఇందు 1, 2 పాదములలో సబిందుకముగాను, 3, 4 పాదములలో నిర్బిందుకము గాను గూర్పబడి ప్రాసలు చెల్లినవి. ఈపద్యమును బట్టియే ఈలక్షణ పద్యములోని క చ ట త పలు గ జ డ ద బ ల కుపలక్షణములని మున్నే తెల్పఁబడినది.

308 పద్య వివ:— ఇది ద్విపదము. దీనికి రెండుపాదములలో నియతముగా ప్రాస లుండవలెను. అట్టి దీని పాదములలో మొదటి పాదమున సబిందుక ప్రాసమున్ను, రెండవ దానిలో నిర్బిందుక ప్రాస మున్ను గూర్పఁబడినను చెల్లినది. పై ఉపలక్షణ కిదియు హేతువే.

309 పద్య వివ:— ఇందు 1, 4 పాదములలో నిర్బిందుకము, 2, 3 పాదముల సబిందుకమున్ను గూర్పబడ్డది.

310 పద్య వివ:— ఇందు 1, 3 పాదములలో అర్ధబిందువు లేకుండ గాను, 2, 4 పాదములలో (నాఁటికి, వేఁటాడెద అని) బిందువుతోఁ గూడునట్లును్ను కూర్పఁబడినను చెల్లెను.

311 పద్య వివ:— ఇది ఆటవెలది. ఇందిచ్చానుసారమున 1, 2 పాదములలో ప్రాసయతులు కూర్పబడినవి. అట్టిపాదములు రెంటను మొదటి ప్రాసములు సబిందుకములు గాను (బోఁటి, ఆఁప అని) తక్కినవి నిర్బిందుకములుగాను (పాట, తాపము అని) కూర్పబడినను చెల్లెను.

312 పద్య వివ:— ఇందు 1, 3, 4 పాదములు నిర్బిందుకములై 2 వ పాదము సబిందుకమై (వీఁపు అని) యున్నను చెల్లెను.

సంయుతాక్షర ప్రాసము

తే॥ సంయుతాక్షర ప్రాసమై జగతి వెలయు
గర్గుఁ డర్చించు దైవంబు భర్గుఁ డనఁగఁ
బక్ష్మలేక్షణ కౌనతిసూక్ష్మ మనఁగఁ
జంద్ర వంశ్యుఁడు భోగదేవేంద్రుఁ డనఁగ 313

313 పద్య వివ:— ప్రాసయతులలో గాని నియత ప్రాసలలో గాని ఒకప్రాసములోని సంయుక్త వర్ణ మేయాకృతి గలదో పైనుండు అచ్చెట్టిదైనను కావచ్చును, అట్టి యాకృతియే గల సంయుక్త వర్ణములే తక్కిన ప్రాసములందును గూర్పఁబడిన యెడల నది సంయుతాక్షర ప్రాసమగు ననియు, ఇందు 2, 3, 4 పాదములలోని ప్రాసము లెల్ల నట్లేగూర్పబడినవి గాన నివి సంయుతాక్షర ప్రాసమునకుదాహరణ మగు చుండెననియు భావము. వాస్తవ మాలోచింప నిది అసమప్రాసలలో చేరునదిగాఁ దోచునట్లు కూర్పఁబడుట పొసఁగి యుండలేదనియు సమ ప్రాసములలో అంతర్భూతముగా చేర్చుకో వచ్చుననియు తోఁచు చున్నది.

సంయుతాసంయుత ప్రాసము:—

తే॥ రలలు తమక్రింద జడ్డలై గ్రాలువ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసి
గూడియైనను బెఱయడుగులను నిలుచు నైనఁ
సంయుతా సంయుతప్రాస సంజ్ఞఁ దనరి 314

తే॥ పాఁడి ద్రిచ్చఁగ నిమ్మ నాతండ్రి కృష్ణ
వేఁడుకొనియెద నంద్రాఁకఁ బండ్లు దినుము
దుండగపు చేష్టలును నోటిగాండ్రితనము
మెండుగాఁ జొచ్చె నీకు నై దేండ్లు కనఁగ 315

314 పద్య వివ:— ఇఁక అసమప్రాసలలో సంయుతాసంయుత ప్రాసములు చెప్పఁబడుచున్నది. సంయుక్తవర్ణములలో రకారముగాని లకారముగాని ప్రథమేతర సంయుక్తములో రెండవది లేక మూఁడవది వర్ణముగాఁగల మొదటి వర్ణము గాక తక్కిన వర్ణములలో నేదియేని రకారమైగాని లకారమైగాని యున్న సంయుక్త వర్ణ మొకప్రాసమై గాని లేక రెండు లేక మూఁడు ప్రాసములై గాని (మాలిక యైనచో అంతకన్నను నెక్కువ ప్రాసలై గాని) యున్నప్పుడు తక్కిన ప్రాసములు రకారముతో గాని లకారముతోఁగాని కూడక యున్నను చెల్లుఁబడి యగుననియు, అట్లు కూర్చినచో దానికి సంయుతాసంయుత ప్రాస మని పేరనియు భావము. మఱియు నేదియైనను మూఁడు వర్ణములు సంయుక్తము లై నప్పుడున్ను, మరియు సంభవమైనచో మూఁటికన్న నెక్కుడు వర్ణములు సంయుక్తములై నప్పుడున్న మొదటి వర్ణముగాక తక్కిన వానిలో నేదియేని యొకటి మఱియొకప్రాసములో లేకపోయినను చెల్లుబడియగునని కొందఱు పెద్దలు వక్కాణింతురనియు, అట్టిమహాకవుల ప్రయోగములు కూడఁ గానవచ్చుచున్నవనియు విశేష మెఱుంగునది.

315 పద్య వివ:— ఇందు మొదటి పాదమునందును మూఁడవ పాదమునందును రెండవ ప్రాసము క్రింద రకార సంయుక్తముగాను

పాదాదిప్రాసము రకారము లేకుండ కేవలముగాను కూర్పబడినను అట్లే రెండు నాలుగు పాదములందు ఒకచో (రెండవచోట) లకార సంయుక్తముగాను పాదాదిని లకారము లేకుండ కేవలముగాను కూర్పబడినను చెల్లుబడి యగుచుండెనని తెల్పుచు నీపద్యమును స్వయముగా కల్పించి అప్పకవి సంయుతా సంయుత ప్రాసముల కుదాహరించె ననియు నెఱుంగునది. ఇక్కడ పరికింపఁగా మూఁడు నాలుగు పాదముల ప్రాసములు చెల్లుబడి యగును గాని ఒకటి రెండు పాదముల ప్రాసములు చెల్లుబడి కావని తోఁచుచున్నది ఏలయన అసంయుక్తప్రాసములలోనేకాక అన్ని వర్ణములు సమాకృతిగాగల సంయుక్త వర్ణముల ప్రాసములలో సైతమొకచో పూర్ణబిందు పూర్వకముగాను మఱియొకచో నర్ధబిందు పూర్వకముగాను ఉన్నయెడల నట్టిప్రాసములు చెల్లుబడి కావుగదా; అట్లెక్కడను అప్పకవి చెప్పనూలేదు. అట్లుండ ఒకచో సంయుక్తము నొకచో నసంయుక్తము నైనప్పుడున్ను గురుపూర్వత్వ మెట్లో కలిగినంతమాత్రమున ఒకచో నర్ధబిందువు మరియొకచో పూర్ణబిందువు గలిగిన యిట్టి ప్రాసము లెట్లు చెల్లుబడి యగునని అప్పకవి యుదాహరించెనో తెలియరాకున్నది. అప్పకవి చూపిన మహాకవి ప్రయోగములలోను మఱియు మేము చూచిన వానిలోను నెందును నిట్టి ప్రాసములు గానరాకున్నవని యెఱుంగునది. మఱియు నట్లు ఇక్కడ లక్షణమైనను చెప్పినాఁడా! లేదుగదా! ఇఁక ఎట్లు చెల్లును.

రేఫశ్లిష్టమునకు నాదిపర్వమునందు

ఉ॥ క్షత్రియ వంశ్యులై ధరణిఁ గావఁగ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రు లనఁగాఁ దగు నాలుగు జాతులన్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరిక్షితు కాచిన యట్లు రామ మాం
ధాతృ రఘు క్షితీశులు ముదంబునఁ గాచిరె యే యుగంబునన్

(ఆ 2, 178) 316

వ. మాంధాతృ శబ్దము ఋకారాంతము గనుకఁ దకారము క్రింద
నున్నది వటుప్రసుడి గాని కార్రవడి కాదు. అందులకు— 317

కవికర్ణరసాయనమునందు:—

సీ. గీ. దాన గుణ శాలి భూ సముద్ధరణ దక్షుఁ
డనిశ మఖ దీక్షితుండు మత్తారిహరణ
విహృతి నిరతుఁడు యువనాశ్వ విభు సుతుండు
ఘనుఁడు మాంధాత నృపుఁడైన కాలమందు (2, 58) 318

సోముని హరివంశమునందు:—

శా॥ నాత్రో మాంర్కొనలేరు నిర్జరపురీ నాగేంద్ర బృందారకా
రాతుల్ మున్నుగ దేవసంఘములు పోరన్ ధీరసంగ్రామకుం
డీ త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణంబెచ్చోట లేకుండఁగాఁ
జేతుల్ వేయు వృథాభరంబగుచు వచ్చెన్ దేవ యీమేనికిన్ 319

దేవీవిజయమునందు:—

తే॥ వాక్త్రినేత్రాంగనా శచీ శక్తు లధిక
సంభ్రమంబున శుంభ నిశుంభ దైత్య
హంత్రిఁ బూజింపుదురు త్రియీ మంత్రములను
స్తోత్రములు సేసి మంగళారాత్రిక లిడి 320

పద్మ పురాణమునందు:—

క॥ శ్రీకర చక్రాంకితులగు
లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీక్రియలు లేక యుండినఁ
బ్రాకృతులనఁ బతితులనఁగఁబడుదురు జగతిన్ 321

లకార శ్లిష్టమునకు రాఘవ పాండవీయమున:—

శా॥ లోకత్రాణ రతిం దదాదిమ మహీ లోక ప్రివేశోత్క— భా
షా క్లృప్త ప్రథమ ద్వితీయ పద గుంజన్మంజు మంజీర గ
ర్జా కల్పామల రామ భారత కథా సర్గంబులన్నించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయ శ్లేషార్థ సంసిద్ధికిన్.
(పీఠిక—3) 322

వివ:— ఇఁక సంయుతాసంయుత ప్రాసలకు మహాకవుల ప్రయోగములు చూపఁబడుచున్నవి—

ఒకచో రేఫసంయుక్తప్రాసము మరియొకచో రేఫాసంయుక్త ప్రాసము కూర్పఁబడినను చెల్లుటకు ఆదిపర్వమునందలి పద్య ముదాహరింపఁబడినది.

316— ఇందు 1, 2, 3, పాదములలో రేఫము రెండవదిగా సంయుక్తమైన ప్రాసములున్ను, 4 వ పాదమున (మాంధాతృ అని) రేఫాశ్లిష్ట మగు (అచ్చగు ఋకారముతో గూడుటచే సంయుక్తమే కాకున్నట్టి) ప్రాసమున్ను కూర్పఁబడినను చెల్లుబడియగుటచే పై విషయమునకిది యుదాహరణ మగుచుండెనని భావము.
మఱియు మాంధాతృ శబ్దములో ఋకారమే గాని రేఫము లేదనియు

317— ఇది మాంధాత్రి శబ్దము కాదనియు, అట్లు భ్రమపడకుండుట కిది ప్రమాణ మనియు కవికర్ణ రసాయన ప్రయోగము చూపఁబడినది యనియు గ్రహించునది.

318— ఇందు నాల్గవ పాదమున ఘనుఁడు మాంధాత నృపుఁడైన కాలముననను అనుచోట మాంధాత అనునది మాంధాతృ శబ్ద తత్సమ రూపము (ధాత, విధాత, కర్త అనునట్లు) కాని మాంధాత్ర శబ్దరూపము కాదు. అదియే యైనచో అకారాంత మగు మాంధాత్రి శబ్దము తత్సమమై మాంధాత్రుఁడు అయి తీరవలెనుగదా! అట్లున్నచో ఛందోభంగము

వాటిల్లును గావున నీప్రయోగము మాంధాతృ శబ్దమునే సాధించు చున్నది కాని యెట్లును మాంధాత్ర శబ్దము నిది సాధింప దనియు, అట్టి దానిని సాధించు సాధనాంతరము గాని ప్రయోగాంతరము గాని లేమిం జేసి పైని చూపబడ్డ ఆది పర్వ పద్యమున్న మాంధాతృ శబ్దయుతమై రేఫ సంయుతా సంయుత ప్రాసమున కుదాహృతి యగుచుండె నని భావము.

మఱియుఁ గొందఱు పైని చూపఁబడిన ఆది పర్వ పద్యములో 'క్షత్రియ వంశ్యులై' అనుదానిలో 'రామ మాంధాత్ర రఘు క్షితీశులు' అనియే పాఠము కల్పించి ఇది సంయుతాసంయుత ప్రాసము కాదనియు సమప్రాసమే యనియు భ్రాంతిపడుచున్నారు. ఇట్టి భ్రాంతికిఁ గార ణము విచారించి నిర్ణయించవలసి యున్నది. సరియైన ప్రమాణము లేమింజేసి కేవల మాంధాతృ శబ్ద మకారాంతము కాఁదని వారంగీకరిం చియు ద్వంద్వ సమాసములో నున్న ఈమాంధాతృ శబ్దమునకు 'ఉర్ద్వం ద్వేరః' అను చింతామణి సూత్రముచేత రకారాదేశము ఋకారమునకు రాఁగా 'మాంధాత్ర రఘుక్షితీశులు' (మాంధాతాచ రఘుక్షితీశశ్చ మంధాతారఘుక్షితీశౌపిమ్మట తత్సమమున మాంధాత్రరఘుక్షితీశులు' అని యగునని వారియభిప్రాయ మూహింత మన్నచో అది కుదురదు; ఏల యన 'ఉర్ద్వంద్వేరః' అను సూత్రముచే ఋకారాంత పదములే రెండును (లేక ఎన్నియుండునో అన్నియు) అయినప్పుడే మొదటిపదములోని (ఋకారాంత బహుపద ద్వంద్వమైనచో మతాంతరమున చివరపదము కాక తక్కిన పదము లన్నిటిలోని) ఋకారమునకు రకారాదేశ మగును గాని ఒక్కటి ఋకారాంతము మఱియొక్కటి అకారాంతము నైన ఇట్టి ద్వంద్వములో (మాంధాతృరఘుక్షితీశ అను దానివంటి ద్వంద్వ ములో) పూర్వపద ఋకారమునకు రకారము వచ్చుట కవకాశము లేదు. ఈవిషయమునే అధర్వణుఁడు 'ఆనజ్జ స్స్యాదృతో ద్వంద్వే రేఫ శ్శ్వైరి కవే ర్మతే' అని స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. ఋకారాంత పద

ద్వంద్వములో వచ్చు ఆనజ్‌లోని ఆకారమునకుఁ తత్సమములో రకారము వికల్పముగా వచ్చునని దీని యభిప్రాయము. చింతామణిలో 'ఙః' అని ఋకారమునకు ఆదేశము విధించినట్లు తోఁచినను ఆధర్వణము ననుసరించి ఆనజ్జులోని ఆకారమే స్థాని యని యూహింపవలసియున్నది. కావున ఆనజ్‌లోని ఆకారము స్థాని యగుచున్నది. అట్టి యానజ్ 'ఆనజ్కృతో ద్వంద్వే' అను పాణినీయ సూత్రముచేత ఋకారాంత పదముల ద్వంద్వములో ఉత్తరపదము పరమై యుండఁగా పూర్వశబ్ద ఋకారమునకు వచ్చునుగాని అన్నియు ఋకారాంతములు కాక ఒకటి గాని (కొన్నిగాని) ఋకారాంతత్వము నొందినంతమాత్రమున ఆనజ్ రాదనియు, అన్నియు ఋకారాంతములైనప్పుడు మాత్రమే ఉత్తరపదమునకు కాక తక్కినదాని (లేక తక్కినవాని) ఋకారమునకు ఆనజ్ వచ్చుననియు అట్టి యానజ్జునకు తత్సమము చేయునప్పుడు రకారము వచ్చుననియు సిద్ధాంత మగుచున్నది. కావునఁ బ్రకృత మాంధాతృ శబ్ద ఋకారమునకు ఆనజ్జ్ వచ్చుటయు ఆపిమ్మట రకారము వచ్చుటయు సంభవింపదు. దీని పైని అట్లైనచో పితాపుత్రౌ (పితాచ పుత్రశ్చ పితాపుత్రౌ) అనుచో అకారాంతమగు పుత్ర శబ్దముతోఁ గూడిన ద్వంద్వములో ఆనజ్ వచ్చుటయు తత్సమములో 'పిత్రపుత్రులు' అని రకారాదేశరూప మేర్పడుటయు నెట్లు పొసఁగును. అని పూర్వపక్షము రావచ్చును గాని అది నిలువనేరదు. 'ఆనజ్ ఋతో ద్వంద్వే' అను సూత్రములోనికి మండూక ప్లుతిచే ఒక సూత్రములోని పదము మధ్య సూత్రములు కొన్నిటిలో నన్వయింపకయే (అనువృత్తి నొందకయే) తరువాతి సూత్రములో నన్వయించుట మండూకప్లుతి యని చెప్పఁబడును పుత్రశబ్దము వచ్చు ననియు అందుచేత పుత్ర శబ్ద మొక్కటి మాత్రము ఋకారాంతము కాక పోయినను దానితో ద్వంద్వమును పొందిన ఋకారాంత పూర్వపదములోని ఋకారమునకు మాత్రము ఆనజ్ రావచ్చుననియు, దానంజేసి 'పితాపుత్ర' అనికావచ్చు ననియు